అంతర భారతీయ పుస్తకమాల

# అగ్నిధార

రచన

కురతులైన్ హైదర్

అనువాదం

వేమూరి రాధాకృష్ణమూర్తి



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

దేవతలనుగురించి నాకు బాగా తెలియదు:
కాని సముద్రం నీలసముద్రం
కోపిష్ఠిది, ఆవేశానికి కేంద్రం
ఋతువులకూ ఆక్రోశాలకూ యజమాని వినాశకం.
మానవుడు మరవదలచిన విషయాలను అది జ్ఞాపకం చేస్తూవుంటుంది.
ఏదో నిరీక్షణలో నిమగ్నమై ఉంటున్నది.
మనలోపలా బయటా వ్యాపించి మనల్ని చుట్టుముట్టి ఉన్నది.
స్వరంలేని అరుపులకూ,
శిశిరంలో నిశ్శబ్దంగా రేకులురాల్చి
శాంతంగా వాడిపోయే పుష్పాలకూ
ప్రవహించే చోట శకలాలకూ
అంతమెక్కడ ? అంతం లేదు.
ఉన్నది అనంతమైన వృద్ధిమాత్రమే.
బాధకు గల లక్షణాలు వెదకాము. బయటకు తీశాము.
బాధకు కారణమేమని గాదు ప్రశ్న.
అది భ్రమ, తప్పువల్లకలిగిన భయం, ఆకాంక్ష.
ఈ క్షణాలు స్థిరమైనవి,
ఈ సత్యాన్ని మనకు కలిగిన బాధలోకంటే
ఇతరులబాధలో బాగా తెలుసుకొనగలం.
ఎందుకంటే మన భూతకాలం కర్మప్రవాహంలో దాగివున్నది.
ఇతరులబాధ ఒక విశుద్ధ, పవిత్ర అనుభూతి.
అది పాతబడదు.
జనం మారవచ్చు, చిరునవ్వు నవ్వవచ్చు కాని బాధమాత్రం తప్పదు.
శవాలనూ వృక్షాలనూ ప్రవహింపజేసే సముద్రంలాగా.
(కాలం సంహారకం సంరక్షకం గూడా)
నేను తరచు ఆలోచిస్తాను——
కృష్ణశబ్దానికి తాత్పర్య మేమిటి ? అది భవిష్యద్గీతమా ?
పశ్చాత్తాపం ఎరగనివారికి

పశ్చాత్తాప మొక ఎర్ర గులాబీ
అది ఎన్నడూ తెరవబడని
పచ్చని కాగితాలపెట్టెలో పెట్టబడివున్నది.
యాత్రికులారా! ముందుకు సాగండి
భూతకాలంనుండి విభిన్నజీవితాలలోనికీ
ఏదోరకపు భవిష్యత్తులోనికి పరుగెత్తండి.
ముందుకు సాగండి.
మీరు వారు గారు గదా?
ఓడ రేవు దాటిపోవడం, అవతలి వొడ్డు దరిజేరడం
చేసిన వారు గారు గదా?
ఈ క్షణం రెండు తటాలమధ్య కాలం స్థిరంగా ఉన్నది.
భూతభవిష్యత్తుల్ని ఒక్కటిగా ధ్యానించండి.
ఇది కర్మకూ నిష్కర్మకూ సంబంధించిన క్షణంగాదు.
మృత్యుక్షణంలో మనుష్యుని చైతన్యం
సద్బిందువుపై కేంద్రితమయితే:
అదే కర్మ. అదే ఇతరులజీవితాలలో ఫలీభూతమవుతుంది.
కర్మ ఫలాన్నిగురించి చింతించకు. సాగు ముందుకు
నీవు విడిచినరేవూ, నీకు కలిగినఅనుభవమూ
అదే నీ మజిలీ.
కృష్ణుడు యుద్ధక్షేత్రంలో అర్జునుడికి చెప్పిందిదే.
యాత్రికుడా!
సాగు ముందుకు, సాగు ముందుకు
విశ్రాంతికి స్థానం లేదు.

—టి. ఎస్. ఇలియాట్

# 1

ఇంకా వానచినుకులు మెల్లమెల్లగా పడుతూనేవున్నాయి. నదీతీరాన ఆకుపచ్చని. ఎర్రఎర్రని పూలు. దట్టంగా వ్యాపించియున్న పచ్చికబయళ్లమధ్య కుంకుమ పూవుల్లా మిలమిలలాడుతూ వున్నాయి. వజ్రాల్లా తళతళలాడుతూన్న నీటి తెరటాలు పచ్చికమీదపడి భూమిలో కలిసిపోతున్నాయి. నది రేవులో నావలు నిలబడి వున్నాయి. కొద్దిదూరాన ఒక నరంగు ఉత్సాహంతో గొంతెత్తి పాటలు పాడటం ప్రారంభించారు. గుబురుగావున్న కదిమిచెట్లక్రింద పింఛం విప్పుకొని ఒక నెమలి నాట్యం చేస్తున్నది.

ముగ్గురు అమ్మాయిలు రేవుకు కొద్దిదూరాన మర్రిచెట్టుక్రింద కూర్చొనివున్నారు. వారిలో ఒక అమ్మాయి సింధూరంరంగు చీరకట్టుకొని సంపెంగపూలు పెట్టుకొని వున్నది. రెండో అమ్మాయి వయస్సులో చిన్నది. ఆమె తన కళ్లకు నీలిరంగు రాసుకుంది. పరికించిచూస్తే రాజకుమారిలా కనబడుతూంది. మూడవ అమ్మాయి వీరిద్దరికి దాసి. ఆమె పట్టుగుడ్డతో తయారుచేయబడిన కుచ్చులగొడుగు విప్పిపట్టుకొని చినుకులు వారిమీద పడకుండా చూస్తున్నది. మర్రిచెట్టుక్రింద ఒకవైపున పరికగడ్డ తీగ అల్లుకొని వున్నది. ఎర్రని తామరపూలు వికసించివున్నాయి. సిందూరం రంగుచీరె కట్టుకొన్న అమ్మాయికి 26 లేక 28 ఏండ్లు వుంటాయి. ఆమె పాపిట్లో సిందూరం లేదు. అంటే యింకా ఆ అమ్మాయికి పెండ్లి కాలేదన్న మాట. సిగలో పూలు వున్నాయి కనుక ఆమె సన్యాసినిమాత్రం కాదు. అందుకనే కాబోలు కొద్దిదూరాన మోదుగచెట్లప్రక్కన నిలబడి తెల్లనిబట్టలు ధరించివున్న ఒక నవయువకుడు ఆశ్చర్యంతో తన్మయుడై కొద్దిక్షణాలపాటు రెప్పవాల్చకుండా ఆమెను చూస్తూవున్నాడు. తరువాత ఆ యువకుడు చూపులు క్రిందకువాల్చి త్వరత్వరగా పడవవైపుకు బయలుదేరాడు.

మేఘాలలో మెరుపు మెరిసింది. మౌనంగా నదివైపుచూస్తూ కూర్చున్న అమ్మాయి 'వర్షం వస్తుంది' అన్నది.

నీలిరంగు కళ్ల అమ్మాయి ఏమీ జవాబు చెప్పలేదు. తెల్లనిబట్టలు ధరించిన బ్రహ్మచారి ఆమెకు కనబడటమే అందుకు కారణం.

శ్రావస్తి గురుకులంలో చివరిసంవత్సరపు విద్యార్థి గౌతమ నీలాంబరుడు. అతడు మోదుగుల అడవిలో నడిచి, నదివైపుకు మళ్ళాడు. బ్రహ్మచారి కావటం వల్ల అతనిచేతిలో గొడుగులేదు. కాళ్లకు చెప్పులులేవు. భుజాలమీద పడుతూ అతని నల్లనిజుట్టు రెపరెపలాడుతూంది. అతనిముఖం ఉదాసంగాను, అందంగాను వుంది. అతను ఆకాశంవంక ఒక్కపర్యాయం చూచాడు. ఇంద్రుని ఏనుగుల్లా దిగ్మండలాన్నుంచి ముందుకు సాగివస్తున్న నల్లనిమేఘాలను చూచాడు. అడవి ఎంతో రమణీయంగా వున్నది - నది, నావలు, కదిమిచెట్లక్రింద నెమలి. రేవుకు కొద్దిదూరాన కూర్చున్న ఆ అమ్మాయి, వానజల్లులమధ్య చంద్రబింబాల్లా మిలమిల లాడుతున్న వాళ్ల అందమైనముఖాలు. శ్రావస్తి ఆశ్రమం ఇంకా 20 క్రోసుల దూరాన వున్నది. నలువైపులగల దృశ్యాన్ని ఒక్కపర్యాయం గాఢంగాచూచి గౌతముడు నదిలోకిదూకి యీత ప్రారంభించాడు. నదిలోని చల్లని నీటికెరటాలు, చల్లని వాన నీటిచినుకులు గౌతముని శరీరానికి హాయి కలిగించాయి. ఆనందంతో, ఉత్సాహంతో ఆవలిఒడ్డు చేరుకొనేందుకై యీత ప్రారంభించాడు. 'ఈ విద్యార్థుల జీవితం కష్టాలమయం. పాపం పడవ ఎక్కేందుకుకూడా అనుమతించరు' అంటూ నిట్టూర్పు విడిచింది ఒడ్డున కూర్చొనియున్న దాసీమనిషి.

నీలిరంగు కనుబొమల రాజకుమారి పేరు నిర్మల. ఆమె నదివంక చూస్తున్నది. నదిలో యీదుకుంటూ సాగిపోతున్న ఆ యువకునిమీద ఆమె చూపులు నిలిచి వున్నాయి.

తన సోదరుడు జ్ఞాపకం వచ్చినందున ఆమె దాసికి ఏమీ సమాధానం చెప్పలేదు. ఆమె సోదరుడుకూడా యిలాగే నదుల్ని దాటుతూ, మైదానాల్లో నడుస్తూ, భయంకరమైన కొండలు ఎక్కుతూ ఎంతో దూరానవున్న తక్షశిలకు వెళ్ళిపోయాడు. పది సంవత్సరాలైంది యిప్పటికి. యింకా తిరిగిరాలేదు.

సోదరుని స్మృతి నిర్మలను బాధ పెట్టసాగింది. రాజకుమారి దిగులుగా ఉండటం చూచింది దాసీమనిషి. 'రాజకుమారుడు తక్షశిలనుండి తిరిగివచ్చియుంటే చంపక కుమారి అతణ్ణి వివాహమాడియుండేది. కాని చంపకకుమారి యిప్పుడు కవిత్వం వ్రాస్తూంది. దూరదూరప్రాంతాలనుండి వచ్చిన జైనయాత్రికులతోను, పండితుల

తోమ చర్చలు సాగిస్తుంది' అని ఊహించుకొని దాసీమనిషికూడా ఖిన్నురాలైంది. రాజకుమారి నిర్మలం క్రిందికివంగి పరికగడ్డతీగకుగల ఆకు త్రుంచింది. వెనుతి తనమెడను ప్రక్కకుత్రిప్పి ఆ అమ్మాయిలను పరికించిచూచి గర్వంతో వయ్యారంగా నడచి అరటిచెట్లమధ్యకు వెళ్ళిపోయింది.

గౌతముడు నదిమధ్యకు చేరుకున్నాడు. వర్షంవల్ల సరయూనది వెడల్పు బాగా పెరిగింది. గౌతముడు వెనకకుతిరిగి నదీతీరంవైపు చూచాడు. ఇంకా ఆ అమ్మాయిలు అక్కడే కూర్చునివున్నారు. ఎదురుగా రెండో ఒడ్డుమీద వెదురుపొదలు, తుంగగడ్డ. పచ్చిరంగు శంఖుపూలతీగలు దట్టంగా అల్లుకొనివున్నాయి.

ఒడ్డుకు చేరుకొని గౌతముడు తడిగుడ్డల్ని పిండుకొన్నాడు. ఏదో చింతలో మునిగిపోయాడు. సమీపంలో నున్న కాళీదేవళం చేరుకొన్నాడు. ఇదివరకు యీ దేవళంలో చండీమాతకు నైవేద్యం సమర్పించి అయోధ్యకు వెళ్ళినవిషయం అతనికి జ్ఞాపకం వచ్చింది.

ఎటుచూచినా నిశ్శబ్దంగా వున్నది. దేవళం ఆవరణలో అడుగుపెట్టగానే అతనికి భయంవేసింది. నిరాకారబ్రహ్మ ఏదోరూపంలో ప్రత్యక్షమైనప్పుడు భయం ఎందుకు కలుగుతుందో. మనిషికి మరో జీవి అస్తిత్వంమీద నమ్మకం లేకనా? యీవిధంగా గౌతముడు భయాన్నిగురించి చాలాపర్యాయాలు యోచించాడు. జీవితమంటే భయం, చావంటే భయం. బ్రతకటానికి భయం. ఋగ్వేదంలో యిలా వ్రాసివున్నది - మొదట పురుషునిరూపంలో 'అహం' ప్రత్యక్షమై నలువైపులా చూచింది. తనుదప్ప మరేమీ దానికి కనబడలేదు. వెంటనే యిదంతా 'నేను' అని అన్నది. దానితో తనను తాను 'నేను' అని అనుకోవటం ప్రారంభించింది. ఒంటరిగావున్నందున దానికి భయంవేసింది. అందువల్ల ఒంటరిగావున్నవారికి భయం కలుగుతుంది. నేనుదప్ప మరెవ్వరూ లేనప్పుడు, యీస్థితిలో నేనెందుకు భయపడటం అని అనుకొన్నది. దానితో భయంపోయింది. అయినా దానికి సుఖం కలుగలేదు. ఒంటరిగావుండటమే అందుకు కారణం. ఒంటరితనంతో ఉదాసీనత తప్పదు.

'ఆత్మ ఒంటరితనానికి నేను భయపడకూడదు' అని అనుకొన్నాడు గౌతముడు. రావిచెట్లగాలి రివ్వుమంటూ వీస్తున్నది. చాలాదూరంవరకు అంతా పొలాలే. ఆ తరువాత అడవులు, మోదుగపొదలు, నదులు, లోయలు, కొండలు, వాటన్నిం

టీపీ దాటి ఆశ్రమం చేరుకోవాలి. దేవాలయం మెట్లుదిగి ఊరువైపుకు బయలు
దేరాడు. సరయూనదిఒడ్డున అయోధ్యానగరకాంతులు కనబడుతున్నాయి మిణు
గురుపురుగుల్లా. వర్షపుజల్లుల్లో దృశ్యమంతా పేలంగా మిలమిలలాడుతూంది.
గౌతముడు గ్రామంలో అడుగుపెట్టి మొదటియింటి తలుపు తట్టాడు. మట్టిగోడలతో
అలికబడివున్న యింటిద్వారం దగ్గర దీపం వెలుగుతున్నది. మధ్యవయస్సు
దాటిన ఒక గృహస్థు ఆ దీపందగ్గరగా కూర్చొని ఏదో చదువుతున్నాడు. వరండా
బైట చీకటిగావున్నది. గౌతముడిమాట విని దీపం పట్టుకొని ఆ వ్యక్తి బైటకు
వచ్చాడు. దీపం వెలుగులో బ్రహ్మచారి కట్టుకున్న తెల్లనివస్త్రాలు కనిపించాయి.

"ఇక్కడకు యీమధ్యనే శాక్యముని భిక్షుకులముఠా ఒకటి వచ్చింది. మీరు
ఆ ముఠావారేమోనని అనుకొన్నాను. అబ్బబ్బ. ఇదేం గోలోగాని మొగపిల్లలే
కాదు, ఆడపిల్లలు కూడా యిల్లు వాకిళ్లువదలి అడవులకు వెళ్ళిపోతున్నారు' అన్నాడు
గృహస్థు.

'నాకు కొద్దిగా పప్పు బియ్యం కావాలి' అని అన్నాడు గంభీరంగా గౌతముడు.
కాని ఆ గృహస్థు వసపోసిన పిట్టలా వాగుతూనేవున్నాడు - 'ఎదురుగా కనబడు
తుంది పట్టణం అక్కడ ఒక అమ్మాయి వున్నది. రాణి రేణుకలా ఎంతో
అందచందాలు గల యువతి. నిన్న మా యింటావిడ నలుగులు కొనితెద్దామని
బజారు వెళ్ళింది. రాణివాసపు దాసీలు ఆమెకూడా ఎక్కడికో బౌద్ధవిహారానికి వెళ్ళి
పోయిందని చెప్పారుట. ఎంత అన్యాయం, ఎంత అన్యాయం?' అని అతడు
అంటూవుండగానే అతనిభార్య పప్పు, బియ్యం తెచ్చియిచ్చింది. బ్రహ్మచారి తన
పైపంచలో వాటిని మూటకట్టుకొన్నాడు. ఆమె భర్త అంటూనేవున్నాడు - 'కలి
కాలం వచ్చింది బాబూ, కలికాలం వచ్చింది. ఆడపిల్లల తల్లితండ్రులకు పెండ్లిండ్లు
చేయవలసినబాధ వదలిపోయింది. ఇప్పటి ఆడపిల్లలు నిర్వాణంకోసం బయలు
దేరుతున్నారండీ, నిర్వాణంకోసం.'

పప్పు, బియ్యం మూటకట్టుకొని బ్రహ్మచారి కొద్దిసేపు వరండాలో నిలబడ్డాడు.
బౌద్ధవిద్యార్థులు ఆ ఊళ్ళో ఉన్నారని తెలుసుకొని ఎంతో సంతోషపడ్డాడు. ఎవ
రైనా కలిస్తే ఆరాత్రి మాటలతో హాయిగా గడిచిపోతుందని ఆనందించాడు.
'పరమేశ్వరుడు నిన్ను అనుగ్రహించుగాక. పాడిఆవులు, సుపుత్రులు, ధనధాన్యాలు

పేకు లభించుగాక' అని ఆ గృహస్థును ఆశీర్వదించి గౌతముడు దేవళంవైపుకు త్వరగా నడక ప్రారంభించాడు.

గృహస్థు దీపం పుచ్చుకొని లోపలికి వెళ్ళాడు. ముందుకు అడుగువేసిన గౌతముడు ఆగిపోయాడు. లోపలిదృశ్యంచూస్తూ నిలబడిపోయాడు. లోపల పిల్లలు ఆడుకొంటున్నారు. గృహిణి కుంపటిముందు కూర్చొనివున్నది. ద్వారందగ్గర ఒక పంజరం ఆటూయిటూ కదలుతూవున్నది. అందులో పర్వతప్రాంతపు గోరింక ఒకటి కూర్చొనివున్నది. శాంతిమయంగావున్న ఆ వాతావరణంచూచి అతనికి భయం కలిగింది. కుంపటివెలుగులో నిగనిగలాడుతున్న యువతిముఖం, వరండాపైన వంగి వంగి తొంగిచూస్తున్నవా అన్నట్లు పచ్చని అరటిఆకులు. రెక్కల్లో ముక్కుదూర్చుకొని నిద్రిస్తున్న గోరింక. ఆహా, దృశ్యం హాయిగొలుపుతూంది. కాని యీ గృహాగ్నియే కొంతకాలానికి చితిజ్వాలలుగా మారిపోతుంది. ఈ చితి రవ్వలతో మరోయింటి కుంపటి అంటుకొంటుంది. ఇంటిలోని యీ నిప్పునే సన్యాసి తీసికొని బయటికి వెళతాడు. ఈ క్షణాలన్నీ ప్రతిమనిషిజీవితంలోను వస్తాయి. తన జీవితంలోను ప్రవేశిస్తాయా ?....యీ దృశ్యాలకు అర్థం ఏమిటి ?

శ్రావస్తీలో అతని తండ్రిగారి మూడుఅంతస్తులమేడ వున్నది. దాని వరండాలోగల స్తంభాలమీద ఏనుగుశిరస్సులు నిర్మించబడ్డాయి. ఇది అతని విద్యార్జనా కాలంలో చివరిసంవత్సరం. చదువు పూర్తికాగానే ప్రపంచమంతా అతని పాదాలపై పడుతుంది. సమయమంతా తన ఒక్కనిదే. ఎంతో ఉదారహృదయంతో దర్శనశాస్త్రాల్ని పరిశీలిస్తున్నాడు; పఠిస్తున్నాడు, యోచిస్తున్నాడు. కాని దానితో పాటు తనకంటికి కనబడుతూవుండే వస్తువుల్నిచూచి భయపడిపోతున్నాడు. ఏమిటా వస్తువులు ? వర్షపుచినుకుల్లో తడుస్తూ నదీతీరాన కూర్చొనియున్న ఆ ముగ్గురు అమ్మాయిలు - మర్రిచెట్ల అడవి - కాషాయవస్త్రాలు ధరించి ఆ అడవిలో తిరుగుతున్న భిక్షుకులసమూహాలు - వయస్సుమళ్ళిన ఆ మాటకారి గృహస్థుభార్య - ఇవన్నీ వివిధరూపాల్లోనున్న ఆ పరబ్రహ్మ ప్రతిబింబాలేకదా. అంతా పూర్ణ బ్రహ్మమే.

గౌతముడు ఒక పండిపోయి రాలిపోయిన తీగను గడ్డిమీదనుండి తొలగించాడు. దేవళం చేరుకొన్నాడు.

అక్కడ చిన్నగుంట త్రవ్వి పొయ్యి తయారుచేశారు. మృణ్మయపాత్రలో బియ్యంపోసి పొయ్యిమీద పెట్టారు. ఎదురుగావున్న నది గాఢాంధకారంలో మునిగి పోయింది. చంద్రుడు మేఘాలమాటున దాగివున్నాడు. అక్కడ వీస్తున్నగాలిలో వృక్షాల మవాపవలు గుబాళిస్తున్నాయి. అడవిప్రదేశమంతా చీకట్లో బిక్కుబిక్కు మంటూంది. ఇంతలో అతనికి ఎవ్వరిదో అడుగులచప్పుడు వినబడింది. ఎవరో చీకట్లో మెల్లగా వచ్చినట్లు వినిపించింది. తిరిగి నిశ్శబ్దం వ్యాప్తమైంది. గౌతముడు గరుకుగాను, ఎగుడుదిగుడుగానువున్న గోడవానుకొని కూర్చున్నాడు. ఎవరో బైటనుండి మునికాళ్ళమీద నిలబడి లోనికి తొంగిచూశాడు. చీకట్లో గౌతమునికి ఆ వ్యక్తిముఖం స్పష్టంగా కనబడలేదు. బైట మేఘాలు దట్టంగా వ్యాపించి యున్నాయి.

'ఎవరివయ్యా నీవు? చీకట్లో ఒంటరిగా కూర్చున్నావు?'

'నేను' సమాధానం చెప్పాడు గౌతం.

'బాగుంది. చాలా బాగుంది. నీకు ఏమీ పేరంటూ లేదా?'

'నేను అనుదానికి ఏమీ పేరు వుండదు. మనిషి ఆత్మకు ఏం పేరు పెట్టగలం?'

ఎవ్వరూ మాట్లాడలేదు. గౌతమునకు కొంచెం విరాశకలిగింది. కొంచెంసేపు మౌనంగా వుండి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'జీవితరహస్యాలన్నీ తమకే తెలుసునని చెప్పుకొనే శ్రావస్తీనగర పండితులు కొందరు నా జనవపత్రిక తయారుచేసి 'గౌతమ నీలాంబరుడు' అని నాకు పేరు పెట్టారు.'

'నీలాంబరుడవగు గౌతమసోదరా, దివినుండి భువికి దిగి రావయ్యా' అని అన్నాడు ఆ అపరిచిత వ్యక్తి.

'భూమి తడిసిపోయింది. దానిమీద పాములు వున్నాయి. నీవే రావాదా పైకి?'

'ఎత్తుపల్లాలు కేవలం చైతన్యపులేదావల్ల ఏర్పడుతాయి. నీవు ఎత్తు అను కొంటున్నచోటు పాతాళంకంటెకూడా లోతైనదేమో నీకేం తెలుసు?'

'నీవు భగవంతుడవా?' గౌతముడు గోడప్రక్కకు తొంగిచూడకుండానే ప్రశ్నించాడు.

'ఈ ప్రశ్నకు తుదిసమాధానం యివ్వడం సాధ్యంకాదు' అని సమాధానం వచ్చింది.

'ఓహో ఏదెవరో తంతిరిగిన జైనసన్యాసిలా వున్నారు' అని అనుకొన్నారు గౌతం. పాటలీపుత్రపు రాజకుటుంబం జైనపండితుల్ని నెత్తిన ఎక్కించుకొంటూంది. లేక బౌద్ధపండితుడే నేమో. శాక్యముని గౌతంసిద్ధార్థుని అనుచరులు బుద్ధిజీవులు. అట్టివారితో చర్చలుచేయటం గౌతమునకు యిష్టం. అడవులు. గిరులు ఎక్కడచూసినా బుద్ధిజీవులు. కుతార్కికులు. సందేహవాదులు. నాస్తికులు ఎక్కడబడితే అక్కడ చర్చలుచేస్తూ కనబడుతూవుంటారు. గత శతాబ్దిలోనే కపిలవస్తు రాజకుమారుడు అధివిమార్గంబట్టి యీ పరంపరను అనుసరించారు. వారి సమయంలో అన్నిమతాలు భిన్నభిన్నశాఖలతో ప్రచారంలో వుండేవి. మతాలు శాఖోపశాఖలై ముమ్మరంగా నెలకొనియున్న ఆ సామ్రాజ్యంలోకూడా శాక్యముని సిద్ధార్థుడని పిలువబడుతూ క్రొత్తవిధానాన్ని నెలకొల్పారు. దృక్పథాలు అనేకం కావచ్చు. జీవితంమాత్రం ఒక్కటి.... మానవుడు ఏకాకి.

'సోదరా, మీ రెవరు?' అని ప్రశ్నించారు గౌతముడు. అజ్ఞాతంగావున్న భయం తిరిగి అతనికి కలిగింది.

'నన్ను ఎరుగుదుమని అనుకొన్నవాళ్లంతా నన్ను హరిశంకర్ అని పిలుస్తూ వుంటారు. కాని వారికి పేరుతోమాత్రమే పరిచయం.'

'ఈ ప్రాంతానికి క్రొత్తవాడవా?'

ఈ ప్రశ్నవిని అపరిచితవ్యక్తి కొంచెం సిగ్గుపడ్డాడు. 'పశ్చిమోత్తరదిశనుండి వస్తున్నాను' అని అన్నాడు.

'ఎక్కడ చదువుకొన్నావు?' గౌతముడు ప్రశ్నించాడు.

'తక్షశిలలో.'

'తక్షశిలా? అక్కడకు వెళ్ళాలని నా మనస్సు ఎంతకాలంనుండో ఆరాటపడుతూంది' అన్నారు గౌతం.

'వెళ్ళలేకపోయానని చింతించకు. జరిగేదేమీ ఉండదు. తక్షశిలవల్లకూడా కలిగేమార్పు ఏమీ ఉండదు.'

'నీ చదువు పూర్తి అయిందా హరిశంకర్?'

'ఆఁ పూర్తి అయింది. నదులమార్గాన పెద్ద పర్యటనకు పూనుకొన్నాను. మధుర వెళ్ళాను. బ్రహ్మావర్తంలో హస్తినాపుర శిథిలాలు చూశాను. ప్రత్యేకనావలో బయలుదేరి తూర్పుదేశాలు చూశాను. ప్రతిచోట కాలం నన్ను వెంబడిస్తూవున్నది.

కాలం చాలా భయంకరమైనదని నా అభిప్రాయం. కాలాన్నిగురించి నీ వెప్పుడైన భయపడ్డావా గౌతం?'

'నీవు గౌతమబుద్ధుణ్ణి అంగీకరిస్తావా?' నిబ్బరంగా ప్రశ్నించాడు గౌతం.

'ఆ, అయితే నీవుకూడా సంఘంలో ఉన్నావా?' అంటూ ఆ అందమైన యువకుడు గోడదూకి దేవాలయం వరండాలో ప్రవేశించి, అక్కడే ఒక అరుగుమీద కూర్చున్నాడు.

'నీవు యిక్కడే కాశీలో చదువుతున్నావుకదూ?' అని ప్రశ్నించాడు గౌతముని తెల్లనిదుస్తుల్ని తదేకంగా చూస్తూ.

'శ్రావస్తి గురుకులంలో చివరిసంవత్సరంలో వున్నాను' అంటూ సగర్వంగా జవాబిచ్చాడు గౌతం. 'కాశీలో గల పాఠశాలలు స్థాపించింది కేవలం మహాపండితులే కదా.'

'గౌతం నీలాంబర్, నీ జీవితలక్ష్యం ఏమిటి?' అపరిచితుడు ప్రశ్నించాడు.

'చీకటినుండి బైటకువచ్చి నీవుకూడా నన్ను యీ ప్రశ్నయే అడుగుతున్నావా' అన్నాడు విసుగ్గా గౌతం. గాలిలో కొంచెం వేగం తగ్గింది.

మసకమసకగావున్న చంద్రునివెలుగులో గౌతం తన క్రొత్త అనుచరుణ్ణి శ్రద్ధగా చూశాడు. అతని అందమైనముఖం బాగా పరిచితమైనదే.

'ఇతణ్ణి నేను ఇదివరకు ఎక్కడో చూశాను. ఉంగరాలజుట్టు తీసివేస్తే యితని అసలుస్వరూపం బైటపడవచ్చు' హడావుడిగా అనుకున్నాడు గౌతం.

'జుట్టు తీయించుకోలేదే, ఇదేం బౌద్ధభిక్షువువు? సంఘనియమాలను పాటించడం లేదన్నమాట' భిన్నమనస్సుతో ప్రశ్నించాడు గౌతం.

'నేను స్వతంత్రుణ్ణి. ఇంకా స్వాతంత్ర్యంకోసం అన్వేషిస్తున్నాను' అంటూ భిక్షువు దూరంగా కనబడుతున్న అయోధ్య వెలుగువైపు చూడడం ప్రారంభించాడు.

'అయితే....నీకు యిక వేదాలమీద విశ్వాసం పోయిందన్నమాట' కొద్దిసేపు అయినతరువాత ప్రశ్నించాడు గౌతం.

గౌతమసిద్ధారుని మేధావియగు శిష్యునితో విధిగా ప్రత్యేకచర్చ జరపాలని, అందుకు సరియైన సమయం దొరికిందని నిశ్చయించుకొన్నాడు.

'శాక్యమునికూడా యీ కోసలదేశంవాడే. నీవు చెప్పే పరిభాషలన్నీ ఉపనిషత్తుల్లో వున్నవి. శాక్యమునిపై కపిలదేశపు దార్శనికుల దృక్పథప్రభావం బాగా

వదిలింది. ఏ వస్తువూ యోచనాప్రపంచంలో పరిశుద్ధరూపంలో వుండదు. అసం బద్ధంగాను వుండదు. నీవు శబ్దాలను ఎందుకు ప్రయోగిస్తావు? శబ్దాలు సంబంధాన్ని స్థాపిస్తాయి. అంతే....' యింతలో ఆతనికి యిల్లు వాకిలి వదలి అడవికివెళ్ళిన వాణీనిగురించి గృహస్థు అన్నమాటలు జ్ఞప్తికివచ్చాయి-'యిప్పుడు ఆడవాళ్లకు కూడా యీ భావాలగాలి సోకుతూవున్నది' కొంచెం కోపంతో ముగించాడు.

హరిశంకరునకు నవ్వు వచ్చింది.

'ఎందుకు నవ్వుతావు? నీ ఆనందునికి ఏమి మూడిందో చూడరాదూ' యింకా కొంచెం కోపంతో అన్నాడు.

'నీకే బోధపడుతుంది వెమ్మదిమీద' మెల్లిగా అని భిక్షువు అక్కడే పడు కొన్నాడు.

'నీవు యిలా తప్పించుకొని ఎందుకు పారిపోతున్నావు?' అని ప్రశ్నించాడు గౌతం.

అందుకు సమాధానంగా 'నీవు దేనికోసం వెతుకుతున్నావు?' అని హరిశంకర్ ఎదురుప్రశ్న వేశాడు.

'శంకర్? నీవు అహంకారివి. ఒక అంధుడు మరో అంధునికి త్రోవ చూపించి నట్లు జ్ఞానులుకూడా గర్వమనే భ్రమలోపడి ఒక మూసలో పరిభ్రమణం చేస్తున్నారు.'

'దండుగమారి మాటలు' అంటూ త్రోసిపుచ్చాడు హరిశంకర్.

'నీవు పాణిని చదివావా? శబ్దాలపరిధుల్ని ఛేదించకపోతే వాటి రహస్యాన్ని తెలుసుకోలేవు.'

'శబ్దాల తుదివ్యాఖ్యను అందుకొనేసరికి వాటి అర్థాలు మారిపోతాయి. అర్థం కోసం పరుగెత్తడం ప్రారంభించేసరికి ఎక్కడికి చేరుకొంటానో నాకే బోధ పడటంలేదు.'

'శబ్దాలు శాశ్వతమైనవి. శబ్దాలు పరమేశ్వరస్వరూపాలు. ఓమ్ అను మూడు అక్షరాల్లోను, స-వ-న అను మూడు స్వరాలమధ్యను సృష్టి అంతా యిమిడివున్నది. ధ్వని ఆకాశపు ఒక గుణవిశేషం.'

'పేర్లు పెట్టడంలో ఘనుడు మీ గౌతమఋషి. ఆయన చెప్పినప్రకారం ధ్వని శాశ్వతమే అయితే, నోటిమంచి వెలువడకపూర్వమే శబ్దం వినబడాలి. ఆకాశానికి మన చెవులకుమధ్య అడ్డు ఏమీ లేకపోవడమే అందుకు కారణం.'

'శబ్దాలమీద విశ్వాసం లేనివాడవు, నీవేం వేదాంతివయ్యా! శబ్దాలనేమార్గం లేకపోతే విశుద్ధమైన భావంవరకు ఎలా చేరుకోగలవో చెప్పు. ధ్వని శబ్దపు సహజ గుణవిశేషం. మూలవస్తువు లేక పదార్థం శాశ్వతం. అదే బ్రహ్మ స్వరూపమన్న మాట.'

'శూన్యాన్ని విశ్వసత్యమని నమ్మే మీరు చాలా గౌరవచేస్తున్నారు.' అన్నారు హరిశంకర్ మెల్లగా.

'వేదాంతాన్ని దాటి మీరు ముందుకు వెళ్లలేకపోవడం ఆశ్చర్యకరమైన విష యమే.'

'ఆ తుది తరువాత ఏముంటుందో చెప్పగలవా.'

'నీకే తెలియాలి....' అన్నారు హరిశంకర్.

గౌతముడు మౌనం వహించాడు.

జీవాత్మ పరమాత్మలు అవిద్యవలన ద్వైతంగా వున్నాయి. అందువల్లనే శబ్దము అశబ్దము రెండూ వేరువేరు బ్రహ్మలు. శబ్దస్మరణద్వారానే అశబ్దాన్ని ప్రకటించ వచ్చును.'

'నేనే అశబ్దాన్ని' అని అన్నాడు హరిశంకర్.

గౌతముడు ఏమీ మాట్లాడలేదు.

హరిశంకర్ చెప్పడం ప్రారంభించారు—'కార్యము, కార్యములనియమము పూర్ణమైనది. ఏవస్తువు మరోవస్తువులా వుండదు. క్షణికమైన అస్తిత్వం తప్ప ఏవస్తువుకూ మరోవస్తువుతో సంబంధంలేదు. అన్నీ క్షణికాలే. అంతా దుఃఖ మయం. ఆపదలమయం. సర్వం దుఃఖం. దుఃఖం. శరీరము, ఆత్మ రెండూ నశ్వరములే. రెండూ కలిసివున్నప్పటికీ శాశ్వతమైన అస్తిత్వమేమీ అనిర్భ వించదు. ఆత్మ శాశ్వతంకాదు. మనుష్యుడు దీపంవలె ఆరిపోతాడు. కేవలం పుట్టాలు, భావాలుమాత్రమే నిలిచివుంటాయి....నిద్రపోతున్నావా సోదరా ...'

'మేల్కొనేవున్నాను, చెప్పుకుపో.'

'సంగీతానికి నిలయం అయోధ్య. అక్కడ ఒక అమ్మాయి వున్నది. శాశ్వత మని నన్ను నమ్మించాలని ఆ అమ్మాయి ప్రయత్నించింది. మేఘాల్లోను, స్వరా ల్లోను దేశకాలాలను బంధిస్తూవుంటుంది.'

'నీవు పాటను, సదాన్ని అంగీకరించలేదు. ఒకటిమాత్రం నిజం. స్వరాలు మిగిలివుంటాయి. స్వరాలు స్థిరంగా వుంటాయి.'

'నేను ఉత్తర కోసలరాజ్యంలో అడుగుపెట్టాను. రహస్యస్థావరాల్లోవుండి వరి హద్దును రక్షిస్తుండే రక్షకభటులు 'ఎక్కడనుండి వస్తున్నావు?' అని గద్దించి అడిగారు. ఇక్కడినుంచే వెళ్ళాను, యిక్కడికే తిరిగివచ్చాను. మీరందరూకూడా యిక్కడే ఒరిగిపోతారు. ఈ తిరుగుడులో పడక తప్పించుకొనేఉపాయం చూసుకోండి' అని సమాధానం చెప్పాను. 'దీనిఅర్థం ఏమిటో బోధపడిందా?' అని రక్షకభటుడు తనతోబాటువున్న మరొకణ్ణి అడిగాడు. 'ఏదెవరో వేదాంతిలా వున్నాడు' అని అన్నాడు రెండవవాడు. ఇద్దరూకలిసి గవ్వలు ఆడుకోవడం ప్రారంభించారు. నన్నుగురించి పట్టించుకోలేదు. అయోధ్యలో ప్రవేశించిన తరువాత స్వరాలు యింకా మిగిలేవున్నాయని నాకు తెలిసింది. గౌతమ్! జీవితం చాలా విస్తారమైనది. దేశాలు, పట్టణాలు, కొత్తకొత్తముఖాలు, రకరకాల భాషలు, అబ్బ! చాల పెద్దయాత్ర చేశాను. కొన్ని మేఘరాగాలుమాత్రం నన్ను వెంబడిస్తూనే వున్నాయి. తక్షశిలలో కొద్దిసంవత్సరాలు వున్నాను. ఆవిధంగా ఆ స్వరాలను మరిచిపోయేందుకు ప్రయత్నించాను. ఇక్కడికి వచ్చాను. మళ్ళీ ఆ స్వరాలు నా చెవులకు వినబడుతున్నాయి. శబ్దాలు, ధ్వని-నిత్యనశ్వరం అని అంటున్నావు....నన్నడుగు....నాకు తెలుసు....అంతా వేరువేరుస్థలాల మహిమ. ఇందులో యథార్థం లేనేలేదు. సర్వం దుఃఖం....దుఃఖం...

గౌతముడు బొమ్మలా వింటూవుండిపోయాడు.

'పవిత్రమైన సరయూనదీ! ఋగ్వేదంలో ప్రవహించిన నదీమతల్లీ! యీనాటి రాత్రి ఆశ్చర్యంతో నిన్ను దర్శిస్తున్నాను. అయోధ్యా! నీ వెలుగులు ఎప్పటివరకు యీవిధంగా ప్రకాశిస్తూవుంటాయి? అయోధ్యానగరం-బ్రహ్మనగరం. ఎవ్వరూ జయించలేని నగరం. ఏదో ఒకరోజున నీ వైభవంకూడా వుండదా! స్థిరంగా వుండే వస్తువే లేదా? ఆ అమ్మాయిపేరు చంపక. చంపా అంటే సంపెంగ అని అర్థం. అంటే సంపెంగపూవులా అందంగా వున్నదన్నమాట. ఇక్కడే నా యింటివారు నాకోసం ఎదురుచూస్తున్నారు. నా తల్లిదండ్రులు-నా ఆమంగు సోదరి. రామచంద్రుడు పద్నాలుగుసంవత్సరాల వనవాసం తరువాత తిరిగివస్తానని మాట యిచ్చారు. నేనుకూడా తిరిగివచ్చాను. గౌతమసిద్ధార్థుడు నన్ను వాగ్దానమనే బంధం

నుంచి విముక్తిణ్ణి చేశాడు. చూశావా? శబ్దాలు మళ్లీ నన్ను మోసగించాయి' అంటూ ఉదాసీనంగా ముగించాడు.

బయటి వృక్షాలమీద వానచినుకులు పడుతూవున్నాయి. గాలికి దీపం ఆరిపోయింది. శంకర్ యిటుకలను తలగడగా అమర్చుకొని పడుకున్నాడు. గౌతముడు తెల్లని పైవంచ కప్పుకొని గోడవైపుకుమళ్ళి పడుకొన్నాడు. ఇరువురూ కొద్దిసేపు చీకట్లో రెప్పలు వాలుస్తూ తెరుస్తూ గడిపారు. చలచల్లని గాలికి యిద్దరికీ నిద్ర పట్టింది.

ఆ రాత్రి గౌతమునకు చిత్రమైన స్వప్నాలు కలిగాయి. గర్భగుడినుండి చండీదేవి గౌరీరూపంలో ఘల్లుఘల్లుమని అడుగులువేసుకొంటూ బయటకు వచ్చింది. తరువాత ఆమె సిందూరం రంగుచీర కట్టుకొన్న అమ్మాయిలా మారిపోయింది. ఆతరువాత ఆమె అనేకరూపాల్లో కనబడసాగింది. ముందు పెండ్లికూతురులా కనబడింది. మరునిమిషంలో ముసలిదానిలా నల్లగా భయంకరంగా మారిపోయి వచ్చి గౌతముని తలవద్దకూర్చొని బిగ్గరగా ఏడ్వడం ప్రారంభించింది. 'అమ్మా, అమ్మా....అమ్మా' అంటూ బిగ్గరగా అరిచాడు గౌతముడు. ఆ ముసలిది 'ఒరేయ్, నేను నీ తల్లిని గానురా. నేను వైశాలీ నగర ... ...' అని అంటూవుండగానే యింతలో చెట్టుకొమ్మను అలుముకొనియున్న తీగ ఒకటి తెగి గౌతం సమీపంలో పడింది. ఆ తాకిడికి గౌతముడు అదరిపడిలేచాడు. ప్రక్కనే శంకర్ విశ్రాంతగా హాయిగా నిద్రపోతున్నాడు. వర్షం ఆగిపోయింది. గౌతముడు వెంటనే త్వరత్వరగా మంత్రాలు పఠించడం ప్రారంభించాడు. చాలాసేపు గడిచాక అతనికి నిద్రవచ్చింది.

ఉదయానే శంకర్ లేచిచూశాడు. గౌతముడు చండీమాతస్తోత్రాలను పఠిస్తున్నాడు. దేవుడగ్గర బ్రాహ్మణుల హడావుడి ఎక్కువగా వున్నది. మామిడితోట పక్షులకూతలతో ప్రతిధ్వనిస్తూంది. గౌతం పూజ ముగించుకొని బైటకు వచ్చాడు. అతణ్ణిచూచి హరిశంకర్ చిరునవ్వు నవ్వాడు. 'వైశాలీనగరంలో ఎవరు వుండేవారు?' అని గౌతం ప్రశ్నించాడు.

శంకర్ జవాబు చెప్పలేదు. ఆపుకోలేక పక్కున నవ్వాడు. అర్థంలేని అతని నవ్వుచూచి గౌతం మండిపడ్డాడు. కాని తమాయించుకొన్నాడు. ఇద్దరూ దేవాలయం మెట్లుదిగి అడవిలో ప్రవేశించారు.

'నీవు శ్రావస్తికి తిరిగి వెళుతున్నావా' అని అడిగాడు శంకర్.

'అవును, వెళుతున్నాను. నీవుకూడా నాతోబాటు రా. శ్రావణమాసంలో నీవు మా ఆశ్రమంలో వుండవచ్చు.'

'శ్రీవ, మంగలికత్తికంటె పదునుగలది సుమా అని ఋషులవాక్కు గౌతం సోదరా! నడగురు నడచేమార్గంలో అడుగుపెట్టకు, జాగ్రత్త.'

'కాలిబాట ఇరుకుగావుంది, యిద్దరు యాత్రికులు ఎదురుబదురుగా నిలబడివుంటే వారిలో ఒకరు తప్పుకోవలసివుంటుంది. లేకపోతే యిద్దరూ గోతిలో పడిపోతారు' అని అన్నాడు గౌతం.

'అవును, నిజం.'

ఇరువురూ శ్రావస్తికి బయలుదేరారు.

ఆకాశంలో అలుముకొన్న మేఘాలు తొలగిపోయాయి. గాలిలో పచ్చిమొగ్గల వాసన గుబాళిస్తున్నది. సాయంకాలానికి వాళ్ళిరువురూ నెమళ్లను పెంచి పోషించే వాళ్ల గ్రామం చేరుకొన్నారు. గౌతం, శంకర్ గ్రామపు నూతిదగ్గరకువెళ్ళి నూతి గట్టుమీద కూర్చొన్నారు. ఇద్దరు విద్యార్థులు వచ్చారనేవార్త మరుక్షణంలో ఊరంతా వ్యాపించింది.

శంకర్ కళ్లుమూసుకొని కూర్చున్నాడు. ఇంతలో ఒక అందమైనయువతి నెమలి ఈకలతో తయారుచేయబడిన రెండు విసనకర్రలు వాళ్ళదగ్గరకు తెచ్చింది. గౌతముడు ఆమెచేతినుండి ఒక విసనకర్రతీసికొని అటుఇటుత్రిప్పి చూడసాగాడు. 'ఈ విసనకర్రలు ఎక్కడెక్కడికి, ఏ యే పట్టణాలకు, ఏ యే ప్రదేశాలకు పంపబడ తాయి? నేను తాకిచూచిన యీ విసనకర్ర అయోధ్యానగరంలో అమ్మకం అవు తుంది. బహుశః సంపెంగపూవులాంటి లావణ్యంగల ఆ అమ్మాయే దీన్ని కొంటుంది.' అనుకొంటూ ఆ విసనకర్ర తిరిగి యువతికి యిచ్చివేశాడు. 'మేము విలాసవస్తువుల్ని స్వీకరించకూడదు. అందమైన నీ యీ విసనకర్రలు మాకు అవసరంలేదు. నెమలిరెక్కల్ని అడవుల్లోచూచి మేము ఆనందిస్తుంటాము.' అని గబగబ అన్నాడు గౌతం. యువతి విసనకర్రల్ని తిరిగి తీసికొని నమస్కరించేం దుకు కొంచెం వంగింది.

'నీ పేరు సుజాత కాదుగదా' అని నవ్వుతూ ఆమెను ప్రశ్నించి గౌతం ఒక్క పర్యాయం శంకర్‌వంక చూచాడు. శంకర్ యింకా కండ్లు మూసుకొనేవున్నాడు.

'నాపేరు వందనాల. సుజాత మా అక్కయ్య పేరండి' అని సహజంగా చెప్పి ఆ యువతి నూతిగట్టు దిగి ఊళ్ళోకి వెళ్ళిపోయింది.

హరిశంకర్ అందుకొన్నాడు—'సోదరా గౌతం, ప్రతియుగంలోను ప్రతి త్రోవ మలుపుదగ్గర ఏదో ఒక వందనాల లేక సుజాత నీకు తటస్థపడుతూనే వుంటారు. నీ దగ్గరకువచ్చి ఆరాధించాలని కోరుతారు. ఇంకా మించిపోలేదు. మేలుకో.'

మరునాడు ఉదయం యిరువురూ తిరిగి యాత్రకు బయలుదేరారు.

శ్రావస్తి సమీపిస్తున్నది. చంద్రచెట్ల అడవి దాటినతరువాత ప్రజలు నివసించే ప్రదేశం ప్రారంభమైనది. నడుస్తూ నడుస్తూ హరిశంకర్ గౌతమునివంక తిరిగి 'సోదరా గౌతం, వైశాలీనగరంలో అంబపాలి అను ఒక సుందరాంగి ఉండేది. అంబపాలి, చంపక, సుజాత, వందనాల అంతా ఒక్కటే. అందువల్ల నీ మనస్సును వికారరహితం చేసుకో.' అని అంటూ వెనకకుతిరిగి చంద్రచెట్ల అడవి లోకి త్వరత్వరగా వెళ్ళిపోయాడు. గౌతం బిగ్గరగా పిలిచాడు. ఎంత పిలిచినా హరిశంకర్ తిరిగి రాలేదు.

## 2

అందమైన శ్రావస్తీనగరం రాప్తీనది ఒడ్డున చాలాదూరంవరకు వ్యాప్తమైవున్నది. ఆ నగరానికి ఉత్తరదిక్కున మంచుకొండలు నిలిచివున్నాయి. ఆ పర్వతాల చరియల్లోగల వంటపొలాలు కన్నులకు ఆహ్లాదం కలిగిస్తున్నాయి. కొండలోయల్లో దట్టమైన అడవులు వ్యాపించివున్నాయి. అందు పెద్దపులులు తిరుగుతూవుంటాయి.

ఉత్తరకోసలరాజ్యం, పెద్దపెద్ద నగరాలతోను, గ్రామాలతోను నిండి కళకళ లాడుతూ వున్నది. అడవులు ఎక్కువ. అందువలన అడవి కలపతో అందమైన భవనాలు అక్కడ నిర్మింపబడుతూవుంటాయి. జనసంఖ్య పెరిగిపోతూ వుండటం వలన అడవులసంఖ్య తరిగిపోతూవున్నది.

శ్రావస్తీనగరం జనంతో కిటకిటలాడుతూ వుంటుంది. దూరదూరదేశాలనుంచి జనంవచ్చి అక్కడ వుంటున్నారు. వేరువేరు పేటల్లో కంసాలులు, కమ్మర్లు, కోమట్లు, సాలీలు మొదలుగాగల కులాలవాళ్లు నివసిస్తూవున్నారు.

రథాలు తోలేవారు, కుమ్మర్లు, మద్యం అమ్మేవాళ్లు, బుట్టలు అల్లేవాళ్ళు నగరం బయట నివసిస్తూవుండేవారు. ఊరికిదూరాన మాలపల్లె వున్నది. చాతుర్వర్ణ్యాల కంటె హీనంగా చూడబడే ఆ పంచమజాతివాళ్లు శవాలను మోసుకొనిపోయేందుకు, శవాలను తగులపెట్టేందుకు ఉపయోగపడుతూవుంటారు. అదే వాళ్లవృత్తి. శవాల మీది గుడ్డలుమాత్రమే వాళ్లు కట్టుకొనేవారు. పగిలిపోయిన బొచ్చెల్లో తిండి తినాలని, గాజుల అభరణాలుమాత్రమే ధరించాలని సమాజనిర్ణయం.

అప్పటికి 70, 80 సంవత్సరాలక్రితం శ్రావస్తీనగరానికివచ్చి కపిలవస్తునగరపు శాక్యముని నివాసం ఏర్పాటు చేసుకొన్నాడు. ఆయన, ఆయనశిష్యులు తమ ప్రవచనాలద్వారా మానవులంతా ఒకటేనని, జన్మనుబట్టి కులాలను నిర్ణయించటం తప్పని కర్మనుబట్టి మైచ్చులని, శూద్రులని పరిగణింపబడటం ఒప్పని ప్రచారం చేశారు. కాషాయదుస్తులు ధరించినభిక్షువులు వాడవాడకువెళ్ళి మాలమాదిగలను, శూద్రులను సత్కర్మలుచేయమని ప్రబోధం చేయసాగారు.

సంవత్సరమంతా మౌనంగావుండి వానదేవతవలన నూతన స్ఫూర్తిపొందిన బావురుకప్పలు మౌనవ్రతం విరమించుకొని బ్రాహ్మణుల్లా గొంతు చించుకొని అరుస్తున్నాయి. విద్యార్థులు గురువుచెప్పిన ప్రతిశబ్దాన్ని అనుకరించినట్లే ఒక కప్ప మరోకప్ప అడుపున ఉ. చ. తప్పకుండ అనుకరిస్తూవున్నది. కప్పలు చెరువులో హాయిగా కూర్చొని వర్షాకాలపుదాగాన్ని ఆలాపిస్తున్నాయి.

గౌతముడు పుస్తకం మూసి కండ్లెత్తిచూశాడు. ఎదురుగా జోరుగా వర్షం కురుస్తున్నది. కప్పలు అరుస్తున్నవి. నెమళ్లకూతలు, ఇంకోళ్లకూతలు దిగ్గరగా వినబడుతున్నవి. శ్రావణమాసపు మేఘాలు ఆకాశంఅంతటా వ్యాపించియున్నాయి. ఋగ్వేదంలో శతాబ్దాలక్రితం వర్ణించబడినట్లుగా వర్షఋతువుదృశ్యం అతని కండ్ల ఎదుట కనబడుతున్నది. కుటీరంముందు వరండాలో శ్రావణమాసపు ఈ దృశ్యాన్ని రెప్పవాల్చకుండా చూస్తూకూర్చున్నాడు గౌతం.

ఆచార్యపదవిపొందిన గురువుదగ్గర గౌతముడు చాలాకాలంనుండి చదువుతున్నాడు. ఈమధ్యనే అతడు నాటకరచన, చిత్రరచన కావించి పేరుప్రతిష్ఠలు

సంపాదించుకొన్నారు. ఇతడు జన్మతః కవి. అట్టిస్థితిలో పురోహితుడు అయితే ప్రయోజనం ఏమిటి? అని గౌతముణ్ణిగురించి అతని గురువుకూడా అన్నారు. రచనావ్యాసంగంమీద అభిరుచి లేకపోయినా అతడు ఇంద్రప్రస్థంవెళ్ళి పాంచాల రాజులసైన్యంలోచేరి ఉద్యోగం చేయగలడు. కాని నాటకాలు వ్రాయడం, కళలకు సంబంధించిన సిద్ధాంతాలమీద పుస్తకాలు వ్రాయడం, బొమ్మలు గీయడం, విగ్రహాలు తయారుచేయడం జీవితలక్ష్యంగా పెట్టుకొన్నాడు.

అఖిలేశుడు తక్షశిలనుండి యీమధ్యనే తిరిగివచ్చిన రాజకీయవిద్యార్థి. ఉత్సాహవంతులగు కొద్దిమంది యువకులతోపాటు వచ్చి గౌతముని కుటీరంలో తిష్ఠవేశాడు. చర్చలు ప్రారంభమైనాయి.

'భవిష్యత్తులో యీ దేశంలో రగడ తప్పకజరిగితీరుకుంది తమ్ముడూ. పాలు, పెరుగు, పప్పు-ఉప్పు అన్నీకూడా పాటలీపుత్ర ప్రభుత్వమే చెల్లించుకొంటూంది' అని అన్నారు యోగేంద్ర.

'అంతటితో ఆగితేకదూ! చివరకు యింతపెద్ద సైన్యం అయ్యుకూడా పాటలీపుత్ర ప్రభుత్వమే భరించవలసి వస్తున్నది. ఇక్కడిప్రజలు చూస్తూ వూరుకొంటారనే నమ్మకం నాకులేదు.' అన్నారు గుణవర్మ.

శ్రావస్తీనగరవాసి విమలేశ్వర్ అందుకొన్నాడు-'ఘనానంద్ మహారాజా అగ్నిపర్వతాగ్రంమీద కూర్చొనివున్నాడు' అఖిలేశ్వర్ వంకచూచి 'నీవు చాణక్యుణ్ణి గురించి ఏమిటి చెబుతున్నావు? చాణక్యుణ్ణి నీవు కలిశావా?' అని ప్రశ్నించాడు.

'తక్షశిలలో చాలాసార్లు కలిశాను.'

'తక్షశిలనుండి వచ్చిన విద్యార్థులంటే యితరులకు మహాగౌరవం. వెంటనే మిగతా యువకులంతా అఖిలేశ్‌వైపు తిరిగి అతడు చెప్పే మాటలు శ్రద్ధగా వినడం ప్రారంభించారు. అఖిలేశ్ చాణక్యుణ్ణిగురించి అనేక విషయాలు చెబుతూవుంటే మిగతా యువకులంతా మధ్యమధ్యన చర్చలో పాల్గొంటున్నారు.

కాని గౌతం యీ విషయాలేమీ పట్టించుకొనక దూరంగా కూర్చొన్నాడు.

'మగధదేశం ప్రజలు మొదటినుండి మహావీరులే. జరాసంధరాజాపేరు మరిచిపోయావా?' అన్నాడు యోగేంద్ర.

'మగధవారితో సంధిజరగడం అసంభవం' అన్నాడు విమలేశ్వర్.

'ఇదంతా కులాల జాతుల వ్యవహారం' అంటూ చెప్పడం ప్రారంభించాడు అఖిలేశ్. 'ఇప్పుడు దేశమంతటా బ్రాహ్మణ క్షత్రియుల రాజ్యం సాగుతూంది.

సింధునదీతీరం వరకు బ్రాహ్మణులరాజ్యమే సాగుతూంది. మగధమాత్రం ఎన్నడూ పూర్తిగా బ్రాహ్మణులవశం కాలేదు. మగధలోగల గొప్ప కులాలవాళ్లను కోసల దేశవాసులం ఎన్నడూ లక్ష్యంచేయలేదు. అజాతశత్రువు మనమడు గతించినప్పటి నుంచి అక్కడ శూద్రులు అధికారం చెలాయిస్తున్నారు. మగధదేశమంతా శూద్రమయం' అంటూ యువకులవైపు చూచాడు.

'మగధదేశపు క్రొత్త రాజధాని, గిరివ్రజం, రాజగిరులనుగూడా మించి పోయింది.' అని అన్నాడు గుణవర్మ.

'కాశీనగరం, వైశాలి, శ్రావస్తివాళ్ళంతా అజాతశత్రువుకు వ్యతిరేకంగా ఏకమైనారు. అప్పుడు వీళ్ళ తాకిడికి తట్టుకొనేందుకై మగధ పరిపాలకులు పాటలీపుత్రానికి నలువైపుల కోటగోడలు నిర్మాణం చేయించారు. అజాతశత్రువు మనమడు ఉదయ్ కుసుంపూరు నగరాన్ని నిర్మాణంచేశాడు. ఆ కుసుంపూరు యిప్పుడు శక్తివంతమైన రాజధానిగా రూపొందింది. దానిపేరు వింటేనే యింత దూరానవున్న మనంకూడా వణుకుతున్నాం' అన్నాడు విమలేశ్వర్.

దీపం వెలుగులో గౌతం తన అనుచరుల ముఖాలుచూస్తూ లోలోన యిలా అనుకొంటున్నాడు - 'ఈ నగరంకూడా అగ్నికి, పిడుగులకు, యుద్ధాలకు ఆహుతి అయిపోతుందని గౌతంబుద్ధుడి భవిష్యవాణి. నగరాలు, పట్టణాలు యిలాగే నిర్మాణం అవుతాయి, నశించిపోతాయి. హృదయములేని నగరాలుకూడా మట్టిలో కలిసిపోతాయి. ప్రజలు పట్టణాలు ఏవీ శాశ్వతంకావు. నేను పూర్తిగా ఏకాకిని.'

తక్కువ వయస్సుగల ఒక యువకవిద్యార్థికి చాణక్యుణ్ణి గురించి యిప్పటివరకు చెబుతున్న అఖిలేశ్ పక్కకు తిరిగి విమలేశ్‌తో దగ్గరగా యిలా అన్నాడు: 'అజాతశత్రువు మనుమడు మహారాజా ఉదయ్ పేరు ఎత్తావు. అతడు ఎటువంటివాడో, ఎప్పటివాడో తెలుసా? ఇరాన్‌ను ఏలిన దారా ప్రథమునికి సమకాలికుడు.' తిరిగి చిన్నవయస్కుడితో యిలా అన్నాడు: 'చాణక్యుడి రాజనీతిని సామ్రాజ్యాన్ని గురించి నీకుచెబుతున్నాను. దారా పరిపాలనలోనున్న ఇరాన్‌గూడా సామ్రాజ్యమే. అతడి అధికారం యిప్పుడు నలువైపుల సాగుతున్నది. అది ఎంత ప్రబలంగా సాగుతున్నదో మీకు తెలియదు.'

'అధికారమా?' చిన్నవయస్కుడు ప్రశ్నించాడు.

'ఇరాన్‌వాళ్లు గాంధార్‌మీద ఆక్రమణ చేసినప్పుడు ఆ దేశపురాజా బింబిసారుని దగ్గరకు తనదూతను సాయంకోసం పంపించారు. ఇప్పుడు ఇరాన్ గొప్ప సామ్రాజ్యమైపోయింది. సప్తసింధుకు ఉత్తరదిక్కున, పశ్చిమదిక్కునగల రాజ్యాల దగ్గర పన్ను వసూలుచేస్తున్నది. ఆ దేశపు ప్రభువు దారా. నేను దారయుష్‌ను. నేను సామ్రాట్టును. రాజులకు రాజును. షాహంషాహును. రకరకాలజనం నివసించే యీ దేశాలకు చక్రవర్తిని' అని చెప్పుకొన్నాడు అతడు. గుశ్తాష్ప బిడ్డడు, ఇరాన్ బిడ్డడు, ఆర్యుడు - ఆర్యవంశపుత్రుడు - అతని పడవలు. సైనికులతోనిండిన అతడి పెద్దపెద్ద నావలు, పవిత్ర సింధునదీకెరటాలపై తేలియాడుతూ తిరుగుతూ వుండేవి.

'షాహంషాహ్ అను శబ్దం పారసీభాషకు సంబంధించినది కదూ' అని అడిగాడు గౌతం.

'అవును. దారయుష్ ప్రథమపుత్రుడు అర్తక్షేత్. అతడు మనదేశంలోగల చాలా రాజ్యాలను జయించాడు. దేవతలను పూజించే యీ రాజ్యాలలోగల దేవళాల పునాదులు కదిలించివేశాను. ఇది అహుర్మజ్ద్ ఆజ్ఞ.' అని గర్వంతో చాటుకున్నాడు.

ఈ మాట వినేసరికి గౌతమునకు వెగటుకలిగింది. ఇలా అన్నాడు: 'మనుష్యులు ఒకరిని మరొకరు మ్రింగివేయాలని ముందుకురుకుతున్నారు. లేకపోతే అహుర్మజ్ద్ ఆజ్ఞ ఏమిటి? దేవళాల పునాదులు కదలించివేయడమేమిటి?'

'అహుర్మజ్ద్ ఎవడు?' అని ఒక విద్యార్థి అధ్యాపకుడును ప్రశ్నించాడు.

'పరమేశ్వరుణ్ణే ఇరానీభాషలో అహుర్మజ్ద్ అని అంటారు.'

'అయితే నీవు పొగడుతున్న అర్తక్షేత్ శబ్దానికి అర్థం ఏమిటి?' అని అడిగాడు గౌతం.

'ఇదంతా రాజనీతిలే తమ్ముడూ. శబ్దార్థాలతో కూర్చుంటే ప్రయోజనంవుండదు' అని గౌతమునికి కోపంగా సమాధానంచెప్పి ఆచార్యుడు మిగతా విద్యార్థులవైపు తిరిగి యిలా చెప్పడం ప్రారంభించాడు:-'కొద్దిరోజులక్రితం కొంతమంది వ్యాపారస్తులు పర్సిపోలిస్‌నుంచి ప్రాణాలు దక్కించుకొని తక్షశిల చేరుకొన్నారు. ఇరాన్‌లో పెద్దయుద్ధం జరుగుతున్నదని వాళ్ళు చెప్పారు. యవనులు ఇరాన్ ఆధిపత్యాన్ని తొలగించుకొని స్వతంత్రులు అయినప్పటినుండి ఇరాన్‌సామ్రాజ్యం బలహీనమై పోతున్నది' గౌతంవైపు తిరిగి - 'గౌతం, ఒక్కమాట చెప్పనా. తక్షశిలలో విష్ణు

గుప్తుడు నాతో మనదేశానికికూడా శక్తివంతమైన సామ్రాజ్యం అవసరం. ప్రపంచం నాలుగుచెరగుల ఆ సామ్రాజ్యం విస్తరించాలి' అని అన్నారు. పర్సిపోలీస్‌నుండి వచ్చిన వ్యాపారస్థులు చెప్పినప్రకారం ఇరాన్ దారయుష్ తృతీయుడు. దేశాన్ని పరిపాలిస్తున్న యిప్పటి గొప్పసాహసి. కాని ఏం లాభం? యవనుల సైన్యాధిపతి అలెక్సాండ్రచేతుల్లో చిత్తుచిత్తుగ ఓడిపోయాడు. అలెక్సాండ్ర పెద్దసైన్యంతో వచ్చి విరుచుకుపడ్డాడు.

గౌతం ఆశ్చర్యంతో వింటున్నాడు.

'ఇరాన్‌దేశమంతా యిప్పుడు అలెక్సాండ్రచేతుల్లో వున్నది' అంటూ ముగించాడు అఖిలేశ్.

'అంటే పారసీకుల రాజ్యానికంతటికీ నీవు చెప్పిన అలెక్సాండ్ర పాలకు డన్న మాట' అని అన్నాడు గౌతం.

'అవును అతడే పాలకుడు' అఖిలేశ్ సంకోచిస్తూ సమాధానం చెప్పాడు.

'అఖిలేశ్, నీవు క్షత్రియుడవు. రాజ్యాలు స్థాపించడం, రాజ్యాలను మట్టిపాలు చేయడం నీ పని. ఇంతకుమించి ఏమి చెప్పను' అని అన్నాడు గౌతం. అఖిలేశ్ దీపం ప్రమిదలో కొద్దిగా నూనెపోసి గౌతంవైపు జాగ్రత్తగాచూసి 'నీవు అవసరమైతే యుద్ధంలో పాల్గొంటావా లేదా' అని సూటిగా ప్రశ్నించాడు.

కుటీరంలో దూరంగా కూర్చొనివున్న యోగేంద్ర అందుకొని 'నీవు ఊరుకుంటేమాత్రం ప్రజలు నోరుమూసుకు కూర్చుంటారంటావా?' అని గౌతమని ప్రశ్నించాడు. గౌతం గాభరాపడుతూ యోగేంద్రవంక చూశాడు.

మగధరాజకీయం పరిస్థితులపై మళ్ళా తీవ్రస్థాయిలో చర్చ ప్రారంభమైంది.

మరునాడు సంధ్యానమయమప్పుడు గౌతం కిటికీవగ్గర కూర్చొని ఒక భోజపత్రం చదువుతున్నాడు. ఇంతలో హరిశంకర్‌వచ్చి 'బ్రహ్మచారీ, పావనకుటీరంలో ప్రవేశించవచ్చునా?' అని ప్రశ్నించాడు.

'తప్పక ప్రవేశించవచ్చు తమ్ముడూ. ఏమిటి యిలా వచ్చావు?' గౌతం భోజపత్రం మడిచి ఒకవైపునపెట్టి త్వరగాలేచి 'నీవు ఎక్కడికో వెళ్ళిపోయావని, యిక కానరావని అనుకొన్నాను' అని అంటూ చీపురితెచ్చి చిమ్మి హరిశంకర్ కోసం ఒక చిరుచాప పరిచాడు.

'గౌతం, వాంఛలు నిన్ను బాధిస్తున్నాయా?' అంటూ ప్రశ్నించాడు హరిశంకర్.

'అంటే'

'ఉదాహరణకు మాంసం తినాలనే కోరికవంటి వాంఛలన్నమాట.'

'ఏం చేయమంటావు చెప్పు హరిశంకర్. నాలో రక్తం ప్రవహిస్తున్నది. నా నాలుగువైపుల రక్తం ప్రవహిస్తున్నది. ఇంతటి రక్తపాతానికి ప్రాయశ్చిత్తం ఎలా చేసికోగలను ? నా మిత్రులంతా యుద్ధాన్నిగురించి మాట్లాడుతూ వుంటారు. నాకు యుద్ధమంటే యిష్టం లేదు.'

'అయినా నీవు యుద్ధంచేయక తప్పదు.' అని అంటూ హరిశంకర్ గ్రంథ పఠనంలో లీనమైనాడు.

కుటీరం వెలుపల మోదుగవృక్షపు నీడ పెద్దని కాసాగింది. హరిశంకర్ ఇంకా ఏమైనా చెబుతాడేమోనని గౌతం ఎదురుచూచాడు. కాని ఆ విచిత్రభిక్షువు ఏమీ మాట్లాడలేదు. ఇద్దరూ మౌనంగా కిటికీదగ్గర నిలబడ్డారు.

'జీవితాన్నిగురించి నాకు ఏమైనా చెప్పు శంకర్' అని అన్నాడు గౌతం.

'నీ జీవితం నీదే. నా జీవితానికి నీ జీవితానికి తేడా వున్నది. నేను నీకు ఏమీ చెప్పలేను' అంటూ హరిశంకర్ సమాధానం చెప్పాడు.

'గౌతం ఒకమూలకువెళ్ళి కుప్పంగానున్న ఒక తాటాకు తీసికొనివచ్చాడు — 'శాంతినిగురించి చెప్పు, నేను వ్రాసుకొంటాను' అని. గౌతం కలంతీసికొని కూర్చున్నాడు.

'నా పుస్తకంలోని రెండవప్రకరణం వ్రాస్తాను.'

'నీ పుస్తకంలోని చివరిప్రకరణం ఎవరు వ్రాస్తారు ?'

'చరిత్ర అగాధమైన సముద్రంవంటిది. ఈ సముద్రంలో నేను నీవు అకులవలె తేలిపోతుంటాం. నాకంటె ముందు జరిగిందేమిటో తెలుసుకొన్నవిషయాలు వ్రాస్తే దానిబాధ్యత నామీద ఉంటుందా ఉండదా చెప్పు ?'

'కాలనిర్ణయం అవసరంలేదు. అంతా ఒక కలలా జరిగిపోతూవుంటుంది.'

'గడచిపోతూవుంటుందా లేక గడచిపోతుందా ?'

'అది నీకు సంబంధించిన సమస్య' అంటూ శంకర్ క్లుప్తంగా జవాబిచ్చాడు.

'అహింసనుగురించి ఏమైనా చెప్పు' మారాంచేసే పిల్లవాడిలా గౌతం మళ్ళీ బలవంతం చేశాడు.

'బ్రాహ్మణుడిలా అహింసా పూజారిగా మారిపోవాలని కోరుకుంటున్నావా?' నవ్వుతూ అడిగాడు శంకర్.

'అలార్ బుద్ధునితో ఏమనిచెప్పాడో జ్ఞాపకం వున్నదా?'

'ఏమని చెప్పాడు?'

'మిత్రమా, నీవంటి సత్పురుషులసాంగత్యం లభించినందుకు సంతోషంగా వున్నది. నాకు తెలిసినసిద్ధాంతాలు, విద్యలు నీకు తెలుసు. నీకుతెలిసిన సిద్ధాంతాలు, విద్యలు నాకు తెలుసు. నే నేమిటో నీవూ అంతే. నీ వేమిటో నేనూ అదే. అందు వల్ల మనిద్దరంకలిసి సంఘ సంరక్షకుల మవుదాం' అని చెప్పి గౌతం మౌనం వహించాడు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

పొలాలకు అవతల దివిటీలు వెలుగుతున్నాయి. గ్రామంకొవవ నాలుగుత్రోవల కూడలిదగ్గర జనం గుమిగూడివున్నారు. భట్టు మహాభారతకథను గానం చేస్తు న్నాడు. ఎంతోదూరాన కథాగానం జరుగుతూవున్న భట్టు కంఠం గాలికెరటాలతో కూడి గౌతం ఆశ్రమంవరకు వినబడుతూవున్నది. ఆనందపరవశులైనజనం మధ్య మధ్యచేస్తున్న కోలాహలం, కరతాళధ్వనులుకూడా వినబడుతూవున్నాయి.

'ఈ విశ్వద్వం రకరకాల కథలు వినిపిస్తూవుంటుంది. శబ్దాలు సమాప్తమై పోయినా నాకు విముక్తి లభించడంలేదు' అని తనలోతాను అనుకొని గౌతం హరిశంకర్‌వైపు చూశాడు.

ఎవరు ఎవరికంటె శ్రేష్ఠులో, ఎవరు ఎవరిమీద విజయంపొందారో, కౌరవులో, పాండవులో నిర్ణయించి చెప్పగలవారెవరు?

మగధతో యుద్ధంవస్తే నీవూ అందులోపాల్గొని యుద్ధం చేస్తావా?' బిగ్గరగా ప్రశ్నించాడు గౌతం.

'మనం మనభావాలకు పరిణామంమాత్రమే. ప్రతిమనిషికి అతని ప్రకృతి వల్లనే కర్మలు, దుర్ఘటనలు జరుగుతూవుంటాయి. ఎవ్వడూ స్వతంత్రుడు కాడు. బాధ్యత అనుమాటకు అర్థం లేదు' అని సమాధానం చెప్పాడు హరిశంకర్.

ఇంతలో నదిమీద పెద్ద వెలుగురేఖలు కనిపించాయి.

'ఎవరిదో పెండ్లి ఊరేగింపులా వున్నది' అన్నాడు గౌతం.

'కావచ్చు.'

'లేక ప్రభుత్వాధినేతల నౌక యిటు వెళుతూవున్నదేమో.'

'అయితే పద. బయటకు పోదాం' భయపడుతూ అన్నాడు శంకర్. వా రిరు వురు కుటీరం వెలుపలికివచ్చి గ్రామానికివెళ్లేమార్గం చేరుకొన్నారు.

గౌతం మౌనంగా శంకర్‌వెంట నడుస్తున్నాడు. కొద్దిసేపు నడచి హఠాత్తుగా యిలా అన్నాడు: 'హరిశంకర్. నీవు చాలా అహం వున్నవాడివి. ఇతరులను గురించిన చింత నీకు లేదు. తెలివిగలవాణ్ణిగదా అని అనుకొని ఎవరికివారు అహితం వైపుకుపోవడం మంచిపని కాదు. ఇతరులకు ఏమిబాధ కలుగవచ్చునో అర్థమన్నా చేసికోవు.'

'ఎవరికి ఏమిబాధ కలుగవచ్చునో, కలుగుతుందో నాకు అంతా తెలుసు. పద అటువెళ్ళి చూద్దాం ఏం జరుగుతున్నదో' అంటూ హరిశంకర్ ముందుకునడిచాడు.

గౌతంకూడా మరేమీ మాట్లాడలేదు.

వెలుగును విరజిమ్ముతున్న నావలు నదిని దాటాయి. దూరాన నదిరేవుదగ్గర హడావుడిగా వున్నది. 'ఎవరైనా పెండ్లివారా?' అని త్రోవనపోతున్న ఒకవ్యక్తిని అడిగాడు గౌతం.

'కాదయ్యా. రాజుగారు అయోధ్యనుండి వచ్చారు' అని జవాబిచ్చాడు ఆ వ్యక్తి. గౌతం ఉలిక్కిపడి నలువైపుల చూచాడు. శంకర్ ఎక్కడా కనబడలేదు. వున్నవా డున్నట్లు మాయమైనాడు. భారతకథ వింటున్న ఆ జనంలో శంకర్‌జాడ తెలుసు కోవడం చాలా కష్టం.

గౌతం పైపంచ కప్పుకొని పట్టణంవైపుకు బయలుదేరాడు. పట్టణంమధ్య వున్న తన భవనంవైపు చూచాడు. భవనంలోనుండి వెలుగు బైటకు వస్తూవున్నది. అతడు వెంటనే ప్రక్కనేవున్న సందులోకి మళ్ళాడు. వడివడిగా నడుస్తూ పట్టణం వెలుపలకు చేరుకొన్నాడు. మామిడితోటలో మామిడిఆకులమధ్య ఒక భవనం మౌనంగా నిలబడివున్నది.

వందసంవత్సరాలక్రితం కేవలం వందసంవత్సరాలక్రితమే శాక్యముని నివ సించిన భవన మిది.

గౌతం ఆ భవనందగ్గరకు పోలేదు. మధ్యలోనే ఆగిపోయి తిరిగి తనకుటీరానికి బయలుదేరాడు.

స్వాతంత్ర్యం లేదు. స్వేచ్ఛలేదు. తెరవగావుండే వాతావరణంలో, స్వర తరం గాలలో, బుద్ధి వి స్తరణలో, స్వాతంత్ర్యం స్వేచ్ఛ ఎక్కడా లేవు. నేను బంధింప

బడివున్నాము. మేము ఏమీ చేయలేము. ఏమీ చేయలేము. ఒకానొకరోజున చరిత్ర మమ్మ మింగివేస్తుంది. పేర్లక్రమం, దేశం, కాలం అన్నీ మమ్మ మింగివేస్తాయి.

గౌతం నదీతీరానికి చేరుకొన్నాడు. చల్లని గడ్డిమీద ఒరిగాడు. ఉపనిషత్తులలో ఒకచోట-'తన ఆత్మనే కాంక్షించువానికి తండ్రి తండ్రికాదు. తల్లి తల్లికాదు. ఈ లోకం లోకంకాదు. దైవం దైవంకాదు. దొంగ దొంగకాదు. హంతకుడు హంతకుడుకాదు. మంచిచెడుల చింత అతనికి వుండదు. మనస్సుకు కలిగే క్లేశాల మీద, దుఃఖాలమీద అతడు విజయం సాధించడమే అందుకు కారణం' అని వ్రాసి వున్నది.

శాక్యముని చెప్పిన మాటలివి - 'ఈశ్వరుడు ఉన్నాడో లేడో కాని దుఃఖం అనునది వున్నమాట నిజం. సాపేక్ష్యంలో మునిగివున్నప్పటికి మనం అనేవాళ్లం వున్నామని అనుకొంటూవుంటాము. ప్రతివస్తువు దుఃఖమయమే. సర్వం దుఃఖం, దుఃఖం. దీపాన్ని ఊది ఆర్పివేసినట్లే మానవుడుకూడా ఆరిపోతాడు. కేవలం ఘట్టాలు, అనుభవాలుమాత్రమే నిరంతరం నిలిచివుంటాయి.

నీటికెరటాలు ఒడ్డుకు కొట్టుకొని తిరిగి వెనుకకు వెళ్ళిపోతున్నాయి. ప్రశాంతంగా ప్రవహిస్తున్న నదివంకచూచాడు గౌతం.... నేను దుఃఖాలను సహిస్తాను. దుర్బలుడ నవుతాను. నా మూర్ఖత్వాన్ని స్వయంగా దర్శిస్తాను. దుఃఖాలు అనుభవిస్తాను.

హృదయానికి, మస్తిష్కానికి దుఃఖాలు, క్లేశాలు, పరీక్షలు అవసరం. నేను వాటినే కోరుకొంటున్నాను. నాకు ముక్తి అవసరంలేదు. కరుణ, దయ గొప్ప వస్తువులు. శాక్యమునీ, నాకు నీ మీదనే కరుణ కలుగవచ్చునేమో. ఎవరు ఎవరిమీద కరుణ చూపుతారనేదీకూడా పెద్ద ప్రశ్నయే.

## 3

శ్రావస్తీనగరాన్నుంచి ఉత్తరదిక్కుకుపోయేమార్గం పర్వతపు లోయలగుండా పోతుంది. త్రోవకిరువైపుల ఎత్తయిన మోదుగచెట్లు. రకరకాలపొదలు దట్టంగా

అలుముకొనివున్నాయి. ఆ పొదలమధ్య రకరకాల పూలు అందంగా కనబడుతూ వున్నాయి. ఆ అడవిమధ్యన నది ప్రవహిస్తూంది. ఆ నది తూర్పుతీరాన ఒక రేవు వున్నది. ప్రభుత్వంవారి పడవ ఒకటి క్రితంరోజు రాత్రివచ్చి ఆ రేవు చేరుకొన్నది. అయోధ్య, ఉత్తర కోసలదేశ పరిపాలకుడు రాజుగారు, అతని అనుచరులు ఉదయానే వేటనిమిత్తం ఉత్తరదిక్కుకు బయలుదేరబోతున్నారు. కాని త్రోవలు వెతికేభటులువచ్చి 'ఏనుగులు ఎక్కువగాతిరిగే ప్రదేశంలో విపరీతంగా వర్షాలు కురుస్తున్నాయి. అడుగుపెట్టేందుకు వీలులేకుండా ఉన్నది' అని చెప్పారు. అప్పటికే రాజుగారు, వారి అనుచరులు ఏనుగులమీద గుర్రాలమీద, పాలకీలమీద, రథాలమీద బయలుదేరారు. భటులు అందజేసిన ఆ వార్తవినగానే అంతా ప్రయాణం విరమించుకొన్నారు. పురుషోత్తంగురువుగారి ఆశ్రమానికి కొద్దిమైళ్ళదూరాన ఇప్పచెట్లమధ్య గుడారాలు నిర్మించబడ్డాయి.

కన్నుమూసి తెరిచేవరికి అడవిలో పట్టణం వెలిసినట్లనిపించింది. లేళ్లు, కోళ్లు, బాతులు, నెమళ్లు స్వేచ్ఛగా తిరిగేచోట అప్పుడప్పుడు కాలిబాటన నడిచివెళుతుండే ఒకరో యిద్దరో విద్యార్థులు కనబడుతూవుండే ఆ చోట జనసమ్మర్దం పెరిగిపోయింది.

రాజుగారితోపాటు వచ్చిన అమ్మాయిలు పగలంతా పూలవనాల్లో తిరిగి, చీకటి పడగానే నదిలోదిగి స్నానం చేస్తున్నారు. విల్లు, అమ్ములు పుచ్చుకొని వనాల్లోకి వెళ్ళి లేళ్లను వేటాడుతున్నారు. రెండు మూడురోజులకే చంపకకు విసుగుపుట్టింది. ప్రయోజనంలేని జీవితమంటే రోత పుట్టింది. మూడురోజులు వరుసగా అడవుల్లో వుండడం, విపరీతంగా తిరగడం, వేటాడటంవలన ఆమె మనస్సు భీతిల్లిపోయింది. రాజకుమారి నిర్మలను వెంటబెట్టుకొని ఎవ్వరికీ చెప్పకుండా నగరం వైపుకు నడక సాగించింది.

ఎదురుగా మామిడితోపు కనబడింది. వాతావరణం చల్లగాను, ప్రశాంతంగాను వున్నది. ఆకాశంలో రంగురంగులమబ్బులు కనబడుతున్నాయి. 'అదుగో పాట వినబడుతూంది. అటు పోదాం పద' అన్నది నిర్మల.

నేలమీద పడివున్న ఆకుల్ని త్రొక్కుకుంటూ యిద్దరూ మామిడిచెట్లవైపుకు నడక ప్రారంభించారు. చెట్లకొమ్మలమధ్యగా కొద్దిదూరాన ఒక ఆశ్రమం, అందలి కుటీరాలు కనబడ్డాయి.

కరిమిచెట్టు కొమ్మమీద చెయ్యి ఆన్చి 'ఏ ప్రదేశమో యిది?' అన్నది చంపక. 'ఎవరా యువకులు?' అంటూ ఎదురుగా దూరాన ఎగురుతూ కనబడుతున్న బ్రహ్మ చారుల్నిచూచి ప్రశ్నించింది నిర్మల. ఆమెకు తనసోదరుడు జ్ఞాపకం వచ్చాడు.

* * *

గౌతం పీలాంబరుడు మూడు పగళ్ళు మూడు రాత్రుళ్ళు ఆహారమేమీ తీసుకో కుండ నదిఒడ్డున తిరుగుతూఉన్నాడు. రాత్రిళ్ళు నదీజలంలో ఒంటికాలిమీద నిల బడి జపం చేశాడు. ఇసుకమీద తుమ్మముళ్లుపరచి వాటిమీద శయనించాడు. నాలుగవరోజున ఇక ఆగలేక తిరుగుముఖం పట్టాడు. సాయంత్రం మెల్లగా అడు గులువేస్తూ ఆశ్రమానికి బయలుదేరాడు. వెనుకనుంచి ఎవరిదో పిలుపు వినబడింది. వెనుకకు తిరిగిచూచాడు. అఖిలేశ్ నవ్వుముఖంతో గౌతందగ్గరకు వస్తున్నాడు.

'గౌతం, మూడురోజులనుంచి ఎక్కడికి పోయావు? నీకోసం ఆశ్రమవాసులు యీ ప్రాంతమంతా గాలించివేశారు.'

'నేను యిక్కడనే వున్నాను. నీవు యీ సమయంలో యిక్కడ ఏం చేస్తు న్నావు?' అని ప్రశాంతంగా ప్రశ్నించాడు గౌతం.

'నీవు చేస్తున్నపనే నేనూ చేస్తున్నాను' అని సమాధానం యిచ్చాడు వినోదంగా అఖిలేశ్.

'నేను ఈశ్వరసృష్టిని పరిశీలిస్తున్నాను.'

'ఈశ్వరసృష్టిలోని ఒకరేఖను నిన్న నేను చూశాను. విల్లు చేతబట్టుకొని లేడి వేటకై పరుగెడుతూ కనబడింది. నన్నుచూసి అమాంతం చెట్లు ఎక్కి కూర్చు న్నది.' అఖిలేశ్‌మాటలు గౌతం పీలాంబరునికి బోధపడలేదు. ఖిన్నవదనంతో అఖిలేశ్‌వైపుచూస్తూ వుండిపోయాడు.

గాలికి ఎగిరివచ్చిన ఆకులు కాలిబాటమీద పడుతున్నాయి.

'వనదేవీ, వనదేవీ' దూరాన ఎవరో భజనగీతం పాడుకొంటూపోతున్నారు. 'వనదేవీ, దూరానవుండి నీ వైభవాన్ని, ఆశోభను చూపించి పోతున్నావా, మా గ్రామానికి విచ్చేయవూ ....' అని ఆ పాటకు భావం.

'నీకు మనుష్యులంటే భయం వేస్తుందా?'

అఖిలేశ్, గౌతం లిరువురు సువాసనలు విరజిమ్ముతున్న గాలిపీలుస్తూ ముందుకు సాగారు. కొద్దిదూరాన మురళివాయిస్తూ కొంతమందిపిల్లలు గ్రామం

వైపు వెళుతున్నారు. అలసిపోయిన కాళ్ళతో గౌతం ఒక్కచెట్టుక్రింద నిలబడి పోయాడు.

'ఒకవైపున రమణీమణులు, మరోవైపున అప్సరసలు, చెట్లమీద యక్షిణులు ఉన్నారు. ఇక్కడ నిలబడవద్దు. చెట్లమీది యక్షిణులు మొగవాళ్ళను మాయంచేసి ఎత్తుకుపోతారు' అన్నాడు అఖిలేశ్. తెచ్చిపెట్టుకొన్న కృత్రిమగాంభీర్యం అతని కంఠంలో నిండివున్నది.

'ఎదురుగా అక్కడ నిలబడివున్న దెవరు?' అని అడిగారు గౌతం ఆశ్చర్యంతో.

అఖిలేశ్ అందుకొన్నాడు, 'ఓ తల్లీ, కదిమిచెట్టుకొమ్మనువంచి నిలబడ్డ నీ వెవరవు? దేవతాంగనవా, యక్షిణివా, అప్సరసవా' అని అన్నాడు మహాభారతం రచించిన కవి.

'ఈ చెట్లరహస్యాలు చాలా వుంటాయి, గౌతం.'

'ఏ చెట్లు?'

'గౌతం, పొరబడుతున్నావు. అందమైన ఆడపిల్లలమీద కన్ను వేయరాదని మనకు ఆజ్ఞవున్నది' అంటూ కండ్లుమూసుకుని అఖిలేశ్ చెట్లచాటుకు తప్పుకొన్నాడు.

గౌతం కండ్లు నులుముకొని మనోపర్యాయం చూచాడు. ఎదురుగా కదిమిచెట్ల క్రింద సాక్షాత్తు అయోధ్యరేవులో కనబడిన ఆ అమ్మాయే నిలబడివున్నది.

చంపక గౌతమును చూడలేదు. నిర్మలతో మాట్లాడుతూ మరో కాలిబాటమీదకు మరలింది.

అఖిలేశ్ ఒకరాతిమీదకూర్చొని ధ్యానంలో లీనమైనట్లు నటించి ఒక కన్ను తెరచి 'ఆశ్రమం పోదాం పద' అని అన్నాడు బిగ్గరగా.

ఇరువురూ బయలుదేరారు. గ్రామందగ్గరకువచ్చి గౌతం ఆగిపోయాడు.

'భిక్షాటనం చేసికొనివస్తాను' అంటూ గౌతం అఖిలేశ్‌ను వదిలించుకొని త్వర త్వరగా ఆ అమ్మాయిలు మళ్ళినవైపుకు నడిచాడు. తొందరలో అతనిపాదాలకు ముళ్లు గుచ్చుకొన్నాయి.

తాము మకాంచేసిన గుడారాలను సమీపిస్తుండగా ఎవరో తమను అనుసరిస్తున్న సవ్వడు వినబడింది. చంపక వెనుకకు తిరిగిచూచింది.

సరయూనదిని ఈదుకొంటూ దాటిన ఆనాటి యువకుడే ఎదురుగా నిలబడి వున్నాడు. అతనికళ్ళు నల్లగా వున్నాయి. స్ఫురద్రూపి. బ్రాహ్మణవిద్యార్థుల్లా తెల్లని వస్త్రాలు ధరించివున్నాడు. అవును. ఆ యువకుడే.

'అయోధ్యానగరవాసులు ఇటు వచ్చారని తెలిసింది. ఇవాళ భిక్ష యిక్కడే. మీదగ్గరే స్వీకరిద్దామని వచ్చాము' అన్నాడు గౌతం గంభీరంగా.

'వనదేవీ అను పాటపాడింది నీవేనా?' మెల్లగా అడిగింది చంపక.

'నే నెవరినో. ఆ పాటపాడింది ఎవరో చెప్పలేము.'

'మీరు బొమ్మలు వేస్తారా? పురుషోత్తమ గురువుగారి ఆశ్రమంలో గౌతం నీలాంబర్ అనునాతడు బొమ్మలు వేస్తాడని విన్నాను. నీ ఆకారంచూస్తే నీవే ఆ గౌతం నీలాంబరుడవని అనిపిస్తున్నది. నామరహస్యమంటే నాకు విశ్వాసం ఎక్కువ. నీకూ నామరహస్యాలమీద విశ్వాసం వున్నదా?'

'నీవు ఏ మూర్ఖులదగ్గరో విన్నటువంటి గౌతం నీలంబరుణ్ణి నేనే.'

'అయితే నీవుకూడా నా బొమ్మ వేస్తావన్నమాట. ఇవాళ ఉదయం చాలామంది చిత్రకారులు ఇక్కడకు వచ్చారు.'

'నేను విగ్రహాలు చెక్కుతాను. కల్పనమీద ఆధారపడి. మనస్సు పురికొల్పితే చిత్రాలుకూడా వేస్తాను. విశ్వకర్మకూడా నన్ను గౌరవింపక తప్పదు.' అన్నాడు కొంచెం గర్వంగా.

'నీవు నాస్తికుడవు కాదుకదా. ఇప్పుడు చాలామంది విద్యార్థులు కపిలుణ్ణి. శాక్యమునిని ఎక్కువగా విశ్వసిస్తున్నారు.'

'భిక్ష పెట్టు. నా స్త్రోత్ర కంఠకావృతం' అన్నాడు కోపంగా. ఈ అమ్మాయినే చూడాలని అనేకమాసాలపాటు తాను తెగతిరిగాడు. ఇప్పుడు ఆ అమ్మాయి తన కళ్ల ఎదుట నిలబడివున్నది. ఆ అమ్మాయితో జగడం పెట్టుకొన్నాడు. ఈ వస్తువు నాది. నా అస్తిత్వంలోని అంశం, నా మనస్సులోని భాగం అని అతనికి అనిపించింది. ఇక్కడ ద్వైతానికి తావులేదు. సంకోచించవక్కరలేదు. సిగ్గుపడవలసిన అవసరమే లేదు. అనాదినుండి ఆమె తనకు తెలుసు.

తనపంక రెప్పవాల్చకుండా చూస్తున్న మరో అమ్మాయిని పరిశీలించిచూశాడు. ఆ అమ్మాయి హరిశంకర్ సోదరి.

చంపక లోపలికివెళ్ళి కొద్దిగా పిండితెచ్చి గౌతముని భిక్షపాత్రలో వుంచింది- 'ఇక వెళ్ళు. మళ్ళీ ఎప్పుడైనా రా' అని అన్నది. మెల్లగా గౌతమునికిమాత్రమే వినబడేలా.

గౌతం బయటకువచ్చాడు. ఆ యిద్దరు యువతులు ఎవరో, రాజుగారి ఎర్రని గుర్రంతో వారికిగల సంబంధం ఏమిటో అతనికి యింకా తెలియదు. శిబిరందగ్గర యింకా చాలామంది అమ్మాయిలు తిరుగుతున్నారు. కాని అంతమందిలోను ఆ అమ్మాయిలు యిద్దరూ ప్రత్యేకించి విలక్షణంగా వున్నారు.

'ఆ అమ్మాయిలిద్దరూ ఎవరు?' అని వంటశాలవైపు వెళుతున్న ఒక ముస లమ్మను గౌతం ప్రశ్నించాడు. ఆ ముసలిది ఎగాదిగా చూసింది గౌతముణ్ణి. 'నీవు బ్రహ్మచారిలా వున్నావు' అంటూ కండ్లు పెద్దవిచేసి 'అందులో ఒకమ్మాయి రాజ గురువు కుమార్తె చంపావతి, రెండవఅమ్మాయి రాజకుమార్తె నిర్మల. వీళ్ళిద్దరూ రాజుగారితో వేటనిమిత్తం విచ్చేశారు. అయినా బ్రహ్మచారివి, ఆడపిల్లలసంగతి నీ కెందుకయ్యా? మళ్ళీ యిటు రాకు. ప్రమాదం. దొంగవెధవలు చాలామంది సన్యాసులవేషాలు వేసుకొని యీమధ్య వస్తున్నారట. పో! పో!' అంటూ విసు రుగా వెళ్ళిపోయింది.

'చపలకదే చపల' అంకొంటూ మెల్లగా గౌతం ఆశ్రమానికి బయలుదేరాడు. మరునాడు దుప్పటికప్పుకొని, గౌతం శిబిరంవైపుకు బయలుదేరాడు. అంతా కలియ చూశాడు. ఎక్కడా ఆ అమ్మాయి కనబడలేదు. రాజకుటుంబాల ఆడపిల్లలు సామాన్య జనంతో కలిసి తిరగరు. బహుశః లోపల జరీఅంచుల పట్టుదేరాలో కూర్చొని చిలకలకు మాటలునేర్పుతూ వుందేమో అని అనుకొన్నాడు. అతనికి నవ్వు వచ్చింది. చిలకలకు మాటలు నేర్పడమంటే పెద్దింటి అమ్మాయిలకు సరదా అని అతడు వినివున్నాడు. పాలకీఎక్కి బస్తీకి షికారువెళ్ళిందేమో అని అనుకొన్నాడు.

'ఇదిగో, యిక్కడే వున్నాను' అంటూ కదిమిచెట్టుకొమ్మమీదినుంచి దిగి దగ్గరకువచ్చింది అమ్మాయి. గౌతం కంగారుపడిపోయాడు. 'నీవుకూడా ఉదా సీనంగా వున్నావే. నాకు యిలావుండటం సుతరాము గిట్టదు. నిన్నటినుంచి నిర్మలకూడా ఉదాసీనంగా వున్నది.'

'నిర్మల ఉదాసీనంగా ఎందుకు వున్నది?'

'ఆమె అన్న రాజకుటుంబాన్ని వదలి ఎక్కడికో వెళ్ళిపోయాడు. చిన్న నిన్ను చూసేవరికి నిర్మలకు ఆమె అన్నయ్య జ్ఞాపకం వచ్చాడు.'

ఆనందుడు తన ప్రేయసి సుందరిని పరిత్యజించాడట. గౌతమ సిద్ధార్థుడు చెప్పి నంతమాత్రానే అంతపని చేశాడట. ఆమె ఏమీ మాట్లాడలేదు.

'ఆనందుడు తిరిగివస్తే....ఆనందుడు పూర్తి అర్హత పొందలేదని నాకు బాగా తెలుసు. అతడు తప్పక తిరిగి వచ్చితీరుతాడు.

'అయితే అది చాలా పెద్దమాట. ముక్తి అనునది చాలా గొప్పది. శాక్యముని మహామతితో చెప్పినమాటలు అతను మరచిపోలేదేమో; అతనికి జ్ఞాపకంలేదా.'

'ఏమని చెప్పాడో?'

'ఓ మహామతీ: నాటకాంలో నాట్యము చేయుట, పాటలు పాడుట, వీణ వాయించుట, చిత్రరచన చేయుట మొదలగు కళలలో ప్రావీణ్యము సంపాదించుకొనుట, క్రమక్రమముగా అభ్యాసమువలన అలవడినట్లే ఆత్మోన్నతికూడా క్రమక్రమముగా అలవడగలదు. మన రాజకుమారుడుకూడా త్యాగాన్ని ఒకవిలక్షణమైన కళయని భావించినట్లున్నది. అని అన్నాడు శాక్యముని' అంటూ చంపక శిబిరం వెనుకగల రాతి గుట్టమీద కూర్చున్నది.

'సరే, నేను వేసినచిత్రాలు చూపిస్తాను' అని అన్నాడు ఆతురతతో.

'ఆ చిత్రాలు చూడటంవలన నాకేమి లాభం కలుగుతుంది?' అని ప్రశ్నించింది ప్రసన్నవదనంతో. 'ఇతర విద్యార్థుల్లా నేనుకూడా కల్పనాలోకంలో విహరించే పనికిమాలిన వాజమ్మ ననుకుంటున్నావేమో. చంపకరాణీ, శ్రావస్తీనివాసియగు గౌతం నీలాంబరుడు చిత్రకళయందు గొప్ప ఆచార్యపీఠం అలంకరించాడని ఒకానొకరోజున నీవే వినగలవు.' చిన్నపిల్లవాడిధోరణిలో అని ఆమెకు కోపం వచ్చిందేమోనని శ్రద్ధగా ఆమెవంక చూశాడు. కాని ఆమె ఏమీ మాట్లాడలేదు.

ఆమె రాతిగుట్టమీద అలాగే మౌనంగా కూర్చున్నది. 'నేటికి పది సంవత్సరాల క్రితం హరికూడా యిలాగే తనతో అన్నాడు. 'ఇతర విద్యార్థుల్లా నేనుకూడా కల్పనాలోకంలో విహరించే పనికిమాలిన వాజమ్మననుకుంటున్నావేమో, చంపకరాణీ, అయోధ్యానగర రాజకుమారుడనగు నేను గొప్ప గణితశాస్త్రవిశారదుడనైనానని ఒకానొకరోజున నీవే వినగలవు' అని.

దప్పికగొన్న లేడికి మరుభూమిలో నదీప్రవాహం కనబడినట్లే. కాంక్షలవలన ఆత్మకు యీ సృష్టిఅంతా మృగతృష్ణలా కనబడుతుందని వేదాంతంలో చెప్ప బడింది. అభివ్యక్తి వేరు. ఉద్దేశ్యం వేరు.

'అసలు ఉద్దేశ్యం ఏమిటి?' ఆమె రాతిగుట్టపైనుంచిలేచి నిలబడింది. 'నీ ఆనందుడు ఎక్కడైనా నీకు కనబడితే సుందరి మృగతృష్ణనుంచి విముక్తి పొందిందని, ఆమెనుగురించి చింతించవద్దని చెప్పు' అని అన్నది.

'నీవు ...విహారంలో చేరతావని అంతా అంటున్నారు. నిజమేనా?'

'కావచ్చు. యిందులో తప్పేముంది? ఆ అనుభవంకూడా పొందిచూడవచ్చు గదా.'

'చంపకా, అంతా కలిపి నీ వయస్సెంత?'

'ఎన్నో వందల సంవత్సరాలు. నాకు జ్ఞాపకం రావన్ని ఏండ్లు.' నవ్వుతూ అన్నది.

'ఉనుద్ధ్యాసే మహాభారతంలో భీష్ముడు, అర్జునుడు-యీ ఇద్దరికి సంబంధించిన కథలు విన్నాను. చిత్రాంగద, ఉలూపి ఎలా వుండివుంటారోనని అనుకొన్నాను.'

'నన్ను చూశాక తెలుసుకొన్నావు కదూ' అంటూ ఒక్కపర్యాయం నవ్వి 'నీవు విగ్రహాలు తయారుచేస్తావు కదూ?' అని అన్నది.

'అవును. పేరు, రూపము యీ రెంటినీ కలుపుతే ప్రతి కళాఖండమను విషయం మరిచిపోవద్దు. ఒకదానితో చెవికి, రెండవదానితో కంటికి పరిచయం ఏర్పడుతుంది.'

'పరిశుద్ధమైన గుణవిశేషం బుద్ధికిమాత్రమే బోధపడుతుంది. దాని అనుభవం పొందటం సాధ్యంకాదు. అలా కాదంటే నీవు నీ దృక్పథాన్ని ఖండించుకొన్నట్లు అవుతుంది.'

'పరిశుద్ధరూపం కేవలం గుణవిశేషంమాత్రమే. ఏదో ఒక భౌతికసాధనం ద్వారా దానివైపు సంకేతం చేయవచ్చునేకాని దాన్ని భౌతికలక్షణమని భావించుటకు వీలులేదు.'

'ఆకాశే రూపం లక్షణం' నవ్వుతూ అన్నది చంపక.

'పరిశుద్ధరూపానికి అస్తిత్వమే లేనప్పుడు యింకా వ్యాఖ్యానం ఎందుకు?' ఆవేశంతో అన్నాడు గౌతం

'ఇంతకీ భవిష్యత్తులో ఏమవుదామనుకుంటున్నావో చెప్పు?'

'ఆ రోజు రానీ. నేను ఏం అవుదామనుకొంటున్నానో తప్పక చెబుతాను.'

ఇంతలో వెనుకనుంచి అందెలచప్పుడు వినబడింది. తెల్లనిపూల పూలసెజ్జ నిండా నింపుకొని నిర్మల వస్తున్నది. గౌతముణ్ణి చూచి పూలసెజ్జ రాతిగుట్టమీద పెట్టి రెండు చేతులు జోడించి నమస్కరించింది. గౌతం గొప్ప మహానుభావుడుగాను, పవిత్రమైన బ్రాహ్మణునివలె ఆమెను ఆశీర్వదించి, ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

* * *

శాంతిపొందినవారు ధన్యులు అనుకొన్నది చంపక. ఆమెకు గౌతమసిద్ధార్థుడు గయలో యిచ్చిన క్రింది ప్రవచనం జ్ఞాపకం వచ్చింది. 'ఓ పురోహితుడా, అన్ని వస్తువులకు నిప్పు అంటుకొన్నది. కండ్లు నిప్పులో కాలుతాయి. ఆకారం, దృష్టి, ఇంద్రియాలకు సంబంధించిన పదార్థాలు, అతిశయించిన తృష్ణ, శబ్దము, గంధము, బుద్ధి, మస్తిష్కము, భావాలు, శరీరకల్పనలు అన్నీకూడా నిప్పులో మండిపోతున్నాయి. అసహ్యము, ప్రేమ, జననము, వృద్ధాప్యము, మృత్యువు, శోకము, దుఃఖము, నైరాశ్యము నిప్పును కుంపటిని అంటించిపెడతాయి.'

గుడికుంభపెళ్ళార్థి తిరిగి వెళ్ళిపోయాడు. అడవిగాలి రివ్వున వీస్తూంది. చెట్ల క్రిందుగా కొంతమంది బౌద్ధభిక్షువులు భిక్షపాత్రలు పట్టుకొని తమతమ కుటీరాలకు తిరిగి వెళుతున్నారు. వారిముఖాంపై శాంతి వ్యాప్తమైవున్నది. వాళ్లు ప్రవాహంలో ప్రవేశించారు. తిరిగి రాకడ అనునది లేనిమార్గాన వారు పయనిస్తున్నారన్నమాట. నేనుకూడా ఆ ప్రవాహంలో ప్రవేశించగలనా? అంటూ ఆలోచించసాగింది ఉద్విగ్న మనస్సుతో చంపక.

## 4

'స్త్రీలవిషయంలో మనం అనుసరించవలసిన విధానం ఏమిటి?' అని వంద సంవత్సరాలక్రితం యీ శ్రావస్తీనగరంలోనే ఒక మహత్తరమైనప్రశ్న బయలు దేరింది.

'అనంద్, వారివైపు చూడనైనా చూడవద్దు' అని సమాధానం వచ్చింది.

'వారిమీద చూపు పడిందే అనుకోండి, అప్పుడు?'

'వారితో మాట్లాడవద్దు.'

'వాళ్ళువచ్చి మనతో మాట్లాడటం ప్రారంభించితే.'

'పూర్తిగా మేల్కొనివుండు.'

అనేకరాత్రిళ్ళు వరుసగా నిద్ర లేకపోయినందున గౌతమునకు గాఢంగా నిద్ర పట్టింది. అయినా గట్టిగా ప్రయత్నించి కళ్ళు తెరచివున్నాడు గౌతం.

రాజుగారి శిబిరాన్నుంచి గజ్జలచప్పుడు వినబడుతూవున్నది. చతుర్దశినాటి చంద్రుడు మెల్లిగా ఆశ్రమంపైకి చేరుకొన్నాడు. అతనివెలుగులో పుష్పలతలతో కప్పబడివున్న కుటీరాలు శాంతిసముద్రంలో మునిగినట్లు కనబడుతూవున్నాయి. అక్కడక్కడ దీపాలు వెలుగుతున్నాయి. మిగతా విద్యార్థులంతా నిద్రపోయారు. గౌతం ఒక్కడుమాత్రమే మేల్కొని వున్నాడు.

మెల్లిగా లేచాడు. పైపంచవిండా కప్పుకున్నాడు. చప్పుడుకాకుండా అడుగులు వేసుకొంటూ ఆశ్రమం బయటకువచ్చాడు. ఇప్పచెట్లతోటకు బయలుదేరాడు. అతని పాదాలక్రింద ఎండిపోయిపడివున్న ఆకులు గలగలలాడుతు నలుగుతున్నాయి. త్రోవలో ఒక ఉడత అతని అలికిడివిని బెదురున పరుగెత్తుకొంటూ వెళ్ళిపోయింది. ఎవరైనా తనను గుర్తుపడతారేమోనన్న సంకోచంతో మెల్లగా కాగడాలవెలుగులో తళతళలాడుతున్న ఇప్పచెట్లతోటలోకి ప్రవేశించాడు. మధ్యభాగంలో ఒక మండపం కట్టబడివున్నది. ఆ మండపంమీద ఒకవైపున సంగీతమండలికి సంబంధించిన అమ్మాయిలు, మద్దెలలు, వీణలు, గజ్జలమధ్య కూర్చొనివున్నారు. ఇంతలో గౌతముని చూపు విన్న తనను మందలించిన మునలిదానిమీద పడింది. కొంచెం భీతికలిగి ఒక దేరాచాటుకు తప్పుకొన్నాడు. ఆ తరువాత ఒక యువతి నాట్యం చేస్తుంటే తన్మయుడై చూస్తున్నాడు.

* * *

శకులు స్వరబోయారు. ఒక యువకుడు శిబిరం వెనుకనుంచి ముందుకు వచ్చాడు. మండపంలోకివచ్చి వంగి కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్నాడు. తెల్లని పైపంచను ఒకప్రక్కకు విసిరివేశాడు. స్వేచ్ఛగా ఆనందంతో తాండవనృత్యం చేస్తూ జనం ముందుకు వచ్చాడు.

ప్రేక్షకులు మంత్రముగ్ధులై అతని నాట్యం చూడసాగారు. సాక్షాత్తు నటరాజే దిగివచ్చిన ట్లనిపించింది.

చంపక నృత్యం చేస్తూచేస్తూ ఆగిపోయింది. ఆశ్చర్యంతో నర్తకునివంక చూసింది. మృదంగం పెద్దగా మ్రోగుతూంది. తాండవనృత్యం చేసుకొంటూ మండపం మధ్యకు అతడు వచ్చేశాడు.

అతడు నృత్యానికి సంబంధించిన ఎనిమిదిరసాలు అమోఘంగా ప్రదర్శించాడు. ఇది శివనృత్యం. అతనిముద్రల్లో ప్రపంచ వికాసక్రియ అంతా ఇమిడివున్నది. అతని వాణియే సర్వము. చంద్రుడు సూర్యుడు అతని వస్త్రాలు. సాక్షాత్తు శివుడే తానం. శివుదే సంగీతం. శివుడే సార్వభౌమికమగు లయకు ద్యోతకుడు. చంపక తన చోటునుంచి కదలింది. నృత్యం చేసుకొంటూవచ్చి అతని సరసకు చేరుకొన్నది.

ఆమె గౌరి. శంకరునితోబాటు నృత్యం చేస్తున్నది.

వెన్నెల విశాలంగావున్న మైదానాలమీద పాటల్ని వరిస్తున్నది. రజతంలాంటి తెల్లనిమేఘాలు నదిమీద తేలియాడుతూవున్నాయి. రజతంవంటి తెల్లనిహంసలు రెక్కల్లో ముక్కులు ముడుచుకొని ఇసుకమీద విశ్రమిస్తున్నాయి. కార్తీకమాసపు పూర్ణచంద్రుడు పుష్పాలమీదుగా తొంగిచూస్తున్నాడు.

ఆ రాత్రికూడా గడిచిపోయింది. ఉత్సవం జరుపుకొంటున్నవారి హడావుడి తగ్గిపోయింది. వాళ్ళ పాటలచప్పుడు, గజ్జెల రవంకూడా మెలమెల్లగా తగ్గిపోయింది. ప్రొద్దు పొడిచేసరికి రాజుగారి శిబిరమంతా నిశ్శబ్దంగా వున్నది. మండపంమీద మాత్రం కొన్ని పూలచెండ్లు, పూలమొగ్గలు కుప్పలుకుప్పలుగా పడివున్నాయి.

* * *

తెల్లవారింది. హిమాలయ శిఖరాలమీద గాలిదుమారంవల్ల వచ్చే చీకటి తేలియాడుతూవున్నది. సరోవరాల్లో ఎర్రకమలాలు వికసించాయి. గ్రామపు బాటమీద నడుస్తూ వెళుతున్న గొల్లభామల పాలజానలు లేతఎండలో తళతళలాడుతున్నాయి. ఇప్పపూలమీద గుసగుసలాడుతూ ఎగురుతున్న తేనెటీగలు అతడిచెవుల్లో రొద చేయసాగాయి. అయినా నిద్రమత్తు వదలలేదు. ఇంతలో సూర్యునికిరణాలు కళ్ల మీద ప్రసరించేసరికి కళ్లు నులుముకుంటూ లేచాడు. చెరువు మెట్లమీద తాను పడుకొనివుండటం గమనించాడు. కంగారుపడి తేరిపారచూశాడు. ఏమిటిదంతా, తాను

ఇక్కడ వుండటమేమిటి? ఆలోచించసాగారు. ఎంతప్రయత్నించినా ఏమీ జ్ఞాపకం రావడంలేదు.

ఒళ్ళు విరుచుకొని లేచినిలబడ్డారు. రెండోపర్యాయం ఒళ్లు విరుచుకొని మళ్ళీ చెరువుమెట్లమీద కూర్చున్నారు. సమీపంలోనేవున్న ఇప్పచెట్లతోటమీదకు అతని దృష్టి మళ్ళింది. అంతా నిశ్శబ్దంగావున్నది. చెట్లచాటునుండి ఒకలేడి పరుగెత్తింది. ఉడతలు రేగిచెట్టుమీదకూర్చొని ఆకుల్ని కొరుకుతున్నాయి. చెట్టుకొమ్మమీద కూర్చొనివున్న పచ్చని చిలుకలగుంపు ఎగిరిపోయింది. అడవిఅంతా ప్రశాంతంగా వున్నది. విశ్వేశ్వరశాస్త్రిగారు కూర్చున్నారు. మెలమెల్లగా ఏవేవో ఘట్టాలు జ్ఞాపకం రాసాగాయి. అక్కడే ఆ తోటలో రాజుగారి శిబిరం వున్నది. అక్కడ మండపం మీద రాత్రి తాను నాట్యం చేశాడు. అందరూ నాట్యంచేశారు. నాట్యం చేసిచేసి తను అలసిపోయాడు. రాజు తనను దగ్గరకుపిలిచి కూర్చోపెట్టుకొన్నాడు. రాజు గారితోబాటు తానుకూడా కడుపునిండా మద్యం త్రాగాడు. వేపుడుమాంసంకూడా తిన్నాడు. ఆ సంగీతనృత్యగోష్ఠిలో అతడికళ్లు చంపకను వెతుకుతున్నాయి. నృత్యం అయిపోగానే చంపక రాజకుమార్తెలతోబాటు అంతఃపురంలోకి వెళ్ళి పోయింది. ఆమెకోసం నిరీక్షిస్తూ ప్రొద్దుపొడిచేదాకా అక్కడే కూర్చున్నాడు. ఆమె రాలేదు. ఇక మండపందిగి ఆశ్రమంవైపుకు ప్రయాణమైనాడు. త్రోవలో చెరువుదగ్గరకు వచ్చేసరికి చల్లనిగాలి వీచింది. నిద్ర ముంచుకువచ్చింది. ఆ చెరువు గట్టున మెట్లమీద పడి నిద్రపోయాడు. ప్రాతఃకాలాన రాజుగారి వేటప్రయాణానికి దుందుభి మ్రోగింది. గుడారాలు ఎత్తివేయబడ్డాయి. చంపక నిర్మలతోకలిసి చెరువు ప్రక్కగా వెళుతూవున్నది. ఇద్దరూ గౌతముణ్ణి చూశారు. 'విచిత్రమైన బ్రాహ్మణుడు. మొన్న నీతో చిత్రకళనుగురించి వివాదం పెట్టుకొన్నాడు. రాత్రి నట రాజులా నాట్యం చేశాడు. ఇప్పుడు పసిపిల్లవాడిలా పడుకొని నిద్రపోతున్నాడు. వెళ్ళిపోయేముందు చంపకా, పద, ఒక్కపర్యాయం అతణ్ణి మేల్కొల్పి నమస్కరించి మరీ వెళదాం' అని అన్నది నిర్మల.

చంపక కొద్ది నిమిషాలపేపు మౌనంగా, గంభీరంగా ఆలోచించింది 'వద్దు, మేల్కొనేవాడికి ఏదో ఒకరోజున నిద్ర తప్పక వచ్చితీరుతుంది. నిద్రపోయేవాడు ఏదో ఒకరోజు తప్పక మేల్కొంటాడు. ఎప్పుడూ మేల్కొని వుండేవారిని పరిశీ

లించిచూడు' అంటూ చంపక పల్లకీవైపు నడిచింది. గౌతముణ్ణి లేవకుండానే యిద్దరూ వెళ్ళిపోయారు.

ఇప్పుడు ఇప్పతోట నిశ్శబ్దంగావున్నది. చెరువు మెట్లుమీద కూర్చొని అతడు ఆలోచించసాగాడు. ఆ ఒక్కరాత్రి తాను ఎంతో ఎదిగిపోయాడు. హృదయ జగత్తులో విహరించాడు. మాయను ప్రయోగించాడు. ఈ ప్రయోగంవల్ల అతనికి అనంతతృప్తి కలుగలేదు. కాని ఎంతో విచిత్రమైన అనుభూతి జీవితంలో అతనికి కలిగింది. జీవితంలోని విషాన్నంతటినీ శివునిలా తానే మ్రింగినట్లనిపించింది. ఇదొక విచిత్రమైన ప్రయోగం. కపిలవితో అతడు పోటీపడలేదు. పాపం హరి శంకర్ ఇప్పుడు తనకు వేలాదిమైళ్ళ దూరాన నిలబడి వుండిపోయాడు.

చంపక వెళ్ళేముందు తనను కలుసుకోనైనా లేదు. దగ్గరకువచ్చి తనను లేపనైనాలేదు. ఒక్కమాట అయినా తనతో చెప్పకుండా ఆమె వెళ్ళిపోయింది. ఒక్క క్షణంపాటు అతనికి ఎందుకో సంతోషం కలిగింది. చంపక తన ఆస్తిలోని భాగంగా అతనికి అనిపించింది. ఆ అనుభూతి తీవ్రమైంది. ఇట్టి అద్వైతానుభూతిలో ఆమె తనతో మాట్లాడవలసిన అవసరం ఏమున్నది ? ఆమె ప్రతినిమిషం తనతో మాట్లాడుతూనే వున్నది. ఎప్పుడూ తనలోనే వుంటున్నది. కాని యిదంతా నిజమా. అంతా మిథ్య. నిజంగా మిథ్యయే. నన్ను నేనే మోసగించుకొంటున్నాను. మాయాజాలంలో చిక్కుకుపోయాను. ఆమె నాకు దూరమైపోయింది. చాలా దూరమైపోయింది. నేనెక్కడ ? ఆమె ఎక్కడ ? అంతా అబద్ధం.... అంతా అబద్ధం.

'సరే మంచిది.' అంటూ చెరువుమెట్లుమీద లేచి నిలబడ్డాడు. ఇక్కడే ఆకోణాన ఆమె కూర్చున్నది. సరే వెళ్ళు. పూర్తి అంగబలంతో, హంగుతో ఏనుగులవేటకు వెళ్ళిపోయావు. ఇక నా జీవితం ? నీవులేకపోయినా గడుస్తుంది.

ఆశ్రమానికి బయలుదేరాడు. తోవలో జ్ఞాపకం వచ్చింది. ఇది అతని చదువులో చివరి సంవత్సరం. త్వరలోనే తనతండ్రి తనను యింటికి తీసికొని వెళ్ళేందుకు వస్తాడు. గురువుగారు సత్యంవద, ధర్మంచర (ధర్మమా ?) అంటూ ఆ చిలుక పలుకులే పలుకుతారు. ఆశ్రమంలోని విద్యార్థులంతా, ఆప్తమిత్రులంతా తనను సాగనంపేందుకు రేవువరకు వస్తారు. తాను ప్రతిష్ఠ అనే తలపాగాధరించి జీవితంలో ప్రథమపర్యాయం కళ్ళకు కాటుక పెట్టుకొంటాడు. చెవులకు మణి కుండలాలు ధరిస్తాడు. కేసరరంగు దుస్తులతో, భుజంమీద ఉన్నికంబళి వేసుకొని,

జొట్టులో ఏనుగుదంతాలతో తయారుచేయబడిన దువ్వెనలు దూర్చుకొని, గొడుగు వేసికొని, ఠీవిగా శ్రావస్తీ నగర నడివీధుల్లో తిరుగుతాడు. అయోధ్య, పాటలీ పుత్రపు దర్బారుల్లోకి వెళతాడు. పురోహితుని పీఠం అధిష్టిస్తాడు. రాజుగారి మంత్రిమండలిలోనైతేతం చేరగలడు. పాపం ఆ మూర్ఖురాలు మగధలో ఏ పాడు పడిన, భయంకరమైన విహారంలోనో తలదాచుకొని శాక్యముని చెప్పిన నిర్వాణం కోసం తపస్సుచేసికొంటూ పడివుంటుంది.

తన ప్రతిభపై ఆమెకే యింత గర్వంవుంటే తన తెలివితేటలమీద నాకు మాత్రం గర్వంగావుండదా? చిత్రకళ, శిల్పకళల్లో ఏముంటుంది? నేను రాజ్యాధికారిగావుండి రాజ్యాన్ని నడిపిస్తాను. మనువు, కపిలుడు, జైమిని ముగ్గురూకూడా నా పాదధూళికి సరిపోరు. పెద్దపెద్దవిగ్రహాల ప్రపంచాన్ని ఒక్క పర్యాయం కదలించివేస్తాను. జ్ఞానం నాది, గణపతికలం నాది. చంపక నాకు లోబడకపోతే ఏమి మునుగుతుంది? సరస్వతి నాదేకదా. చంపకవలె ఆమె నన్నువదలి ఎన్నటికీపోదు.

అసలు చంపకలోగల విశేషం ఏమిటి? అందమైన యువతులు ప్రపంచంలో ఎంతోమంది వున్నారు. నిర్మల ఎంతో అందంగావున్నది....అసలు చంపక, శ్రద్ధగాచూస్తే ఏమంత అందగత్తె?

చంపకకు యింత గర్వమా? కోపంతో నడుస్తూనడుస్తూ నాగసైదు కంకర రాళ్లను గట్టిగాతన్నాడు. 'నీ బొమ్మ ఎన్నటికీ వేయనని నిర్ణయించుకొంటున్నాను. చాలా గొప్పదాన్నని, అందగత్తెనని అనుకొంటున్నావు కాబోలు. నీవంటే నాకసలు లెక్కలేదు. నీ రూపాన్నికూడా నేను మరిచిపోతున్నాను. రూపం అనేది కేవలం మూస అన్నమాట. నా హృదయంలో చోటుచేసికొన్న రూపాన్ని ఆ విశ్వకర్మ మాత్రమే గుర్తించగలడు.'

గౌతం తన కుటీరంలోకి వెళ్ళాడు. బయటకు వచ్చాడు. అటూయిటూ తిరిగాడు. ఆశ్రమంలోగల విద్యార్థులంతా అతణ్ణి ఆశ్చర్యంగా చూశారు. 'నిన్నటి రాత్రినుంచి కనబడలేదు. ఎక్కడికి వెళ్ళావు?' అని అడిగారు.

నదీతీరాన తపస్సు చేసికొంటున్నానని అబద్ధం చెప్పాడు. జీవితంలో మొట్ట మొదటిపర్యాయం గౌతం అబద్ధం ఆడాడు. అబద్ధాలాడుతూంటే అతనికి ఆనందం కలుగసాగింది. సంధ్యావందనం చేసుకోలేదు. గురువుగారి దర్శనంనిమిత్తం వెళ్లలేదు. ఆశ్రమంతోటల్లో కాలుగాలిన పిల్లిలా తిరుగుతూవున్నాడు.

'నేను చంపక చిత్తరువు తయారుచేయను. కళ జీవితసంబంధాలకంటే మించి నది. శ్రేష్ఠమైనది.' మళ్ళీ మళ్ళీ అనుకొన్నాడు. కాని ఉండబట్టలేకపోయాడు. అతడు కళాకారుడు. సృజనం చేయాలనే తహతహ అతణ్ణి తొందరపెట్టింది.

రెండోరోజు ప్రాతఃకాలం చిత్రకళ, మూర్తికళకు సంబంధించిన సామగ్రి తీసికొని ఇప్పతోటకు చేరుకున్నాడు. చెరువు ఒడ్డునకూర్చొని ఎర్రమన్ను మెత్తగా పిసికి దానితో ఎర్రరంగు తయారుచేశాడు. నీలిరంగు పొట్లాంవిప్పి మట్టిపిడతలో పోసి నీటితో కలిపాడు. పసుపు, కేసరములతో పసుపురంగు, కేసరరంగులు తయారుచేశాడు. ఏవో వేర్లు, మూలికలు ఉడకబెట్టి వివిధరంగులను తయారు చేశాడు. తెల్లవిబట్టపరచి చిత్తరువు తయారుచేయాలని కూర్చున్నాడు. కాని రూపం, అరూపం అను వివాదం, తూలికను ఆపివేసింది. నేను 'ఏమిచేయను? ఏమిటి అర్థం? పరమేశ్వరుడు నిరాకారుడని, అతనికి రూపంలేదని అగమ్యుడని, అగోచరుడని వేదాంతులు అంటారు. భావనను ప్రతీకాలద్వారా ప్రేక్షకులవరకు ఎలా చేర్చడం అనునదే సమస్య. జీవితంయెడలగల ఆకర్షణ భావనమీద ఆధారపడినదే. కళాకారుడు పరిశుద్ధభావనను ఎలా ప్రవేశపెట్టగలడు? అతని దృక్పథం విష్వాక్షి కంగా వుండదుకదా. కళాకారుని నిజమైనకళ అతని ధ్యానమే. అది సంపూర్ణమైతే కదా. శుద్ధ ఆకృతిని, వస్తుకల్పనను చిత్రించడమే యధార్థమైన కళాలక్ష్యం. వస్తువుయొక్క వ్యక్తిగతమైనస్థితిని ప్రేరితం ఎలా చేయడం?

యధార్థ జీవితాన్నుంచి కళ్ళు ఎలా మూసుకోగలం?

ఈవిధంగా మథనలోపడి ఎన్నోచిత్రాలు తయారుచేశాడు, చెరిపివేశాడు. ఎర్ర మట్టితో చాలావిగ్రహాలను తయారుచేశాడు, చిదిపివేశాడు.

ఆశ్రమం గోడలమీద మట్టి, సున్నం వగైరాలతో చాలాబొమ్మలు వేశాడు. ఎర్రమట్టితో విగ్రహాలు తయారుచేశాడు. ఇప్పటివరకు ఆశ్రమంలోగల తెరలమీద బ్రహ్మజ్ఞానానికి సంబంధించినబొమ్మలు అనగా త్రిశూలం, కల్పవృక్షం, పృథ్వి, కమలాలు, సంసారచక్రం, కమలాసనాలు, అగ్నిస్తంభాలు మొదలుగాగలవి చిత్రించబడివున్నాయి. కాని గౌతం పిలాంబరుడు వేసినవన్నీ గ్రామ్యచిత్రాలు. స్త్రీలు, రైతుబిడ్డలు, ఆవులు, మొగ్గలు, పూలనమూనాలు మొదలుగాగలవి. వీటిలో శక్తివున్నది. జీవితలావణ్యం ఉన్నది, వేడి వున్నది.

అలౌకిక జీవితంగాక యథార్థజీవితం అతనిచిత్రాల్లో చిత్రించబడింది. సృష్టికి సంబంధించిన క్రొత్తసృష్టి అన్నమాట.

ఒకరోజున అతడు సుదర్శనయక్షిణి విగ్రహం తయారుచేశాడు. కదిమిచెట్టు కొమ్మవంచి, వృక్షానికి ఆనుకొని నిలబడివున్న సుదర్శనయక్షిణి బొమ్మ అది. పట్టణంలోని కళాకారులంతా దాన్నిచూసి తలలూపారు. కాని చిత్రశాలల్లోను, దేవళాల్లోను దాన్ని వుంచకూడదని నిషేధించారు.

విమర్శకులు లోతుగా అతడుగీసిన బొమ్మలు చూశారు. కాని ఎవ్వరూ గౌతముని ప్రశంసించలేదు. అతడిబొమ్మల్ని చూచి ఆశ్చర్యపడుతున్నారు.

కళాకారుల్లోను, బుద్ధిజీవుల్లోను గౌతం చిత్తరువులనుగురించి వివాదం బయలుదేరింది. గౌతం శాంతంగా అంతా వినేవాడు. తానుమాత్రం ఏమీ మాట్లాడేవాడు కాదు. అతడు దర్శనశాస్త్రమార్గాన్ని త్యజించాడు. అందువల్ల విశుద్ధమైన సౌందర్యబోధ అంటే ఏమిటో, అది ఏవిధంగా లభిస్తుందో, యితరులకు దానిని ఎలా అందజేయడమో అతడు చెప్పలేకపోయేవాడు. రూపము-అరూపము, భావము-అభావము మొదలుగాగల వివాదాలనుగురించి నిర్ణయించి చెప్పడానికి తా నెవ్వరు? మనుష్యుల్ని వాళ్లరహస్యాల్ని విగ్రహాలలో బంధించడమే అతని పని. వేదాంతోపానకుడుగాచూస్తే విశుద్ధమైన సౌందర్యానుభూతి ఆనందము, విద్యుత్తువలె అది అఖండము, అవిభాజ్యము, స్వయంప్రకాశవంతము. కళాకారుని కల్పన విశ్వకర్మ కల్పనలో భాగమైనట్లే ద్రష్ట ఆత్మ లేఖ అహంలో నిహితమైవుంటాడు. అతడు ప్రతిక్షణం చూస్తూనేవుంటాడు. అతనిస్వరూపం సమస్తజగత్తుకు ద్యోతకం. జగత్తుయొక్క స్వరూపాన్ని అహంగా భావించి, అహం అనే భూమికపై సృష్టిని చేయడమే సౌందర్యపు ఆదర్శదృక్పథం. పరిశుద్ధమైన అస్తిత్వం, పరిశుద్ధజ్ఞానం, పరిశుద్ధ జీవనం, విశుద్ధహృదయమనే చిత్రాలయంలో సమస్తచిత్తరువులు, కల్పనలు ఇమిడివుంటాయి. ఉపమానాలన్నీ అక్కడ ఏకమైపోతాయి. రంగురంగుల అద్దాలలోనుండి ఒకే ఒక వెలుగు ప్రకాశిస్తుంది. ఆవిధంగా తయారుచేయబడినదే కళాఖండం. కళాకారునికి, ప్రేక్షకునికి యిద్దరికీ ఒకేమార్గం. క్షాములైన విద్వాంసులే దాన్ని అర్థం చేసికొనగలరు. సుదర్శనయక్షిణి సృజించబడినప్పటినుంచి వాస్తుకళలో ప్రత్యేకశైలి ప్రారంభమైంది. వాస్తుకళ విశుద్ధమైన ప్రాపంచిక

వస్తువై పోయింది. ఆ విగ్రహాలలో విశుద్ధమైన యధార్థవాదం ఇమిడివుంది. కదిమి చెట్ల రమణీమణులు, ఇంద్రలోకపు దేవతాబాలికలు అంతా అయోధ్య, శ్రావస్తి నగరాలలో కనబడే ఆర్యపుత్రికలే. గ్రామాలలో తిరుగాడే రైతుబిడ్డలే. ప్రతిరోజూ నీలాటిరేవుకు వెళ్ళే గ్రామ్యయువతులే. శ్రావణమాసపు పాటలు పాడుకొంటూ, పొలాల్లో నడుంవంచి పనిచేసే గ్రామ్యస్త్రీలే.

సుదర్శనయక్షిణి నడుం ప్రక్కకుత్రిప్పి వయ్యారంగా నిలబడివున్నది. ఆమె భుజాలు రక్తమాంసాదులతోకూడి బలిష్ఠంగావున్నాయి. విశాలమైన కళ్లు. శరీరం దృఢంగాను, కుదిమట్టంగాను అందంగాను వున్నది. రూపము, లావణ్యము, గాంభీర్యము, నడక అనుభూతిజన్యమై ఆకర్షకంగా వున్నది. ఈ శైలిలో జీవితం, శక్తి, స్వాతంత్ర్యం, సంతోషము ఉట్టిపడుతున్నాయి. ఇక్కడ బంధనాలేమీ లేవు. అంటే కళాకారునికి బంధనముక్తి లభించిందన్నమాట. తాను సృష్టించవలసింది ఏమిటో సృష్టించబోయేది ఏమిటో యిప్పుడు అతనికి బాగా బోధపడింది.

ఒకరోజున గౌతం తాను తయారుచేసిన కొన్ని క్రొత్తచిత్రాలు తీసికొని విమలేశ్వరుని చిత్రనికేతనానికి వెళ్ళాడు. అక్కడ ఎప్పటివలెనే అతనిమిత్రులు, వ్యతిరేకులు గుమిగూడివున్నారు. ఆ సమూహంలో కొంతమంది వ్రాతగాళ్లు, తదితరులు కూడా కనబడ్డారు. అతనికి ఆశ్చర్యం కలిగింది. వాళ్లంతా అప్పుడప్పుడు రాజకీయాలనుగురించి చర్చించేందుకు తన కుటీరానికి వస్తూవుండేవారు. అంతా మౌనంగా వున్నారు. ఏదో ఆలోచనలో లీనమైయున్నారు. అతణ్ణిచూసికూడా ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. గౌతంకూడా ఏమీ మాట్లాడకుండా నెమ్మదిగా వెళ్ళి వీధిలో తిరుగుతున్న జనాన్ని చూస్తూ కిటికీదగ్గర కూర్చున్నాడు.

'నీకు తెలియదా ?' అంటూ విమలేశ్వర్ మాట్లాడటం ప్రారంభించాడు.

'ఏమిటి ?'

'నీవేమీ వినలేదా ? ఏ ప్రపంచంలో విహరిస్తున్నావు ?'

ఎవరో బయట గొళ్ళెం చప్పుడుచేశారు. హఠావుడిగా అఖిలేశ్ లోపలకు ప్రవేశించాడు. రొప్పుతూ అతని కాళ్లంతా మట్టికొట్టుకొని వున్నాయి. చాలా దూరాన్నుంచి పరుగెత్తుకొని వచ్చినట్లున్నాడు.

'సోదరులారా, మీ మీ సామాన్లు చంకన పెట్టుకోండి. ఎక్కడవాళ్లు అక్కడ పారిపోండి' అని అన్నాడు తడబడుతూ.

'ఏం, ఏమైంది ?' అని ప్రశ్నించాడు గౌతం కంగారుగా.

'మగధలో యుద్ధం ప్రారంభమైంది. చంద్రగుప్తుని సైన్యాలు దేశాన్నంతటినీ జయిస్తూ ముందుకు వస్తున్నాయి. ఈ వైపుకే వస్తున్నాయి. గ్రామాల్ని, నగరాల్ని చదునుచేసుకొంటూ ముందుకు సాగిపోతాయి. ఇక మనకాలం ముగిసినట్లే. యముడు యుద్ధదుందుభి మోగిస్తూ అందరినీ వెంబడిస్తున్నాడు. 'రూపము-అరూపము, భావము-అభావము అన్నింటినీ సరిచేయగల సమర్థుడు యముడు' అంటూ అలసిపోయిన అఖిలేశ్ క్రిందకూర్చొని కళ్లు మూసుకొన్నాడు. కొంచెం సేపు ఆగి మళ్ళీ చెప్పడం ప్రారంభించాడు. 'రాజుగారు వేట ముగించుకొని తిరిగి వస్తూవుండగా విష్ణుగుప్తుని సైనికులు వారిమీద దాడిచేసి వారందరినీ హతమార్చి వేశారు.'

'అందరూ హతమైపోయారా ?' అడిగాడు గౌతం ఆతురతతో.

'రాజకుమార్తెమాత్రం నదిలోకిదూకి యీదుకొంటూ ఆవలిఒడ్డుకుచేరి పాంచాలరాజుల రాజ్యం చేరుకొన్నారని. విష్ణుగుప్తునిసైనికులు వాళ్లను వెంటాడుతూనేవున్నారని తెలిసింది' అంటూ లేచినిలబడ్డాడు అఖిలేశ్.

'అఖిలేశ్, ఎక్కడికి వెళుతున్నావు ?' అని అడిగాడు గౌతం.

'యుద్ధరంగంలోకి వెళుతున్నాను. నీవు యుద్ధంచేయవు కాబోలు. అవునులే, అహింసావాదివి కదూ' అంటూ బైటకు వెళ్ళిపోయాడు.

గౌతం కంగారుపడిపోయాడు. లేచి నిలబడ్డాడు. 'మీరంతా కళాకారులు, పండితులు. ఎప్పుడు యుద్ధంచేయాలో ఎప్పుడు చేయకూడదో చెప్పండి. జీవహత్య ఎప్పుడు చేయాలో ఎప్పుడు చేయకూడదో హరిశంకర్‌ను అడిగి తెలుసుకొంటే బాగుండును. సోదరులారా! నందమహారాజుతో నాకెట్టి వైరములేదు. విష్ణుగుప్తుణ్ణే నెరుగను. చంద్రగుప్తునితో నాకు తగాదాలేదు. వీళ్లంతాకలిసి నన్నుకూడా యుద్ధరంగంలోకి ఎందుకు లాగుతున్నారు ? నేనుకూడా యితరుల్ని చంపవలసిందేనా ? వీళ్లందరి ప్రాణాలంటే నాకు యిష్టం. నేనుకూడా జీవించివుండాలనే కోరుతున్నాను. ఏమిచేయను?' అంటూ కిటికీకి తల ఆన్చి కళ్లు మూసుకొన్నాడు గౌతం. అక్కడ వున్నవాళ్లంతా ఎక్కడివాళ్ళక్కడ లేచి నిలబడ్డారు. ఎవరి పాదరక్షలు వారు తొడుక్కొని బయటకు వెళ్ళిపోయారు. గౌతం ఒక్కడే అక్కడ మిగిలిపోయాడు. కళ్లుతెరచి చూచాడు. ఎవ్వరూ లేరు. బయటకు పరుగెత్తాడు. అంతా

వెళ్ళిపోతున్నారు. 'మీ మీ విగ్రహాలు, బొమ్మలు వదలి ఎందుకు వెళ్లుతున్నారు? పగిలిపోతాయి. తీసుకువెళ్లండి' అంటూ బిగ్గరగా అరిచాడు. ఎవ్వరూ వినిపించుకో లేదు.

ఇంతలో క్రిందవీధుల్లో ప్రళయం వ్యాప్తమైంది. శ్రావస్తీనగరంమీద యుద్ధ రథాలు, ఏనుగులు దాడిచేశాయి. నిమిషంలో వీధులన్నీ యుద్ధకేంద్రాలుగా మారి పోయాయి. ఎటుచూసినా దుమ్ము, ఏనుగుల ఘీంకారం, బాణాలసవ్వడి, కత్తుల చప్పుడు, డాళ్ళమోతలు, ఆడవాళ్లు, పిల్లలు రోదిస్తున్న ధ్వనులు, కేకలు, అరు పులు - దృశ్యమంతా భయంకరంగా వున్నది. విగ్రహంలా మెట్లమీద నిలబడి గౌతం చూస్తూవున్నాడు. బజార్లన్నీ రక్తపుమడుగులై పోయాయి. ఒక్క ఇటుక కూడా మిగిలినట్లు లేదు. ఇప్పటివరకు చిత్రనికేతనంలో తనతోకూడా కూర్చున్న మిత్రులశవాలు వీథిలో పడివున్నాయి. చాణక్యునిసైనికులు కనపడిన వాళ్ళందరి తలలు నరికివేస్తున్నారు. గౌతముని కళ్లముందు చీకట్లు కమ్మాయి. కాళ్ళు తడబడు తున్నాయి. చిత్రనికేతనం మెట్లుదిగి వీథిలోకి వచ్చాడు. చనిపోయి పడివున్న విమలేశ్వర్ చేతిలోని కత్తితీసికొని స్వప్నంలో నడిచిపోతున్నవాడిలా వీథిలో ముందుకు సాగాడు. ప్రొద్దుపోయేదాకా గౌతం యుద్ధం చేస్తూనేవున్నాడు. అతని శరీరమంతా గాయాలతో నిండిపోయింది. వీథిలో పడిపోయాడు. ఎటుచూసినా శవాలు కుప్పలుకుప్పలుగా పడివున్నాయి.

పట్టణానికి కొద్దిదూరాన జేతవన్ రాజప్రాసాదం మౌనంగా చెట్లమాటున దాగి వున్నది. ఆ ప్రాసాదపు కలశం యీ దృశ్యాన్నంతటినీచూపి మౌనంగా నవ్వుతూ వున్నదా అన్నట్లు కదలకుండా నిలబడివున్నది.

## 5

కాలం ముందుకు నడచింది. 'దేశంలో నెమలి రాజచిహ్నంగాగల సామ్రాట్టుల రాజ్యం స్థాపితమైంది. సామ్రాట్టుల వంశావళినిగురించి వ్రాతలువ్రాసే కలం ప్రియదర్శి నరచంద్రవరకూ వచ్చి ఆగిపోయింది. పాటలీపుత్ర సింహాసనంమీద

అధిష్ఠించిన ప్రియదర్శి నరచంద్రుడు శూద్రకులస్త్రీకి జన్మించాడు. గొల్లలు అతణ్ణి పెంచారు. తక్షశిలలో అతనికి శిక్షణనిచ్చి పైకితెచ్చినవాడు చాణక్యుడు. నరచంద్ర యిక క్రొత్తచరిత్ర వ్రాయిస్తాడన్నమాట. నందరాజ్యం అంతరించింది. నంద రాజ్యపు తొంభైతొమ్మిదికోట్ల రూపాయల ధనాగారపుకథలు కేవలం కట్టుకథలు గానే మిగిలిపోయాయి.

ఇది కొత్తయుగం.

చంద్రగుప్తుడు మహాశక్తివంతుడు. దేశమంతటా అతని ఢంకా మార్మోగ సాగింది. అతని రాజధాని ప్రపంచపు మహానగరాల్లో స్థానం సంపాదించుకొన్నది. అతని సైనికశక్తిచూచి యితరదేశాలు భయపడసాగాయి. అందుకు కారకుడు విష్ణుగుప్తుడు. అతనికే చాణక్యుడని మరోపేరు. అతణ్ణే కౌటిల్యుడనిగూడా అంటారు. మహాపద్మనందుణ్ణి తన చాకచక్యంతో, కూటనీతితో ఓడించివేశాడు. ఆ విష్ణుగుప్తుని సలహాప్రకారం చంద్రగుప్తుని రాజ్యం నడుస్తూంది. 'విజయం వివగింపును పుట్టిస్తుంది. ఓడిపోయినవాళ్లు దుఃఖంతో నిద్రిస్తారు. గెలుపు ఓటము లకు అతీతంగా వుండగలిగినవాడు ప్రశాంతంగా సుఖంగా వుంటాడు' అని శాక్యముని సూక్తి.

ప్రతి గెలుపు ప్రతి ఓటమి చరిత్రమార్గంలో ఒక క్రొత్తమలుపు సృష్టిస్తుంది. ప్రపంచం దేనినీ లక్ష్యంచేయకుండా ముందుకుసాగుతుంది. చంద్రగుప్తుని విజయం తరువాతనే యీ దేశప్రజలు మొట్టమొదటిసారి జాతీయభావం అంటే ఏమిటో తెలుసుకొన్నారు. అనేకవంశాలు, జాతులు, కులాలు, కుటుంబాలతోకూడిన దేశం తమదని, మతాలకంటే, కులాలకంటే దేశం గొప్పదని ప్రజ తెలుసు కొన్నారు. ప్రియదర్శి చంద్రగుప్తుని నాయకత్వాన ఇరాన్, యూనాన్ దేశాల వాళ్లను తమ దేశాన్నుండి తరిమివేశామనికూడా తెలుసుకొన్నారు. పాటలీ పుత్రానికి అదివరకెన్నడూ యింత వైభవం, వెలుగు సంప్రాప్తించలేదు. క్రొత్త క్రొత్త భవనాలు వెలిశాయి. జనసంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. దానితోబాటు భాషలో కూడా చాలామార్పు వచ్చింది. శాక్యముని కాలంలో ప్రచారంలోవున్న మాగధీభాష క్రొత్త ప్రాకృతరూపం దాల్చసాగింది. నాటకకళ, సంగీతకళ రెండూ ఉన్నతస్థాయి నందుకొన్నాయి. నటులు రకరకాల వేషాలతో రంగస్థలంమీద ప్రత్యక్షమై తమ నటనాకౌశలాన్ని ప్రదర్శిస్తున్నారు.

కాశీకి చెందిన ఒక నాటకమండలి క్రొత్తక్రొత్త నాటకాలు ప్రదర్శిస్తున్నది. ఈ నాటకాల రచయిత మొదటిపర్యాయం పాటలీపుత్రం విచ్చేశాడు. అయితే అతని కీర్తిప్రతిష్ఠలు అదివరకే పాటలీపుత్రమందంతట వ్యాపించాయి. అతణ్ణిగురించి ప్రజలు రకరకాలుగ చెప్పుకొంటున్నారు. గొప్ప గుణవంతుడని, కళాకారుడని, విగ్రహాలు చెక్కుతాడని, అత్యద్భుతంగా నృత్యంచేస్తాడని, అద్భుతంగా నటించ గల నటుడని, భరతముని రచించిన శాస్త్రాన్నంతటిని అపోశనం పట్టిన అఖండు డని అతణ్ణిగురించి చెప్పుకుంటున్నారు. అనేక సంవత్సరాలు అయోధ్యలో పెద్దల సాంగత్యంలోవుండి, స్వరాలు, రాగాలు మొదలుగాగలవాటిని వశంచేసికొన్న దిట్ట అనికూడా పేరుతెచ్చుకొన్నాడు. అయినా అతనిమనస్సుకు శాంతిలేదు. ఏ ఒక్క కళమీద దృష్టిని కేంద్రీకరించడు. ఎక్కడా స్థిరంగాఉండడు. సుఖంలేదు. దేశమం దంతట తిరుగుతూవుంటాడు. మేఘాలనీడను పట్టుకోవాలని ప్రయత్నించి విఫలు డైపోతున్నట్లు అతని వ్యవహారంచూస్తే తోస్తుంది.

ఈ నాటకాన్నిగురించి బాగా ప్రచారం జరిగింది. పాటలీపుత్రమంతా ఆ నాట కాన్ని చూసేందుకు విరగబడి వస్తూవుంది. స్త్రీలుకూడా రథాలమీద, పాలకీలమీద వచ్చి విరగబడి చూస్తున్నారు. రాజకుమార్తెలు, శ్రేష్ఠుల, మంత్రులు, వ్యాపా రస్థుల కుమార్తెలు, అధికారుల భార్యలు మొదలుగాగల మహిళలు రంగురంగుల చీరలు ధరించి, వడ్డాణాలు పెట్టుకొని, రకరకాల ఆభరణాలు ధరించి నాటకం ప్రదర్శించే భవనంలోకివచ్చి కూర్చుంటున్నారు. పెండ్లికాని యువతులు ఆ నట రచయితను చూడాలని మరీ తహతహలాడుతూ వుండటం పేర్కొనదగిన విశేషం. అతడు మంచి అంగసౌష్ఠవంగల రూపసి అని వాళ్ళు వినడమే అందుకు కారణం. కళయొక్క మంచిచెడులను గురించి సమస్య వచ్చినప్పుడు స్త్రీలు వాటిని కళాకారుని రూపానికి, అంగసౌష్ఠవానికి ముడిపెట్టి గందరగోళం చేస్తూవుంటారు. ఇది ఆడవాళ్ళలోగల బలహీనత.

తెల్లటితెర ప్రక్కకు తొలగింది. నగిషీపని చేసిన చెక్కలతో అమర్చబడిన వేదిక వెనుకవైపున తెర కలశాలతోను, రంగురంగుల బొమ్మలతోను అలంక రించబడి వుంది. వాద్యమండలివారంతా వేదికకు ఒక ప్రక్కన కూర్చున్నారు. వందనంచేసే బాలికలు స్తంభాలమాటునుండి వేదికమీదకువచ్చి పరమేశ్వర స్తుతి చేశారు. వారిలో ఒకయువతి ముందుకువచ్చి నడుంమీద చేయిబెట్టుకొని నిలబడింది.

ఆమే ఆ నాటకానికి నాయిక. ఆమె జడ మోకాళ్లవరకు వ్రేలాడుతూంది. అందులో ముత్యాలలో కూర్చబడిన చెండు తళతళలాడుతూ ఎంతో అందంగావున్నది. ఆమె పెట్టుకొన్న బంగారు వడ్డాణానికి అమర్చబడిన బంగారుపూసలు చూపరులను యిట్టే ఆకర్షిస్తున్నాయి.

ప్రేక్షకులంతా శ్వాస బిగబట్టుకొని ఎదురుచూస్తున్న ఆ మహానటుడు నునుపుగా నున్న తెల్లని వేదికమీద ప్రవేశించాడు. ఠీవిగా శిరస్సు పైకెత్తి శూన్యంలోకి చూస్తూ గంభీరంగా అడుగులువేసికొంటూ ముందుకువచ్చాడు. కొంచెంసేపు ప్రేక్షకులపై దృష్టినిలిపి నియమప్రకారం నటితో నాటకాన్నిగురించి సంభాషణ ప్రారంభించాడు. అతని తీయనిమాటలకు మంత్రముగ్ధులై తమతమస్థానాలలో కూర్చొని రెప్పవాల్చకుండా అతనివంకచూస్తూ, చెవులు రిక్కబొడుచుకొని అతని మాటలు వింటూవున్నారు.

సంభాషణలమధ్య భావానుకూలంగా మొదట కుడిచేతిని ఆ తరువాత ఎడమ చేతిని పైకి ఎత్తాడు.

ప్రేక్షకులకు ఒళ్లు గగుర్పొడిచింది. అంతా నివ్వెరబోయారు. అందరిముఖాలు చింతాక్రాంతమైపోయాయి. స్త్రీలు దుఃఖాన్ని ఆపుకోలేక కండ్లు మూసుకొన్నారు. అత్యంత రూపసి, అత్యద్భుతమైన ఆ కళాకారుని రెండుచేతులకు గల వ్రేళ్లు తెగి వున్నాయి. అంతా నివ్వెరపోయారు.

* * *

గౌతం నీలాంబర్ క్రొత్తక్రొత్తనగరాలు తిరుగుతున్నాడు. క్రొత్తక్రొత్త ప్రేక్షకులముఖాలు అతనికి కనబడుతున్నాయి. ప్రతిచోట ప్రజలు, ప్రేక్షకులు ప్రేమతో, శ్రద్ధగా తనను చూస్తున్నారు. అంతా తనను ఆదరిస్తున్నారు. అతడు అందరికీ నాటకాలు ప్రదర్శించి చూపుతున్నాడు. కాని, అతని జీవితనాటకంమాత్రం ఎవ్వరూ చూడటంలేదు. పెద్దపెద్ద వేదికలవెనుక ప్రేక్షకులకు కనబడని మరో చిన్న వేదిక వున్నట్లువున్నది అతని జీవితనాటకం.

పాటలీపుత్రపు సుశిక్షితులగు పౌరులు నాటకప్రదర్శనంచూసి ఆనందిస్తున్నారు. అతని సంభాషణలు విని ముగ్ధులవుతున్నారు. ఏ యే నగరాలపర్యటనకు అతడు బయలుదేరాడో, ఎవ్వరికీ తెలియదు. జీవితంలోని ఎన్నోరకాలప్రయోగాలు చేసి

చూశాడు కాని ఇక మిగిలివున్నదేమీ లేదనికూడా ఎవ్వరికీ తెలియదు. జీవితం కేవలం శూన్యమో, వెలుగుమయమో లేక చీకటిమయమోనని అతడు అను కొన్నాడు. కాని యథార్థజగత్తును కాదనలేకపోయాడు. ప్రపంచం అడుగడుగునా రకరకాలరూపాలలో ఎదురుపడి అతణ్ణి కవ్విస్తున్నది. బాధిస్తున్నది.

* * *

ఆనాడు శ్రావస్తీనగరవీధుల్లో రోజంతా అతడు శత్రుసైనికుల్ని ఎదిరించి పోరాడుతూవున్నాడు. ఇంతలో చీకట్లో శత్రుసైనికుడొకడు బల్లెంతో పొడిచే సరికి గాయపడి ఒళ్లు తెలియకుండా క్రిందపడిపోయాడు. ఒళ్లుతెలిసి తలయెత్తి చూశాడు. ఆకాశంలో చీకటిమబ్బులు పల్చబడి తేలిపోతున్నాయి. ఒళ్లంతా పచ్చి పుండుగా వున్నది. చేతులు రక్తంతో తడిసిపోయాయి. ఎంతో కష్టంమీద రక్తంతో తడిసినచేతులు బారుగాచాచి చూచాడు. చేతివ్రేళ్లు తెగిపోయివున్నాయి. సౌందర్య సృజనంకోసం నిర్మాణమైనవ్రేళ్లు రక్తంతో తడిసివున్నాయి. ప్రశాంత వాతావర ణంతో, ఏదో ఆశ్రమంలో కూర్చొనివుంటే తనకు యీవిషయం బోధపడివుండేది కాదు. ఇది జీవితంలో ఎదురైన కటుసత్యం. కళాకారునికి చేతులు అవసరం. ముఖ్యంగా వేళ్ళు యింకా అవసరం.

నృత్యంలో వేరువేరు ముద్రలద్వారా అనేక ప్రపంచపురహస్యాలు వ్రేళ్లద్వారా వెల్లడి అవుతాయి. వ్రేళ్లు భవనాలను నిర్మిస్తాయి. ఉద్యానవనాలను తరుపుతాయి. మురళిని మ్రోగిస్తాయి. చిచ్చికొట్టి పసిబిడ్డల్ని నిద్రపుచ్చుతాయి. శూలాలు విసురు తాయి. ఇతరవ్యక్తుల్ని పట్టులో యిరికించి అణచి పీక నొక్కుతాయి. ఇది మరో సత్యం. రెండిటి అనుభవం అతనికి జీవితంలో లభించింది.

కొద్దిగా ఓపిక వచ్చినతరువాత అతడు లేచాడు. శవాలకు దాటుకుంటూ గోడ లకు ఆనుకొంటూ మెల్లమెల్లగా అడుగులువేసుకొంటూ తన ఇంటికి వెళ్ళాడు.

కాని అతని యిల్లంతా నిర్మానుష్యంగా వున్నది. ఇరువదిసంవత్సరాలతరువాత అతడు స్వగృహంలో అడుగుపెట్టాడు. కాని దురదృష్టం. అప్పటికి రెండుగంటల ముందే అతని తల్లితండ్రి యుద్ధాగ్నికి ఆహుతి అయిపోయారు.

గాయాలు మానడానికి చాలాకాలం పట్టింది. ఇక అతడు శ్రావస్తీలో వుండ లేకపోయాడు. దేశదిమ్మరై తిరగ ప్రారంభించాడు.

దేశంలో కొంతకాలానికి శాంతి ఏర్పడింది. చంద్రగుప్తునిరాజ్యం గట్టిపడింది. గౌతం తిరుగుతూ తిరుగుతూ కాశీ చేరుకొన్నాడు. అతడు యోగ్యుడు, సుశిక్షితుడు అయిన బ్రాహ్మణుడు. అతడిదగ్గర జ్ఞానంతప్ప యింకేమీ పెట్టుబడిలేదు. అయినా అతడికి విచారంలేదు. విద్యార్థిగాను, బ్రహ్మచారిగాను జీవితం గడపడంవల్ల మొదటినుండి కష్టాలు సహించగలశక్తి అతనికి అలవడింది. దేశదిమ్మరిగా తిరగడం అతనికి బాగానేవున్నది. పండితుల సాంగత్యమంటేను పండితులతో వాదవివాదాలంటేను యిష్టంగా వుండటంలేదు.

కాశీలో ఒకరోజున ఒక నాటకశాల నాయకిని కలుసుకోవడం తటస్థపడింది. చూడగానే ఆమె అతడిమీద మోజుపడింది. గౌతమున్ని వెంటనే తన నాటక మండలిలో చేర్చుకొన్నది.

తెగిపోయినవ్రేళ్లతో బొమ్మలు వేయలేడు. విగ్రహాలు తయారుచేయలేడు. నృత్యం చేయలేడు. కేవలం అభినయంద్వారా తనకళను ప్రదర్శించగల నేర్పు మాత్రమే మిగిలింది. విద్యార్థిగావున్నప్పుడు అతడు కొన్నినాటకాలు రచించాడు. అతడు మొదట దార్శనికుడు, పండితుడు, చిత్రకారుడు. ఇప్పుడు నటుడు. నాయక పాత్ర ధరించసాగాడు.

రూపాలు అనేకం. కాని సత్యం ఒక్కటి.

వియోగం నాటకంలో ముఖ్యమైనది. గౌతం వీలాందరుడుకూడా ఆ వరం వరను అపలుబరిచాడు. వియోగంతప్ప మరింకేవిషయాన్ని అతడు తనకోసం ఎన్నుకోలేదు.

నాటకశాల యజమానురాలు మంచి రూపసి. ఆమెపేరు అంబిక. ఆమె గొప్ప నటి. నటనలో మేటి. గొప్పగొప్ప ధనికులకుమారులు, వస్తాదులు ఆమె నామ జపం చేస్తూవుంటారు. కాని ఆమెమాత్రం వారెవ్వరిమీద మోజుపడలేదు. ఒక దరిద్రుడైన వ్రేళ్ళుతెగిన బీద బ్రాహ్మణవిద్యార్థికి లొంగిపోయింది.

అప్పుడు గౌతముడికి మరో సత్యం బోధపడింది. నీవు ఎవరిని ప్రేమిస్తావో వారు నిన్ను ప్రేమించరు. నీకోసం ప్రాణాలుపైతం అర్పించేందుకు సిద్ధపడేవాణ్ణి నీవు ప్రేమించవు. ఇది యథార్థవిషయం. వేలాదిమందికి యిది అనుభవైకవేద్యం. కాని అతడికిమాత్రం యిది క్రొత్త అనుభవం.

ఆంబిక నాటకమండలితోబాటు అంతటా తిరిగాడు. మౌర్యరాజ్యం సస్యశ్యామలమై సమృద్ధిగా వున్నది. లలితకళలు ప్రచారంలోకి వచ్చాయి. ఇప్పుడు గౌతం కూడా ధనికులవలె మారిపోయాడు. దర్జాగా వుండసాగాడు. త్రాగుడు అలవాటు అయింది. రోజూ క్రొత్త ఆడముఖాలకై తహతహలాడటం. త్వరలోనే మొహం మొత్తి మరో రూపసికోసం పరుగులెత్తడం ప్రారంభించాడు. అయినా అంబికకు అతడంటే ప్రాణం. ఎన్ని దుర్వ్యసనాలకులోనైనా అంబికమాత్రం అతణ్ణి ఆరాధించడం మానలేదు. ఆమె ప్రేమచూపుతుంటే అతడు ఆమెను అవమానించేవాడు. ఆమె అనురాగం చూపుతుంటే అతడు నిర్దాక్షిణ్యంగా వ్యవహరించేవాడు. ఆమెను బాధబెట్టి తాను ఆనందం పొందుతూవుండేవాడు.

అతడు చంపకకోసం ఎన్నోచోట్ల తిరిగాడు. చంపక యింకా బ్రతికేవున్నదని అతనికి గట్టి విశ్వాసం. కాని ఆమె ఎక్కడా కనబడలేదు.

చివరకు విసిగిపోయి ఆమెను వెతకడం మానివేశాడు. అంబిక ప్రేమముందు తన ఓటమిని అంగీకరించాడు. అంబికతో వుంటూవుంటే ఒక గృహస్థుకు లభించే శాంతి అతనికి జీవితంలో లభించింది.

ఇవాళ అతడు పాటలీపుత్రంలో వున్నాడు. ఎప్పటివలెనే అంబిక ప్రక్కన నటిస్తున్నాడు. ప్రేక్షకులు అతణ్ణి శ్రద్ధతో చూస్తున్నారు. అతని బహురూపాలను చూచి ఆనందించే ప్రేక్షకులు గౌతం నీలాంబరుణ్ణి ఎప్పటికీ చూడలేదు.

# 6

మహిళలంతా దుఃఖంతో కళ్లు మూసుకొన్నారు. రకరకాల తీయనికళలుకన్న యువతులు బాధతో క్రుంగిపోయారు. ఆ మహిళలవరుసలోనే ఒకప్రక్కన చంపక కూర్చొనివున్నది. ఆమె తన స్నేహితురాండ్రతో మాట్లాడుకొంటున్నది.

తల పైకిఎత్తి చూచేసరికి ఆమెకు గౌతం నీలాంబర్ కనిపించాడు. ఆమె కంపించిపోయింది. ఆమెనేత్రాలు కన్నీటితో నిండిపోయాయి. కళ్లఎదుట అంతా

మసకమసకగా కనబడసాగింది. ఆ మసకలో గౌతం నీలాంబరునిముఖం ఆరి పోతున్న దీపంలా ఆమెకు కనబడుతూవున్నది.

గౌతంకూడా ఒక్కపర్యాయం ఎదురుగావున్న మహిళలవంక చూశాడు. చంపక కనబడింది. కొంచెంసేపు సమస్తమూ మరిచిపోయాడు. సంభాషణ మధ్యలో ఆగిపోయింది. మళ్లీ మళ్లీ చూశాడు. నిజంగా చంపకే ఎదురుగావున్నది. అతనిచూపులు క్రిందికి వంగిపోయాయి. చంపక ఊదారంగుచీరె కట్టుకొనివున్నది. ఎంతోకాలం నిరీక్షిస్తూవున్నతరువాత అకస్మాత్తుగా చంపక కనబడింది. అతడు యింతకాలం పడ్డశ్రమ ఫలించినట్లనిపించింది. కాని ఏం లాభం? చంపక పాపిట సింధూరంతో నిండివున్నది. అంటే ఆమెకు వివాహం అయిపోయిందన్నమాట. ఒక చిన్నపిల్లవాడు ఆమె ఒడిలో వున్నాడు.

మరుక్షణంలో గౌతం ప్రక్కకు తప్పుకున్నాడు. అతనిబుర్ర ఆలోచనలతో బరువెక్కిపోయింది. సంబాళించుకొని తిరిగి యథాప్రకారం అభినయంలో లీనమైపోయాడు.

అదృష్టం, దుర్ఘటనలు, కాలచక్రపు విచిత్రమైనపోకడలు యథార్థాలని అతనికి బోధపడింది.

అతడు అభినయంలో లీనమైపోయాడు.

ఆమె లోలోన కుమిలిపోసాగింది. మౌనంగా ఏడ్చింది. ఒకవ్యక్తి ప్రపంచం వదలి వెళ్ళాడు. అయినా అతని స్మృతిమాత్రం తనను వదలలేదు. అతడు హరిశంకర్. మరొకవ్యక్తి తన స్మృతినుండి తప్పించుకొనేందుకై త్యాగాన్ని ఆశ్రయించక ప్రపంచాన్ని ఆశ్రయించాడు. అయినా అతడు బైరాగిగానే ఉండిపోయాడు. అతడు గౌతం నీలాంబరుడు. తాను ఎన్నోబాధలు పడింది. దుఃఖాలు సహించింది. అయినా ప్రపంచాన్ని వదలలేకపోయింది. ప్రపంచసుఖాన్ని అనుభవించనూ లేకపోయింది. అంతా మాయ.

స్త్రీగా పుట్టినందున స్త్రీ నొసటవ్రాసినప్రకారం ఆమెకూడా నడచుకొనక తప్పలేదు. అది స్త్రీ జీవితకర్తవ్యంకూడానేమో. రాజా వధింపబడినతరువాత యితర రాజకుమార్తెలతోబాటు ఆమెకూడా పాటలీపుత్రం తీసికొనిరాబడింది. అయోధ్యానగరపు రాజకుటుంబాలవారితోబాటు ఆమెకుకూడా పెళ్ళిళ్ళు జరిగాయి.

చాణక్యునిదగ్గర పనిచేసే ఒక పెద్దఅధికారితో ఆమెకు వివాహం జరిగింది. ఆమెభర్తకు అరవైఏండ్ల వయస్సు. లావుగా బొద్దుగా వుంటాడు. చాలా తెలివి గల బ్రాహ్మణుడు, అతడు ఆర్థికశాఖలో ఉద్యోగి. ఎప్పుడూ డబ్బులగొడవల్లో మునిగితేలుతూ వుంటాడు.

అతడు ఎలావున్నా అతనికి సేవచేయడం చంపక ధర్మం. కర్తవ్యంకూడా. ఆమె అతనికి సేవ చేస్తున్నది. పాటలీపుత్రంలోవున్న మిగతా వేలాదిగృహిణుల్లో ఆమెకూడా ఒకతె. ఆమె ఒడిలో ఒక పిల్లవాడు వున్నాడు. స్నేహితురాలితో మాట్లాడుతూవున్నది. వేదాంతాన్నిగురించి చర్చించేరోజులు గడిచిపోయాయి. కొద్దిసేపటికి ప్రథమఅంకం పూర్తి అయింది. ఆమె దాసీదానిచెవిలో ఏమో చెప్పింది. దాసీమనిషి అటూయిటూచూచి త్వరగా బైటికి వెళ్ళింది.

మొదటిఅంకం పూర్తి అయినతరువాత గౌతంకూడా వేదిక వెనకవైపుకువచ్చి నిలబడ్డారు.

'ఒక దాసీమనిషి మిమ్ము కలుసుకొనేందుకు వచ్చింది' అని అన్నది అద్దం ముందునిలబడి పూలచెండు ఊరదీస్తూ అంబిక.

'ఎవరు?' అని మెల్లగా ప్రశ్నించాడు గౌతం. అతడి కంఠంలో స్వతహాగా వుండే కటుత్వం మటుమాయమైంది. అతనితోవచ్చిన యీ మార్పునుగ్రహించి అంబిక నిర్విణ్ణురాలై పోయింది.

'ఎవరో నాకు తెలియదు. మీరే వెళ్ళిచూడండి, తెలుస్తుంది' అంటూ తన దుస్తులుపట్టుకొని ఇతరనర్తకీమణులు వున్నవైపుకు వెళ్ళిపోయింది.

గౌతం వేషాలువేసుకొనే గదిదాటి మెట్లమీదకు వచ్చారు.

మెట్లక్రింద చామనచాయగానున్న ఒక దాసీమనిషి నిలబడివున్నది. గౌతం రాగానే నమస్కరించి 'మా రాణిగారు మీకు నమస్కారాలు చెప్పమన్నారు. వెళ్ళే ముందు కలుసుకొని వెళ్లమన్నారు' అని అన్నది వినమ్రంగా.

గౌతం మెట్లుదిగి క్రిందికివచ్చి మౌనంగా నిలబడ్డారు. 'మీ రాణితో నేను రానని చెప్పు, మేల్కొనివున్నవారు ఒకానొకరోజున నిద్రిస్తారని, నిద్రపోయినవారు ఒకానొకరోజున మేల్కొంటారని, అందువలన ఎప్పుడూ మేల్కొనివుండేవారిని చూడమని చెప్పు. నేనుకూడా మేల్కొంటున్నాననీ, యింక ఏ వస్తువూ నామార్గంలో

అర్థం వుండదనీ, పతివ్రత పరపురుషుని నీడనైనా చూడకూడదనీ. నేను చెప్పా నని చెప్పు. ఇక నీవు వెళ్ళవచ్చు.' అని అన్నాడు గౌతం.

ఆమె త్వరగా బైటకువెళ్ళి తిరిగివచ్చింది. 'మీరు చెప్పిందంతా నిజం. యిప్పటి కైనా మేల్కొన్నారు మంచిది.' అని మా రాణి చెప్పమన్నారు. పతివ్రత అంటే అర్థం ఏమిటో మీకేం తెలుస్తుంది? అయినా నిజమే. మీ మార్గంలో అడ్డంగా నిల బడి ఆపుచేసే అధికారం ఎవ్వరికీ వుండదని. యిక మీరు వెళ్ళవచ్చును అనికూడా మా రాణి చెప్పమన్నారు' అంటూ మేలిముసుగు కప్పుకొని దాసీమనిషి వడివడిగా వెళ్ళి ప్రేక్షకుల్లో కలిసిపోయింది.

నాటకం పూర్తి అయినతరువాత గౌతం ప్రేక్షకులవంక చూడకుండా రంగ భూమినివదలి బైటకు వచ్చాడు. లోనికివెళ్ళి పట్టుదుస్తులువిడిచి ఆభరణాలు తీసివేసి తెల్లని పైపంచ కప్పుకొని పాదరక్షలైనా తొడుక్కోకుండా ప్రజలకంటబడకుండా తప్పించుకొని నాటకమందిరాన్నివదలి బయటకువచ్చాడు. జైలునుంచి విడుదల అయిన ఖైదీ పారిపోతున్నట్లుగా రివ్వురివ్వున నగరసింహద్వారందగ్గరకు చేరు కొన్నాడు.

త్రోవ కిరువైపులా సత్రాలు, భోజనశాలలు అనేకం వున్నాయి. లోపలినుంచి పకపకలు వినబడుతున్నాయి. ఆసుపత్రులలో రోగులుపడుకొని మృత్యువుకోసమో లేక ఆరోగ్యంకోసమో నిరీక్షిస్తున్నారు. బజార్లలో వెండి రాగి నాణాలచప్పుడు వినబడుతున్నది. ఆయుధశాలల్లో క్రొత్తక్రొత్తఆయుధాలు తయారుచేయబడు తున్నాయి. నదిలో రేవుదగ్గర ఓడలనిర్మాణం జరుగుతూంది.

దూరాన్నుండి ఎత్తయిన రాజభవనం బురుజులు కనబడుతున్నాయి.

'ఇప్పుడు మహారాజా తన విశ్రాంతిగృహంలో పడుకొని చాణక్యునితో చద రంగం ఆడుతూ వుండొచ్చు' అనుకొని గౌతం చిరునవ్వు నవ్వుకొన్నాడు.

ఒకవేశ్య అతణ్ణి రెప్పవాల్చకుండాచూస్తూ ప్రక్కగా వెళ్ళింది. బహుశః యీ వేశ్యకూడా మిగతావేశ్యలవలె గూఢచారివర్గానికి చెందియుండవచ్చును. నిజంగా గూఢచారుల్ని చాణక్యుడు ఎందుకు ఏర్పాటు చేశాడో ఆయనకే తెలియాలి. ఎవరికి ఎవరు గూఢచారులో చాణక్యుణ్ణే అడిగి తెలుసుకొంటే బాగుంటుంది అనికూడా అనుకొన్నాడు.

చీకటి పడింది. కోటమీద పహరాకాస్తున్న రక్షకభటుల కేకలు వినబడుతున్నాయి. కోటగోడదగ్గరకుచేరి అతడు నిలబడ్డాడు. ఆ కోటకు 64 ద్వారాలు వున్నాయి. తాను వెళ్ళాలనుకొన్నచోటుకు ఏద్వారంగుండా వెళ్ళాలో తెలియలేదు.

కాపలావాడు గౌతంను చూచాడు. బ్రాహ్మణుడనిభావించి పోనిచ్చాడు. ఎదురుగా వున్న ద్వారాన్నుండి బైటకువచ్చి ఒక రాజమార్గం చేరుకొన్నాడు. అది ప్రయాగకువెళ్లే త్రోవ.

సోన్‌నది దాటినతరువాత చాలారోజులవరకు నడుస్తూనేవున్నాడు గౌతం. త్రోవలో అనేక అరణ్యాలు, నదులు, గిరులు తగిలాయి. వాటినన్నింటినీ దాటుకొంటూ ముందుకు సాగుతూనేవున్నాడు.

వానప్రస్థాశ్రమం తరువాత సన్యాసాశ్రమం ప్రారంభమవుతుంది. బహుశః నా స్థితికూడా అంతేనేమో. మృత్యువు కావాలనిగాని, జీవితం కావాలనిగాని అని పించని స్థితి అది. వెళుతూనేవున్నాడు. త్రోవలో అనేక నగరాలు, ఆశ్రమాలు, ప్రభుత్వపొలాలు గ్రామాలు తగిలాయి. తన నివాసం ఎక్కడో అతనికి బోధ పడలేదు.

ఇంకి భయమెందుకు? తాను భూదేవి ఒడిలో వున్నాడు. భూదేవి అతనికి తల్లి. ఆమే నీకు తోడునీడ అని అన్నది అతని మనస్సు.

పచ్చగడ్డిలో నలువైపుల వాసనలు. రాళ్లలో చల్లదనం; చవిచూశాడు. మట్టికి గల శక్తియిమిటో అతడి పాదాలు తెలుసుకొన్నాయి. గాలి అతణ్ణి స్పృశించి ముందుకు వెళుతూంది. ఎలుగెత్తి 'అమ్మా, భూదేవీ, నీ పర్వతాలు, మంచుతో కప్పబడిన పర్వతాలు, వనాలు, ఉపవనాలు చిరునవ్వు నవ్వుతున్నాయి. నేను నీ అంచున నిలబడివున్నాను. నేను ఓడిపోలేదు. నాకు ఏమీ దెబ్బ తగలలేదు. నాకు గాయాలు తగలలేదు. నేను పూర్వపురుషుణ్ణి. నన్ను ఎవ్వరూ అంతం చేయలేక పోయారు. అమ్మా, నీ ఒడిలో ఏమున్నదో తెలియదు. నాకు నీ ఒడిలో చోటు యివ్వు'[1] అంటూ అన్నాడు బిగ్గరగా.

చాలారోజులు గడిచిపోయాయి. గౌతం యింకా నడుస్తూనేవున్నాడు. రకరకాల పూలమొక్కల్ని వృక్షాల్ని అతడు చూశాడు. పక్షులు అతనికి స్వాగతం పలికాయి.

---

1. ఋగ్వేదంలోని ఒక స్తుతి.

శ్రావణమాసపు వర్షపుచినుకులు తామరాకులమీద పడి జలతరంగాలను రెచ్చ గొడుతూవున్నాయి. కన్నీటితోనిండిన నేత్రాలతో యీ దృశ్యాన్నంతటినీ గౌతం చూశాడు. ఇంతలో మేఘాన్నుండి నీటిబిందువు అతడి కనురెప్పపై ముత్యపు చిప్పలో స్వాతినక్షత్రం బిందువు రాలినట్లుగా రాలిపడింది.

దిగ్మండలంమీద కారుమేఘాలు గర్జించసాగాయి. గౌతం ఆనందంతో వణికి పోసాగాడు. అతడి మస్తిష్కంలో సెలయేళ్ల తీయనిరాగాలు పలుకసాగాయి. ఇంద్రుడు తనకు సాయపడుతున్నాడు. రుద్రుడు తన వెంట వున్నాడు. ఒక వృక్ష నికి ఆనుకొని కొంచెంసేపు కన్నుమూశాడు. వానచినుకులు అతని అందమైన ముఖంమీదపడి క్రిందికి దొర్లిపోసాగాయి.

గౌతం లేచి మళ్ళీ నడక ప్రారంభించాడు.

'ఓ దేవతలతల్లీ, వెలుగు చూపించు. దేశాల్లో మాకు గొప్పస్థానం ప్రసా దించు' అంటూ గానంచేస్తున్న బ్రాహ్మణులకంఠధ్వని వినబడుతున్నది. దేవాల యాలమీదుగా ముందుకుసాగాడు. ఇక తిరిగి అడవులు ప్రారంభమైనాయి. ఎదురుగా అయోధ్య కనబడుతున్నది.

తడిసిన మట్టిమీద మోకాళ్లమీద కూర్చున్నాడు. నాలుగువైపుల శూన్యం. తాను శూన్యంలో ఒంటరిగా వున్నాడు. ప్రపంచపు అనాది మానవుడు. అనంతమైన వాడు అలసిపోయి. ఓడిపోయి భగవంతువిస్వరూపంలో ఆశావాదిగా ప్రసన్న చిత్తుడై వున్నాడు. అతడు తానే భగవంతుడు. ఎదురుగా అయోధ్యానగరం బంగా రంతో నిర్మాణమైనట్లు తళతళలాడుతూ వున్నది.

గౌతం తిరిగి లేచినిలబడ్డాడు. అతనికంఠంలో విశ్వాసం వున్నది. గర్వం వున్నది. అభిమానం వున్నది. తనలోని భగవంతుణ్ణి నంబోధించి యిలా అన్నాడు- 'ఓ ప్రభూ, నీవు అగ్నివి. సూర్యుడవు. పవనుడవు. చంద్రుడవు. నక్షత్రాలతో నిండిన ఆకాశానివి. బ్రహ్మవు. జలానివి. ప్రజాపతివి.'

'నీవు స్త్రీవి. పురుషుడవు. యువకుడవు. యువతివి. కర్రసాయంతో తడ బడుతూ నడుస్తున్న వృద్ధుడివి. ప్రతిరూపంలోను నీవు జన్మిస్తున్నావు.'

'నీవు నీలిరంగుగల ఈగవు. నీవు ఎర్రని కండ్లుగల చిలుకవు. నీవు తుఫా నువు. మేఘానివి. అన్ని ఋతువుల రూపానివి సముద్రానివి.'

'రెండుపక్షులు చెట్టుమీద కూర్చొనివున్నవి. ఒకపక్షి పండు కొరుక్కు తింటు వ్నది. రెండవది శ్రద్ధగాను తృప్తిగాను దానివంక చూస్తున్నది. ఇతరుల మహత్వాన్ని తెలుసుకొన్నజీవి తన దుఃఖాలు మరిచిపోయినట్లు. ఋగ్వేదం ఉద్ఘోషిస్తున్న యీ పరమసత్యాన్ని అర్థం చేసికోలేనప్పుడు అతనిలో భగవంతుడు నివసించినా ఏమి ప్రయోజనం? తెలుసుకొన్నవాడు సూక్ష్మంకంటె సూక్ష్మతరమైనవాడు. అతనికి అనేకరూపాలు. అతడే శివం. అతడే ఆనందం.'

'జ్యోతి ప్రసరించినప్పుడు పగలు వుండదు. రాత్రి వుండదు. అస్తిత్వము వుండదు. శివం మాత్రమే మిగిలివుంటుంది. ఆ అనంతజ్యోతి సావిత్రిది. ఆమెనుండే బుద్ధి ఆవిర్భవించింది.'

'ఆమె సౌందర్యం చూసేందుకు వీలులేదు. ఆమె ఐశ్వర్యానికి, మహాత్మ్యానికి ఉపమానం లేదు. అది అంతరంగంలో నిలచివుండే మహాశక్తి.'

'జన్మరహితుడవు' అంటూ ఎవరో గజగజవణుకుతూ నీదగ్గరకు వస్తున్నాడు.

'ఓ రుద్రుడా నన్ను రక్షించు.'

'అతడు ప్రపంచంలో ఒంటరిగానున్న పక్షి. సముద్రంలో మునిగిన సూర్యుని వంటివాడు. మానవుడు అతణ్ణి తెలుసుకోగలిగితే మృత్యువును జయించగలడు.'

'ఇంతకంటె మించిన మరో యాత్రామార్గం లేదు.'

గౌతం కళ్లు తెరిచాడు. అతడిశరీరం తంబూరాతీగలా వణికిపోతున్నది. కాళ్ళ క్రింద నీళ్లు పారుతున్నట్లుగ చప్పుడు వినవచ్చింది. తల పైకెతి చూశాడు. సరయూనది ప్రవహిస్తున్నది.

ఎంతో జాగ్రత్తగా పరికించిచూశాడు. స్పష్టంగా ఏమీ కనబడలేదు. నదికి అవలి ఒడ్డున కాషాయవస్త్రాలు ధరించిన భూతాలు కదులాడుతున్నట్లుగా అనిపించింది. రేవుదగ్గరకు చేరుకొన్నాడు. ఒక అమ్మాయి అక్కడ కూర్చొనివున్నది. ఆ అమ్మాయి సింధూరంరంగుచీర కట్టుకొని సంపెంగపూలు తల్లో పెట్టుకొనివున్నది. 'నదికి అవలితీరాన ఎవరున్నారో నీకు తెలుసునా?' అని ఆమెను అడిగాడు.

'ఎవరో కొందరు భిక్షువులు వున్నారు' అంటూ నిర్లక్ష్యంగా సమాధానంచెప్పి నీళ్లలో కాళ్లు కడుక్కోసాగింది.

'మంచిది. వాళ్లను కలుసుకొనివస్తాను.'

'తుఫానువేగంతో ప్రవహిస్తున్న యీ నదిని దాటుతావా? ఇప్పుడు పడవ అయినా ఏమీ లేదు.'

'ఏమీ భయం లేదు. దాటేందుకేగదా నది వున్నది?'

నాలుగువైపులా దృశ్యం మనోహరంగా వున్నది. నెమళ్లు నాట్యం చేస్తున్నాయి. తుమ్మెదలు రొద చేస్తున్నాయి. చాతకపక్షుల కూతలు వినబడుతున్నాయి. చాలాపుష్పాలు చెట్లనుండి రాలి అతని పాదాలవద్దకువచ్చి చేరుకున్నాయి. వంగి పుష్పాలను చేతుల్లోకి తీసికొన్నాడు. నదిలోకి వదిలాడు. నదిలోకిదూకి అవలి ఒడ్డుకు వెళ్లేందుకై ఈత ప్రారంభించాడు.

ఇంతలో వేగంగా నీటిప్రవాహం ఒకటి వచ్చింది. ఆ ప్రవాహంలోపడి ఒడ్డు సమీపంవరకు కొట్టుకువచ్చాడు. కాని యింతలో నీటితరంగాలు ఉవ్వెత్తుగా వచ్చి పడ్డాయి. శక్తినంతటినీ కేంద్రీకరించి ఈత ప్రారంభించాడు. కాని అతని శక్తి కంటె నీటిశక్తి పెరిగిపోయింది. సంఘర్షణ ప్రారంభమైంది. ఇంతలో ఒక బండ రాయి అతనిచేతులకు చిక్కింది. చండికాదేవికి సంబంధించిన దేవాలయభాగం అది. త్వరత్వరగావెళ్ళి ఆ రాతిని గట్టిగా పట్టుకొన్నాడు. అతడు చాలా అలసిపోయాడు. ఆయాసంగా వున్నది. రాతినిపట్టుకొని క్షణంసేపు కళ్లు మూసుకొన్నాడు. కాలప్రవాహం నీటిని ముందుకు త్రోసుకొనిపోతున్నది. ఎటుచూచినా నీళ్ళనీళ్లు.

ఆ సమయంలో రాయి చేతికి చిక్కినందున రక్షణ లభించినట్లనిపించింది. కానీ అతని చేతివ్రేళ్లు తెగిపోయినందున పట్టు సడలిపోసాగింది.

సరయూనదీతరంగాలు గౌతం నీలాంబర్‌మీదుగా ముందుకు సాగిపోయాయి.

మరోవైపున అబుల్ మంసూర్ కమాలుద్దీన్ ఒడ్డుకు చేరుకొని నల్లని చెవుల తన గుర్రాన్ని మర్రివృక్షంక్రింద కట్టివేసి నాలుగువైపుల పరికించి చూశాడు. ఎదురుగా నది ప్రవహిస్తున్నది. దూరాన గుడిసెలు వున్నాయి. శివాలయాల గంటల చప్పుడు వినబడుతున్నది. మర్రిచెట్టుక్రింద ఎవరిదో ఒక పీరుసమాధి వున్నది. అతడు వంగి నీటిలో వేళ్ళు ముంచాడు. నీటిలో అతనికి తనముఖం స్పష్టంగా కనబడింది. ఆశ్చర్యచకితుడై అటూయిటూ చూచాడు.

ఇంకా చంప రాలేదు. మరోసారి నదివంక చూశాడు. కదిమిచెట్టునుండి పూలు జలజల రాలాయి. అతని నెత్తిమీద పడ్డాయి. తలపాగా ఊడదీసి పూలను చేతుల్లోకి

తీసికొన్నారు. తరువాత వగిషీపనిచేసియున్న తన కత్తిపిడిని స్పృశించారు. పుష్పాలరాశిలో కత్తి కఠోరంగావున్నట్లు అనిపించింది. నడుముకుకట్టివున్న కర వాలాన్ని ఊడదీసి నేలమీద ఉంచారు.

ఇంతలో నీటిమీద ఈదుతూవస్తున్న చంప కనబడింది. 'నీవు ఎవరివో చంప దావికో, చావడానికో వెళ్ళావని అనుకొన్నాను' అని అన్నది నవ్వుతూ.

'మళ్ళీ అదేమాట. నేను సిపాయినికానని, సుల్తానుగారి గ్రంథాలయ రక్షకుణ్ణి మాత్రమేనని ఎన్నోసార్లు చెప్పాను.'

'అయితే యీ కత్తిని ఎందుకు దగ్గర వుంచుకొంటావు? దీనికి దయాదాక్షిణ్యాలు వుండవు.'

'చంపారాణీ, ఇది మొగవాళ్ల ఆభరణంవంటిది. కత్తి, తలపాగా లేకపోతే పురుషులకు అందం ఉండదు. అయోధ్యానివాసులగు మీరు మాల్వా, బుందేల్ ఖండ్‌కుచెందిన రాజపుత్రుల్ని చూడలేదు. నాకు ఒక స్నేహితుడున్నాడు. ఉదయ సింహ్ రాఠౌర్. కన్నౌజ్‌కుచెందిన రాజపుత్రుడు. గొప్పశూరుడు. ఇప్పుడు ఎక్కడున్నాడో తెలియదు. గ్వాలియర్‌సైన్యంలో కీర్తిసింహుడిదగ్గర వున్నాడని విన్నాను. మాల్వాలో ఎవరితోనో ఒకరితో యుద్ధంచేస్తూ వుండొచ్చు.' అంటూ కమాలుద్దీన్ ఒక్కక్షణంసేపు యుద్ధరంగపున్మృతుల్లో లీనమైపోయాడు.

తడిసినజుట్టును పిండి ముడివేసుకొంటూ 'అదుగో మళ్ళీ ప్రారంభించావు యుద్ధాలగొడవ. యుద్ధాలంటే నాకు భయం.' అని అన్నది చంప.

'భయమా? అంటే?'

'నీకు చెప్పడం వృథా' అంటూ చంప మెట్టుమీద కూర్చున్నది. కమాలుద్దీన్ చెట్లనీడ తరిగిపోతూవుండటం గమనించారు.

'చంపావతీ. నిన్ను భగవంతుడికి అప్పగించి వెళుతున్నాను' అంటూ వెళ్ళి గుర్రం ఎక్కాడు.

మహమ్మదీయ ఫకీర్లగుంపు ప్రక్కగా వెళ్ళింది. వారిలో ఒకయువకుడు చంపను, కమాలుద్దీనును చూశాడు. తలవంచుకొని ముందుకు సాగాడు.

'వీళ్లంతా విదూషకులా' అని పకపక నవ్వాడు కమాలుద్దీన్.

'విదూషకులు కారు. వీళ్లు ఎంతో మంచివాళ్ళు. ఎగతాళిచేయకు. కష్టసమయంలో నాకు సాయపడేది వీళ్లే' అని అన్నది చంప.

'నీవు కాశీవెళ్ళి కబీరుకు శిష్యురాలిగా చేరిపోరాదూ?'

'నిన్నుకూడా కాశికి తీసికొనివెళతాను. అయితే యీ కత్తిమాత్రం పనికిరాదు.'

'మంచిది. ఖుదాహాఫిజ్' అంటూ కమాలుద్దీన్ నదివైపుకు సాగాడు. 'అదిగో ఆ రాళ్ళగుట్ట ఎత్తుగా కనబడుతూవున్నదే, అది ఏమిటి?' అని ప్రశ్నించాడు.

'అదా, పాడుపడిన దేవాలయం. వేలసంవత్సరాలనాటి దేవళం. శిథిలమై పోయింది.'

'దానిప్రక్కన ఆ గుడిసెల్లో ఎవరు వున్నారో?'

'సూఫీలు వుంటున్నారు. నరేకాని ఎక్కడికి నీ ప్రయాణం?'

'బహరాయిచ్ వెళుతున్నాను. ఎన్నిరోజులు పడుతుందో ఏమో.'

'వర్షాకాలం వస్తున్నది. ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడుకో.'

'అలాగే, ఖుదాహాఫిజ్. పిచ్చిపిల్లా.'

అతడు ఆమెను పిచ్చిపిల్లా అని అంటూవుంటాడు. ఆ సంబోధనలో అగాధమైన ప్రేమ యిమిడివున్నది. కన్నీరు దిగమ్రింగి పైకి చిరునవ్వు నవ్వింది చంప. కమాలుద్దీన్ గుర్రంపగ్గాలు పట్టుకొని లాగాడు. రోడ్డుమీదకు చేరుకొన్నారు. గుర్రం ముందుకు సాగింది.

# 7

బహరాయిచ్ చిన్నపల్లె. అక్కడక్కడా మట్టియిళ్ళు వున్నాయి. మట్టిరోడ్లమీద ఎద్దులబండ్లు నడుస్తున్నాయి. పల్లెఅంతా ఏదో ఉదాసీనంగా వున్నది. గతంలో యిక్కడ శ్రావస్తీ అను పెద్దనగరం ఉండేదని ప్రతీతి. సోమవంశపు రాజులు పరిపాలిస్తూవుండేవారు. వాళ్ళు గొప్పవీరులు. సుహల్‌దేవ్ అను రాజుకు జ్యోతిష్కులు 'భవిష్యత్తులో మీ రాజ్యం వుండదు, తురుష్కులువచ్చి యీ రాజ్యాన్ని పరిపాలిస్తారు' అని చెప్పారట. ఆతరువాత కొంతకాలానికి గజనీ మహమ్మద్ సేనాని ఒకడు యిటువచ్చి సుహల్‌దేవును చంపివేశాడు. అతడిపేరు మసూద్ గాజీ. ఢిల్లీకి కుతుబుద్దీన్ ఐబక్ వచ్చాడు. అతడి సేనాపతి అహమద్ భక్తియార్

కోసల, మగధ, బెంగాలుదేశాల విగ్రహారాధకులగు హిందూరాజుల్ని ఓడించి వేశాడు.

రెండువేలసంవత్సరాలనుండి శాక్యముని విష్ణువుకు మరో అవతారమని భావించ బడినట్లే విగ్రహాలను ధ్వంసంచేసిన సేనాపతి మసూద్‌గాజీ గత రెండుశతాబ్దాల నుండి బాలేమియా అను పేరుతో కోసలదేశప్రజలకు ఆరాధ్యదైవం అయి పోయాడు.

అబుల్ మన్సూర్ కమాలుద్దీన్ మొదటిపర్యాయం బహరాయిచ్ వచ్చాడు. సాలర్ మసూద్ సమాధిగోడకు ఆనుకొని కూర్చున్నాడు. ఆశ్చర్యంతో హిందూ స్త్రీలబట్టు నొకదానిని చూడసాగాడు. వాళ్ల చేతుల్లో యత్తడిపళ్లాలు పెట్టుకొని ఎదు రుగావున్న ఒకసమాధికి కానుకలు సమర్పించేందుకై వస్తున్నారు.

నాలందా, విక్రమశిల, అమరావతి విశ్వవిద్యాలయాలు యిప్పుడు లేవు. శ్రావస్తిలోగల పురాతనఆశ్రమాలు పాడుబడిపోయాయి. విచిత్రమైనభాషల్లో వ్రాయబడివున్న ఆ గ్రంథాలు, కాగితాలు చదివేవారు ఎవరూలేరు. కాని కాశ్మీరు సుల్తాను జెన్ ఉల్ అబిదీన్, గౌడ్‌ప్రాంతపు సుల్తాను అల్లాఉద్దీన్ హుసేన్‌షా వలె జౌన్‌పూర్ సుల్తాన్ హుసేన్‌షర్కీ కూడా విగ్రహాలను నాశనంచేయకుండా లభించిన ప్రాచీనగ్రంథాలను భద్రపరిచాడు.

సుల్తాన్ హుసేన్‌షర్కీ యిటు ఢిల్లీసుల్తాను బహలోల్ లోదీతోను, సుల్తాన్ సికందర్‌లతోను యుద్ధాలు చేస్తూవుండేవాడు. తీరిక దొరికినప్పుడు తంబూరా పుచ్చుకొని సంగీతంలో లీనమైయేవాడు. లేకపోతే ప్రాచీనగ్రంథాల వ్రాతప్రతు లను చదువుతూవుండేవాడు. ఈమధ్యనే అతనికి అయోధ్యకుచెందిన కొందరు పండితులు బహరాయిచ్‌లోని ఒక మఠంలో రెండువేలసంవత్సరాల ప్రాచీనమైన సంస్కృత తామ్రపత్రాలున్నవని చెప్పారు. వెంటనే తన గ్రంథాలయానికి సంబం ధించిన అబుల్ మంసూర్ కమాలుద్దీనును అక్కడిపండితులను కలుసుకోమని అయోధ్యకు పంపించాడు.

కమాలుద్దీన్ అయోధ్య చేరుకొన్నాడు. అయోధ్యలో ఆ పండితుల్లో ఒకడి సోదరి అతడి కంటబడింది. ఆమెపేరు చంపావతి.

సుల్తానుఆజ్ఞప్రకారం కమాల్ పండితులదగ్గరకు వెళ్ళాడు. అప్పుడు వాళ్లంతా భక్తిగొగవల్లో మునిగితేలుతున్నారు. కమాలుకు భక్త కబీరుఅన్నా, భక్తులన్నా,

సాధువులన్నా, సూఫీలన్నా ఏమీ యిష్టంలేదు. చరిత్రకారుడు కావాలనే కోరిక మాత్రం అతనికి వున్నది. సుల్తాను అతనికి రకరకాలచరిత్రలు వ్రాసేపని అప్పగించాడు. అతనిరోజులు హాయిగా గడుస్తున్నాయి. కాని సుల్తాను అయోధ్యవెళ్లి పండితుల్నికలిపి సంస్కృతం, పాలీ, అర్ధమాగధిభాషల్లో వ్రాయబడియున్న పుస్తకాలన్నీ తెచ్చి వాటిని పార్శీభాషలోకి అనువదించమని ఆజ్ఞాపించాడు.

ప్రాచీనగ్రంథాలకోసం మఠాలన్నీ గాలించాడు. శ్రావస్తీలోగల శిథిలాలనన్నిటినీ గాలించాడు. ఒకరోజున ఒకచోట పెద్ద రాళ్లగుట్ట కనబడింది. ఆ గుట్టకు నాలుగువైపుల వీధులు వున్నాయి. వెనుకటిరోజుల్లో అది పెద్ద వ్యాపారకేంద్రమనీ, నాలుగువైపుల పెద్దపెద్దభవంతులు వుండేవని స్పష్టపడింది. ఒక మఠంలోకి వెళ్ళి శిధిలమైపోయిన ఆ గుట్ట ఎవరిదని ఒక పండితుణ్ణి ప్రశ్నించాడు.

అతడు కమల్‌వైపు గంభీరంగా చూశాడు. ఇతడెవరో పరాయిదేశపు విద్వాంసుడని గ్రహించాడు. 'ఇక్కడ ఎంతోమంది రాజులు, చక్రవర్తులు ఆవిర్భవించారు. మట్టిలో కలిసిపోయారు. చంద్రగుప్తమౌర్యుడు, అశోక ప్రియదర్శి, సముద్రగుప్తుడు అట్టి చక్రవర్తులే చంద్రగుప్తునికి పూర్వ చిత్రకారులు. విగ్రహాల నిర్మాతలు, రచయితలు వుండేవారు. వాళ్ల పేర్లేమిటో తెలియదు. పేర్లు మట్టిలో కలిసిపోతాయి. మనుష్యులుమాత్రం జీవించివుంటారు' అని అన్నాడు.

'యా అల్లా, ఈదేశపు ప్రాచీనచరిత్ర వ్రాయడం చాలాకష్టం. తామ్రపత్రాలలో రచయితలపేర్లు వుండవు. వాటిని అనువదించాలని తాను యిక్కడికి వచ్చాడు. ఊరంతా తిరిగితిరిగి మళ్ళీ అక్కడికేవచ్చి ఒక విరిగిపడివున్న స్తంభం మీద కూర్చున్నాడు. ఇక ఏమి చేయడమా అని ఆలోచించసాగాడు.

ఇంతలో బాగ్దాద్, నేషాపూరు జ్ఞాపకం వచ్చాయి. బాధ కలిగింది. ఈ దేశానికి క్రొత్తగా వచ్చాడు కమాలుద్దీన్. జౌన్‌పుర్‌లో కొద్దిఏండ్లనుండే వుంటున్నాడు. బాగ్దాద్‌లోని నిజామియా అను ప్రసిద్ధపాఠశాలలో అధ్యయనంచేశాడు. ఇబ్నేసీనా, అల్ఫారాబీ, ఇరాన్ ఫఖురుద్దీన్ రాజీ, మైమూన్ ఇబ్నేరుష్ద్, ఇబ్నుల్ అరబీలను ప్రత్యేకించి అధ్యయనం చేశాడు. ఇబ్నే ఖుల్దూన్‌ను తన గురువుగా అతడు ఎన్నుకొన్నాడు. అరబ్ దేశాలచరిత్ర వ్రాయాలని నిర్ణయించుకొన్నాడు. ఇబ్నేఖుల్దూన్ భావాలతో ఏకీభవించే పెద్దలను కలిసిమాట్లాడి వచ్చేందుకై ఉత్తరఆఫ్రికా వెళ్ళాలని బయలుదేరాడు. ఇంతలో అతనితండ్రి కైరోలో చనిపోయాడనేవార్త అందినది.

బాగ్దాద్ తిరిగివచ్చి అక్కడినుండి ఇరాన్ వెళ్ళిపోయారు. నేషాపూరులో వున్న ప్పుడు కత్తి కలం రెండూ నడుపగలిగినవారంతా హిందూదేశం వెళుతున్నారని. ఒక విద్వాంసుడు అతనికి చెప్పాడు. కమాల్ తనకు యిష్టమైన కొన్ని గ్రంథాలు తీసికొని మధ్య ఆసియా, కాశ్మీరు, లాహోరుమీదుగా తుగ్లకాబాద్ చేరుకొన్నారు.

అప్పుడు ప్రపంచం విచిత్రమైన గందరగోళంలోపడి మార్పుచెందుతూ వున్నది. చరిత్రకారుడుగనుక ప్రతియుగంలో మనుష్యుడికి ఏదో అవాంతరాలు తప్పవని యీ చరిత్రగతి యింతేనని కమాలు గ్రహించాడు. తాతారీల దాడులవల్ల దేశాలు గతంలో నష్టపడ్డాయి. అరబ్, ఇరాన్, స్పెయిన్, ఉత్తరఆఫ్రికాలలో గల విద్వాంసులంతా కలిపి గత ఆరువందలసంవత్సరాలనుండి వెలిగించిపెట్టిన జ్ఞాన దీపం, గోబీ ఎడారుల్లోనుండి బయలుదేరిన యిసుకతుఫానుల తాకిడికి తట్టుకోలేక పూర్తిగా ఆరిపోయింది.

హత్యాకాండలు, యుద్ధాలు, సాగుతూవున్నా జ్ఞానదీపంమాత్రం పూర్తిగా ఆరి పోలేదని చెప్పవచ్చును. మహమ్మదీయ సూఫీలు గ్రంథాలు వ్రాస్తూనేవున్నారు. విద్యాభ్యాసం జరుగుతూనేవున్నది. మానవత్వపు జ్యోతి పూర్తిగా ఆరిపోలేదు.

కంబళీలు కప్పుకొనే సూఫీకార్లు హిందూదేశానికి చేరుకోవడం ప్రారంభించారు. వీళ్ళు బెంగాల్, బీహారు, అయోధ్య, రాజస్థాన్, దక్కన్, గుజరాత్, సింధు, పంజాబుప్రాంతాల్లో ప్రచారం ప్రారంభించి స్థావరాలు ఏర్పాటుచేసికొన్నారు. షర్కీరాజ్యం భారతదేశంలో సభ్యత, సంస్కృతికేంద్రంగా పేరుపొందింది. జౌన్‌పూర్‌కూడా ప్రతిష్ఠ సంపాదించుకొన్నది.

అబుల్ మన్సూర్ కమాలుద్దీన్‌కూడా ఢిల్లీలో కొద్దిరోజులపాటువుండి చివరకు జౌన్‌పూరు చేరుకొన్నాడు. అతనిఎదుట విచిత్రమైన క్రొత్తప్రపంచం ప్రత్యక్ష మైంది.

హిందూదేశం విశాలంగా అందమైనది. అయినా యిది అతనికి మాతృదేశం కాదు. మాతృదేశానికి దూరం కావడంవల్ల అతనిమనస్సుకు హాయిలేకుండా పోయింది. విరిగిన స్తంభంమీద కూర్చొని, 'నేను యిక్కడ ఎందుకు వుండటం? ఇక్కడ ఎవరున్నారు? నా దేశం ఎందుకు వెళ్లకూడదు?' అని కళ్ళుమూసుకొని యోచించసాగాడు. జౌన్‌పూరువెళ్ళి సుల్తానుదగ్గర సెలవుతీసికొని మన్నించమని కోరి దమిష్కుదేశం వెళ్ళిపోదామని అనుకొన్నాడు. దమిష్కులో యిప్పుడు

ఏమున్నది? అక్కడికివెళ్ళి తాను ఏమిచేయగలడు? నేషాపూరులో 'నా' అనువా రెవరున్నారు? బాగ్దాద్‌తో యిప్పుడు తనకు ఏమిసంబంధం వున్నది? యీవిధమైన ఆలోచనలు మళ్లీ బయలుదేరాయి.

ఈదేశం రాకముందు ఏమేమో విన్నాడు. జోగులు గాలిలో ఎగురుతారనీ, తంత్రాలు, మంత్రాలు తెలిసి గారడీలు చేస్తూవుంటారని ఏమేమో విన్నాడు. రక రకాల జనాన్ని యిక్కడ చూశాడుకూడా. బెంగాలు, బీహార్లలో కొన్నితంత్రాలు జరిగే దేవాలయాల్ని చూశాడు.

కమాల్ అక్కడే కొద్దిసేపు కూర్చున్నాడు. అయోధ్యలో చంప పాటలు విని పించే ఆ పాటలన్నీ జ్ఞాపకంవచ్చాయి.

ఆ పరదేశి అక్కడే కూర్చొని రాత్రికోసం ఎదురుచూస్తున్నాడు. సూర్యుడు అస్తమించాడు. వెన్నెలరాత్రి. చంద్రకిరణాలు శిథిలమైపోయిన ఆ రాతిగోడలమీద ప్రసరిస్తున్నాయి. రాళ్లమీద, గోడలమీద త్రిశూలం, కల్పవృక్షం, భూదేవికి ప్రతీకంగా పద్మం, సృష్టిచక్రం, కమలాల సింహాసనం, అగ్నిస్తంభం మొదలుగాగల బొమ్మలు చిత్రింపబడివున్నాయి. వాటిని చెక్కినవాళ్ళ మనసుల్లోగల భావాలు ఏమిటో అతనికి బోధపడలేదు. చుట్టుపక్కల గుండెల్నిసైతం గడగడలాడించగల నిశ్శబ్దం వ్యాపించివున్నది. కొంతసేపటికి చిత్రవిచిత్రమైన కేకలు, అరుపులు, కూతలు వినబడసాగినవి. ఏవో పెద్దపెద్దరథాలు వస్తున్నట్లు రథాల్లో దుప్పట్లు కప్పుకొని, చెవులకు కుండలాలు, శిరస్సులపై కిరీటాలుపెట్టుకొని తనను చూస్తూ పోతున్నట్లు అనిపించింది. వాళ్ళ నేత్రాలు మిలమిలలాడుతున్నాయి. 'మేమంతా ఒక్కవెలుగు వెలిగినవాళ్లమే. మా కాలం తీరిపోయింది. అంతా వెళ్ళిపోయాం. నీవుకూడా ఆవిధంగా వెళ్ళిపోవలసినవాడివే' అంటున్నట్లు మాటలు వినబడాయి. ఇంతలో ఎదురుగా చంద్రగుప్తమహారాజా నిలబడి కనబడ్డాడు. ఇక్కడకు ఎలా వచ్చాడు? అతడు ఏసుక్రీస్తుకంటె మూడువందల సంవత్సరాలక్రితమే చని పోయాడుకదా. కాని ఇప్పుడు అతడు తన ఎదురుగానిలబడి చిరునవ్వు నవ్వు తున్నాడు. అతని వెనుకనుండి మరోవ్యక్తి తొంగిచూశాడు. అతడు తనను సంబోధించి - 'చూడు, నా పేరు అశోకచక్రవర్తి. నేను భారతదేశాన్నంతటిని పరిపాలించాను, కాని చనిపోయినప్పుడు ఏముంది? ఏమీలేదు. ఒకటిన్నర ఊపిరి

క్కాయలకు యజమానిగామాత్రమే మిగిలాను' అంటూ గుప్పిటతెరచి అర్ధ ఉసిరిక్కాయను కమాల్‌మీదకు విసిరివేశాడు.

ఆతరువాత వెనుకటివ్యక్తుల ఆత్మలు ఒకటితరువాత ఒకటిచొప్పున అతని ముందు ప్రత్యక్షమైనాయి. రథాలు దిగిరావడం, కనబడి పరిచయంచెప్పి వెళ్ళి పోవడం - 'నేను భరతమునిని. నేను నృత్యనాటకాలనుగురించి సిద్ధాంతాలు నిర్ణ యించాను.'

'నేను తక్షశిలకుచెందిన విష్ణుగుప్తుణ్ణి. నేను అర్థికశాస్త్రం రచించాను.'

'నేను భోజరాజును.'

'ఆకాశంలో మేఘాలు గర్జిస్తున్నాయి. నేను కాళిదాసును.'

'నేను కన్నౌజ్ రాజ్యాధిపతిని రాజశేఖరుణ్ణి.'

'నన్ను భవభూతి అని అంటారు. నేను మాలతీ మాధవం రచించాను.'

'నేను భర్తృహరిని. ఈ ప్రపంచమంతా ఒక రంగభూమి, మనమంతా నటులం అని నేను అప్పుడే చెప్పాను. నువ్వు నటుడివి. నేను నటుణ్ణి. మనమంతా నటులమే.'

మట్టిబండి తోలుకుంటూ శూద్రకుడు ముంగిటకువచ్చి కనబడి వెళ్ళిపోయాడు. తరువాత కత్తులచప్పుడు వినబడసాగింది. ఆ కత్తుల తళతళలు మెరుపుల్లా మెరుస్తు న్నాయి, వేలాదితలలు తెగి నేలమీద పడిపోతున్నాయి. రుధిరస్రవంతులు ప్రవ హిస్తున్నాయి.

'మేము చందేలా రాజపుత్రులం. మేము బఘేలీలం. మేము పరమార్ వీరులం. మేము రాఠౌరులం. మేము చౌహానులం. మా పేరు అల్హా. మా పేరు ఉందల్.'

కమాలుద్దీన్ కంగారుపడి లేచినిలబడ్డాడు. దిగ్మండలంమీద తెల్లారుతున్నట్లు వెలుగురేఖలు కనబడ్డాయి. గ్రామరైతులు పాటలు పాడుకొంటూ నాగళ్ళు మోసు కొని ఎద్దుల్ని అదిలించుకొంటూ పొలాలకు పోతున్నచప్పుడు వినబడింది. కంగారు పడి నాలుగువైపుల పరిశీలించిచూశాడు. తాను ఎక్కడవున్నదీ బోధపడలేదు.

ఇది బహరాయిచ్. విగ్రహారాధకుల శిధిలాలయంలో తాను పడుకొనివున్నాడు. అతని నల్లచెవులగుర్రం దగ్గరలోనే ఒక స్తంభానికి కట్టివేయబడివున్నది. అది సకిలిస్తున్నది. చల్లనిగాలి వీస్తూవున్నది.

అతడు అల్లాను స్మరించాడు. నమాజు చదివేనిమిత్తం లేచి మెల్లమెల్లగా అడుగులు వేసుకొంటూ నదివైపుకు బయలుదేరాడు.

# 8

రోజంతా పండితులతో తామ్రపత్రాలనుగురించి తలబద్దలుకొట్టుకొన్న తరువాత కమాల్ మఠంబైట పచ్చిగడ్డిమీద కూర్చున్నాడు. రేపుఉదయాన అయోధ్యకు బయలుదేరి వెళదామని అనుకొన్నాడు. ఇంతలో వర్షపుచినుకులు అతని ముఖం మీద పడ్డాయి. మఠంలోకివెళ్ళి నదుముకు కట్టుకొన్న పటకా విప్పాడు. శ్రావణ మాసం వచ్చిందనేవిషయం అతనికి జ్ఞాపకం వచ్చింది. ప్రతిమాసానికి పేరుతో బాటు దాని వాతావరణం, దృశ్యాలు, రంగు, రాగం వేరువేరుగా వుంటాయి.

అతని మాతృదేశం కాకపోయినప్పటికీ ఇక్కడి ఋతువులప్రభావాన్నుండి తప్పించుకోలేదు కదా.

ఇంతలో ప్రక్కనే చప్పుడు వినబడింది. ఒకసాధువు వర్షంలో తడవకుండా వుండేందుకై అక్కడికి వచ్చాడు. కమాల్ అతణ్ణి శ్రద్ధగా చూడసాగాడు. 'జైరాంజీ' అని అన్నాడు.

'జైరాంజీ.'

'ఏం సిపాయి, ఎక్కడినుండి వచ్చావు?'

'బాబా, నీవు యిక్కడి నివాసివా?'

'కాదు, మాది జౌన్‌పూర్.'

కమాలుకు ఎగిరి గంతువేసినంతపని అయింది. 'మాదీ జౌన్‌పూరే' అని అన్నాడు సంతోషంతో. తన మాతృదేశం కాకపోయినా జౌన్‌పూర్ పేరు విన గానే ఆనందం కలిగినందుకు అతనికే ఆశ్చర్యం వేసింది.

'నిర్గుణరామా, నిర్గుణరామా జపించవోయీ, నిర్గుణరాముని జీవా' అంటూ కళ్ళుమూసుకొని గానం చేస్తున్నాడు సాధువు. కొంచెంసేపు అయాక కమాలువంక

చూపి, 'కలందరవానులు కొందరు ఇవాళ బాలేమియా దర్గాదగ్గరకు జండాలు పట్టుకొని వచ్చారు' అని అన్నాడు.

'మంచిది.'

'మా సుల్తానుకు, ఢిల్లీ సుల్తానుకు బాగా చెడిందని, యీ పర్యాయం మా సుల్తానుకు విజయం లభించేలాలేదని సమరం తీవ్రంగా సాగుతున్నదని' చెప్పారు. నిర్గుణరామా, నిర్గుణరామా.

కమాల్ కంగారుపడుతూ లేచాడు. వెంటనే నడుం బిగించుకొని బైటకువచ్చి సత్రంవైపు బయలుదేరాడు.

సత్రపువరండాలో ఉదయసింహ రాఠౌర్ అతనికోసం ఎదురుచూస్తున్నాడు.

'నీవా? నీవు ఇక్కడకు ఎప్పుడు వచ్చావు?' నివ్వెరబోతూ అడిగాడు కమాల్.

'నీవు గ్వాలియర్‌లో వున్నావు కదూ.'

'అవును నేను గ్వాలియరునుండే వస్తున్నాను. నాతో బయలుదేరు. చక్రవర్తి నిన్ను వెతుక్కొనిరమ్మని నన్ను పంపాడు.'

'నన్ను వెతుక్కుంటూ యింతదూరం వచ్చావా?'

'చక్రవర్తికూడా యిక్కడే. యీ బహరాయిచ్‌లోనే వున్నాడు. నీవు యిక్కడ జ్ఞానంలోను, ధ్యానంలోను లీనమైవున్నావు. అటు ప్రపంచమే మారిపోయింది. సుల్తాన్ బహలోల్ మీ పాదుషామీద దాడిచేశాడు. ఇక్కడ కూర్చో. విషయమంతా చెబుతాను' అని అన్నాడు ఉదయసింహ్. ఇద్దరూ కూర్చున్నారు. ఉదయసింహ్ చెప్పడం ప్రారంభించాడు—'హుసేన్ సుల్తాను మీ పాదుషామీద దాడి చేసేసరికి మీ పాదుషా యమునానదిదాటి మా గ్వాలియర్ మహారాజాదగ్గరకువచ్చి సాయపడమని కోరాడు. మారాజా వెంటనే అవసరమైన సాయంచేశాడు. నేను ఒక్క పెద్ద సైన్యాన్నితీసికొని కాలపికి బయలుదేరాను. చాలా భయంకరమైనప్రయాణం మాది' అంటూ ఒక గడ్డిపరకతీసికొని యుద్ధవ్యూహాన్నిగురించి చెప్పడం ప్రారంభించాడు. 'ఇటు చూడు. యిటు సుల్తాన్ బహలోల్ సైన్యాలు వున్నాయి. అటు మేము వున్నాము. మామధ్య యమునానది వున్నది. మేము నదిని దాటలేము. వాళ్ళూ దాటలేరు. సమయం గడిచిపోతున్నది. ఒకరోజున ఏమి జరిగిందో తెలుసా. త్రిలోకచంద్ సుల్తాను బహలోలును నది దాటించాడు. త్రిలోకచందును ఎరుగుదువా?'

'ఎరుగను.'

'బక్సర్‌ను పరిపాలిస్తున్నాడోయ్. ఎప్పుడైనా బక్సర్ వెళ్ళావా?'

'లేదు. సరేకాని ఏమి జరిగిందో త్వరగా చెప్పు' అంటూ విసుక్కున్నాడు కమాల్.

'ఇంకేం జరుగుతుంది. ఢిల్లీ సైన్యాలు మమ్మల్ని వెంటాడుతున్నాయి. మేము జౌన్‌పూరుకు చేరుకొన్నాము. ఢిల్లీ సైన్యాలు అక్కడకూడా మమ్ము ఎదుర్కొన్నాయి. జౌన్‌పూరును వదలివేసి బహరాయిచ్ చేరుకొన్నాము. జౌన్‌పూరు చేయి జారిపోయింది. పగలే గుడ్లగూబలు అక్కడ కూస్తున్నాయి. పద పోదాం. నీవు చాలామాసాలనుండి యిక్కడ వున్నావని పాదుషా చెప్పారు. ఉదయంనుంచీ నీకోసం వెతుకుతున్నాను. పండితులు చెప్పగా యిప్పటికి పట్టుకొన్నాను.'

కమాల్ వెంటనే ఉదయసింహ్‌వెంట బయలుదేరాడు. పాదుషా డేరాలు రాప్తీ నదిఒడ్డున వున్నాయి.

బహరాయిచ్‌నుండి కన్నౌజ్ కుమాళ్ళు పారిపోయారు. ఢిల్లీసుల్తాన్‌సైన్యాలు అక్కడకూడా వాళ్ళను వదలలేదు. చివరకు అలసిసొలసిన సుల్తాన్ బీహారులో తల దాచుకొన్నాడు. జౌన్‌పూర్‌లో యిప్పుడు ఢిల్లీసుల్తాన్‌కొడుకు ఒకడు సింహాసనం అధిష్ఠించాడు. షర్కీరాజ్యం సమాప్తమైపోయింది. కాజీ షహాబుద్దీన్ జౌన్‌పూరీ వారసుడు అబుల్ మంసూర్ కమాలుద్దీన్ రాజకీయకుట్రల్లో నైపుణ్యం సంపాదించాడు. చరిత్ర, అన్వేషణ వగైరాలనన్నింటిని ప్రక్కన పెట్టివేశాడు. రాత్రింబగళ్ళు సుల్తానుతోబాటు కూర్చొని ఢిల్లీసుల్తానును ఓడించేమార్గం ఏమిటా అని ఆలోచనలు చేస్తున్నారు.

ఇంతలో సుల్తాన్ బహలోల్ మరణించాడు. అతడికొడుకు సికందర్ పాదుషా అయినాడు. అతడు మంచి రూపసి. అతడితల్లి హిందూవనిత. ఆమెపేరు హేమావతి. అతడు తన తండ్రికంటే మించిన బలవంతుడు. మహాశక్తివంతుడు.

బీహారులో తలదాచుకొన్న వీరంతాకలిసి తలల్ని పందెంవేసి మళ్లీ ఒక పాచిక విసిరారు. కానీ ప్రయోజనం కలుగలేదు. హుసేన్‌షర్కీ ఓడిపోయి బీహారుకు పారిపోయి వచ్చారు. కమాల్ అంతా గ్రహించాడు.

* * *

యుద్ధాలంటే కమాల్ యిప్పటికే బాగా విసిగిపోయాడు. అతడు చాలామందిని యుద్ధరంగంలో చంపాడు. రక్తపుటేరులు ప్రవహింపచేశాడు. ఆడవాళ్ళు అనాథలై ఏడ్వడం చూశాడు. పెద్దపెద్ద పౌరులు కాళ్ళుచేతులు బంధింపబడి విజయం పొందినవారి ఎదుటకు తీసికొనిపోబడటం చూచాడు. వారిలో కవులు, గాయకులు, చిత్రకారులు అంతా వున్నారు. పుస్తకాలు ఎన్ని ఉంటే ఏం లాభం? ఎంత జ్ఞానం వుంటే ఏం ప్రయోజనం? వేదాంతులైతే ఏం ప్రయోజనం? రాజ్యాధికారం ముందు అంతా బలాదూరే. మానవుల రక్తంముందు యివేమీ ఆగవు. చరిత్ర అంటే ఎంత ఆసక్తి అతనికివుండేదో యిప్పుడు అంత అసహ్యం కలిగింది. ఇక పాదుషాల వంశావళుల్ని, యుగాల్ని, వాళ్ళరాజ్యాల విశేషాలనన్నింటిని పూర్తిగా మరిచిపోవాలని నిర్ణయించుకొన్నాడు.

పాపం సుల్తాను టీహారువదలి బెంగాలు చేరుకొన్నాడు. గౌడ్ సుల్తాన్ హుసేన్‌షా, ఓడిపోయిన జౌన్‌పూర్ సుల్తానుకు ఆశ్రయం యిచ్చాడు. కమాల్ గౌడ్ దేశంలో వుంటూ యిక నా లక్ష్యం ఏమిటి? నా ఆత్మకు కావలసింది ఏమిటి? అంటూ యోచించసాగాడు. ఆ భయంకరమైన శూన్యంలో అతనికి ఏమీ గోచరించడంలేదు. ఏమీ తోచడంలేదు.

చివరికి ఒక ఆలోచన కలిగింది. నేను యీ గొడవలో వున్నంతవరకు ఇతరుల్ని చంపక తప్పదు. ఇతరులు నన్ను చంపకతప్పదు. మనిషి నిజంగా మనిషికాదు. రక్తం చవిచూసే తోడేలులాంటివాడు. నిజమైనమనిషి నాకు ఎక్కడ దొరుకుతాడు?

రకరకాల కూతలు అతనికి వినబడసాగాయి. పిలకజుట్టు పెట్టుకొన్నందుకు, ఆవును పూజించినందుకు, విగ్రహాలను పూజించినందుకు నేను వాళ్ళని చంపాలి. నేను వాళ్ళను చంపక ఏమరుపాటుచూపితినా వాళ్లు నన్ను చంపుతారు. నేను పిలక పెట్టుకొనకపోవడం ఆవుమాంసం తినడమే అందుకు కారణం.

అందమైన శివపురిని - వారణాసిని - నేను సర్వనాశనం చేసివేయాలి. అక్కడి దేవాలయాల్లో వేలాదివిగ్రహాలు వుండటమే అందుకు కారణం. ఆ విగ్రహాలు నాకు చేసిన అపకారం ఏమిటి?

రోజులు గడిచిపోతున్నాయి. పగలు పనిలేదు. అందువల్ల రాత్రిళ్లు విలాస సభల్లోను, వేశ్యల మేజువాణీల్లోను పాల్గొనడం ప్రారంభించాడు. కాని సంగీతసభల్లో

శాంతి లభించలేదు. అందక_త్తెలు నాట్యంచేస్తుంటే దయ్యాలు చేస్తున్న ట్లనిపించింది.

అతడి హృదయంలో పెద్ద గందరగోళం వ్యా ప్తమైంది. లోపల బయటకూడా అశాంతి పెరిగిపోయింది. ఒకరోజున ఎవరోవచ్చి 'మనసుకు శాంతి లభిస్తుంది. వజ్రపుతునక వున్నది. అక్కడికి పద.' అని చెవిలో చెప్పారు. ఆ వజ్రపుతునక ఒక నర్తకి. అక్కడా శాంతి లభించలేదు. మరోనర్తకిదగ్గరకు వెళ్ళాడు. రకరకాల రాగాలు విన్నాడు. పాటలు పాడమన్నాడు. ఆమె పాడింది. కాని తృప్తిలేదు. చివరకు విసిగిపోయి పట్టణాలువదలి పల్లెలకు బయలుదేరాడు. అక్కడ పట్టణాల గొడవలేదు. ప్రశాంతమైన వాతావరణం. పొలాల్లో రైతులు పనిచేసుకొంటూ వుంటారు. చెరువుల్లో తామరపూవులు విచ్చుకొని అందంగా కండ్లకు విందుచేస్తూ వుంటాయి. పొగడచెట్లక్రింద వైష్ణవస్త్రీలు రాధాకృష్ణులమీద గీతాలు గానంచేస్తూ తిరుగుతూవుంటారు. అక్కడక్కడ వెనుకటిరోజుల మేడలు కనబడ్డాయి. ఇప్పుడు అక్కడ ఎవ్వరూ వుండటంలేదు. పొదలు బాగా పెరిగిపోయి పాడుబడిపోయివున్నాయి. ఎదురుగా మహానందా నది ప్రవహిస్తూవున్నది. ఆ వాతావరణంలో అతడిమనస్సుకు కొంత ఆనందం కలుగసాగింది. కాని అతరువాత ఆ ఆనందం క్షణికమేనని తేలింది. బెంగాలువదలి వెళ్లిపోవాలని నిర్ణయించుకొన్నాడు. సుల్తాన్ హుసేన్ పర్కిని ఒంటరిగా గౌడ్‌లోవదలి వెళుతూంటే అతనికే సిగ్గువేసింది.

అంతా క్షణికమని నిర్ణయించుకొని ఒకరోజురాత్రి రాజమహలునువదలి గంగానది ఒడ్డుకు చేరుకొన్నాడు. అక్కడ ఒక పెద్దపడవ వున్నది. తిన్నగావెళ్ళి ఆ పడవలో కూర్చున్నాడు. పడవ ఎక్కడికి వెళుతున్నదోకూడా ఎవ్వరినీ అడగలేదు

నదిమీద వెలుగు కనబడింది. లంగరు ఎత్తారు. సరంగులు సంతోషంతో గొంతెత్తి పాటలు పాడసాగారు. కమాల్ ఒకవైపున కూర్చున్నాడు. ఆ పడవ ప్రయాగవైపుకు వెళుతున్నదని తెలుసుకొన్నాడు. రోజులు గడుస్తున్నాయి. గంగానదిలో పడవ నడుస్తూనేవున్నది. పడవ యాత్రికులతో నిండివున్నది. భాగల్పూరు దగ్గర పెండ్లివారువచ్చి పడవఎక్కారు. పెండ్లికొడుకు పసుపురంగు బట్టలు కట్టుకొనివున్నాడు. పెండ్లికూతురు మేలిముసుగు కప్పుకొని వెక్కివెక్కి ఏడుస్తున్నది. అత్తగారింటికి వెళుతూ వున్నదన్నమాట. పెండ్లివాళ్లు రొదచేస్తున్నారు.

కమాల్ పడవలో యీ దృశ్యంచూస్తూ కూర్చున్నాడు. గతంలో జరిగిన ఘట్టాలు జ్ఞాపకం రాసాగాయి.

'చంపావతీ, నన్ను పెళ్ళిచేసికో'

'రామరామ ఏమిటీ నీ మాటలు? ఏ మౌల్వీల గడ్డాలంటే నాకు భయం. జౌన్‌పూర్ అధికారిఅయి నీవుకూడా పొడుగాటిగడ్డం పెంచుకొంటావా?'

'చంపారాణీ, యింకా సమయంవున్నది. చివరకు వయసుమళ్ళిన ఏ పురోహితునికో నిన్ను ముడివేస్తారు. జీవితమంతా ఆ ముసలివానితో బాధపడతావు. అతడు చచ్చిపోతే నీవుకూడా చితిలోకిఎక్కి సహగమనం అయిపోతావు. నీ భవిష్యత్తులో జరిగేది యిదే. బాగా ఆలోచించుకో.'

'నేను నీతోకూడా చావడానికి సిద్ధమే నమ్మకంలేకపోతే చనిపోయి చూడు.'

'ఆమె మాటలువిని నిర్విణ్ణుడైనాడు నాకు నీకు పెళ్ళికాలేదుగదా. నేను చచ్చిపోతే నీవుకూడా చచ్చిపోతావా? ఏమిటి నీ మాటలు?'

'పెండ్లికాకపోతే ఏం? పూర్వజన్మఫలితంగా మనం యిద్దరం ఒకటేగదా.'

'మళ్ళీ వాగుడుప్రారంభించావు. ఏమిటీ నీ మాటలు? అంతా గారడీమాటలు.'

'ఇంలో గారడీ ఏమున్నది? నేను నిన్ను ఎన్నుకొన్నాను. నీ ఎదుట తల వంచాను.'

'తలవంచడానికి నేనేమైనా దేవుణ్ణా?'

'మనస్సు నిర్ణయానికివస్తే నీవే నా దైవానివి.' అంటూ పకపకనవ్వి ఆమె మాయమైపోయింది.

పడవ పాట్నారేవు చేరుకొన్నది. రేవుదగ్గర చాలామంది యాత్రికులు దిగిపోయారు. క్రొత్తవాళ్లు చాలామంది ఎక్కారు. క్రొత్తగా వచ్చినవారిలో కొందరు ధనికులైన యువకులు వున్నారు. యోగులుకూడా కొందరు ఎక్కారు. వారిలో నారింజరంగు గుడ్డలు ధరించిన భిక్షువు ఒకడు వున్నాడు. అతడు కమాలును గుర్తించాడు.

'ఎక్కడికి వెళుతున్నావు?' అని ప్రశ్నించాడు కమాల్.

'కాశీ వెళుతున్నాను.'

'అక్కడ ఏమున్నది?'

'అక్కడ లేనిదేమున్నది? అది శివపురం. అక్కడ ఆనందం లభిస్తుంది. అక్కడ నా గురువు వున్నారు. ఇంత వయస్సువచ్చింది. కాని నీవు ఆయనను తెలుసుకోలేదు. నీవు జౌన్‌పూర్ కమాలుద్దీనువు కదూ.'

కమాల్ ఆదేపనిగా చూస్తూ వుండిపోయారు.

'నేను సికందర్ సుల్తాను సైన్యాధిపతిని. చునార్‌లో జరిగిన యుద్ధంలో నేను నీతో యుద్ధంచేశాను. నీవు కత్తితో నన్ను గాయపరిచావు. ఇదుగో చూడు గాయం.' అంటూ అతడు తనకుడిచేయి చూపించాడు. ఆ చేతివ్రేళ్ళు తెగిపోయి వున్నాయి. 'ఇంకాచెబుతాను విను. నీవు గౌడ్‌దర్బారులో విలాసాల్లో మునిగి తేలుతున్నావు. అటు ఆమె నీకోసం ఎదురుచూస్తూ ఏడుస్తూవున్నది. కాని ఏ రాజ హంసవచ్చి నీకు ఆమెసమాచారం అందిజేయలేదు.'

కమాల్‌గుండె కొట్టుకోసాగింది. వీడికి జ్యోతిషశాస్త్రం తెలుసునేమోనని అనుమానం కలిగింది.

'నేను సైన్యంతో అయోధ్యమీదుగా వెళ్ళుతున్నాను. రావడీలో యుద్ధంజరిగింది. అందు ఆమెసోదరుడు చనిపోయాడు. ఆమె అడవుల్లో ఏడుస్తూ తిరగసాగింది. ఏ సిపాయినిచూచినా నీవేనని అనుకొనేది. నీవు తప్పక తిరిగివస్తానని ఆమెకు మాట యిచ్చావట. నీ జాడ తెలుసునా అని ఆమె నా దగ్గరకువచ్చింది. ఆ తరువాత ఎక్కడికి వెళ్ళిపోయిందో తెలియదు. ప్రపంచం చాలా విశాలమైనది. ఇక నీవు ఆమెను వెతుకలేవు. ఆమె నిన్ను పొందడం సాధ్యంకాదు. జీవితంలో ఇద్దరు మనుష్యులు కలిసినతరువాత విడిపోతే యిక తిరిగి కలుసుకోలేరు. కలయిక, ఎడబాటు అంటే ఏమిటో తెలుసా నీకు?' అంటూ సితారాతీసికొని తన అనుచరుల దగ్గరకు వెళ్లిపోయాడు.

గంగ ప్రవహిస్తున్నది. రజతఫలకంలాంటి ఆ నీటిమీద యాత్రీకులతో నిండిన పడవలు అసంఖ్యాకంగా రాజహంసల్లా నడుస్తున్నాయి. పడవల్లో పాటలు పాడు తున్నారు జనం. రకరకాల పాటలు వినబడుతున్నాయి. ఆ పడవల్లో అరబ్, చైనాదేశాల పండితులు, జావా వర్తకులు, టిబెట్టు కాశ్మీరు భిక్షుకులు, ఇరాన్ చిత్ర కారులు వున్నారు. దేశం ప్రశాంతంగావున్నది. ఢిల్లీలో సికందర్‌సుల్తాన్ రాజ్యం చేస్తున్నాడు.

'మానసికశాంతి పొందినవాళ్ళు నిజంగా అదృష్టవంతులు. నాకు మానసికశాంతి కావాలి ' అని అనుకొన్నాడు కమాల్.

భిక్షువు తలఎత్తి కమాలును చూచాడు. ఆనాడు వైశాఖపూర్ణిమ. ఆనాటి రెండు వేల ఏళ్ళక్రితం యీ గంగానది అవలి ఒడ్డున ఒకపల్లెలో శాక్యముని జన్మించాడు. ఈ వైశాఖపూర్ణిమనాడే అతనికి బుద్ధత్వం లభించింది. చంద్రబింబం నదికెరటాలపై అటునిటు ఊగుతున్నది. చల్లని చంద్రకిరణాలు కమాల్ ముఖంమీద భిక్షువు ముఖంమీద పడుతున్నాయి.

'నా భావాలనుండి నాకు విముక్తి లభింపచేయి' అని అన్నాడు కమాల్.

భిక్షువు నిశితంగా పరికించిచూశాడు. 'భావాలా ? భావాలు తమనుతాము గుర్తించలేవు. భావాలు తననువిడిచి బైటకు పోలేవు. సృష్టిని విడిచి పరమేశ్వరుడు లేడు. పరమేశ్వరుణ్ణి విడిచి సృష్టిలేదు. సత్యం, అసత్యం రెంటికి తేడాలేదు. అయితే అన్నింటికిపైన పరమసత్యం, శూన్యం వున్నది.'

'నాకు యీ శూన్యమంటే చాలా భయం,' అని అన్నాడు కమాల్.

'శూన్యం - నిశ్శబ్దం - శూన్యం - అదే అంతిమ సత్యం.'

'ఈ శూన్యంలో ఒంటరిగా నేను ఎక్కడికి వెళ్లగలను ? నీవు నాకు సాయం చేయరాదా ?' అంటూ కమాల్ మహాయానశాఖకు చెందిన ఆ భిక్షువువైపు చూచాడు.

పడవ ఒక గ్రామతీరానికి చేరుకొన్నది. కమాల్ రేవులోకివెళ్ళి నాలుగువైపుల చూశాడు. దిక్కుతోచలేదు. ఇంతలో వైష్ణవభక్తురాంద్రగుంపు కనబడింది. వాళ్ళంతా ఆ పడవనుండే దిగారు. కమాల్ వాళ్ళవెనుక నడువసాగాడు. వాడవాడల తిరుగుతూ ఒక అడవిలోకి ప్రవేశించాడు. ఆ చోటుపేరు అతనికి తెలియదు. దగ్గరలోనే సాలెవాళ్ళపల్లె ఉన్నది. శ్రావణమాసం ప్రారంభమైనది.

మెడలో తులసిమాలలుధరించి వైష్ణవభక్తురాంద్రు కూర్చొని భజనగీతాలు పాడుతున్నారు. ప్రకృతి అందంగా కనబడుతున్నది. కమాల్ చెరువుఒడ్డుకు చేరుకొని గీతాలువింటూ, ప్రకృతిశోభను తనివితీరచూస్తూ కూర్చున్నాడు.

అంతా నిశ్శబ్దంగావున్నది. నిశ్శబ్దం, శూన్యమంటే యిదేకదా అని అతనికి బోధపడింది. భిక్షువు అన్న మాటలు అతనికి యిప్పుడు బోధపడ్డాయి.

పూజారిణులు పాటలు పాడుతున్నారు—

సువాసనలు విరజిమ్ముతూ మలయమారుతం వీస్తున్నది. యాలకులతోటల్లో సుగంధం వ్యాప్తమైవున్నది. తేనెటీగలు అక్కడ ఎగురుతున్నాయి.

అది వసంతఋతువు. పూలతోటలు రంగురంగులపుష్పాలతో కళ్ళకు హాయిని కలిగిస్తున్నాయి.

మొగలిపూవులు కామదేవుని బాణాల్లా మెరుస్తున్నాయి. ప్రకృతంతా శోభాయమానంగా వున్నది. వేడి అధరాలు మూసిన కనురెప్పల్ని స్పృశించినట్లు సూర్యకిరణాలు మామిడిపూతను స్పృశిస్తున్నాయి. అతడు ప్రశాంతంగా యమునానదీ తీరాన నాట్యం చేస్తున్నాడు. ఆ పూవులప్రపంచంలో అతడు ఒంటరిగా లేడు.

రాధ అతడికోసం నిరీక్షిస్తున్నది. గోపికలతో నాట్యంచేస్తూ యింకా ఎంతసేపు వుంటాడు?

అహో, దూరప్రయాణంచేస్తున్న యాత్రికునకు కోకిలకూత వినబడగానే తన గ్రామంలోని మామిడితోటల్లోని తుమ్మెదలు జ్ఞాపకంవచ్చినట్లు కృష్ణునికి రాధ జ్ఞాపకం వచ్చింది.

'పీతాంబరములు ధరించి, అడవిపూలతో జుత్తును సింగారించుకొని, పెదవులు ఎర్రన చేసుకుని, గోపికలతోకలిసి నాట్యంచేస్తున్న కృష్ణుణ్ణి చూచింది రాధ.'

పై పాటలువింటూ వాటిభావాన్ని అర్థం చేసికొంటున్నాడు చెరువు ఒడ్డున కూర్చొని కమాల్.

'పూజారిణులు పాడుతూనే వున్నారు.

కోకిలకూతలు విన్నప్పుడు యాత్రికునికి మనసు కలతచెందినది.

ఇంతవరకు లభించని ఆనందానికి సంబంధించిన దా బాధ.

యాత్రలబాధ అర్థంకానిది.

ఫలితమేలేని పరిశ్రమవలన కలిగినబాధ.

ఆనందం కలిగినప్పటికీ, ఆ ఆనందంలోనే యిమిడివున్న దా బాధ.

బాధ అనంతం, అంతట వ్యాప్తము.'

కమాల్ లేచాడు. పూజారిణుల పాటలు, భక్తజయదేవుని పాటల మాటలు దూరం కాసాగాయి. కమాల్ బయలుదేరి అడవిలో తిరగసాగాడు. దగ్గరలోనే గంగానది కనబడింది.

తిరిగి తిరిగి తాము కాశీ చేరుకొన్నానని గ్రహించలేదు. ఆవలిఒడ్డున శివపురి కాశీ వున్నది. అక్కడి దేవళాల కలశాలు ఆకాశంలో ధగధగ మెరుస్తున్నాయి. వందలాది గంటలు ఒక్కసారిగా మ్రోగుతున్నాయి. కాశీపట్టణం. అనాదికాలాన్నుండి ప్రసిద్ధికెక్కిన మహాపట్టణం కాశీ.

అతడు చెట్లపీడల్లో రోజంతా కలియతిరిగాడు. అతడికాళ్ళు అలసిపోయాయి. నడిచే ఓపికకూడా లేకుండాపోయింది. మెల్లిగావెళ్లి ఒక సాలెవాళ్ల వాడ చేరుకున్నాడు.

ఒక గొల్లవాడు అతని స్వరూపంచూసి 'తమ్ముడూ, నీ కాళ్లనిండా మట్టి పేరుకొన్నది. అలసిపోయివున్నావు. దూరప్రయాణంచేసి వస్తున్నట్లున్నావు' అని ప్రశ్నించాడు.

'అవును, చాలాదూరం ప్రయాణంచేసి వచ్చాను.'

'మా యింటికి రా, ఇదుగో రొట్టె, పేలపిండి. కడుపునిండా తిను. బట్టలు చూస్తే డబ్బుకలవాడుగా వున్నావు - సుల్తానుకు చుట్టానివా ?'

'నేను ఏ సుల్తానుకీ చుట్టాన్ని కాను.' చెప్పులువిడిచి యింటిముంగిట్లో కూర్చొని నాలుగువైపుల పరిశీలించి చూచాడు.

'చంపావతీ, నీవు చెప్పినప్రకారం చేశాను. కత్తిని గంగానదికి సమర్పించాను. కాశీ చేరుకున్నాను. నీవు ఎక్కడవున్నావో తెలియదు.' అంటూ నిట్టూర్పు విడిచాడు.

చాలామంది సాధువులు, చెవులకు కుండలాలుధరించి ముందుకు నడుస్తున్నారు. కమాల్ వాళ్లవెనుక నడువసాగాడు.

'వీళ్లను ఎగతాళి చేయవద్దని, వీళ్లు మంచివాళ్లని, ఒకానొకరోజున వీళ్లే నీకు సాయంచేస్తారని' చంపావతి చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి.

ఆ సాధువులు తమ గురువుదగ్గరకు వెళుతున్నారని తెలుసుకొన్నాడు.

కబీరు ఉదయానే మగ్గంమీదకూర్చొని బట్టలు నేస్తూవుంటాడు. మధ్యాహ్నం తరు వాత బట్టలమూటలు వీపుకు కట్టుకొని కాశీపట్టణం వీధుల్లోకివెళ్లి అమ్ముతూ వుంటాడు. ఆయన యింటిముందు సాధువులు, సన్యాసులు రోజూ ఉంటూ వుంటారు. భజనలుపాడుతూ వుంటారు.

కాశీపట్టణంలో హిందూపురోహితులకు, ముస్లింమౌల్వీలకు కబీరు వాణి రుచించలేదు. కాని వాళ్లు అతణ్ణి ఏమీ చేయలేకపోయారు. మూడువందల సంవత్స రాలనుండి యీ భక్తిమార్గాన చాలామంది పయనిస్తున్నారు. పాదుషాలు, చక్ర వర్తులు, రాజులు, మంత్రులు, సైన్యాధిపతులు మొదలుగాగలవాళ్ల ప్రపంచా న్నుంచి బైటికివచ్చిన కమాల్ మరోప్రపంచంలో అడుగుపెట్టాడు. ఈ ప్రపం చంలో కార్మికులు, మంగళ్లు, మాదిగలు, రైతులు, బీదలు వున్నారు. ఇది నిజ మైన భారతదేశం. ఈ ప్రపంచాన్ని పాలిస్తున్నది సూఫీలు, సాధువులు, సన్యా సులు. ఇస్లాంమతంలోని సమానత్వమనే సిద్ధాంతం హిందువులను ఆకర్షిస్తున్నది. శాంతికాముకులగు సూఫీ సాధువులు ఇస్లాంమతాన్ని వ్యాప్తం చేస్తున్నారు. ఇందు కత్తికి స్థానంలేదు. వేలాది సంవత్సరాలనుండి పీడింపబడుతున్న అస్పృశ్యులు సూఫీ సాధువులదగ్గర కూర్చొని రామనామం జపించసాగారు. ఇదొక విచిత్ర ప్రపంచం. ఇక్కడ హిందూముస్లిం సమస్య లేనేలేదు. ఇది ప్రేమసామ్రాజ్యం. కమాల్ నిజమైన మనుష్యుల్ని చూద్దామని అన్వేషణ ప్రారంభించాడు. కొద్దికాలం లోనే ప్రపంచమంతా తోడేళ్ళమయం కాదని, మనుష్యులుకూడా వున్నారనే సత్యాన్ని తెలుసుకొన్నాడు. ఇంటిముంగిట కూర్చొనబెట్టి పేలపిండి తినమని ఆహ్వానించిన గొల్లవాడు నిజమైనమనుష్యుడు. దయార్ద్రహృదయుడు. అతనికి మతం ప్రధానంకాదు. మానవత్వమే ప్రధానం. రెండుపూటలా తనకు తిండి లభిస్తున్నది. అంతా ఆ పరమేశ్వరుని దయ. దేశరాజకీయాలతో తనకు పనేమిటి ? హాయిగా తనపొలంలో కూర్చొని పసిబిడ్డను ఒడిలో కూర్చొనబెట్టుకొని రేగి పండ్లు తినిపిస్తున్న రైతుకుగల మానసికశాంతి రాజ్యసింహాసనంమీద కూర్చొన్న వాడికి ఎక్కడ లభిస్తున్నది ? ఢిల్లీలో ఎవడు సింహాసనం ఎక్కితే ఏం ? ఎవడు

పాదుషా అయినా సామాన్యరైతుకు కాయకష్టం తప్పదు. పన్నులు చెల్లించక తప్పదు. ముస్లిం పాదుషాలకుపూర్వం పృథ్వీరాజు రాజ్యం చేస్తున్నప్పుడుకూడా ఆ రైతు తాతముత్తాతలకు యీ పాట్లు తప్పలేదు. శ్రావణమాసంలో పచ్చపచ్చగా వుండేవారు. కరువుకాటకాదులవస్తే ప్రాణాలు విడిచేవారు. కమాల్‌బుర్ర యీవిధమైన ఆలోచనలతో వేడెక్కిపోయింది.

సాయంకాలమైనది. భజనలో పాల్గొనేందుకు జనం వస్తున్నారు. కమాల్ లేచి కళ్లులేని ఒక అంధునిచేయి పట్టుకొని ఆ జనంలో కలిసిపోయాడు.

బాగ్దాద్, జౌన్‌పూరు నివాసియగు అబుల్ మంసూర్ కమాలుద్దీన్ చరిత్రకారుడు. పరిశోధకుడు. రాజకీయ ధురంధరుడు. సైనికుడు. తత్వజ్ఞానంతో సంబంధం లేనివాడు. కాని అట్టి కమాలుద్దీన్ యీనాడు కాశీలోని పంచగంగానదీ రేవు చేరుకొన్నాడు.

కాని పునాదికి సంబంధించిన ప్రశ్నలనుగురించి యోచించే తాత్వికబుద్ధికి ఇంకా తీరికలేదు. కబీరు ప్రసంగిస్తున్నాడు - 'సాధువులారా, వినండి. హరిని ధ్యానించండి. ప్రేమించండి. మీ దుఃఖాలు తమంతటతామే తొలగిపోతాయి. దుఃఖం సత్యం. దుఃఖానికి మూలం సత్యం....' పడవలో కలిసిన సాధువుకూడా చెప్పింది యీ విషయమే. కానీ యీ హరి ఎవ్వరు? ఒడ్డు ఎక్కడ? అక్కడకుచేరితే లభించేదేమిటి? నిజమైన విశ్వాసమంటే ఏమిటి? దేవుడంటే ఏమిటి? ప్రేమవల్ల వైరాగ్యంవల్ల లభించే దేమిటి? మోక్షమంటే ఏమిటి?

తాను దేన్నిగురించి ముందు ఆలోచించాలి? కర్మ, జ్ఞానం, ప్రేమ యీ మూడు మార్గాలు అతనిఎదుట వున్నాయి. ఏ మార్గాన తాను నడక ప్రారంభించాలి?

ముస్లిం మదరసాల్లో ఇస్లాంమతాన్నిగురించి పెద్ద ప్రసంగాలు సాగుతూ వున్నాయి. సూఫీలు ప్రేమమార్గాన్నిగురించి, భగవంతుణ్ణిగురించి చెబుతున్నారు. గంగానదిఒడ్డున మామిడితోపులమధ్యన కట్టబడిన పూజామందిరాల్లో అల్లా సేవకుల్ని చాలామందిని చూశాడు. చర్చలనన్నింటినీ అధిగమించి తమ గురువు ధ్యానంలో వాళ్ళంతా నిమగ్నులై వున్నారు. నిర్వాణసిద్ధికోసం పరితపిస్తున్న యోగుల్ని, భగవంతునికోసం అర్పణ అయిపోదామని పరితపిస్తున్న సూఫీలను చూశాడు. 'చివరిసత్యం వెలుగు. వెలుగు.... వెలుగు.... వెలుగు లేకపోతే అతనికి

అస్తిత్వమేలేదు' అంటూ సూఫీలు చెప్పారు. చివరిసత్యం చిత్తమేనని. కొందరు ముల్లాలు చెప్పారు. అల్లాజలాల్ తేజస్సు, అల్లా జమాల్ సౌందర్యం, అల్లా కమాల్ పూర్ణత్వం గురించిన బోధలు యీ తోటల్లో వినబడ్డాయి. ఇది భారతదేశం. ఫరీదుద్దీన్ అత్తార్, షేఖ్ జలాలుద్దీన్ తబరేజీ, బహాఉద్దీన్ జకరియా, జలాలుద్దీన్ సుర్ఖ్‌పోష్, ఖ్వాజా మొహినుద్దీన్ చిష్తీ, కుతుబుద్దీన్ బఖ్తియార్ కాపీలదేశం యీ భారతావని. ఇట్టి పుణ్యాత్ములు ఆవిర్భవించిన దేశంలోకూడా తాను అన్వేషిస్తున్న వస్తువును పొందలేని నిర్భాగ్యులు వుండగలరని ఊహించడం కష్టమే.

ఒకరాత్రంతా మఠంగోడ నానుకొని కూర్చున్నాడు కమాల్. ఈవిషయమే ఆలోచిస్తున్నాడు. లోపలినుండి వెలుగు బైటకు వస్తున్నది, పండితులు శ్లోకాలు పఠిస్తున్నారు. అతడు మహమ్మదీయుడు. అందువలన అతడు మఠంలో ప్రవేశించకూడదు. ఆ శ్లోకాలు విచిత్రంగా వున్నాయి. అతడు కదలకుండా అక్కడే కూర్చొన్నాడు.

'దేవా, దయాసింధూ, దేవా, దయాసింధూ'

అను పల్లవి వినబడింది. ప్రక్కకు తిరిగిచూశాడు. దగ్గరలోనే మెట్లమీద కూర్చొని కొంతమంది గిరిజనులు తంబూరామీటుతూ పాడుతున్నారు.

ఒళ్లు విరుచుకొని లేచి నిలబడ్డాడు. కమాలుద్దీన్ అని పిలిచింది అతని ఆత్మ. విన్ను కబీరువాణి తిరిగి పిలుస్తున్నది. ఇప్పటికి రెండుమార్గాలు చూశావు. కాని ప్రేమమార్గాన్ని నీవు చూడలేదు. ప్రేమమార్గాన నీవు పయనించలేదు, పద. ఆ మార్గాన్నికూడా నడచిచూడు.

అతడు తిరిగి రేవుపైపుకు బయలుదేరాడు. గంగానదిని దాటి కబీరు కుంజ్ చేరుకొన్నాడు.

రోజులు గడుస్తున్నాయి.

హజరత్ నిజాముద్దీన్ జేలియా బ్రహ్మలో లీనమైనాడని విన్నప్పుడు ప్రసిద్ధ ముస్లిం కవి అమీర్ ఖుస్రూ చెప్పిన-

'ముఖముపై కప్పుకొని కేశరాశి, శయ్యపై శయనించినది సుందరాంగి
నలుదెసల చీకట్లు క్రమ్మినవి, ఓ ఖుస్రూ యాక పద నీ యింటికి.'

ఆను పద్యం మాటిమాటికి కమాలుకు జ్ఞాపకం రాసాగింది.

ప్రేమ విర్వహణమంటే ఏమిటో అతనికి బోధపడింది. ప్రేమ అంటే ఏమిటో చంప అతనికి చవిచూపింది. గంగతోబాటు యమున ప్రవహిస్తున్నట్లు అతడు కబీరుతోబాటు కాలం గడుపుతున్నాడు. కంటికి కనబడకుండ గంగతోబాటు సరస్వతి వున్నట్లే చంప అతని మనస్సులో యిమిడిపోయింది.

కబీరు సాంగత్యంకూడా ఎంతోకాలం నిలవలేదు. కాశీపట్టణంలోని పండితులు, మౌల్వీలు సికిందర్ లోడీ సుల్తానుకు యీ పదభ్రష్టుడైన దూదేకులవాడు ప్రజల్ని తప్పుత్రోవ పట్టిస్తున్నాడని అర్జీలు పెట్టుకొన్నారు.

ఢిల్లీసుల్తాను కబీరుకు కాశీపట్టణ పండితుల, మౌల్వీల మతోన్మాదబారినుండి రక్షణపొందుటకు నీవు కాశీపట్టణంవదలి ఎక్కడైనా వెళ్ళిపొమ్మని తాఖీదు పంపించాడు.

# 10

కబీరుదాసు కాశీ వదలిపెట్టక తప్పలేదు. కమాల్ మరొకపర్యాయం యాత్రకు బయలుదేరాడు. గంగానదిఒడ్డుకువెళ్ళి బెంగాలుకువెళ్లే పడవఎక్కి కూర్చున్నాడు. అక్కడకు వందలాదిమైళ్లదూరాన గౌడ్ అను పట్టణం వున్నది. నేటికి చాలా సంవత్సరాలక్రితం తన సుల్తానును ఒంటరిగావదలి పారిపోయివచ్చాడు.

కొద్దివారాలకు పడవ పాట్నా చేరుకున్నది. సుల్తాన్ హుసేన్ షర్కీ గౌడ్ నుంచి భాగల్పూర్ వచ్చారని పాట్నాలో అతనికి తెలిసింది. భాగల్పూరులో అతడు చనిపోయాడనికూడా తెలిసింది.

సంగీతప్రపంచంలో క్రొత్తవిధానాన్ని ప్రవేశపెట్టిన సుల్తాన్ హుసేన్ షర్కీ యుద్ధాలతో సతమతమై విసిగివేసారి చివరకు కన్నుమూశాడు.

అయినా యీనాటికి 'హుసేనీసియా' అనురాగంమాత్రం శాశ్వతంగా వుండిపోయింది. అతడు క్రొత్త రాగరూపంలో శాశ్వతంగా నిలచిపోయాడు.

స్వరలహరులపై తేలియాడుతూ కమాల్ క్రొత్తక్రొత్తప్రదేశాలకు బయలుదేరాడు. సంగీతప్రపంచం శాశ్వతమైనది. అనాదికాలంనుండి వున్నది. సూఫీలు దీనినే నవాయే షర్మదీ అని అంటారు. కబీరు అనహదనాదం అని అన్నారు.

ఈ సంగీతప్రపంచమే కమాలుకు యిప్పుడు మిగిలింది. జయదేవుడు, విద్యాపతి, చండీదాసు గీతాలు, రైతులపాటలు, జానపదగేయాలు అన్నీ అతనివే. ఈ ప్రపంచంలో ఆక్రమణకు, యుద్ధాలకు, ఎగుడుదిగుళ్ళకు, ఆటుపోటులకు తావులేదు. సంగీతానికి సంబంధించినది అద్వైతసిద్ధాంతం.

బెంగాలు చేరుకొని తనకు తెలియని ఒకరేవులో దిగాడు కమాల్. అక్కడ తమలపాకులతోటలు విపరీతంగా వున్నాయి. వాగుల్లో నీలిరంగుపూలు వికసించి వున్నాయి. మర్రిచెట్లక్రింద అక్కడక్కడ గురువులపీఠాలు వున్నాయి. అతడు అక్కడే వుందామని నిర్ణయించుకొన్నాడు.

కమాల్ తిరుగుబోతుకవులతోబాటు కొంతకాలం వీధివీధికి తిరుగుతూ వున్నాడు. చటగ్రాంపర్వతాలు చేరుకొన్నాడు. యాత్రికులతోబాటు చటగ్రాంలో గల సీతాకుండ్ చేరుకొన్నాడు. అక్కడి పర్వతాలలో పెద్దపులులు తిరుగుతున్నాయి. అక్కడ సీతమ్మవారి దేవళం వున్నది. పర్వతాల క్రిందిభాగంలో ఎర్రని రాళ్ళతో నిండిన చెరువుఒడ్డున యింకా దేవాలయాలు వున్నాయి. మర్రిచెట్లక్రింద ఆడపిల్లలు కూర్చొనివున్నారు.

ఇప్పుడు కమాల్ క్రొత్తభాష నేర్చుకోసాగాడు. అది బెంగాలీభాష. అయోధ్యలోను, బీహారులోను జనం మాట్లాడేభాషలకూ దీనికి వ్యత్యాసం వున్నది. సంస్కృతానికి బహు చేరువలో వున్నది. ఇతరభాషలవలెనే త్వరత్వరగా వికసిస్తున్నభాష బెంగాలీ.

బెంగాలీ మధురమైన భాష. దానిని తనభాషగానే అతడు భావించసాగాడు. ఆ భాషలోనే మాట్లాడుతున్నాడు. ఆ భాషలోనే వ్రాస్తున్నాడు. ఆ భాషలోనే ఆలోచిస్తున్నాడు. జౌన్‌పూర్ సర్దారుగా యీ ప్రాంతాలకు తాను వెనుక వచ్చాడుకూడా.

అయితే ప్రపంచం మారిపోయింది. జౌన్‌పూర్ ఆ కమాలుద్దీనును యింకా జ్ఞాపకం పెట్టుకొంటుందా? ఇప్పుడిప్పుడే వయస్సు మళ్లుతున్న యీ అందమైన యువకుడు కమాలుద్దీన్ బెంగాలీభాషలో పాటలు వ్రాస్తాడని, గురువులదగ్గర కూర్చొని క్రొత్తక్రొత్తవిషయాలు నేర్చుకొంటాడని ఎవరూహించగలరు? అతడు బెంగాలీభాషను పార్సీ లిపిలో వ్రాస్తుండేవాడు. కొన్ని శతాబ్దాలతరువాత తనవంటివాళ్ళంతా పార్సీలిపిలో వ్రాసిన బెంగాలీసాహిత్యం బెంగాల్‌దేశంలో

అమూల్యమైన హూధీ సాహిత్యంపేరిట ప్రఖ్యాతి గడుస్తుందని ఎవరు గ్రహించ గలరు?

చాలాసంవత్సరాలు అతడు యిలాగే కథలు, పాటలు వ్రాస్తూవున్నాడు. చరిత్ర కారుడు, పరిశోధకుడు, రాజనీతిజ్ఞుడు, సిపాయి, సూఫీ, కబీరు శిష్యుడు, యిప్పుడు భావకవిగా మారిపోయాడు.

ఈవిధంగా తిరుగుతూ అతడు సోనార్ అనుగ్రామం చేరుకొన్నాడు. అక్కడ అతడు పెండ్లి చేసికొన్నాడు. ఆ పిల్ల పేరు సుజాత. శూద్రజాతి పిల్ల. ఒకరోజున ఆ అమ్మాయి చెరువుఒడ్డుకు కుండఎత్తుకొని వచ్చింది. పొడుగాటి ఆమె నల్లటి జుట్టు, నల్లని కనురెప్పలుచూచి కమాల్ ముగ్ధుడైపోయాడు. నిజానికి అతని వయస్సు, బౌద్ధికంగా అతనియోగ్యత ప్రేమించేందుకు అనుకూలంగా లేవు. రకరకాల అనుభవాలు గడించినతరువాత జీవితంలో చివరకు మిగిలేది, మిగల వలసింది శాంతి అని, ప్రచండమైన తుఫానులులేని శాంతి అని అతడు గ్రహిం చాడు. ఆ శాంతి అమాయకంగావున్న ఆ పల్లెపడుచును పెండ్లిచేసుకొన్నతరువాత అతడికి లభించింది. అదే అతని చరమలక్ష్యమేమోనని అనిపించింది.

ఇప్పుడు సుజాత అతనిభార్య. సుజాత శూద్రురాలైనందున దోషమేమో అతడికి బోధపడలేదు. సుజాత పేరుమార్చి అమ్నాబీబీ అని పెట్టాడు. ఆమెతో బాటు ఒక అందమైనకుటీరంలో కాపురం ప్రారంభించాడు.

పొట్ట నింపుకోవడంకోసం వ్యవసాయం ప్రారంభించాడు. అతడి గుడిసె ముందర చిన్నచెరువు వున్నది. ఆకాశంలో ఇంద్రధనుస్సు విరిసినప్పుడు, సన్న జాజిపూలపై తుమ్మెదలు మూగినప్పుడు అతడు తన చిన్నగుడిసెముందర మిత్రు లతోబాటు కూర్చొని పాటలు వ్రాస్తూ పాడుతూ కాలంగడపుతూ వుండేవాడు. అమ్నాబీబీ తన అందమైన ఒంటిమీద నేరేడురంగుచీరె ధరించి కడవ చంకన పెట్టుకొని నీలాటిరేవుకువెళుతూ కవబడుతూ వుండేది.

రోజులు గడుస్తున్నాయి. బెంగాలుదేశపు సుల్తానులు రోజూ యుద్ధాలు చేసు కొంటూ మరణిస్తూవుండేవారు. ఆ బెంగాలు యీమధ్య కొంతకాలాన్నుంచి ప్రశాంతంగా వున్నది. సైయ్యదు సాదాత్ అలాఉద్దీన్ అబుల్ ముజఫ్ఫర్ హుసేన్ గౌడ్ సింహాసనాన్నధిష్ఠించి పరిపాలనచేస్తున్నాడు. అతడిరోజుల్లో పాలూ పెరుగూ సమృద్ధిగా లభించసాగాయి. రక్తపాతాలు, దోపిడీలు తగ్గిపోయాయి.

బెంగాలును పరిపాలించిన యీ పాదుషా సమయంలోనే విద్యాపతి, ఠాకుర్, చైతన్య మహాప్రభువు శ్రీ కృష్ణుని ప్రేమగీతాలు ఆలాపించారు. పర్వతాలు తొలచి రకరకాల రంగురంగులరాళ్ళు తెప్పించి గౌడ్‌లో ఎన్నో భవంతులు కట్టించింది కూడా యీ పాదుషాయే. దర్బారులో సాహిత్యగోష్ఠులు, జ్ఞానగోష్ఠులు జరుగుతూ వుండేవి.

కొద్దిసంవత్సరాలు గడిచాయి. కమాలుబిడ్డలు పెరిగి పెద్దవారైనారు. ఇద్దరు కొడుకులకు జమాల్ అని, జలాల్ అని పేర్లు పెట్టాడు. కుమార్తెకు సకీనాబీబీ అని పేరుపెట్టాడు. తనబిడ్డల్ని చూసుకొంటూ సంతోషంగా కాలం గడుపుతున్నాడు. అతడి కొడుకులిద్దరూ భవననిర్మాణకళలో నిపుణులైనారు. గౌడ్‌లోను, సోనార్‌లోను భవనాలుకట్టడంలో నిమగ్నులైనారు.

ఇంతలో కమాల్‌భార్య చనిపోయింది. తన చేతులతో తన కుటీరానికి ఎదురుగా చెరువు ఒడ్డున తనభార్య అమ్నాను సమాధిచేశాడు కమాల్. అతడిజుట్టు తెల్లబడిపోయింది. ఇప్పటికీ అతడు కుటీరంబైట కూర్చొని అమ్నా సమాధిపంకచూస్తూ గీతాలు వ్రాస్తూవుంటాడు. బెంగాలు సుల్తానులరాజ్యకాలంలో బెంగాలీభాష జానపద సాహిత్యం త్వరగా ప్రగతిని సాధించింది. గౌడ్‌నుంచి అతనికొడుకులు తమ గ్రామంవచ్చి తండ్రికి రాజకీయమార్పులను గురించి చెబుతూవుండేవాడు. కాని ఇప్పుడు రాజకీయసంబంధమైన వార్తలు బహుదూరానవుండే నక్షత్రాల్లా అతనికి కనబడుతూవుండేవి. అవంటే అతనికి అసక్తిలేకుండా పోయింది.

అబుల్ మంసూర్ కమాలుద్దీన్ బెంగాలీవాడై పోయాడు. ఒటు ఢిల్లీలో రాజ్యాధికారం చేతులుమారినా, ఇబ్రహీంలోడీ పరాజితుడై, జహీరుద్దీన్ బాబరు విజయంపొందినా, కమాలుద్దీనుకు ఏమీ పట్టలేదు. పెద్దకొడుకు జమాల్‌వలన యీ వివరాలు అతడు విన్నాడు. ఆతరువాత జలాల్‌వచ్చి ముఘలులభవనాలు కట్టేందుకై తాను ఢిల్లీ వెళుతున్నానని చెప్పాడు. కమాల్ మౌనం వహించాడు. ఏమీ మాట్లాడలేదు. ప్రపంచమంతా తిరిగితిరిగి తాను గమ్యానికి చేరుకొన్నాడు. ఇక ప్రపంచంమీద గల మోహం అతనికి తగ్గిపోయింది. ఇక తన కొడుకుల ఎదుట ప్రపంచం పరిచివున్నది. తమతమ గమ్యస్థానాల్ని వాళ్ళే వెతుక్కొని నిర్ణయించుకొంటారు.

ఇక శాంతిరోజులు గతించినట్లే. బెంగాలును సైయ్యద్ అలాఉద్దీన్ హుసేన్ షా కుమారుడు నాసిరుద్దీన్‌షా పరిపాలిస్తున్నాడు. మంగోలులచేతుల్లో ఓడిపోయిన

తరువాత విన్నటివరకు రాజ్యంచేసిన ఢిల్లీఆఫ్ఘనులు దెబ్బతిని శరణార్థుల రూపంలో గౌడ్, లఖనవతీవీధుల్లో తలదాచుకొంటున్నారు. ఈ ఆఫ్ఘన్‌లు ఎక్కడబడితే అక్కడ కమాలుద్దీనుకు తగిలారు. గౌడ్‌పట్టణంలో తిరుగుతూ శ్రోవన పోతున్నజనాన్ని ఆపి తమ గతవైభవాన్నిగురించి, ప్రతాపాన్నిగురించి కథలు చెబుతూవుండటం ఆతడు చూశాడు. గౌడ్‌పట్టణంలో ఒకరోజున కమాల్ ఒక పోర్చుగీసువాణ్ణికూడా చూశాడు. వాడు ఒళ్లువిరుచుకొంటూ నడచి వెళ్ళు తున్నాడు. ఆశ్చర్యంతో కమాలుద్దీన్ రెప్పవాల్చకుండా వాడివంకచూస్తూ చేతికర్ర సాయంతో కొంతసేపు అలాగే నిలబడిపోయాడు. పోర్చుగీసువాళ్ళ ఓడలు పటాలాలతో నిండివచ్చాయని, చటగాంరేవులో ఆగివున్నాయని వాళ్లు గౌడ్‌నగరంలో ప్రవేశించబోతున్నారని వార్తలు వ్యాప్తమైనాయి.

సమయం త్వరత్వరగా గడిచిపోతున్నది. గౌడ్‌దేశపు రాజకీయపరిస్థితి తారుమారైపోయింది. అక్కడ నాసిరుద్దీన్ సోదరుడు గయాసుద్దీన్ సింహాసనం ఎక్కి రాజ్యం చేస్తున్నాడు.

ఒకరోజున బీహారుకుచెందిన షేర్‌ఖాన్ దండెత్తివచ్చి గయాసుద్దీనును హత మార్చి బెంగాలుసింహాసనం చేజిక్కించుకొన్నాడని, ఆతరువాత ఢిల్లీపాదుషా హుమయూనుకు, షేరఖానుకుమధ్య పెద్దపోరాటం జరిగిందని కమాలుద్దీనుకు వార్త అందింది. పచ్చపచ్చగానున్న బెంగాలుకు చిచ్చు అంటుకున్నది. అశాంతి పెరిగిపోయింది. షేరఖాను పెనుగాలిలా విరుచుకుపడ్డాడు, ఢిల్లీని పరిపాలిస్తున్న ముఘలులసైన్యాల్ని ఓడించి వాళ్ళను ఢిల్లీకి పారద్రోలి రెండోపర్యాయం బెంగాలును చేజిక్కించుకొన్నాడు. హుమాయూన్ షేరఖానుల సైన్యాలమధ్య భయంకరమైన పోరాటం జరిగింది. ఈ యుద్ధంలోనే కమాలుదీన్‌కొడుకు జమాల్ గౌడ్ నగరంవీధుల్లో యుద్ధంచేస్తూ చచ్చిపోయాడు. ఒకనాటిరాత్రి షేరఖాన్‌సైనికులు కుమాలుద్దీన్ గ్రామంకూడా చుట్టుముట్టారు. దోపిడిచేసుకొంటూ కమాలుద్దీన్ గుడిసెదగ్గరకు షేరఖాన్‌సైనికులు వచ్చారు. బైటకు రమ్మని బిగ్గరగా అరిచారు. 'నీవు చాలా ప్రమాదకారివి. నీ కొడుకులు ద్రోహులు. ఢిల్లీవాళ్ళతోకలిసి మాతో యుద్ధంచేశారు. నీవుకూడా ద్రోహివే, బైటకురా.' అని పిచ్చిగా అరిచారు. 'పాటలువ్రాసే అబుల్ మంసూరువి నీవేనా, బైటకు రావేమిరా ముసలికొడకా' అంటూ గర్జించారు. వణికిపోతున్నచేతులతో దీపం పట్టుకొని కమాలుద్దీన్ బైటకు

వచ్చారు. ఆశ్చర్యంతో సైనికులవైపు చూశాడు. సైనికులు అరుచుకుంటూ అతని మీదికి దూకారు. అతడు బాగా ముసలివాడై పోయాడు. చేతులు వణుకుతున్నాయి. అయినా వాకిలికిఅడ్డంగా నిలబడ్డాడు. తనను రక్షించుకొందామంటే అతనిదగ్గర కనీసం కత్తైనా లేదు. అతడు ఎవరికి ఏం అపకారంచేశాడు? అఫ్ఘన్లకు, ముఘలులకు జరుగుతున్న తగాదాలతో అతనికి ఏమీ సంబంధంలేదు. తాను ప్రశాంతంగా జీవించాలనిమాత్రమే అతడు కోరుకొంటున్నాడు. ఇది అతనిదేశం. ఇదే అతని మాతృదేశం, ఇక్కడే అతనికి బిడ్డలు పుట్టారు. పెరిగారు. ఇక్కడే అతడిభార్య సమాధి వున్నది. ఇక్కడే పచ్చపచ్చని అతని పొలాలు వున్నవి. ఇక్కడిభాషను రక్తంతో పెంచి పోషించాడు. ఇక్కడిభాషలో గీతాలు రచించాడు. అతడు ఇక్కడివాడు. అతణ్ణి ద్రోహి అనే హక్కు ఎవ్వరికీ లేదు. ఇది దారుల్‌హర్బ్ యుద్ధరంగం కాదు. ఇది దారుస్సలామ్ శాంతినిలయం. కాని యిప్పుడు దారుల్ హర్బుకు, దారుస్సలాముకు తేడా ఏమీలేదని అతనికి అనిపించింది. యుద్ధాలు జరిగేది రెండుమతాలమధ్య కాదు, రెండు రాజకీయశక్తులమధ్యనే అనువిషయం వ్యక్తమైనది.

సహసరామ్‌వాసి షేర్‌ఖాన్, ఢిల్లీవాసి హుమాయూన్ పాదుషా యిద్దరూ ఇస్లాం మతస్థులే. ఇద్దరూ కురాన్ భక్తులే. నమాజు చదువుతారు. కాని ఒకడువచ్చి మరొకణ్ణి తొలగించివేశాడు. దారుస్సలామ్‌కూడా అందు పాపాచారాలు ఎక్కువగా వుంటే దారుల్‌హర్బ్ కావచ్చును. షేర్‌ఖాన్ సైనికులు మహామూర్ఖులు. వాళ్ళకి విషయమంతా ఎలా బోధపడుతుంది. పిడికిలితో గట్టిగా పొడిచి గందరగోళం చేసుకొంటూ ముందుకుపోయారు.

కమాల్ తన యింటిముందు బోర్లా పడిపోయాడు. అతడినోటినుంచి నెత్తురు విపరీతంగా ప్రవహించసాగింది. కొద్దిగంటలసేపు వెక్కివెక్కిఏడుస్తూ పడి వున్నాడు. ఆ తరువాత రక్తప్రవాహం ఆగిపోయింది.

* * *

హిందూదేశాన్ని ముఘల్‌పాదుషాలు పరిపాలిస్తున్నారు. పాతవిధానాలు మారి పోయాయి. గౌడ్, లఖన్‌వతి, పాట్నాలు, స్వప్నాల్లా కరిగిపోయాయి. తురుష్కుల ఢిల్లీకూడా అణగిపోయింది. ఇప్పుడు ఢిల్లీ ముఘలులకు లోబడిపోయింది. ఒకానొకనాడు ఇంద్రప్రస్థమని పేరొందిన ఢిల్లీ యిప్పుడు తుగ్లకాబాద్ అయిపోయింది. ఈనాడు అది తైమూర్‌వంశజుల రాజధాని షాహజహానాబాద్.

కాని రోజంతా ఎండనక, వాననక పొలంలో వంగి పనిచేసే రైతుమాత్రం మారలేదు. భగీ-తీకిరాన పాటలు పాడుతూ కమాల్ ఒకగ్రామాన్నుంచి మరో గ్రామానికి వెళుతున్నారు. గురువుల పాదాలచెంత కూర్చొని భజనగీతాలు గానం చేస్తూవున్నారు.

బెంగాల్ రైతు అబుల్ మంసూర్ కమాఉద్దీన్ జీవించేవున్నారు: వుంటారు కూడా. అతడు పద్మానదిలో తన చిన్నపడవలో కూర్చొని కెరటాలను ఎదుర్కొం టున్నాడు. పడవ పద్మానదికెరటాలలో ఊగులాడుతున్నది. ముందు ఎటుచూసినా గాఢాంధకారం. గాలితోబాటు తుపాను గర్జిస్తున్నది. చీకటిప్రవాహంలో భయం కరమైన మొసళ్ళు నోళ్లుతెరుచుకొని కూర్చొనివున్నాయి. గాలి విపరీతంగా వీస్తూంది. అయినా పద్మానదిలో పడవ నడుపుతున్న ముసలివాని పడవ, ఉపవాసా లతో క్రుంగిపోయిన ముసలినరంగు పడవ పద్మానదిలో నడుస్తున్నది. క్రూరమైన తుఫానుల్ని మృత్యువును అతడు బాగా ఎరుగును.

చివరకు గాలివేగం పెరిగింది. పడవ మాటిమాటికి ఊగులాడసాగింది. ప్రిల్ లాంతరు ఎత్తి నాలుగువైపుల చూడసాగారు. కంగారు ఎక్కువైంది. 'పీటర్, మనం తుఫానులో చిక్కుకోలేదుగదా' అని ప్రశ్నించారు.

'లేదు, యిది సామాన్యమైన గాలే. భయపడవలసిన అవసరంలేదు.' అని సమాధానం చెప్పాడు పీటర్. 'ఈ నల్లపందికో వెధవపాటలు పాడటం ఆపి త్వరగా తెడ్డు వేయమని చెప్పకపోతే తెల్లంగ్గాతెల్లవారినా మనం రేవుకు చేరుకోలేము'

'నిద్రపోతున్నావా? ముసలికుక్కా' అంటూ ప్రిల్ వాపమీదకు వంగిచూశాడు. నరంగు తలఎత్తి ఒక్కసర్యాయంచూసి ఎంతో ఓర్పుతో తెడ్డువేయటం ప్రారం భించాడు.

'వీళ్ళు చాలా నీచులు. హంటర్‌తో బాదకపోతే వీళ్ళకు తొందర పుట్టదు.' అని అన్నాడు పీటర్. ప్రిల్ దూరాన్నుంచే తన చేతిలోగల వెంకెపపబెత్తంతో ముసలివాని వదుంమీద పొడిచాడు.

'ఏయ్ మనిషి, నీ పేరేమిటి?'

'అబుల్ మంసూర్ దొరా.'

'అబుల్ మంసూర్, నా చేతిలోగల హంటర్ చూచావా? దీనితో నీ చమడాలు ఒలిపించుకోవాలనే కోరిక నీకు లేకపోతే పడవ త్వరగా నడిపించు. అర్థమైందా?' అని గట్టిగా గద్దించాడు ప్రిల్.

'చిత్తం' అంటూ అతడు తిరిగి చుక్కానిమీదకు వంగాడు. పడవ నడుస్తున్నది. నదికి యిరువైపులతీరాన అనాసపండు పొలాలు. అరటితోటలు విపరీతంగా ఉన్నాయి. దూరాన గ్రామాల్లో దీపాలు వెలుగుతున్నాయి. ప్రిల్ పడవలోపలికి తొంగిచూశాడు. అబుల్ మంసూరుకు సంబంధించిన మట్టిసీసం, చాప, రెండు కంచుపాత్రలు వున్నాయి. గోడకు కొబ్బరికాయ వ్రేలాడుతున్నది. ఇదీ ఆ ముసలి సరంగు ఆస్తి. ఈ ఆస్తితో పడవ పద్మానదితరంగాలమీద నడుస్తూవుంటుందన్న మాట. ప్రిల్‌కు ఆశ్చర్యం కలిగింది. కళ్లు నులిమిచూశాడు. తాను చూస్తున్నదంతా నిజమా, అబద్దమా అని. నిజంగా అదృష్టం అనేది ఒకటి వున్నదని, అదే కేంబ్రిడ్జివీధుల్లో తిరుగాడే తనను యీ పడవలోకి తెచ్చి కూర్చోబెట్టిందని, యీ పడవ బెంగాలు అనే అందమైనదేశంలో వున్నదని, యీ దేశాన్నే ఇండియా అని అంటారని అతనికి అనిపించింది.

లాంతరువత్తి రెండోపర్యాయం నాలుగువైపుల చూశాడు. వెలుతురుపడి నీటిమీద త్రోవ కనబడసాగింది. చంద్రుడు చెట్లచాటునుండి మెల్లమెల్లగా ఉదయించసాగాడు.

## 11

ఇరవై సంవత్సరాల వయస్సులో ప్రిల్ హార్వర్డ్ విస్లే కేంబ్రిడ్జ్‌లోని సెక్స్ కాలేజీలో చేరి బి. ఏ. పట్టం పుచ్చుకొన్నారు. అతని తండ్రి బీదవాడు. పాదరి. తన పేటలోని జమీందారుని వలన ఆర్థికసాయంపొంది ఎంతో కష్టపడి చదివి కేంబ్రిడ్జ్‌లో చేరాడు. అక్కడికి సమీపంలోనే ఫ్లీట్ స్ట్రీట్ వున్నది. అక్కడ కాఫీహోటళ్లలో కూర్చొని రచయితలు, పత్రికావిలేఖరులు, సంపాదకులు ప్రపంచ రాజకీయాలను గురించి చర్చించుకొంటూ వుంటారు. ప్రిల్ కూడా తన స్నేహితులతోపాటు వెళ్ళి

ఆ చర్చల్లో పాల్గొంటూవుండేవాడు. ఒకరోజున భారతదేశంలోవుండి వ్యాపారం చేస్తూ ఏదోపనిమీద అక్కడకువచ్చిన పీటర్ జెక్సన్ అనే అతణ్ని కలుసుకొన్నాడు. బెంగాలులో తానుచేస్తున్న నీలిమందువ్యాపారంవలన కలిగిన విపరీతమైన లాభాలనుగురించి జెక్సన్ బ్రహ్మాండంగా చెప్పాడు. 'భారతీయులు ఎందుకూ పనికిరాని మూర్ఖులు. వాళ్ళ అధికారులు నవాబులు వగైరా అమిత ధనికులు. కలకత్తా మంచిపట్టణం. అక్కడ భోగవిలాసాలకు హద్దులేదు. ఇక్కడవుండి ఏంచేస్తావు? హిందూదేశానికి పద. నీవు తెలివిగలవాడిలా వున్నావు. తెలివిగా పనిచేస్తే నాలుగు రోజుల్లో బంగారుమేడలు కట్టవచ్చు. ఏమిటీ, నీవు కవిత్వంకూడా వ్రాస్తావా? నాటకాలు వ్రాస్తావా? వకీలువృత్తి గౌరవప్రదమైనది.' అంటూ అనేకవిధాలుగా ఫ్రిల్ను ప్రోత్సహించాడు పీటర్. కొద్దిరోజులతరువాత పీటర్ అతణ్ని తన పిన తండ్రిదగ్గరకు తీసికొనివెళ్ళి పరిచయంచేశాడు. అతని పినతండ్రి ఈస్టు ఇండియా కంపెనీకి ఒక డైరెక్టరు.

ఫ్రిల్‌కు కలకత్తాలో ఉద్యోగం దొరికింది. ఒకరోజున అతడు టిల్‌బరీనుండి 'ఇండియామాన్' అను ఓడలో బయలుదేరాడు. డోవర్‌కు చెందిన తెల్లనిగుట్టలు కంటికి కనబడకుండా పోయినప్పుడు ఇంగ్లాండు వదలివేయడం జరిగిందని అతడు గుర్తించాడు. ఒక్కపర్యాయం ఇంగ్లాండు అతనికళ్ళముందు సాక్షాత్కరించింది. అక్కడి కౌంటీలో అతని ఊరు ఉన్నది. అక్కడ థేమ్సానది ప్రవహిస్తున్నది. గోల్డ్‌స్మిత్, కూపర్, గ్రే, బర్క్ జన్మించారు. హోగర్త్, గాట్‌బరో, రేనల్డ్స్ వంటి చిత్రకారులు ఆవిర్భవించారు. అది పూర్తిగా ప్రశాంతి నెలకొనియున్న దేశం. అందమైనదేశం. బెంగాలు, కెనడా, దక్షిణ అమెరికాలనుండి వచ్చినడబ్బుతో ఇంగ్లండు ధనికదేశం అయిపోయింది. పేదలు ధనికులైనారు. ధనికులు వజ్రాలతోను, ముత్యాలతోను తులతూగసాగారు. ఎటుచూసినా 'డబ్బు డబ్బు డబ్బు' అనుచర్చ ప్రబలంగావున్నది. సాహిత్యమంటే అభిరుచిగలిగిన ఫ్రిల్ కూడా డబ్బు కోసం కలకత్తాకు బయలుదేరాడు. బెంగాలులో డబ్బు సంపాదించి లండనులో మేడకట్టిస్తాడు. లేక అతడు ఏ అనాగరిక భారతసర్దారుతోనో యుద్ధంచేసి ఆ యుద్ధంలో చనిపోతాడేమో, ఎవరికి తెలుసు?

సముద్రం భయంకరంగా వున్నది. ఈ ఓడలో ఎన్నిరకాలమనుష్యులు వున్నారో, ఎన్నెన్నికోరికలతో ఎక్కడెక్కడికి వెళుతున్నారో గదా. నీళ్ళంతా

చివరికి ఏమవుతారు? కంపెనీవ్యాపారస్థులు, మద్రాసు చీఫ్ ఆఫీస్ భారతదేశంలో పెండ్లి చేసుకొందామని బయలుదేరిన పెద్దకుటుంబాలకు చెందిన పెండ్లికాని యువతులు - రకరకాలవాళ్ళు ఆ ఓడలో వున్నారు. ఓడ కెప్టెను భోజనం చేస్తున్నప్పుడు టిప్పుసుల్తాను యుద్ధాల్నిగురించి కథలు చెబుతూవుంటాడు. పాట్నాలోను, ఢాకాలోను నీలిమందువ్యాపారం చేస్తున్నవాళ్ళు ఎప్పుడూ తమ వ్యాపారాన్నిగురించే మాట్లాడుకుంటున్నారు. అంతా 'మదీరా' అను మద్యం తాగుతున్నారు. పిక్నీ మండి పేక్స్ కాలేజీలో చేరి, కేంబ్రిడ్జినుంచి బైటకువచ్చాక అసలు ప్రపంచాన్ని ప్రిల్ యిప్పుడు చూచాడు.

ఓడ మెడగాస్కరుమీదుగా ముందుకు సాగింది. ఇది నల్లవానిసం దేశం. చైనా, భారతదేశం, ఇరాన్, టర్కీ మొదలగు తూర్పుదేశాలన్నీ దగ్గరగా అరచి ప్రిల్ను ఆహ్వానిస్తున్నాయి. 'ఓ ప్రిల్ సోదరా, రా నీకు స్వాగతం. బైబిలు, తుపాకులు, కత్తులు తీసికొనిరా. మా చమరాలు వడ.' అని అవి ఆహ్వానిస్తున్నాయి. కాన్పూరు, ఢాకాలకు చెందిన మహాపాపులు కొందరు 'తెలివిగా వ్యవహరించు, కోటీశ్వరుడవైపోతావు' అని అతనికి చెప్పారు. 'ఈ సిరాజుద్దౌలా ఎవరు?' అని అడిగాడు ప్రిల్ పీటర్ టెక్సనును. 'సిరాజుద్దౌలా,' అంటూ ముఖం చిట్లించాడు పీటర్. 'వారి కథంతా సవివరంగా చెబుతాను నేను. కాసింబజారులో వున్నాను. వెర్రిబాగులవాడు. ద్రోహి, దొంగ. అయోధ్య నవాబులాగా మనకు నమ్మినబంటు.

పీటర్ టెక్సను పైజాబాను, లక్నో కథలు చెప్పడం ప్రారంభించాడు. ఆ తరువాత మైసూరునుగురించి, ఆర్కాట్ నవాబుల్నిగురించి చెప్పాడు. బొంబాయి చేరుకొనేసరికి ప్రిల్ గత రెండువందల సంవత్సరాలలో భారత దేశంలో జరిగిన కథలు గాథలు అన్నీ తెలుసుకొన్నాడు. హిందువులు దుర్మార్గులనీ, ఎర్రని నాలుకగలిగిన విగ్రహాన్ని పూజిస్తారని, వితంతువుల్ని నిప్పుల్లోకి నెట్టి చంపుతారని, కాళ్ళకు చెప్పులులేకుండా తిరుగుతారని, ఆవుల్ని, కోతుల్ని, పాముల్ని దేవుడుగా కొలుస్తుంటారని విన్నాడు. మహమ్మదీయులు దుర్మార్గులని, ఆడవాళ్లను ఘోషాలోవుంచి బైటకు రానీయరని, పదిహేనుమంది ఆడవాళ్లను పెండ్లిచేసికొంటారని, గర్వపోతులని, వాళ్ళకు తలతిక్క ఎక్కువనీ విన్నాడు. మొత్తంమీద భారతదేశాన్నిగురించి, యిక్కడి జనాన్నిగురించి చాలా అసహ్యంగా ప్రిల్కు చెప్పాడు పీటరు. 'బెంగాలులో ఏషియాటిక్ సొసైటీ స్థాపించారు.

ఏమేమో త్రవ్వి బైటకు తీస్తున్నారు. అంతా దండుగమారి భాగోతం సంస్కృతం వగైరాలన్నీ మృతభాషలు. వాటిలో ఏమేమో వున్నాయని మన తెల్లవాళ్ళుగూడా వ్రాస్తున్నారని ఆశ్చర్యం వెల్లడించాడు పీటర్.

బొంబాయి రేవు సమీపంలో వున్నది.

భారతదేశం.

ఓడ హార్బరు చేరుకొన్నది. యాత్రికులు దిగ ఒడ్డుకు చేరుకొన్నారు. నూట ఏబై ఏండ్లక్రితం సూరత్ హార్బరుదగ్గరకు రావాలంటే యూరోపియన్లు నానా గడ్డీ కరవవలసివచ్చేది. అది మొఘలుల పరిపాలనాకాలం. ఇప్పుడో? తెల్లవాళ్ల రాజ్యం. వాళ్ళకు ఎదురులేని స్థితి. ఫ్రిల్‌తోపాటు వచ్చిన దొరలంతా ఈలలు వేసుకొంటూ దర్జాగా ఓడ దిగారు. నల్లజాతిజనం ఈగల్లా వాళ్ళను ముసిరి, వాళ్ళ సామాన్లు క్రిందికి దింపుతున్నారు. ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు పీటరుకోసం పల్లకీ పంపించారు. పీటరుతోపాటు ఫ్రిల్ కూడా ఆ పాలకీలో కూర్చొని మలబార్ హిల్ వైపుకు బయలుదేరారు. మలబార్ హిల్ మీద పూవులు వికసించివున్నాయి. వర్షం యిప్పటివరకు కురిసి యిప్పుడే ఆగిపోయింది. ఇంగ్లీషువాళ్లు వుంటున్న గృహాల పెంకులమీద రంగురంగుల పూలతీగలు అల్లుకొనివున్నాయి. పీటరు, ఫ్రిల్ యిద్దరికీ ఆతిధ్యమిచ్చిన పెద్దమనిషి స్వాగతం చెప్పేందుకు వాకిలిగేటుదగ్గరకు వచ్చాడు. కొయ్యస్తంభాల వరండాలో కూర్చొని వాళ్ళంతా తేనీరు పుచ్చుకొన్నారు. ఆతరువాత ఫ్రిల్ తనగదిలో కిటికీముందు నిలబడి సముద్రాన్ని చూడసాగాడు. గదిలో ఒకమూల ఒక హబ్సీజాతి కుర్రవాడు కూర్చొని ఫ్రిల్ బూట్లకు పాలిష్ చేస్తున్నాడు. మడగాస్కరునుండి దిగుమతిచేయబడిన బానిసన్నమాట ఆ పిల్లవాడు. వాడు గదిలో వుండటం ఫ్రిల్‌కు అసహ్యంగా వున్నది. ఒకనాటిరాత్రి భోజనందగ్గర యిద్దరు పారసీవాళ్లు ఫ్రిల్‌కు పరిచయం చేయబడ్డారు. వాళ్లు ఓడలు తయారుచేసే కార్ఖానాకు యజమానులు. ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడగలరు. రకరకాలజనం వున్నారే యీ దేశంలో అని ఆశ్చర్యపడ్డాడు ఫ్రిల్.

కొద్దిరోజులతరువాత ఆతడు పీటర్‌తోపాటు ఫ్యాక్టరీ చూపేందుకై సూరత్ వెళ్ళారు. సూరత్‌పట్టణం వందసంవత్సరాలక్రితం మొఘలులహార్బరు. ఆ రోజుల్లో లండను, పేరిస్ పట్టణాలజనాభాతో సరితూగుతూ వుండేది. బొంబాయి తిరిగివచ్చి పీటరు బొంబాయిలో ఆగిపోయాడు. ఫ్రిల్ ఒక్కడే యాత్రకు బయలుదేరాడు.

ఇండియాతో అతడికి పరిచయం ఏర్పడింది. ఓడలో బయలుదేరాడు. పాండిచ్చేరిలో ఫ్రాంసువాళ్ళు చాలామంది ఓడ ఎక్కారు. మరో ఓడమీద వాళ్ళంతా ఫ్రాంసు వెళ్ళిపోతున్నారని తెలిసింది. వాళ్ళలో ఒకవిద్యార్థి వున్నాడు. అతనికి గ్రిల్‌తో పరిచయం ఏర్పడింది. అతడు తన తల్లిదండ్రుల్ని కలుసుకొనేందుకు ఇండియా వచ్చాడు. ఫ్రాంసు వెళ్ళిపోతున్నాడు. అతడు త్వరత్వరగా గ్రిల్‌కు అనేకవిషయాలు చెప్పాడు. పారిస్ యూనివర్సిటీవిషయాలు చెప్పాడు. అక్కడ బయలుదేరిన స్వాతంత్ర్యోద్యమాన్ని గురించి చెప్పాడు. విప్లవం వర్ధిల్లుగాక, ఫ్రాంస్ వర్ధిల్లుగాక అంటూ ఆవేశంతో నినాదాలుచేస్తూ ఓడదిగి పడవలో కూర్చున్నాడు. పడవ దూరం వెళ్ళిపోయింది. అతనిపేరు ఏమిటో తెలియదు. ఈ విప్లవాలమధ్య అతనిగతి ఏమవుతుందో తెలియదు. ఎటుచూసినా రక్తపాతం; యుద్ధాలు. బెంగాలులో దక్షిణాదిన అంతటా యుద్ధాలే. యూరప్‌లో నెపోలియన్ గొడవ చేస్తున్నాడు. యూరప్ అంతటా చిచ్చు రగుల్కొన్నది. తగలబడుతుంది. ఈ మహాతుఫానులో కేంబ్రిడ్జి ఆగదు. సార్బోన్ విశ్వవిద్యాలయమూ ఆగదు.

ఇప్పుడు గ్రిల్ ఫ్రావర్డ్ బిస్లే బంగళాఖాతంలో ప్రయాణంచేస్తున్నాడు. ఎటుచూసినా మృత్యువు నోరు తెరుచుకొనివున్నది. ఎదురుగా మైసూరువాళ్లు వున్నారు. మరాఠీలు వున్నారు. ఉత్తరాదిన గడ్డాలుపెంచుకొని మీసాలు మెలివేస్తున్నారు ఆఫ్ఘన్‌లు, సిక్కులు. ఎటుచూసినా అశాంతి. ఢిల్లీ, హైదరాబాద్, ముర్షిదాబాద్, అంతటా దుఃఖచ్ఛాయలే. ఈ విషయాలేమీ గ్రిల్‌కు తెలియవు. ఢిల్లీ పాదుషా షా ఆలం ద్వితీయుడు యిప్పుడు చందాబాయి నృత్యం చూస్తూ వున్నారనేవిషయంకూడా గ్రిల్‌కు తెలియదు.

మద్రాసులో ఓడ అయిదారురోజులు ఆగింది. అతడు వాలాజాహి ఆర్కాట్ నవాబు మహలు చూశాడు. సెంట్ థామస్‌రోడ్డులోనున్న ఇంగ్లీషువాళ్ల దుకాణాలు చూశాడు. ఒకరోజున తిరుగుతూ తిరుగుతూ యూరేషియన్ ప్రజలు నివసిస్తున్న పేటకు వెళ్ళాడు.

అక్కడ ఒక యింటిమెట్లమీద ఒకఅమ్మాయి నిలబడి కనబడింది. మిశ్రమజాతి యువతి. అందంగా వున్నది. అతణ్ణిచూసి ఉదాసీనభావంతో చిరునవ్వునవ్వి లోపలికి వెళ్ళిపోయింది. ఒక నల్లరంగుస్త్రీ ఒడిలో పిల్లవాణ్ణి ఎత్తుకొని బైటకు వచ్చింది. ఇంటివాకిలిదగ్గర కూర్చొని పప్పు బియ్యం ఏరడం ప్రారంభించింది.

ఫ్రిల్‌నుచూచి ముగ్గురు నలుగురుపిల్లలు బైటకు వచ్చారు. ఆతరువాత ఆపిల్లల తండ్రికూడా వచ్చారు. అతడు ఒక తీవ యూరేషియన్‌లా వున్నాడు. ఫ్రిల్ వాళ్ళ వంక తదేకంగా చూడసాగాడు. లోపలికి వస్తావా? అని ఒకపిల్లవాడు ప్రశ్నించాడు. ఇంగ్లీషువాడు తమయింటికి ఎందుకు వచ్చాడా అని అందరికీ ఆశ్చర్యంగా వున్నది. ఫ్రిల్ పుట్టిన ఆంగ్లజాతి ఇంగ్లండులో రంగుభేదాన్ని పాటిస్తున్నది. భారతదేశంలోకూడా ఎరుపు నలుపు భేదాలను సృష్టించింది. బ్లాక్‌టౌన్, యూరేషియన్‌టౌన్, వైట్‌టౌన్ అనుపేరిట మద్రాసులో క్రొత్తపేటలు వెలశాయి. ఇంగ్లండులో వున్నప్పుడు ఫ్రిల్ పద్దెనిమిదవ శతాబ్దంనాటి ఉదారవాదాన్నిగురించి ప్రచారం కావించాడు. కాని అక్కడ ఎరుపు నలుపు అంటే ఏమిటో అతనికి తెలియలేదు. భారతదేశానికివచ్చాక అతనికి యీవిషయం బోధపడింది. భారతదేశానికివచ్చిన తెల్లవాళ్ళకు యిక్కడ నల్లరంగు ఆడవాళ్ళతో సంపర్కం ఏర్పడటం వలన తెల్లజాతిస్థాయి పడిపోయిందని అతను భావించాడు. షికారుకు బయలుదేరి ముందుకు పోగాడు. ఇంతలో ఆ యువతి అతనికి కనబడింది. ఆమె ముందు నడుస్తూ పోతున్నది.

ఆమె వెనక్కుతిరిగి ఫ్రిల్‌వంకచూసి తిరిగి చిరునవ్వు నవ్వింది. ఆ యూరేషియన్‌యువతి ఎంతో అందంగా వున్నది. 'ఇదిగో ఒక్కమాట' అంటూ త్వరత్వరగానడచి ఫ్రిల్ ఆమెను కలుసుకొన్నాడు. 'నీవు యిక్కడే వుంటున్నావా?' అంటూ మార్థదిలా ప్రశ్నించాడు.

'అవును. నీవు మా యిల్లు చూశావుగదా? కలకత్తానుండి వచ్చావా?'

'లేదు. కలకత్తా వెళుతున్నాను. లండనునుండి వచ్చాను. బొంబాయినుండి వచ్చాను.'

'ప్రయాణాలు ఎక్కువగా చేస్తుంటావా?'

'అవును. యింకా చాలాప్రయాణం చేయవలసివున్నది. నీవు యిక్కడ ఎంత కాలాన్నుంచి వుంటున్నావు?'

'చాలాకాలాన్నుంచి వుంటున్నాను.'

'నీవు క్రిష్టియనువి కదా.'

'అవును. భారతదేశంలో వుండేవాళ్లు క్రిష్టియన్‌లు కారాదా?' అంటూ 'మా తాతగారు ఆంగ్లేయుడు. నీవంటివాడే. కాని మా అమ్మమాత్రం భారతదేశపురాలు'

డ్రిల్ కంగారుపడ్డాడు. పీటరు యీవిషయమై ఓరలో యూరోపియన్లతో సంబంధం పెట్టుకోవద్దు. గతశతాబ్దంలో మన తెల్లజాతివాళ్లు భారతదేశంవచ్చి చాలామంది నల్లయువతుల్ని పెళ్ళి చేసుకొన్నారు. దానితో ఒక సంకరవర్గం యీదేశంలో తయారైంది.' అని చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి.

'మీ నాన్న జీవించివున్నాడా. ఏం చేస్తున్నాడు?'

'మెట్లమీద కూర్చొనివున్నాడు కదా. మద్యం దుకాణం నడుపుతున్నాడు.'

'ఇటురా, బెంచీమీద కాసేపు కూర్చుందాం' అని అన్నాడు డ్రిల్ గుండె గట్టి చేసుకొని. రోడ్డుప్రక్కన బల్ల వున్నది. యువతి ముందు కొంచెం సంకోచించింది. కానీ సంబాళించుకొని తలకు రుమాలుకట్టుకొని వెళ్ళి అతనితోబాటు బెంచీ మీద కూర్చున్నది. ఆ రోడ్డు చర్చికి వెళుతుంది. డ్రిల్ మాటలు ప్రారంభించాడు. తరువాత తాను ఏం మాట్లాడుతున్నాడో తెలుసుకోకుండానే వేడిఎండఫలితమో ఏమో! 'అబ్బా, నీవు చాలా అందంగా వున్నావు. నాకు ఎంతో నచ్చావు. నాతో బాటు కలకత్తా వస్తావా?' అని అడిగాడు.

'అమ్మో, సాధ్యమా?'

'ఏం?'

'నీవు పెద్దవాడవు. ఇవాళ....ఇవాళగడిస్తే ఆ తరువాత నన్ను మరచిపోతావు. నీలాంటి ఇంగ్లీషువాళ్లు చాలామంది మద్రాసు వస్తూవుంటారు' అంటూ ప్రక్కనే వున్న చెట్టుఆకును తుంచింది.

డ్రిల్‌హృదయం ఆమెకు లొంగిపోయింది. అతనికే ఆశ్చర్యం కలిగింది. మొదటిచూపులోనే యిలా అయిందేమో అని అనుకొన్నాడు. 'ఇదిగో.... ఇదిగో....' అంటూ ఆగిపోయాడు. ఇప్పటివరకు ఆమె పేరేమిటోకూడా అతనికి తెలియదు.

'నన్ను మారియా పెరేరా.... అని అంటారు.'

'మారియా పెరేరా, మారియా పెరేరా.'

ఆరాత్రి అతడు గవర్నమెంట్‌హౌసుకు వెళ్లలేదు, చడీ చప్పుడు చెయ్యకుండా యురేషియన్ల పేటకు వెళ్ళాడు. ఆ రాత్రి.... మరునాటిరాత్రికూడా....వాలుగవ రోజుఉదయం ఓడ కలకత్తాకు బయలుదేరబోతున్నది.

బయలుదేరబోతున్నప్పుడు తానుచేసిన పొరపాటు అతనికి అర్థమైంది. ఆ యువతిని తాను పెళ్ళిచేసుకోగలడా? సాధ్యంకాని పని. పెండ్లి చేసుకొంటాననికూడా అతను ఆమెకు చెప్పలేదు. అయినా ఆ మూర్ఖురాలు ఇండియాలోని ఆడవాళ్ల మాదిరిగా అతణ్ణి తన దేవతగా భావించింది. చర్చి బయటగల తోటకువచ్చి కలకత్తా వెళ్ళిపోతున్నానని, తిరిగివచ్చి తీసుకొనివెళతానని అతడు చెప్పినప్పుడు ఆమె పై ప్రాణాలు పైనే పోయినంతపని అయింది. తానుకూడా వెంటనే అతనితోబాటు కలకత్తాకు వస్తానని బయలుదేరింది.

అతడు తన ప్రతిభనంతటిని ఉపయోగించి ఆమెకు కల్లబొల్లి మాటలుచెప్పి తప్పించుకొన్నాడు. తను ఆడుతున్న అబద్ధాలకు అతనికే సిగ్గువేసింది.

ఈ చిన్నఘట్టం అతని జీవితంలో విచిత్రమైన అనుభూతి కలిగించింది. కలకత్తాకు బయలుదేరాడు. బంగాళాఖాతంలో ప్రవేశించగానే ఆ యువతి వ్యవహారం మరచిపోయాడు ప్రిల్.

ఓడ కలకత్తా సమీపిస్తున్నది. డైమండు హార్బరు చేరుకొన్నది ఓడ. యాత్రికులు డెక్‌మీదకు చేరుకొన్నారు. ఎదురుగా బంగాళాఖాతం ఒడ్డు వున్నది. యాత్రికులు ఓడదిగి పడవ ఎక్కారు. పెద్ద అధికారులకోసం వాళ్ళ సొంతపడవలు వచ్చాయి. ఈ గొడవలో ప్రిల్ ఎవ్వరినీ ఎరుగడు. త్వరగాదిగి కిరాయి పడవ ఎక్కి కూర్చున్నాడు. పడవ త్వరత్వరగా రణగుణధ్వనినుండి బయటపడి ప్రశాంతమైన సముద్రపునీటిని చేరుకొన్నది. దగ్గరగా యాత్రికులతో నిండిన పడవలు నడుస్తున్నాయి. సమీపంలో అడవులు వున్నాయి. అక్కడినుండి సింహాలగర్జన, నక్కలకూతలు వినబడుతున్నాయి. పడవలో దోమలకాటు ఎక్కువగా వున్నది. కలకత్తా యింకా చాలాదూరాన వున్నది. ప్రిల్ అలసిపోయి కండ్లు మూసుకొన్నాడు. కలకత్తానుగురించిన అతని ఊహలు కళ్ళముందు సాక్షాత్కరించసాగాయి. మేడలే మేడలు. వెండి బంగారాలకు నిలయం. తూర్పు దేశపు లండనన్నమాట. చీకటిపడింది. బెంగాలుప్రాంతంలో విహరించే చంద్రుడు సముద్రపునీటి కెరటాలపై తేలియాడుతూవున్నాడు. సరంగులు తమ భాషలో గొంతెత్తి పాటలు పాడుతున్నారు. వాళ్ల కంఠం ఎంతో తీయగావున్నది.

దృశ్యం మారిపోసాగింది. పడవ గార్డన్‌రీచ్ చేరుకోసాగింది. ప్రిల్ ఒడ్డుకు చేరుకొని ఒక పాలకీ ఎక్కి కూర్చున్నాడు. పాలకీ బర్దార్ బారక్‌పుర్ వైపుకు

పోగింది. బారక్‌పూర్‌లో ఇంగ్లీషువాళ్ళ యిళ్లు వున్నవి. డచ్‌దేశస్థుల సిరాంపూర్ వరకు. ఫ్రాంసుదేశస్థుల చంద్రనగర్‌వరకు ఇంగ్లీషువాళ్ళ ఇళ్లు వున్నవి. కోట సమీపంలో ప్రభుత్వభవనాలు వున్నవి. ఆలీపూర్‌లో బ్రహ్మాండమైన బెల్వేడియర్ భవనం వున్నది. అక్కడ కొద్ది సంవత్సరాలక్రితం కార్నవాలిస్ వుంటూ వుండేవాడు.

ఆరునెలతరువాత ప్రిల్ తనతండ్రికి జాబువ్రాశాడు. 'నేను యిక్కడ సెటిల్ అయిపోయినాను. భగవంతుని దయకు కృతజ్ఞుణ్ణి. నాదగ్గరవున్న బెంగాలీ గుమాస్తా అమరేష్ చక్కగా ఇంగ్లీషు మాట్లాడుతాడు. నా వరదకూడా పెరగ బోతున్నది. నేను నీలిమందువ్యాపారం యింకా ఇతరచోట్లకూడా చేయ బోతున్నాను. ఒక ముస్లిం గుమాస్తాను పెట్టుకొన్నాను. అతడు నాకు పార్సీ బెంగాలీ నేర్పుతున్నాడు. ఇక్కడ నాకు హాయిగావున్నది. సంతోషంగా జీవితం గడుపుతున్నాను' అని ఆ జాబులో పేర్కొన్నాడు.

కొద్ది సంవత్సరాలు గడిచాయి. ప్రిల్ యిప్పుడు కలకత్తాలో గొప్ప సొసైటీలో కలిసిపోయాడు. అతడి పల్లకీ మోసేవాళ్లు ఎప్పుడూ ఎర్రనిదుస్తులుధరించి టిప్ టాప్‌గా వుంటూవుంటారు. రాత్రిళ్ల నౌకర్లు కాగడాలు వెలిగించుకొని అతని పాలకీముందు పరుగెత్తుతూవుంటారు. వంటవాళ్లు, సేవకులు అతడి వంటగాలను, డ్రాయింగ్‌రూమును పరిశుభ్రంగా ఉంచుతారు. ఆఫీసులో క్లర్కు యూరోపియన్. అతనిపేరు రాల్ఫ్‌తోపెఫ్. అతడు వున్నంతసేపు ప్రిల్‌కు విశ్రాంతి వుండదు. ఆఫీసు వ్యవస్థనిమిత్తం బెంగాలీవాణ్ణి నియమించాడు. లెక్కలేనంతమంది నౌకర్లు, కాపలావాళ్లు పనిచేస్తున్నారు. ప్రిల్ ఒక్కడికోసం నలభైమందివాకా నౌకర్లు పని చేస్తున్నారు. వీళ్లుగాక మాలి, చాకలి, మంగలి వగైరాలు చాలామంది వున్నారు. అతడికి ఒకపడవ వున్నది. దాన్ని నడిపేందుకు సరంగులు వున్నారు. తెల్లని రంగుగల ఆ మేడలో స్థాపితమైన సామ్రాజ్యానికి నిరంకుశచక్రవర్తి ప్రిల్. అతడికి కోపంవస్తే నౌకర్లను చితకకొట్టిస్తాడు. అలా అనేకపర్యాయాలు చేశాడు కూడా. కేంబ్రిడ్జిలో నాలుగు అణాలుపెట్టి ఉడికిన బంగాళాదుంపలుకొని తింటూ, పుస్తకాల దుకాణాలకువెళ్ళి పుస్తకాలు తిరగవేస్తూ కవిత్వాలు వ్రాయాలని ప్రయత్నించే ఆ ప్రిల్ యీనాడు కలకత్తాలో వైభవం వెలగబెడుతున్నాడు.

ఉదయం ఏడుగంటలకు నౌకరు అతని గదితలుపులు తెరుస్తాడు. అతడి గుమాస్తాలు కాగితాలు పుచ్చుకొని శల్యూట్ చేస్తూ బెడ్‌రూమ్‌లోకి వస్తారు. మంగలి వచ్చి అతని గడ్డం చేస్తాడు. విగ్గు (కృతిమకేశావళి) తలపై అమర్చుకొని టాప్ కట్ తొడుగుకొని భోజనంగదికి బయలుదేరుతాడు. అక్కడ తేనీరు పుచ్చుకొంటాడు. వ్యాపారం విషయమై అతడిదగ్గరకు ఎవరువచ్చినాసరే అతను కూర్చున్న కర్చీముందు నిలబడవలసిందే. చూసికూడా కూర్చోమని అనడు. ఆర్డర్లువేస్తూ వుంటాడు. పదిగంటల తరువాత జనాభా పల్లకీదగ్గరకు మూగాలి. పల్లకీ ఆఫీసుకు బయలుదేరుతుంది. నాలుగుగంటలకు యింటికి తిరిగివచ్చి కలకత్తా అలవాట్లప్రకారం సాయంత్రం ఏడు ఎనిమిది గంటలవరకు నిద్రపోతాడు. ఆ తరువాత బట్టలుమార్చుకొని ముస్తాబై స్త్రీలను కలుసుకొనేందుకు బయలుదేరతాడు. రేస్‌కోర్సుకువెళ్ళి పచార్లుచేస్తూ వుంటాడు. లేక ఎక్కడికైనా డిన్నరుకు వెళుతూవుంటాడు. వ్యాపారంలో విపరీతంగా లాభాలు వస్తున్నాయి. గవర్నరు జనరల్ అతనిమీద ఎంతో దయగా వున్నారు అతనికి యింకా బాధ్యతాయుతమైన పదవినిచ్చి మరో పట్టణానికో లేక లక్నోకో పంపుతారని వదంతికూడా వ్యాప్తమైయున్నది. బాల్‌రూమ్సులో అతనితో నాట్యంచేస్తూ ధనికకుటుంబాల పెండ్లికాని యువతులు మురిసిపోతూవుంటారు. అతణ్ణి పెళ్ళిచేసికొనే అదృష్టం ఎవరికి పడుతుందోనని ఆలోచిస్తూ వుంటారు.

కాని మిస్ పెమిలానుగాని, మిస్ స్నేహలతనుగాని పెండ్లిచేసుకోకుండ అసాధారణమైన తెలివితేటలుగల ప్రిల్ ఐషే సామాన్యమైనపని చేశాడు. అంటే భారతదేశంలో వుంటూ ఆంగ్లనవాబులుచేసే ఘనకార్యం చేశాడన్నమాట. అంటే ప్రిల్ కూడా ఒక స్వదేశపుస్త్రీని తనయింట్లో వుంచుకొన్నాడన్నమాట.

ఆంగ్లనవాబులంటే ఇంగ్లండులో ఎగతాళిగావుండేది. అక్కడి జాగీర్దార్లు భారతదేశంలోవుండే తెల్లవాళ్లను చిన్నచూపు చూసేవారు. నిజానికి వీళ్లంతా ఇంగ్లండులో సామాన్యమైన వ్యాపారులు. అటువంటివాళ్లు భారతదేశంవచ్చి బాగా డబ్బు సంపాదించి భోగవిలాసాలకు లోనైపోతున్నారు. అలాంటివాళ్ళు చాలామంది వున్నారు. పాట్నా, ఢాకా, కాసింబజారు, బాలాసోర్, హుగ్లీలోని వ్యాపారస్థులు, లక్నో, వారణాసి, గ్వాలియర్, ఢిల్లీదర్బారుల్లోగల రాజకీయ సలహాదార్లు, బెంగాల్, బీహారు, ఒరిస్సా ప్రాంతాల్లో పనిచేస్తున్న కలెక్టర్లు,

అయోధ్యలో క్యాంపులు వేసిన మిలిటరీ ఆఫీసర్లు, అంతా ఫ్రిల్‌కు అనుచరులైనారు. అంతా తెల్లవాళ్ళే. వాళ్ళదృక్పథం ఏమిటో ఫ్రిల్‌కు బాగా తెలుసు. ప్లాసీ తర వంతరం లక్ష్మి భారతీయులంటే అసహ్యించుకొని వీళ్ళనువదలి తెల్లవాళ్ళయిళ్ళకు వెళ్ళిపోయింది. ఇంగ్లీషువాళ్ళ యిళ్ళలో డబ్బు కురుస్తున్నది. నీలిమందువ్యాపారం చేసుకొనే తెల్లవాళ్లు కోటీశ్వరులైపోయారు. నవాబుల్లా జీవితం గడపడం వాళ్ళ జీవితాదర్శం అయిపోయింది. భారతదేశంలోగల నవాబులు, రాజాలు, మహారాజాలు ఇంగ్లీషుదొరలతో చేతులుకలిపి కూడబలుక్కొని తామే అత్యధికమైన 'సంస్కారులం' అను కృత్రిమవాతావరణం సృష్టించారు. ఇంగ్లీషువాళ్లు చాలా మంది బెంగాలు చేరుకొన్నారు. వాళ్లు చిన్నవయస్సులో బెంగాలుకువచ్చి యిక్కడి వ్యసనాలన్నింటికీ త్వరగా లోనైపోతూ వున్నారు.

కలక్టర్లఉద్యోగం దొరికి జిల్లాలకువెళ్ళి అక్కడి జమీందార్లతోను, ధనికులతోను స్నేహంగావుంటూ కాలం గడుపుతున్నారు. ప్లాసీ తదనంతరం కంపెనీ వాళ్లు డబ్బుతీసుకొని తమదేశంవెళ్ళడం విరమించుకొని పదిమంది ఆడవాళ్లను ఉంచుకొని నవాబులుగా అయిపోదామని కలలు కనడం ప్రారంభించారు. ఫ్రిల్ కూడా సుజాతను తనకోటకు పిలిపించుకొని నియమప్రకారం నవాబు అయిపోయాడు.

నల్లని కురులు, మత్తెక్కించే కండ్లుగల సుజాత ఢాకా సమీపంలో ఒక గ్రామంలో వుంటూవుండేది. ఢాకా ఆర్థికంగా చితికిపోయినందున ఆమెతండ్రి దారిద్ర్యంతో క్రుంగిపోయాడు. సుజాతకు యింకా ఆరుగురు అప్పచెల్లెళ్ళు వున్నారు. వారిలో ముగ్గురు బాల్యంలోనే వితంతువులైనారు. ఇంకా మిగతావారికి పెండ్లిళ్ళు కాలేదు. వారికి ఒక్కసోదరుడు శ్యామచరణ్. ఎంతోకష్టంమీద కలకత్తాలో ఒక గిడ్డంగిలో అతనికి ఉద్యోగం దొరికింది. తన అక్కచెల్లెళ్ళను కలకత్తాకు పిలిపించుకొన్నాడు. ఫ్రిల్‌దొర ఆ గిడ్డంగికి యజమాని.

ఫ్రిల్‌దొరకు యింకా చిన్నతనం వదలలేదు. అయినా యీనాడు కలకత్తాలో అతనిమాటకు తిరుగులేదు. ఒకనాడు సుజాత పూజచేసికొందామని కాళికాదేవాలయం వెళుతున్నది. ఫ్రిల్‌దొర ఆమెను చూశాడు. చూసిందేతడవుగా ఆమెమీద మోజు పుట్టింది. విలాసపురుషుడుగా అప్పటికే ప్రచారంలోకి అతనిపేరు వచ్చింది. సుజాతసోదరుడు పేదతనంవలన విసుగుచెంది సిరాంపురంవెళ్ళి క్రిష్టియన్‌మతం

పుచ్చుకొంటామని అనుకొంటున్నారు. ఆరోజునే క్రిల్ దొరఉద్యోగివచ్చి దొర గారు రమ్మన్నారని చెప్పాడు. మరునటిరోజు సుజాత క్రిల్ దొరకోటకు పంపించ బడింది. ఈవిధంగా సుజాత కుటుంబదారిద్ర్యం వదలిపోయింది.

క్రిల్ దొర సుజాతను పెండ్లి చేసుకోలేదు. అయినా సుజాత అసంతృప్తిగా లేదు. దర్జాగా కోటలో వుంటున్నది. నౌకర్లమీద రాజ్యం చేస్తున్నది. ఆమెమాదిరి గానే చాలామంది పెద్దకులాల ఆడవాళ్లు ఆంగ్లేయులరాజీవాహాల్లో ఉంపుడుకత్తె లుగా వున్నారు. వాళ్ళకు పుట్టినబిడ్డలు ఇంగ్లండు వెళుతున్నారు. ఆ బిడ్డల తండ్రులు బ్రతికివున్నంతవరకు సుఖంగా వుంటున్నారు. ఆతరువాత వాళ్ల ఆలనాపాలనా అడిగేవాళ్ళు వుండటంలేదు. తాను చనిపోతే తనకు సుజాతకు పుట్టినబిడ్డలభవిష్యత్తు ఉజ్వలంగా వుండదని క్రిల్ కు తెలుసు. పెద్దవాళ్లయితే వాళ్ళకు పెద్దఉద్యోగాలు దొరకవు. క్లర్కుపోస్టులో, రెజిమెంటులో బ్యాండువాయించే వాద్యగాళ్ళ ఉద్యో గాల్లో దొరికితే దొరకవచ్చును. తనకు పుట్టేపిల్లలకు ఇంగ్లిషుస్త్రీకి ఆయాగా పని చేసేఉద్యోగం దొరకవచ్చును. లేకపోతే మిలిటరీఉద్యోగికి ఉంపుడుకత్తె కావచ్చును. అప్పుడతనికి యూరేషియన్ జాతి ఎట్టి దురదృష్టకరమైన పరిస్థితిలో వున్నదో బోధపడింది. మద్రాసులో తాను అనుభవించి వదలిపెట్టివచ్చిన మారియో పెరేజా జ్ఞాపకం వచ్చింది. లోలోన క్రుంగిపోయాడు. అయితే యిప్పుడు తాను ఏంచేయాలి? మిస్ సైంథియాను పెండ్లి చేసుకోవాలా? సుజాతవచ్చి తీయని కంఠంతో పిలిచేసరికి అంతా మరిచిపోతాడు. అతడిజీవితం దర్జాగా గడుస్తున్నది. బెంగాలు, బీహారుప్రాంతాలు అతడి కాళ్ళమీదపడి దొర్లుతున్నాయి. బెంగాలు ప్రాంతమంతా అతడు తిరుగవచ్చును. జలమార్గాలన్నీ అతనికి లోబడివున్నాయి. ధాలేశ్వరి, హరిమంగళ్, కార్నాపులీ, మధుమతి, శిబాంసురీ కెరటాలపై అతడి పడవలు నీలిమందును చేరవేస్తున్నాయి. నేతపనికి ప్రసిద్ధికెక్కిన ఢాకా పట్టణం లోని ముఘల్ పాదుషాల నవాబ్ వారంతా యీనాడు అతనిచేతుల్లోకి వచ్చింది.

ది. 8 జ్యాన్ 1768 క్రిల్ ఉలిక్కిపడ్డాడు. అతడు భారతదేశంవచ్చి సరిగా అయిదుసంవత్సరాలైనది. ఈ అయిదుసంవత్సరాలలో అతడిజీవితంలో ఎంత మార్పువచ్చిందో. నీలిమందువ్యాపారంలో పట్టిందల్లా బంగారమైనది. గుజరాత్ లో నీలిమందు వ్యాపారం దెబ్బతిన్నది. అందుకుబదులుగా 'ప్లాంటర్సు' (తోటలు వేసిన) ఆంగ్లేయులు ఢిల్లీనుండి బెంగాలువరకు విస్తరించారు. బెంగాలులోని

రైతు వారిదగ్గర అప్పుతీసుకొని నీలిమందు వాటుతున్నారు. ఇక ఆ రైతు వాళ్ళ చేతుల్లో పడుతున్న అగచాట్లు వర్ణనాతీతం.

రోజంతా నీలిమందుపొలంలో కాయకష్టంచేసిన బెంగాలుదేశపురైతు అబుల్ మంసూర్ కమాలుద్దీన్ తన క్రొత్తయజమానియగు గ్రిల్ హావర్డ్ బిష్షాను పడవలో ఎక్కించుకొని ఆవలిఒడ్డుకు తీసికొని వెళుతున్నాడు. చంద్రుడు పద్మా నదీ జలాలపై ఊగులాడుతూవున్నాడు. గాలితీవ్రత తగ్గిపోయింది. అరటితోటల్లో నక్కలకూతలు వినబడుతున్నాయి.

ఎటుచూసినా కటికచీకటి. ఆ దృశ్యం భయంకరంగా వున్నది.

# 12

ఒడ్డుమీదకువచ్చి రాధేచరణ్ లాంతరు ఎత్తిపట్టుకొని నీటివైపు చూశాడు. దూరాన్నుండి ఒకపడవ కదలాడుతూ నెమ్మదిగా రేవువైపుకువస్తూ కనబడింది. లాంతరు క్రిందపెట్టి దుప్పటికప్పుకొని మోకాళ్లు ముడుచుకొని అక్కడే కూర్చున్నాడు. దగ్గరలో మండపంవద్ద గ్రామప్రజలు గుమిగూడివున్నారు. వెదురుగడల పొదలకు దగ్గరలోనే రాధేచరణ్ గృహం వున్నది. నాలుగువైపుల భయంకరమైన నిశ్శబ్దం వ్యాపించివున్నది. రాజా శిరీశ్‌చంద్రరాయ్‌గారి మేడమీదినుండి సంగీతం అప్పుడప్పుడు వినబడుతూవున్నది. పాట్నానుండి, లక్నోనుండి వేశ్యలు పిలిపించబడ్డారు. రాజాగారికి వైస్రాయిగారు పెద్ద బిరుదుఇచ్చి గౌరవించారు. ఆ సంతోషంతో ఉత్సవం జరుపబడుతున్నది. కలకత్తానుండి తెల్లదొరలు ఆ ఉత్సవంలో పాల్గొనేందుకు వస్తున్నారు. మండపందగ్గర అంతా మౌనంగా వున్నారు.

'దాదా, ఏమైనా చెప్పు' అని అన్నారు గంజాయిగొట్టంలోగల మసిని దులుపుతూ రాధేచరణ్‌తో.

రాధేచరణ్ మౌనంగా రేవువంక చూస్తున్నాడు. వెదురుపొదల్లో గాలి రివ్వున వీస్తూవున్నది. ఇలాంటి రాత్రులయందు ఉంగరాలజుట్టుగల పత్యపీర్ పత్యవారా

యణ[1] ముఖాన చందనంబొట్టు పెట్టుకొని. చేతిలో పిల్లనగ్రోవి పుచ్చుకొని. కాషాయవస్త్రాలు ధరించి, నడుముకు కట్టుకొన్న గొలుసుల్ని గణగణలాడిస్తూ పద్మానది ఒడ్డునపోతూ కనబడుతూవుంటాడని ప్రతీతి. నాకు ఎప్పుడైనా సత్య నారాయణ కనబడితే తప్పక అడుగుతాను....అయన్ని ఏమని అడగను? రాధే చరణ్ ఆలోచన పూర్తికాలేదు.

చాలాగొలుసుల గణగణధ్వని ఒక్కసారిగా వినబడింది. రాధేచరణ్ ఆశ్చ ర్యంతో చూస్తూనిలబడ్డాడు. ఎదురూగా సత్యపీరులేదు కాని అతని అనుచరులగు కొందరు ఫకీర్లు వున్నారు. వెదురుపొదల్లోనుంచివచ్చి రాధేచరణ్ యింటివైపుక వెళ్ళారు. అతని యింటిముందు నిలబడి పిలుస్తున్నారు.

రాధేచరణ్ చిక్కుల్లో పడ్డాడు. సత్యనారాయణకు సంబంధించిన భిక్షుకులు తన ద్వారందగ్గర నిలబడివున్నారు. వాళ్ళకు యిద్దామంటే తనదగ్గర ఏమీలేదు. శతాబ్దాలనుండి యీ ఫకీర్లు పాటలుపాడుతూ వస్తూవుంటారు. హిందూస్త్రీలు శ్రద్ధతో పిండి, బియ్యం వారిచోలెల్లోవుంచి ఆశీస్సులు పొందుతూవుంటారు. గత సంవ త్సరం సుజాత భిక్ష పెడదామని బైటకువచ్చినప్పుడు 'ఈ బిడ్డ పద్మిని. గొప్ప అదృష్టవంతురాలు' అని వారంతా అన్నారు.

వాళ్ళ మాటలు విన సుజాతతల్లి బైటకువచ్చింది. ఇంట్లో కుండలన్నీ ఖాళీగా వున్నాయి. వాళ్ళకు పెడదామంటే ఏమీ లేవు. సత్య, మానిక, లక్ష్మి, చండి అందరిమీద ఆమెకు కోపంవచ్చింది. ఈ దేవతలంతా మోసగాళ్ళు - అని అంటూ చీరె చెరుగుతో కన్నీరు తుడుచుకొందామని అనుకొన్నది. ఫకీర్లవంకచూస్తూ నిలబడిపోయింది. 'సుజాత ఎక్కడ?' అని వాళ్ళలో ఒకరు ప్రశ్నించారు.

'కలకత్తాలో వున్నది' అని రాధేచరణ్ భార్య సమాధానం చెప్పింది. 'ఆమెకు పెండ్లి అయిపోయింది.' అని మెల్లగా అన్నది. సుజాత ఘోషాపోయింది. తెల్ల వాడికోటీలో వుంటున్నదని చెప్పలేదు.

'అల్లుడు ఏం చేస్తున్నాడు?'

---

1. గౌర్ దేశపు సుల్తాన్ అల్లాఉద్దీన్ హుసేన్ షాకు సూఫీ దేవత బెంగాలులోగల మహమ్మదీయులు అతణ్ణి సత్యపీర్ అని అంటారు. అక్కడి హిందువులు, విష్ణువుకు అవతారమగు సత్యనారాయణ అని అంటారు.

'కలకత్తాలో పని చేస్తున్నారు.'

'మంచిది' అంటూ ఫకీర్లు తమ ఆనందాన్ని వెల్లడించి, ఆశీర్వదించి వెనకకు తిరిగారు. వాళ్ళు ఎక్కడికివెళ్ళినా 'ఇంట్లో ఏమీ లేవు' అనేమాట ప్రతిచోట వాళ్లకు వినబడింది. ఎక్కడచూచినా కరువే.

1880 లో ఈస్ట్ ఇండియా కంపెనీవాళ్లు చేసిన భయంకరమైన దోపిడీవల్ల బెంగాల్ ప్రాంతమంతటా కరువుకాటకాదులువచ్చి 31 సంవత్సరాలు గడిచాయి. తెల్లదొరల రాజధానీనగరమగు కలకత్తాలో రోడ్లు ఆకలితో చచ్చిపోయిన మనుష్యుల శవాలతో నిండిపోయాయని యిప్పటికీ చెప్పుకొంటారు. ఇప్పుడుకూడా ప్రతిగ్రామంలోను జనం చచ్చిపోతున్నారు.

'ఆగండి. నేను ప్రఫుల్లుణ్ణి పంపించాను. ఏమైనా తెస్తాడేమో చూస్తాను.' అని అన్నది సుజాత తల్లి.

కాని ఫకీర్లు ఆగలేదు. ఖిన్నవదనాలతో ఆశీర్వదిస్తూ ముందుకు సాగిపోయారు. సుజాత తల్లి తన సోదరి కుమారుడుకోసం ఎదురుచూస్తూ కూర్చున్నది.

కాని వాడు యింటికివెళ్ళకుండా వచ్చి మండపంలో కూర్చున్నాడు. అతడి అనుచరులుకూడా ఖిన్నవదనాలతో కూర్చొనివున్నారు. మూడుకోణాలనుండి నూనె కోసం కాళ్ళు అరిగేలా తిరుగుతూవున్నాడు. బంగారంవరకంటెకూడా నూనెధర పెరిగిపోయింది. ఉప్పు చూద్దామన్నా కంటికి కనబడటంలేదు. బియ్యంగింజల్ని చూసేందుకై తహతహలాడిపోతున్నారు. పోకచెక్కలు, పొగాకు, బియ్యం, ఉప్పు మొదలగువస్తువు లన్నింటిని కంపెనీదొర చేజిక్కించుకొని కూర్చున్నారు. నదులమీద వాళ్ళపడవలు రకరకాలవస్తువుల్ని మోసుకుపోతున్నవి. కాని బజార్లో మాత్రం వస్తువులు కనబడటంలేదు. ధరలు చుక్కల్ని అంటుతున్నాయి. మండపంలో యింకా ఆయిదారుగురువచ్చి కూర్చున్నారు. మాటలు ప్రారంభమైనాయి.

'మహమూద్ దాదా, నీవుకూడా ఢాకానుండి వస్తున్నావా?' ప్రమోద్‌బాసు అడిగాడు.

'అవును. నేను, వజీరు అందరం ఢాకానుండే వస్తున్నాము. అక్కడ తిండికి ఏమీ దొరకటం లేదు. మగ్గాలన్నీ విరిగిపోయాయి. ఇక అంతా నాగళ్ళమీద బ్రతకాల్సిందే. మీ రాజాగారు యిక్కడిభూముల్ని దున్నుకోనిస్తారా?' అంటూ మహమూద్ ఉల్లాక్ చేతులుచాచి చూపించాడు. అతడి చేతివ్రేళ్ళు తెగకొట్టబడ్డాయి.

'ఏమో తెలియదు.' అని అన్నాడు ప్రమోద్. ప్రజలంతా పల్లెలకు బయలు దేరారు. పల్లెటూళ్ళలో జనసంఖ్య పెరిగిపోసాగింది. ప్రపంచంలో పారిశ్రామికంగా పేరుపొందిన భారతదేశం పరిశుద్ధమైన వ్యవసాయపుదేశంగా మార్చివేయబడింది. పంట తక్కువ. పన్నులు ఎక్కువ. ఈవిధంగా కరువుకాటకాలకు దేశం నిలయమైపోయింది.

'ఈ కళ్లు ఎన్నోఘట్టాలు చూశాయి. రాధేచరణ్ మండపందగ్గరగల జనాన్ని చూస్తూ అనుకొన్నాడు. కార్న్‌వాలిస్‌పెట్టిన చట్టంతో దేశపునడుం పూర్తిగా విరిగిపోయింది. ఇద్దరు ముగ్గురు యువకులు దగ్గరకువచ్చి కూర్చున్నారు.

'దాదా, నవాబులసమయంలోకూడా యిలాగే జరిగిందా?' అని అడిగాడు అశుతోష్.

'ఏమిటీ?' అని అన్నాడు పరధ్యానంతో రాధేచరణ్.

'ఇదే....కరువులు, ధరల పెరుగుదలలు, కొట్లాటలు....'

పొడుగుపాటి తెల్లనిగడ్డాలుగల యిద్దరు హిందూవృద్ధులు కొబ్బరికాయలు ఒలుస్తూ యువకులను ఓరగా చూశారు. వాళ్ళిద్దరూ గతంలో యుద్ధంలో పాల్గొన్నారు. ఊరంతా యిలాంటి ముసలివాళ్ళతోను, ముతకవాళ్ళతోను నిండివున్నది. వీళ్ళు ఎప్పుడూ గతాన్నిగురించి, నవాబుల ఘనతనుగురించి చెప్పిచెప్పి ఏడుస్తూ వుంటారు.

'ఆ కాలం త్వరలో రాబోతున్నది. మన ఆడవాళ్లంతా ఘోషావదలిపెట్టక తప్పదు. మనపిల్లలు వీధుల్లో ఆకలితో చచ్చిపోతారు. మన పాదుషాకిరీటం పడిపోతుంది. మహాభారతంలో యిదంతా వ్రాసివున్నది.' అంటూ ప్రారంభించాడు వృద్ధుడు ధనసింపాల్ మజుందార్.

'అరే, మహాభారతాన్ని మరిచిపో దాదా....' మండిపడుతూ అన్నాడు ప్రఫుల్లుడు. ఈ ముసలివాళ్లలో వున్నదోషం యిదే. ఎప్పుడుచూసినా పరాజుద్దౌలాను జ్ఞాపకం చేసుకొని ఏడుస్తూ వుంటారు. గడచిపోయిన రోజుల్నిగురించి ఎందుకుచెబుతావు? జరగవలసిందాన్నిగురించి యోచించు. శ్యామదా వెళ్లిన కలకత్తాకే పోదాం పదండి' అని అన్నాడు శ్యాం రాధేచరణ్ కొడుకు. ప్రిన్‌దొర గిడ్డంగిలో ఉద్యోగం చేస్తున్నాడు. 'గవర్నరుదొర సేవచేయి దాదా. సిరాజ్ రోజులు గతించాయి.' అని కూడా అన్నాడు.

రాధేచరణ్ కళ్లు యింతింతచేసుకొని చూశాడు. ఈ పిల్లవాడు ప్రపుల్లుడు మార్వాడీల మాదిరిగా మాట్లాడుతున్నాడు. ఈ రకమైన మనఃప్రవృత్తి వీడికి ఎలా వచ్చిందా? అని. మార్వాడీలంటే రాధేచరణ్‌కు అమిత అసహ్యం. మహమ్మదీయుల రాజ్యంలో ప్రభుత్వకార్యకలాపాలు సాగించిన పారసీ చదువుకొన్న శ్రేణికి చెందినవాడు రాధేచరణ్. సమాజంలో ఆ రోజుల్లో పారసీ చదువుకొన్న వారంటే గొప్ప. మిగిలిన సమయమంతా పూజాపునస్కారాల్లో గడుపుతూ వుండేవాడు. కాని ఇప్పుడు తెల్లదొరలు వచ్చినతరువాత మార్వాడీలలో క్రొత్తరకం బయలుదేరారు. వాళ్లు కంపెనీదొరలతో చేతులుకలిపి వ్యాపారం సాగిస్తూ స్థానిక అధికారులతోను, కంపెనీవాళ్లతోను షరీకై బాగా డబ్బుసంపాదిస్తున్నారు. ఇది బెంగాలులో బయలుదేరిన కొత్తరకం కోమటివాళ్లన్నమాట. జాగీర్దార్లకు, రైతులకు మధ్య బయలుదేరిన ఈ క్రొత్తరకం ధనికులు ఆంగ్లేయులకు స్నేహితులై వారికి కుడిభుజాలుగా తయారైనారు.

'గవర్నరుదొరదగ్గర నౌకరీయా?' అంటూ ధనగోపాల్ దగ్గినతరువాత ప్రారంభించాడు. లాంతరువెలుగులో కదులుతున్న అతనిగడ్డం చూసేందుకు చాలా అసహ్యంగావున్నది. 'దొరగారా, ఎవడాదొర, వాడితో మనకేంపని? మన పాదుషా ఢిల్లీలోవున్నాడు. నీ దొరగాడిబుర్రను ఢిల్లీపాదుషా నరిచేయగలడు.'

'గోపాల్ దాదా, నీ ఢిల్లీపాదుషా గుడ్డు పీకివేశారు తెలుసా?' అంటూ పకపక నవ్వాడు ప్రపుల్లుడు. 'నీ పాదుషా అధికారమంతా ముందుగానే లార్డు క్లైవుకు అప్పగించి కూర్చున్నాడు. ఇంక ఏంచేస్తాడు పిడకలుతప్ప' అంటూ వెగటుగా నవ్వాడు. ముసలివాళ్ళిద్దరూ ఏమీ మాట్లాడలేక మౌనం వహించారు. రాధేచరణ్ అందుకున్నాడు - 'ఈ కుర్రవాళ్లకు చెప్పినా లాభంలేదు. పాదుషా తన యిష్ట ప్రకారం అధికారం అప్పగించలేదని ఎలాచెప్పడం? బలవంతంగా క్లైవు లాక్కున్నాడు. ఈ దరిద్రపుదేశంలో పుట్టిన యువకులకు బెంగాలుప్రాంతంలో ఎక్కువగా పంటలుపండేచోటు యిదేనని ఎలాచెప్పడం? ఈ బెంగాలుప్రాంతమే 'ఫిర్దౌసే హింద్' 'హిందూదేశపు స్వర్గం' అను పేరుతో పిలవబడుతూవుండేది. అప్పుడు యీ దేశంలో పరాయిదేశం ఇంగ్లండులోవలె జమీందారీవిధానం వుండేదికాదు. ఆరోజుల్లో దేశంలో తయారైన వస్తువులమీద ఎగుమతి పన్నులు విధించబడేవికావు. ఇతంతా రాధేచరణ్ కళ్ళముందే జరిగింది. కొద్దిరోజుల

క్రితం ఢాకా కలెక్టరు ఇంగ్లీషువాడు స్థిరమైన ఏర్పాట్లు చేసేందుకై యిక్కడికి వచ్చినప్పుడు రాధేచరణ్‌ను పిలిపించి యిదంతా మీ మేలుకోసమే చేస్తున్నాం. మహమ్మదీయ పాదుషాలు పిచ్చిగా పరిపాలించి మిమ్మల్ని సర్వనాశనం చేశారు.' అని అన్నాడు.

'నీవుచెప్పేది అబద్ధం. మహమ్మదీయ పాదుషాల పరిపాలన సౌఖ్యవంతంగా వుండేది. నా పూర్వీకులు చాలా కాలాన్నుండి ముర్షీదాబాదులో రాజ్యపు ఏర్పాట్లు చేస్తూవున్నారు. నేను యీనాడు ముసలివాణ్ణి అయి యీ గంగానది ఒడ్డున గుడిసెలో వుంటున్నాను అంటే గతాన్నంతటినీ మరచిపోయానని అనుకోవద్దు. వెనుకటి సౌఖ్యపురోజుల్ని నేను మరచిపోలేను. నీవు చెప్పేదంతా శుద్ధ అబద్ధం.' అని బిగ్గరగా అరుస్తూ కోపంతో వణికిపోతున్న రాధేచరణ్‌ను కలెక్టరు నౌకర్లు బలవంతాన అక్కడనుండి బైటకు తీసికొనివెళ్లారు. అప్పుడు అక్కడ ఒక తెల్ల మిషనరీకూడా వున్నాడు. అతడు యాత్రావృత్తాంతం వ్రాస్తున్నాడు. రాధేచరణ్ మాటలన్నీవిని తనగ్రంథంలో 'బెంగాలులో నివసిస్తున్న హిందువులకు, మహమ్మదీయ పాదుషాలంటే అసహ్యం. మహమ్మదీయులు హిందువుల రక్తం త్రాగేందుకు సిద్ధపడుతున్నారు. ఈ దేశంలో ఐకమత్యంలేదు. నిజానికి దీన్ని ఒకదేశం అనికూడా అనడానికి వీలులేదు.' అని ఎంతో నిజాయితీతో లిపిబద్ధం చేశాడు.

రాధేచరణ్ నదిఒడ్డున గడ్డిమీద కూర్చున్నాడు. పడవ అతని ఎదురుగా వెళుతున్నది. దానిలో ఒక పొడుగుపాటి తెల్లవాడొకడు దర్జాగా కూర్చొని వున్నాడు. అతని ముఖంమీద గల పౌడరు, కత్తిపిడి వెన్నెలలో తళతళ మెరుస్తున్నాయి. మంఝీరుదాదా ఆయాసపడుతూ పడవను ముందుకు నడుపుతున్నాడు.

రాధేచరణ్ కళ్ళుమూసుకొన్నాడు. నవాబ్ అలీవర్ది చనిపోయేముందు యువకుడైన సిరాజ్‌నుపిలిచి 'తెల్లవాళ్ళు పాదుషాదేశాన్ని. వారిప్రజల ధనాన్ని కొల్లగొట్టి పంచుకొన్నారు. వాళ్లకుగల శక్తి అపారం. మన కోటను, సైన్యాన్ని వాళ్ళనుండి కాపాడు. లేకపోతే దేశం నాశనమైపోతుంది' అని చెప్పాడు. అప్పుడు 24 సంవత్సరాల వయస్సుగల సిరాజ్ ముర్షిదాబాద్‌లో వున్నాడు. తెల్లవాళ్ళు అతణ్ణి అవమానించాలనేదృష్టితో అతణ్ణి కాసింబజారులోగల వ్యాపారస్థులదగ్గరకు వెళ్ళనీయలేదు. ఆ వ్యాపారస్థులమీదగల పన్నులన్నీ అతడు రద్దుచేశాడు. నవాబు

రాజ్యాన్నుండి ఎగుమతిఅయ్యే ప్రతివస్తువుమీద తెల్లవాళ్లు పన్నులు విధించడం ప్రారంభించారు. కలకత్తా పతనమైనతరువాతకూడా షిరాజ్ తెల్లవాళ్ళ ప్రతిజ్ఞా పత్రాన్ని నమ్మి వాళ్ళను క్షమించాడు. రాధేచరణ్ తండ్రి అప్పుడు జరిగిన యుద్ధాలలో షిరాజ్‌వెంట వున్నాడు. హుగ్లీలో తెల్లవాళ్లు హత్యాకాండ జరిపినప్పుడు వాళ్ళకు షిరాజ్ 'మీరు నా ప్రజల్ని అన్యాయంగా బాధించారు. మేము క్రైస్తవులమని మీరు చెప్పుకొంటారు. ఇప్పటికైనా వ్యాపారస్థులవలె వుంటామని మీరు వ్రాసియిస్తే ఆ తప్పులన్నీ పైరెంచి గతంలో మీకుగల వసతులనన్నింటినీ సమకూరుస్తాను. యుద్ధంవల్ల నాశనమేతప్ప లాభం ఏమీ కలుగదనేభావంతో యిలా వ్రాస్తున్నాను. మీరు శాంతిగా నాతో రాజీపడతారా లేక తిరిగి ఆక్రమణకు పూనుకొంటారో తెలుపండి' అంటూ ఒక లేఖ వ్రాశాడు. 'నా ప్రజలకు మీ లైబిలుతో ఏవిధమైన సంబంధమూ లేదు. అయినా నా ప్రజలు తమ మాటమీద నిలబడి వుంటారు. మీరు దేవుడిమీద ఒట్లుపెట్టుకొంటారేగాని ఒక్కమాటను పాటించరు.' అనికూడా వ్రాశాడు.

అందుకు అడ్మిరల్ వాట్సన్ సమాధానంవ్రాస్తూ 'నీ దేశంలో నేను అంటించబోయే చిచ్చును గంగానదిలోగల నీరుకూడా ఆర్పలేదు. చిచ్చుముట్టిస్తాను. తప్పదు.' అని హెచ్చరించాడు. నిజంగా అగ్నిజ్వాలలు గంగాప్రవాహంలో ప్రతిబింబించాయి....ఇంతలో దొరగారిపడవ రేవుకు చేరుకున్నది. రాజా గిరీష్ చంద్రరాయ్, వారి అనుచరులు రేవుదగ్గర దొరవారికి స్వాగతం చెప్పేందుకై వచ్చి నిలబడివున్నారు. రాధేచరణ్ తల పైకెత్తిచూచాడు. ఆ వెలుగులో అతని కళ్ళు జిగేలుమన్నాయి. దుప్పటి కప్పుకొని మెల్లగాలేచి తన యింటివైపుకు తిరిగాడు.

## 13

ఇరవైఐదు సంవత్సరాలు గడిచిపోయాయి.

ఢాకాలోవున్న మిల్లుల్లో గుడ్డ గూటులు నివాసం ఏర్పాటుచేసికొన్నాయి. దేశమందంతటాగల ఇనుపపొయ్యిలన్నీ చల్లబడిపోయాయి. భారతదేశపు సాలెవాళ్ళ

ఎముకలు భారతదేశపు మైదానాల్లో ఎండలో మిలమిలలాడుతున్నాయి. లార్డు క్లైవుకు లండనుకంటెకూడా పెద్దదిగాను, గొప్పదిగాను కనబడిన ముర్షిదాబాద్ యిప్పుడు నిర్మానుష్యమైపోయింది. కలకత్తాపట్టణంమాత్రం పెరిగిపోసాగింది. కలకత్తానగరంలో అలీపూర్ రోడ్డుమీద ప్రిల్ హావర్డ్ ఐష్లేకొర కట్టించిన బ్రహ్మాండమైన భవంతులు వెలిశాయి. ప్రిల్ హావర్డ్ ఐష్లే ఏభై సంవత్సరాల ప్రపంచానుభవం గడించినవ్యక్తి. అరితేరినఘటం. జాన్‌కంపెనీ మూలస్తంభా లలో ఒకటి. అయోధ్యానగరం పాదుషాకు ఆప్తమిత్రుడు. తన వేటకుక్కలతో 'హలో హలో' అని అనుకుంటూ షికారుకు రోజూవలె బయలుదేరాడు. అతని వైద్యుడు 'ఆరోగ్యాన్ని జాగ్రత్తగా చూసుకోమని, శ్రమ తక్కువచేయమని, ఏవిషయాన్నిగురించీ ఎక్కువగా ఆలోచించవద్దని, మద్యం తక్కువ త్రాగమని, రోజూ నియమంగా షికారుకు పొమ్మని, లేకపోతే చనిపోతావని' చెప్పాడు. తన వైద్యుడుయిచ్చిన యీ సలహాలు వినినప్పుడు అతనికి నవ్వు వచ్చింది. ఈ వైద్యుడు నిష్ప్రయోజకుడని అతడు భావించాడు. సామాన్యంగా ధనవంతుడికి అధికారప్రాబల్యం కలవాడికి 50 ఏండ్ల వయస్సువచ్చేసరికి యిలాంటివైద్యులు అతణ్ణి వెంటాడుతూవుంటారని ఏమేమో చెబుతూవుంటారని అతను భావించాడు.

ఆ తరువాత కొంతమంది నౌకర్లు తనవైపుకు వస్తూవుండటం అతడు గ్రహించాడు. త్వరగా పెద్దదొరనను భావంతెచ్చుకొని వెళ్ళి బంగళాలో కూర్చున్నాడు. వీళ్ళు ప్రభుత్వభవనంనుంచి వచ్చారు. తనగుమాస్తాద్వారా కొన్ని కాగితాలు లక్నో రెసిడెంటుదగ్గరకు పంపాలి. బెంగాలుపరిస్థితులు సంతృప్తికరంగాలేవు. జిల్లాలోని మహమ్మదీయరైతులు అయోధ్యానగరపు కొందరు ద్రోహులైన మౌల్వీల నాయకత్వాన తలయెత్తుతున్నారు. అయోధ్య నవాబుదగ్గరకు యీ సంబంధమైన కాగితాలువెళ్లడం అవసరం. విద్రోహాల్ని అణచివేసేందుకు తాను నదియాజిల్లా వెళ్ళడం అవసరం. నదియాజిల్లానుగురించిన కాగితం చూసేసరికి అతనికి అనేక విషయాలు జ్ఞాపకం వచ్చాయి. పేర్లతోను, శబ్దాలతోను అంటిపెట్టుకొని చాలా విషయాలు వుంటాయి. ప్రతివస్తువుకు మరోవస్తువుతో సంబంధం వుంటుంది. ప్రపంచమంతా ఏదో కథ చెప్పేందుకు సిద్ధంగావున్నదా అనిపిస్తుంది. ఇక తనకథ ఎవరికి చెప్పడం ?

కాగితాలమీద సంతకాలుపెట్టి బగ్గీమీద షికారుకు బయలుదేరాడు. ఆకాశంలో మేఘాలు వ్యాప్తమైవున్నాయి. త్రోవలో కొంతమంది జనం ఒక శవాన్నితీసికొని 'హరిబోల్, హరిబోల్' అని బిగ్గరగా అరుస్తూ త్వరత్వరగా శ్మశానంవైపుకు వడివడిగా పోతున్నారు. ప్రిల్ పోతున్నవాళ్లలో ఒకణ్ణి ఆపి 'ఎవరిదీ శవం?' అని అడిగాడు.

'ఢాకాకు చెందిన రాధేచరణ్ చనిపోయాడు.'

ప్రిల్ ఉలిక్కిపడ్డాడు. రాధేచరణ్ సుజాత తండ్రి. సుజాత ఎవరు?

ప్రపంచంలో వేలాది రాధేచరణ్‌లు వుండొచ్చు. అతడు సుజాత తండ్రిని ఎప్పుడూ చూడలేదు. అప్పుడప్పుడు తన కొడుకుని కలుసుకొని వెళ్ళేందుకు వస్తూవుంటాడని, చాలా పట్టుదలగలిగిన మునలివాడని విన్నాను. ప్రిల్ టోపీ తీసి త్రోవకుప్రక్కన నిలబడ్డాడు. అతడు యీవిధంగా నిలబడటంచూచి శవాన్ని తీసికొనివెళుతున్న బెంగాలీలకు ఆశ్చర్యంకలిగింది. నోరు పారవేసుకొంటూ వుండే తెల్లవాడు యీవిధంగా తలవంచి నిలబడటం నిజంగా ఆశ్చర్యకరమే గదా?

పాపం రాధేచరణ్ కొంచెంసేపు బ్రతికి తెల్లవాడు తనకు చూపుతున్న గౌర వాన్ని చూసుకొంటే ఎంతో బాగుండివుండేదని అనుకొన్నారు జనం.

శవం ముందుకు సాగిపోయింది. శవాన్ని మోసుకుపోతున్నజనం పలికే శబ్దాలు కూడా వినబడటం లేదు. బగ్గీమోసేవారువచ్చి 'అయ్యా, ఎక్కడికి వెళ్ళమంటారు?' అని అడిగారు.

ప్రిల్‌వెళ్ళి మేనాలో కూర్చున్నాడు. 'మీ యిష్టం' అని అన్నాడు. అతడు జీవి తంలో ఎగుడుదిగుళ్ళు చాలా చూశాడు. హత్యాకాండమకూడా కండ్లారా చూశాడు. ప్రపంచంలోని ప్రతిరంగును చూశాడు. మనుష్యులు ఎందుకు బ్రతుకుతున్నారు? ఎలా చనిపోతున్నారు? ఇదంతా ఏమిటి? దీనిని ఒక కవి యిలా వర్ణించాడు.

'నది ఎంతో లోతు.
జలరాశి అపారం
బహు తీవ్రమైన ప్రవాహం
చేరాలంటే అవలి ఒడ్డుమ
ఈదుసుకోవలె ముందు నరంగును.'

సరంగు ఎక్కడ వున్నాడు? అతణ్ణి కలుసుకొనేందుకు అవకాశం ఎక్కడ వున్నది? కాని ఆత్మను పట్టుకొనితినివేసే సంతాపంఅంటే ఏమిటో కొద్ది కాలాన్నుంచి అతడికి బోధపడుతున్నది. జీవితంలో అతనికిగల ఆశలు, ఆకాంక్షలు ఎక్కువగానే నెరవేరాయి. కాని జీవితానికి తాను యిచ్చింది ఏమిటి? కంగారుపడి నాలుగువైపులా చూశాడు. అందమైన పట్టణం. అక్కడి సంపద, అక్కడి జన సంఖ్య అంతా అతనిపాదాలపై వున్నది. అతనిచేతుల్లో వున్నది. ఎటుచూసినా జనం తనవంక ముఖం చిట్లించుకొని చూస్తున్నట్లనిపించింది. బగ్గీమోస్తున్న వాళ్ళు బుజాలు మార్చుకొనేందుకై కొద్దిసేపు క్రిందికి దించారు. ఎదురుగా పోర్చుగీసువారి మద్యశాల కనబడింది. హూగ్లీకిచెందిన బ్రిటిష్, ఇటలీ నావికులు ద్వారం దగ్గర నిలబడి గొడవచేస్తున్నారు. లోపలినుండి వాయిద్యాలచప్పుడు వినబడుతున్నది. ఎవరో ఒక ఆడది తలకు వలలాంటి రుమాలు చుట్టుకొని తీక్షణంగా అతణ్ణిచూస్తూ మద్యశాలలోనికి ప్రవేశించింది.

'ఆగండి, దింపండి' అని అన్నాడు ప్రిల్. బగ్గీ క్రిందికి దింపారు. ప్రిల్ బగ్గీ దిగి త్వరత్వరగా ఆ ఆడదాన్ని వెంబడించాడు. కలకత్తాకుచెందిన యీ తక్కువ రకం యూరోపియన్ త్రాగుడుకొట్టులోకిపోతే తననుగురించి లోకులు ఏమని చెప్పుకొంటారో ననువిషయం అతడు మరిచిపోయాడు.

కౌంటరువెనుక ఒక పచ్చని యూరోపియన్ ఆరిపోయిన కండ్లతో కూర్చొని కునుకుతీస్తున్నాడు. ప్రిల్‌ను చూసేసరికి అదిరిపడిలేచి నిలబడ్డాడు. భయంతో గజగజ వణికిపోయాడు. మాటలు తడబడ్డాయి. 'సర్....సర్' అంటూ ఆగిపోయాడు.

ప్రిల్ ఏమీ అనకుండా అతణ్ణిచూస్తూ నిలబడ్డాడు. ప్రపంచంలోని త్రాగుడుకొట్ల కౌంటర్లవెనుక కూర్చొనివుండే యీ యజమానులు రహస్యంగా వుంటారు. వీళ్ళతాతే వేరు. రౌడీలు, దొంగలు, జేబుదొంగలు, దుర్మార్గులు, వేశ్యలు మొదలాగాగలవారికి సంబంధించిన విచిత్రప్రపంచం యిది.

ఇంతలో ఆ ఆడమనిషి బిగ్గరగా అరుస్తూ పైనుండి మెట్లు దిగింది. ఇద్దరు ఆంగ్లనావికులు రొదచేసుకొంటూ లోపలికి వచ్చారు. వాళ్లతోబాటు యిద్దరు చక్కని చుక్కలు వున్నారు. యూరోపియన్‌యువతులు. ఒకతె తెగ నవ్వుతున్నది బిగ్గరగా.

ఆ యువతి ముఖంమీద ప్రిల్ కళ్ళుపడ్డాయి. కంగారుపడి లేచాడు. 'ఎక్కడికి వెళుతున్నారు ప్రిల్ సాహబ్' అంటూ యిందాకటి ఆడమనిషి త్వరగావచ్చి ఆయనకు అడ్డంగా నిలబడింది. ఆమె చెవులకుగల పెద్దరింగులు కదలాడు తున్నాయి. చూడటానికి అందంగాలేదు. ద్వారందగ్గర ఆమె ప్రిల్‌వంక తదేకంగా చూస్తూ నిలబడింది. 'ప్రిల్ సాహబ్, మీ కూతుర్ని చూపివెళ్లండి. మీరు నన్ను కలకత్తా రమ్మన్నారు కదూ. 25 సంవత్సరాలనుండి మీకోసం ఎదురుచూస్తు న్నాను. నేను మీ కూతుర్ని నాలుగుసంవత్సరాల వయస్సులో ఒడిలోకి తీసుకొని మద్రాసునుండి యిక్కడికి వచ్చాను. కాని మీ నౌకర్లు ఒక్కసారికూడా మీ కోట లోనికి అడుగు పెట్టనీయలేదు. ఏంచేయను ? నేను వ్రాసిన ఒక్కజాబుకైనా మీరు సమాధానం వ్రాశారుకాదు. మా జీవితాలు ఎలా గడుస్తున్నాయో తెలుసుకొందామని అనుకొన్నారుకదూ ? చూడండి. యిలా గడుస్తున్నాయి.'

'ప్రిల్ సాహబ్, మీరు బెంగాల్ గవర్నమెంటులో పెద్ద ఆఫీసరు. నాకు కొంత డబ్బు అవసరం వచ్చేఏర్పాటు చేయండి. స్వదేశస్త్రీలమీద మీరు ఎంతోదయ కురిపించారని విన్నాను. నేను మీజాతికి చెందినదాన్ని.'

ప్రిల్‌కు ముచ్చెమటలు పోశాయి. గుండె జబ్బు వస్తుందేమోనని, అక్కడే తాను చనిపోతానేమోనని అనిపించింది. అప్పుడే ఎదురుగా ఒక గుర్రబ్బండి పోసాగింది. 'కలకత్తా క్రానికల్' అను పత్రికా విలేఖరులు కూర్చొనివున్నారు. వాళ్ళను చూసేసరికి ప్రిల్‌కు పైప్రాణాలు పైనే పోయాయి. ఈవిషయం గ్రహిం చిన అతనినౌకర్లు గబగబావచ్చి 'దొరా, మీ ఆరోగ్యం బాగాలేదు, వెళదాం పదండి' అన్నారు. ప్రిల్ వెళ్ళి మేనాలో కూర్చున్నాడు.

మారియాపెరెజా నడుంమీద చేతులుపెట్టుకొని ద్వారందగ్గర నిలబడి అతణ్ణి చూస్తూవున్నది. ఆతరువాత లోపలికి వెళ్ళిపోయింది.

'అయ్యా యింటికి వెళదామా ?' అని అడిగారు.

'ఇల్లా, ఆమె యిల్లు ఎక్కడ వున్నది ? కాదు. తోటమధ్యనవున్న బంగళాకు పద' అని అన్నాడు కోపంగా. తోటలోకి వెళ్ళినతరువాత యిక ఏంచేయాలో ఆలోచిస్తానని అన్నాడు.

బగ్గీ ముందుకు సాగింది.

'త్వరగా పదండి' అని క్రిల్ తొందరపెట్టాడు. జీవితఘట్టాలన్నీ అతని కళ్ళ ముందు తిరగసాగాయి. జీవితంలో తాను చాలారుచులు చవిచూశాడు.

ఎటుచూసినా రంగురంగుల దృశ్యాలే. ఇప్పుడు ఆదృశ్యాలంటే భయం కలుగుతున్నది. గవర్నమెంటుహౌసుకు సంబంధించిన అనుచరులు, ఫోర్టు విలియమ్ కాలేజీకిచెందిన గుమాస్తాలు, వచనరచయితలు, ఏషియాటిక్ సొసైటీకి చెందిన పరిశోధకులు, అయోధ్యనగరపు కవులు, కళాకారులు, లక్నోకుచెందిన చంపాబాయి అంతా కలిసికూడా అతని ఆత్మను పట్టుకొన్నబాధను తొలగింపలేక పోతున్నారు.

అతని ఆత్మను పట్టుకొన్నబాధలు ఏమిటి? స్త్రీలా? కాదు. స్త్రీలవ్యవహారం అతణ్ణి ఎప్పుడూ బాధించలేదు. సంతృప్తిచెందిన మనుష్యులజీవితంలో ఒకభాగం సుందరాంగనలనిమిత్తం సురక్షితంగా వుంటుంది. ప్రేమ, ఓటమి, రోమాన్సు, గృహస్థజీవితంలో హర్షవిషాదాలు అన్నీ ఆడవాళ్ళు అనే లేబిలువెనుక దాగి వుంటాయి. క్రిల్ ఐప్లే మొదట కవిగా లోకాన్ని చూశాడు. కాని యిప్పుడు ఏందు మనిషిగా చూస్తున్నాడు. అతడు ఎవరినీ ప్రేమించలేకపోయాడు - యిదే అతణ్ణి పీడిస్తున్నబాధ. తన సర్వస్వాన్ని కాళ్లమీదవుంచిన దేశాన్ని తనదిగా భావించలేక పోయాడు. అనేకసమయాల్లో తనకు సర్వమూ సమర్పించిన స్త్రీలనుసైతం ప్రేమించలేకపోయాడు. ప్రపంచాన్నుంచి చాలా పొందాడు. కాని తాను ప్రపంచానికి ఏమీ యివ్వలేకపోయాడు. ఇది నిజంగా దురదృష్టకరమైనవిషయం. ఆ రోజుల్లో మతప్రాబల్యం వుండివుంటే అతడు దేవుణ్ణి శరణుజొచ్చివుండేవాడు. కాని ప్రపంచం బుద్ధివాదం, విజ్ఞానం, భౌతికవాదంవైపుకు వెళుతున్నది. బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండుకు, చర్చి ఆఫ్ ఇంగ్లండుకంటె మహత్వం ఎక్కువైపోయింది. జీవితమంటె డబ్బు, వ్యాపారం, అధికారం, రాజ్యం ఔన్నత్యంగా మారిపోయింది ... తన గార్డెనుహౌసుకువచ్చి క్రిల్ ఆరోజు వచ్చినటహా చూసుకొన్నాడు. కొంచెంసేపు పడుకొని నిద్రపోయాడు. తరువాత ఆఫీసుకు బయలుదేరాడు. హృదయంలో బాధలు వున్నప్పటికీ కర్తవ్యం, న్యాయం, చట్టం పాలించవలసినబాధ్యతకూడా వున్నది. వ్యక్తిగతమైన సుఖాలను అవి మరిపిస్తున్నాయి. నదియాజిల్లా వెళ్ళి ఎదురుతిరిగిన రైతుల్ని అణచివేయమని కర్తవ్యం అతణ్ణి

ప్రేరేపిస్తున్నది. హృదయం లక్నో పద, ఆనందంలో మునిగిపో. దుఃఖాలు మరిచిపో' అని ఆహ్వానిస్తున్నది.

కోటు తొడుక్కొని తిరిగి బగ్గీఎక్కి కూర్చున్నాడు. తన ఆఫీసుకు బయలు దేరాడు.

# 14

బెంగాలీక్లర్కు తలయెత్తిచూచాడు. ఇప్పటివరకు అతడు ఫైళ్ళను చూస్తున్నాడు. ఉంగరాలజుట్టు అతని నుదుటిమీద పడుతున్నది. బల్లమీద ఫైళ్ళు చాలావున్నవి. బైట వరండాలో కూలీకివచ్చిన ఒరిస్సా కుర్రవాడు కూర్చొని పంఖా లాగు తున్నాడు. ఆఫీసులోకివస్తున్న గ్రిల్ నుచూచి ఆ కుర్రవాడు త్వరత్వరగా తాడు లాగడం ప్రారంభించాడు.

'గుడ్ ఆఫ్టర్నూన్ సర్' యువకుడు కుర్చీమీదనుంచిలేచి మెల్లగా అన్నాడు.

'గుడ్ ఆఫ్టర్నూన్ నీ పేరు ఏమిటి?'

'గౌతం పీలాంబర్దత్ సర్.'

'నిన్ను యింతకుపూర్వం ఎప్పుడూ చూడలేదు.'

'నేను నిన్ననే ప్రెసిడెన్సీ మేజిస్ట్రేట్ ఆఫీసునుండి ట్రాన్స్ఫర్ఆయి వచ్చాను సర్.'

'ఎప్పటినుండి పనిచేస్తున్నావు? ఇంకా పిల్లవాడిలా వున్నావు.' అని ప్రశ్నిం చాడు గ్రిల్. ఇంగ్లీషువాళ్ళు యీవిధంగా ఇండియావాళ్ళతో మాట్లాడకూడదని, రాజకీయ అధికారం చేజిక్కినప్పటినుంచి కార్న్వాలిస్ నిర్ణయించాడు. ఇంగ్లీషు వాళ్ళు పరిపాలకులు. ఇండియావాళ్ళు పాలితులు. అందువలన ఎట్టిపరిస్థితిలోను ఇండియావాళ్లను సమానస్థాయిలో చూడకూడదని పాలసీ నిర్ణయించబడింది. కాని గ్రిల్ ఓల్డ్స్కూలుకుచెందిన నవాబు. అయోధ్య రెసిడెన్సీలోవున్నప్పుడు ఇండియారంగు అతనిమీద విపరీతంగా పడింది. గాజీపూరు వెళ్ళగానే కలరా

అంటుకొని చనిపోయిన కార్నవాలిస్ జ్ఞాపకంవచ్చాడు. ఇప్పుడు అతని ఎముకలు కూడా మట్టిలో కరిగిపోయివుంటాయి. మృత్యువు జ్ఞాపకంవచ్చేసరికి అతనికి భయంవేసింది. ఒక్కక్షణంసేపు కండ్లు మూసుకొన్నాడు. తిరిగి బెంగాలీ క్లర్కు వంకచూచి 'నీవు ఎక్కడ చదువుకొన్నావు?' అని ప్రశ్నించాడు.

'సంస్కృతకాలేజి బెనారస్‌లో. కలకత్తాకాలేజీ ఎఫ్. ఏ. వరకు చదువుకొన్నాను. ఇప్పుడు బి. ఏ. పూర్తిచేయాలని అనుకొంటున్నాను.

'మంచిది. ఆఫీసు అయినతరువాతకూడా వచ్చి నన్ను కలుసుకొంటూవుండు' అని సంతోషంతో అని తనగదికి వెళ్ళిపోయాడు.

* * *

కొద్దిరోజులతరువాత ప్రిల్ నీలాంబరదత్తును తన ఆఫీసుకు పిలిపించాడు. ప్రిల్‌దొర కాన్ఫరెన్సుబల్లముందు కూర్చున్నాడు. నలుగురుదొరలు అక్కడ కూర్చొనివున్నారు.

'ప్రయాణాలు చేయడం యిష్టమేనా?'

'చిత్తం.'

'అయోధ్యకు ఎప్పుడైనా వెళ్ళావా?'

'వారణాసిదాటి వెళ్ళలేదుసార్.'

'కొన్ని అవసరమైనకాగితాలు లక్నో రెసిడెన్సీకి పంపాలి. నీతోబాటు ఆయుధపాణులగు సైనికులుకూడా కాపలాగా వుంటారు. నేను స్వయంగా వెళ్ళడానికి వీలులేదు. నేను జిల్లాల్లో పర్యటనచేయాలి. ఇంటికివెళ్ళి సామాను తీసికో. ఓడలో నీకోసం కేబిన్ బుక్‌చేయమని అఖిలేష్‌బాబుకు చెప్పు.' అంటూ ప్రిల్‌దొర ఆర్డరిచ్చాడు.

'ఎస్ సర్. థాంక్యూ సర్' నీలాంబరుడు తిరిగివచ్చాడు. దొరలు మౌనంగా ప్రిల్‌వంక చూస్తున్నారు. ఈ ఓల్డ్ ప్రిల్‌కూడా విచిత్రమైన వ్యక్తి. స్వదేశీయులంటే కఠోరంగావుంటాడు. స్నేహంగాను వుంటాడు. ఇక యీ బెంగాలీ కుర్రవాడితో బెంగాలీ కవిత్వాలనుగురించి చర్చిస్తుంటాడు అని అనుకొన్నారు ఇంగ్లీషు దొరలు.

కలకత్తానుండి వారణాసివెళ్లే ఓడ బయలుదేరలేదు. వర్షాకాలం. ముంఘీరు నుండి పాట్నావరకు గంగానది నిండిపోయి ప్రవహిస్తున్నది. గౌతం నీలాం

బిరుదు సామానంతా సర్దుకొని వర్షం ఎప్పుడు వెలుస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. మానిక్‌తల్లాలో అతనియిల్లు వున్నది. అది చాలా చిన్నది. అక్కడ అతడు ఒంటరిగా వుంటున్నాడు. సాయంకాలం అయిపోయింది. ఇంటిముంగిల ఇలకోళ్లు కూస్తున్నాయి. వీధులన్నీ వర్షపునీటితో నిండివున్నాయి. గాలి వీచడం లేదు. ఇంటిగదిలో కూర్చొని లాంతరు వెలిగించుకొని ఒక పెద్ద ఇంగ్లీషు గ్రంథం చదువుతున్నాడు. మాటిమాటికి విఘంటువు చూస్తున్నాడు. ఇంతలో అడుగుడివిని తలయెత్తిచూచాడు. నలభైఏళ్ళ ఆడమనిషి తెల్లనిచీరె కట్టుకొనివచ్చి అతనికి ఎదురుగా నిలబడింది. నీలాంబరుడు లేచినిలబడి ఆమెకు నమస్కరించాడు. 'అమ్మా, ఎందుకు వచ్చావు? ఎవర్ని కలుసుకోవాలి?' అని అడిగాడు.

'నిన్ను కలుసుకొనేందుకే వచ్చాను. నీవు ఫ్రిల్‌దొర గుమాస్తావు కదూ?'

'అవును.'

'నేను ఫ్రిల్‌దొర భార్యను.'

'ఓహో మీరా....' అన్నాడు. ఫ్రిల్‌దొర రాణివాసంలో చాలాసంవత్సరాల నుండి ఒక హిందూవనిత వుంటున్నదని, కొంతకాలాన్నుండి ఫ్రిల్ ఆమెను వదలివేశాడని అతను విన్నాడు.

'నీవంటే దొరకు చాలా యిష్టం. నాదొక పనివున్నది. నీవు లక్నో వెళుతున్నావుకదూ.'

'అవునమ్మా వెళుతున్నాను.'

'నీవు చంపాబాయి పేరు విన్నావా?'

'చంపాబాయి ఎవరు?'

'లక్నోకు సంబంధించిన పెద్దవేశ్య. లక్నో ఎప్పుడువెళ్ళినా ఫ్రిల్ ఆమెకోసం వేలాదిరూపాయలు ఖర్చుపెడుతూవుంటాడు. నన్ను అసలు యిప్పుడు ఆయన చూడటంలేదు. నాకు యీప్రపంచంలో ఎవ్వరూ లేరు. ఒక ముసలితండ్రి వుండే వాడు. ఆయనకూడా చనిపోయాడు. సోదరుడు తన వ్యాపారంలో మునిగి వున్నాడు. వదిన ఎప్పుడూ ఎత్తిపొడుస్తూవుంటుంది.' అంటూ ఒక్కపర్యాయం కళ్లలో పెల్లుబుకుతున్న కన్నీటిని తుడుచుకొన్నది - నాకు ఒక కూతురు వున్నది. పదిసంవత్సరాల వయస్సులో నా కుమార్తెను ఇంగ్లండులోనున్న తన సోదరి దగ్గరకు ఫ్రిల్ పంపించాడు. ఇంగ్లండులో కొంతకాలంవుండి మా అమ్మాయి

తిరిగివచ్చింది. కాని నన్ను గుర్తించనైనా గుర్తించలేకపోయింది. నన్ను తన తల్లి అని చెప్పుకోవడానికే సిగ్గుపడసాగింది.'

తను ఏం చెప్పాలో అతనికి తోచలేదు. దొరకు ఒక అమ్మాయివున్నదనికూడా అతనికి తెలియదు. 'మీ అమ్మాయి పేరేమిటి?'

'మార్గరెట్ అజాబిల్. నేను బేలా అని పిలుస్తుందేదాన్ని.'

'నీవు క్రిష్టియన్‌మతం పుచ్చుకొన్నావా?'

'లేదు. కాని బేలామాత్రం క్రిష్టియన్ అయిపోయింది. నా మతమంటే అస హ్యించుకొంటున్నది. దొరనుగురించిన శ్రద్ధ వదలుకోమని నీవు చంపాకు చెప్పు. లక్నో వచ్చినతరువాత నీవు నన్ను తప్పక కలుసుకో. చంపా ఏమన్నదో నాకు చెప్పు.'

'తప్పక కలుసుకొంటానమ్మా.' అని అన్నాడు గౌతం. ఆమెను పంపేందుకై వీధివరకు వచ్చాడు. 'మీ పల్లకీ ఏదీ?' అని ప్రశ్నించాడు.

'నేను నడిచే వచ్చాను. నన్నుగురించి నీవు బాధపడవద్దు' అంటూ వెళ్ళి పోయింది.

## 15

లక్నోలో రూమీ సింహద్వారం వున్నది. అక్కడ జాముప్రొద్దెక్కినతరువాత నౌబత్‌ఖానా మ్రోగుతుంది. చౌకుల్లోను, బజార్లలోను జనసందడి ప్రారంభమైంది. ధనవంతులు, అధికార్లఇళ్ళముందలి ఉద్యానవనాలు పరిశుభ్రం చేయబడు తున్నాయి. రోడ్డు కిరువైపులగల కిళ్ళీకొట్లు, తాగుడుకొట్లవాళ్ళు అలంకరణ ప్రారంభించారు. మైదానాల్లో ప్రభుత్వసైనికులు పరేడ్ చేస్తున్నారు. తిలంగాలు, గులాంగాలు, హబ్షీలు, రాజపుత్రులు తమతమ హోదాననుసరించి సైనికులు ప్రభుత్వభవనాలదగ్గర కాపలా కాస్తున్నారు. గోమతీనది ఒడ్డుదగ్గర పడవలు నిల బడివున్నవి. ఇంకా పడవలు నడిచేసమయం కాలేదు. ప్రకృతంతా పచ్చపచ్చగా వున్నది. ఆ పచ్చదనం గోమతీనదిలోకూడా ప్రతిబింబిస్తున్నది. హయాత్‌బక్ష్,

చేధీ కోఠీ, సింఘాదేవాలీకోఠీ, ఖుర్షీద్ మంజిల్ మొదలగుచోట్లు మేఘాలు క్రమ్మి వున్నవి. తోటల్లో ఊయలలు అమర్చబడివున్నవి. లక్నో శ్రావణమాసం జరుపు కొనేందుకు సిద్ధంగా వున్నది.

రెండుజాముల నౌబత్ మ్రోగింది. కార్ఖానాల్లో కార్మికులు తిండితినడంకోసం బైటకు వచ్చారు. నవాబులఇళ్ళలో భోజనానికి తివాచీలు పరచబడ్డాయి. బేగం సాహెబాలు తెరలవెనుక కూర్చొని నవాబులకోసం ఎదురుచూస్తున్నారు. దాసీలు తమలపాకుల సరంజామా తెరచి వాటిని సరిచేస్తున్నారు. బాలికలు ముగ్గులు వేస్తున్నారు.

మూడవజాము నౌబత్ మ్రోగింది. పగలు గడచిపోతున్నది. మోతీమహలు దగ్గర చినుకులు పడుతున్నాయి.

నాల్గవజాము వచ్చింది. సూర్యుడు అస్తమించసాగాడు. గాలి నలువైపుల సువాసనలు విరజిమ్ముతున్నది. వీధుల్లో నీళ్ళుకలాపి చల్లారు. జౌన్‌పూరు గులాబీల సువాసనలు, కన్నౌజ్ తీగల పూల గుబాళింపు, దేవాలయాలు విరజిమ్ముతున్న అగరుధూపం, పాదుషామహల్లో ప్రవహిస్తున్న అత్తరుప్రవాహం లక్నోపట్టణాన్ని గుబాళింపచేస్తున్నాయి. వీధుల్లోని గృహాలకిటికీలు తెరచుకొన్నాయి. సంగీతం ప్రారంభమైనది. యువతులు, తమలపాకులు అమ్మే అంగనలు జావణీలు పాడుతున్నారు. నదిఒడ్డున కూర్చొని యోగులు తాన్‌పూరా వాయిస్తున్నారు. హల్వా దుకాణాల్లో పూరీలు తయారుచేస్తున్నారు. ప్రతిమనిషి పవిలో మునిగిపోయి వున్నాడు.

'ఓ ప్రజలారా, యీ ప్రపంచం నిత్యమని పొంగిపోతున్నారు. ఎంతసుఖం మీ నొసట వ్రాసివున్నదో కదా. ఇద్దరుముగ్గురు మనుష్యులు యిక్కడ కలిసివుండటం విశేషమే. రేపు ఏమిజరుగుతుందో తెలియదు. అంతా భగవంతుని లీల. దూరంగా కూర్చొని యీ లీలను నడుపుతున్నాడు. అతడు ఎప్పుడు యీ లీలను ఆపివేస్తాడో తెలియదు.

ఓ ప్రజలారా, మీరంతా కంటికికనబడని సాలెపురుగు వలలో చిక్కుకొని వున్నారు. సాలెపురుగును మీరు గుర్తించలేరు. మీరు గుర్తించగలిగేది కంటికి కనబడితేగదా.

ఓ అమాయక ప్రజలారా,

వీధుల్లో తిరుగుతున్న జనం జీవించడమనే పద్ధతిని అలవరచుకొన్నారు. వీళ్ళంతా ఒక విశిష్టమైన సభ్యతకు సంస్కృతికి ప్రతినిధులు. పద్దెనిమిదవ శతాబ్దపు ఫ్రాంసు ప్రజలవలె వీళ్లు జీవించేకళను చరమస్థాయికి చేర్చారు. ఈ పేర్లు, యీ ఆకారాలు గొప్పవి. షుజాఉద్దౌలా, బహూబేగం, బేగం బహదూర్, టికేన్ రాయ్, అయోధ్యప్రజలు, వీళ్ళంతా గొప్పవాళ్లే. తాము దుఃఖపడరు. ఇతరులకు దుఃఖాలు కలిగించరు. వేలాది సంవత్సరాలనుండి గోమతీనదీతీరాన నివసిస్తున్నారు. శ్రీరామచంద్రుడు పరిపాలిస్తున్నప్పుడూ యీ జనం వున్నారు. షుజాఉద్దౌలా పరిపాలిస్తున్నప్పుడూ వీళ్ళేవున్నారు. ఈ రైతులే, యీ యోగులే అప్పుడూయిప్పుడూ వున్నారు. నదిఒడ్డున దిగంబరయోగి ఆసనంవేసుకొని కూర్చొనివున్నాడు. అతడు తన అనుచరులతోబాటు షుజాఉద్దౌలా సైన్యంలోచేరి బక్సర్‌దగ్గర ఇంగ్లీషువాళ్లతో యుద్ధంచేశాడు. ఇక్కడి ప్రజలు శాంతిప్రియులు. తమదేశాన్ని రక్షించుకొనేందుకై నవాబుసైనికుల హోదాలో మహారాష్ట్ర సైనికులతో పోరాటం సాగించారు.

ఇంగ్లీషువాళ్ళు షుజాఉద్దౌలా సైన్యాన్నిచూసి భయపడి మేము ముప్ఫదిఅయిదు వేలకంటే సైనికుల్ని వుంచమని రాజీపడ్డారు. కాని మాటమీద నిలబడివుండక పోవడం అలవాటుగనుక ఒడంబడికను వాళ్ళు ఉల్లంఘించారు. ఫైజాబాదు షుజాఉద్దౌలా చనిపోయేముందు ఇంగ్లీషువాళ్లను వెళ్ళగొట్టలేకపోయానని చాలా బాధపడ్డాడు. మహాదాజీ సింధియాకు తలపాగాలు మార్చుకొన్న సోదరుడుగా షుజాఉద్దౌలా పరిగణించబడేవాడు. ఈ కథలన్నీ ముఖలోపుట్టి పుద్బలోపోయేవి. ఇలాంటి కథలు అతనికాలంలో విపరీతంగా ప్రచారంలోకి వచ్చాయి. కథలు చెబుతూచెబుతూ తనుకూడా కథ అయిపోయాడు.

లక్నో నగరం అప్సరసలా మిలమిలలాడుతున్నది. వీధులు, యిళ్ళు, రోడ్లు, పేటలు, ఉద్యానవనాలు అన్నీ విందుగావున్నాయి. ఈ కోటపేరు మచ్ఛీభవనం. ఇది మాలీఖాన్ సత్రం. ఇది అసిఫ్ ఉద్దౌలాకోసం ప్రాణాలు అర్పించిన రాజా ఝూఊలాల్ వంతెన.

కొంచెం ఆగండి. అసిఫ్ ఉద్దౌలాపేరు స్మరించుకొని హిందువులు తమతమ దుకాణాలు తెరుస్తూవుండేవారు. 'మౌలా (దేవుడు) అందరికీవుండని వారందరికి అంద అసిఫ్ ఉద్దౌలా' అను లోకోక్తి ప్రచారంలోకి వచ్చింది.

అయోధ్య, వారణాసి రెండూ సంగీతాన్ని ప్రాచీనకాలాన్నుంచి రక్షిస్తూ వచ్చాయి. భైరవిరాగం యిక్కడ ప్రచలితమైనదే. వ్రేపల్లెలోని రాసక్రీడల నర్తకులు గోపికాకృష్ణుల రాసక్రీడలను ప్రదర్శిస్తూవుంటారు. బ్రాహ్మణ నర్తకులు గజ్జెలుకట్టుకొని నాట్యంచేస్తుంటారు. గత ఎనభై సంవత్సరాలనుండి యీ నాటకం ఫైజాబాదు లక్నోలలో ప్రదర్శింపబడుతూవున్నది. ఇందలి పాత్రల గొప్పతనం బైటవాళ్ళకు బోధపడదు. వీళ్లంతాకలిసి కులమతవివక్షతలేని మరోప్రపంచాన్ని సృష్టించారు. బీదలు, ధనికులు, స్త్రీలు పురుషులు, ఠాకుర్ ఇమాంబక్ష్, లాలా హుసేన్‌బక్ష్, మీర్జామేంధూ, నవాబ్‌కమ్మన్, ఇమామహన్ మహరీ, మీర్జా జంగిలీ, సుఖవచన్ వేశ్య, నవాబ్ బసంతీబేగం అంతా ఏడుస్తారు. నవ్వుతారు. పాటలు పాడుతారు, వాయిద్యాలు వాయిస్తారు. పోట్లాడుకొంటారు. పురుషత్వం యిక్కడవాళ్ళ విశేషం. మాటకోసం ప్రాణాలివ్వడం వాళ్లగొప్పతనం. కృతజ్ఞత, నమ్మకం, మంచితనం మెండు. జాగీర్దారీ విధానంలోగల చెడుకూడా వీళ్ళలో అధికం. అందుకే యిక్కడివాళ్ళు భావోద్రేకులు. అక్కడ డబ్బులు తీసికొని నాట్యంచేసే కథకులు, కాశ్మీరు విదూషకులు, జలతరంగిణి, వీణ, తబల వాయిద్యాల విశేషజ్ఞులు, కవులు, వాజపేయి బ్రాహ్మణులు, కథలుచెప్పేవాళ్లు, ముస్లిం మత ప్రధానమైన మర్సియా గాయకులు, యోధులు, పండితులు, కళావంతులు ఎక్కువ. వీరరసం, శృంగారరసం రెండూకలిసి ప్రవహిస్తూవుంటాయి. ఇదీ అక్కడి సాంఘిక జీవితం.

లక్నోకు డెబ్బదిమైళ్ళదూరాన ఫైజాబాద్ వున్నది. అయోధ్య వున్నది. దీన్ని షుజాఉద్దౌలా ఢిల్లీకి పోటీగా నిర్మించాడు. ఇక్కడ గులాబీవాడలు, దేవులు, పెద్ద పెద్ద మసీదులు వున్నాయి. ఢిల్లీలో చిన్నచిన్న ముఘలులు వున్నారు. వాళ్ళు ప్రాణరక్షణకోసం చచ్చి చెడి తిరుగుతూవున్నారు.

ఇక్కడ హిందూ ముస్లిం వైమనస్యం లేదు. పెద్దపెద్దకోటల్లో నివసించే హిందూ ఠాకూర్, మేడల్లోనివసించే నవాబులిద్దరూ జాగీర్దారీవిధానప్రకారం ఒకేసూత్రంతో బంధింపబడివుండటమే అందుకు కారణం. అక్కడి రైతులు, వాళ్లు హిందువులైనా మహమ్మదీయులైనా పరిపాలకులదృష్టిలో అంతా సమానమే. చాకిరీచేయడంలోగాని, పన్నులు చెల్లించడంలోగాని ఏమీ తారతమ్యం చూపరు.

మతసంబంధమైన వ్యవహారాలు వ్యక్తిగతమైనవిగా భావించబడేవి. మొహర్రం పండగ వచ్చినప్పుడు తగాదాలు జరగవు. మసీదులముందు మేళాలు వాయించరు. హిందువులు మహమ్మదీయులపండగల్లో పాల్గొనేవారు. మహమ్మదీయులు దీపావళి పండగ జరుపుకొనేవారు. నవాబ్ బహూబేగం ప్రతిసంవత్సరం హోలీ జరుపుకోవడంకోసం ఫైజాబాదునుండి తన కొడుకుదగ్గరకు లక్నో వస్తూవుండేది. రాజ్యమంతటా అనేకమంది హిందువులు మసీదులు కట్టించారు. ప్రిల్ బిష్షే మిత్రులు బిషప్ హైబరు, అతని అనుచరులు యీదేశంలో తిరిగి తమ యాత్రా వృత్తాంతం వ్రాస్తున్నారు. 'ఇక్కడి హిందూముస్లిములు పరస్పరం పరమ శత్రువులని, రక్తపుటేరులు ప్రవహింపచేసుకొంటున్నారని, వీళ్ళంతా ఆడివిజాతి రకమని, పూర్తిగా అజ్ఞానులని, అందువలన వెస్ట్‌మినిష్టర్‌లోగల తెల్లజాతి ప్రభుత్వం వెంటనే వీళ్ళరక్షణార్థం కల్పించుకొని త్వరగా లక్షలాది బైబిలు పుస్తకాలు, తుపాకులు ఇండియాకు పంపడం అవసరమని వ్రాశారు. ఇదీ తెల్లజాతివాళ్ళ పోకడ.

తెల్లవాళ్ళుపంపిన లక్షలాది తుపాకులు ఓడల్లో కలకత్తాకు వస్తున్నాయని పాపం లక్నోవాళ్ళకు తెలియదు. ఆగామీర్ షాహేజమన్‌కు ప్రధానమంత్రి. నగరంలో పూర్తిగా శాంతి విరాజిల్లుతూవున్నది. ఇది అదుల్ మజప్ఫర్ మెఅజుద్దీన్ షాహేజమన్ గాజీఉద్దీన్ హైదర్ రాజధాని. అంతా ఆనందంగా వున్నారు. కులాసాగా వున్నారు. సుఖంగా వున్నారు. ఇంతటిసుఖం ఎంతకాలం నిలబడి వుంటుంది?

అందం అనేది క్షణికం. శాక్యముని గౌతం సిద్ధార్థుడు వారణాసిలో మాట్లాడుతూ 'అంతా అశాశ్వతం. అంతా క్షణికం. ఈ అశాశ్వతమైనదాన్ని శాశ్వతమని భావించకండి. రక్షణపొందండి. దుఃఖాలనుండి విముక్తిపొందండి. పీడనుండి బైటపడండి.' అని చెప్పారు. రామచంద్రుని అయోధ్య. ప్రసేన్‌జిత్తుని శ్రావస్తీ. చంద్రగుప్తుని పాటలీపుత్రం. హుసేన్‌షర్కీ జౌన్‌పూర్. అల్లాఉద్దీన్ హుసేన్ గౌడ్‌లలోకూడా సౌందర్యం చరమస్థాయిని అందుకొన్నది. ఆ సౌందర్యంలోనే మృత్యువుకూడా నివసించివున్నది. ఈ యధార్థాన్ని అంతా గుర్తించాలి.

రోడ్డుమీద ఒక ధనికురాలిపల్లకీ పోతున్నది. దాసీది చంచల వెంటవరుగెత్తుతున్నది. పల్లకీలు మోసేవారంతా ఎర్రనిదుస్తులు ధరించివున్నారు. వాళ్ళ రంగు

రంగుల తలపాగాలమీద బంగారువన్నెల చేపల ఆకారాలు అమర్చబడివున్నాయి. వాళ్ళచేతుల్లో వెండిపిడులుగల కర్రలు వున్నాయి. అందరికళ్లు అందమైన ధనికురాలిమీద నిలిచివున్నాయి. ఆమె ఆ కాలం ఎంతో అందగత్తెగా ప్రసిద్ధికెక్కిన వంప. కాలం కడు విచిత్రమైనది. కాలం, అందం, మృత్యువు మూడూ కలిపే వుంటాయి.

ఉద్యానవనాల్లో జనం ఇంగ్లీషు రెసిడెంట్ పాదుషాతోబాటు విందు ఆరగిస్తూ ఏనుగులపోట్లాట చూస్తున్నారు వినోదంగా. దర్బారులో కతక్‌నృత్యం జరుగుతున్నది. మామిడితోపుల్లో మల్హార్‌రాగం పాడుతున్నారు. ఈ హంగామానుంచి విముక్తి పొందినవారి శవాలు శ్మశానరేవులో తగులపెట్టబడుతున్నాయి. పండిత ప్రకాండులగోష్ఠుల్లో చర్చలు బ్రహ్మాండంగా జరుగుతున్నాయి. త్రాగుబోతులు భంగు తయారుచేస్తున్నారు. మంజీరాలు, వీణలు, తబలాలు మార్మోగుతున్నాయి. నాట్యాలు అమోఘంగా సాగిపోతున్నాయి. గోరీలలో సమాధులు కట్టబడుతున్నాయి.

అంతా క్షణికం, అశాశ్వతం.

కాలం అస్థిరత్వంలో యిమిడివున్నది.

కాలం విభిన్నభాగాల్లో బంధించబడింది. అయినా అది క్షణక్షణం ఆ బంధనాలను ఛేదించుకొంటూ ముందుకు సాగిపోతున్నది.

ఇక రూమీ దర్వాజాదగ్గర సూర్యాస్తపు నగారా మ్రోగుతుంది. పగలు నాలుగు జాములు గడిచాయి. రాత్రి నాలుగుజాములు గడుస్తాయి. ప్రతిజాముకు ఎనిమిది గడియలు. ప్రతి ఎనిమిదిగడియలకు నగారా మ్రోగుతుంది. మానవులు గుంపులు గుంపులుగా తమతమ సమాధుల్లో దిగిపోతున్నారు. కాలమే మృత్యువు.

## 16

అసఫీయుగంలో నిర్మింపబడిన రూమీ సంహద్వారందగ్గర మ్రోగుతున్న నగారా మోత గౌతం నీలాంబరునిచెవిన పడింది. అప్పుడు అతని వాహనం నగరం

లోపలకు ప్రవేశించబోతూవున్నది. అక్కడ కాపలాకాస్తున్న సిపాయికి గుర్తు కార్డు చూపించాడు. అతడు అయోధ్య పాదుషా సిపాయి. 'ఎక్కడికి వెళతావు?' అని ప్రశ్నించాడు సిపాయి.

'రెసిడెన్సీ'

ఒక్కక్షణంసేపు శ్రద్ధగాచూచి 'తెల్లవాళ్లప్రభుత్వంతో మీకు సంబంధం వున్నదా?' అని ప్రశ్నించాడు.

'అవును వున్నది.' అంటూ కొద్దిగా సిగ్గుపడుతూ సమాధానం చెప్పాడు.

'కావచ్చు. నారుపోసినవాడు నీరుపోయాలి కదా. ప్రతివాడూ ఏదోవిధంగా బ్రతకొద్దూ' అని అన్నాడు మరో సిపాయి.

మొదటిసిపాయి ఒక పద్యంచదివి గౌతం నీలాంబరుడు తనను సమర్థిస్తాడేమోనని అతనివంక చూశాడు. చిన్నప్పుడు పారసీ చదువుకొన్నప్పటికీ సిపాయిలు వాడుతున్న ఉర్దూసాహిత్యం గౌతం నీలాంబరుడికి బోధపడలేదు. దేశంలో స్వదేశ పాదుషాకూడా రాజ్యం చేస్తూన్నాడనేవిషయం ఇప్పుడే తెలుసుకొని ఆశ్చర్యపడ్డాడు. అతని వాహనం ముందుకు సాగింది.

రోడ్డుప్రక్కన గొల్లవాళ్ళు కొందరు పనులు చేసుకొంటున్నారు. ఒక మర్రిచెట్టుక్రింద ఒక యోగి కుంపటివెలిగించి తిష్ఠవేసివున్నాడు. ఆ వెనకనే భవానీదేవి దేవళం వున్నది. తన కాళికాదేవిని పరాయిదేశంలో చూసేసరికి గౌతమునికి క్రొత్తశక్తి చేకూరింది.

రెసిడెన్సీ చేరుకొన్నాడు. దొర నవాబ్ కమాల్ రజా బహాదూర్ యింటికి విందునిమిత్తం వెళ్ళాడని తెలిపింది. అతడు వచ్చినట్లు సూచన అయోధ్య నవాబు ప్రభుత్వసమాచారశాఖకు పంపబడింది. మరో వార్తాహరుడు గోలాగంజ్‌లోనున్న నవాబ్ కమాల్ రజా బహాదుర్‌గారి హర్మ్యందగ్గరకు యీవార్త అందచేశాడు.

నవాబ్ అబుల్ మంసూర్ కమాలుద్దీన్ అలీ బహాదుర్‌ను సరత్‌గంజ్ భోజనం ముగించి కూర్చొని రెసిడెంటుతో చదరంగం ఆడుతున్నాడు. అతడు మంచి రూపసి. కంఠంకూడా మధురంగా వుంటుంది. నగరంలోనున్న వేశ్యలందరికీ అతడంటే ప్రాణం. పదహారుసంవత్సరాల వయస్సులోనే అతడికి పెండ్లి అయింది. ఇప్పటికి లెక్కలేనంతమంది ఆడవాళ్లను ముత్తా తాత్కాలికమైనపెండ్లి చేసుకొన్నాడు. ఇప్పుడు చంపమీదకు మనసు పోయింది. కలకత్తానివాసి ప్రిల్

లాగా యీ రెసిడెంటుదొరకూడా చంపకోసం నవాబుతో పోటీ పడుతున్నాడని తెలుస్తున్నది. ఈ భావాలలోపడి నవాబు చదరంగం ఆడుతుండగా ఒక బెంగాలీ బాబు కలకత్తానుండి ప్రభుత్వపత్రాలు తీసుకొనివచ్చాడని, బెలీగార్డులో దొరగారి దర్శనంకోసం ఎదురుచూస్తున్నాడని వార్త అందింది.

మంచి రసపట్టులోవున్నది వ్యవహారం. చంపాబాయి అక్కడకు రాబోతున్నది. రెడిడెంటుకు బాగా కోపంవచ్చింది. లార్డు హేం హేర్డ్సు గవర్నరుజనరల్‌గా కలకత్తా వచ్చినప్పటినుండి ప్రాణం తీస్తున్నాడు. అతడు చాలా నిక్కచ్చి మనిషి. క్రమశిక్షణకు భంగంకలిగితే సహించడు. రెండుమూడురోజులకు ఎవరో ఒకడు వార్తలు తీసికొనివస్తూవుంటాడు. దొరగారిమనస్సంతా చంపాబాయి నాట్యంలో లీనమైంది. కాని కర్తవ్యనిర్వహణను ప్రధానంగాభావించి దొర వెంటనేలేచి బెలీగార్డుకు బయలుదేరాడు.

'ఇక్కడ చంపాబాయి అను ఆమె ఎక్కడ వుంటుంది?' అని రెండోరోజున రెసిడెన్సీలో పనిచేస్తున్న ఒక గుమాస్తాను ప్రశ్నించాడు గౌతం నీలాంబరుడు. హరిశంకర్‌గుమాస్తా లోలోన చిరునవ్వు నవ్వుకొన్నాడు. ఈ బెంగాలీబాబు రసికుడులావున్నాడని అనుకొన్నాడు. 'భలే, నీవు కూర్చొని పత్రాలువ్రాసే బాబు గారివనిమాత్రమే అనుకొన్నాను. అంటే మీరు చంపాబాయిగారిదగ్గరకు దయ చేస్తారన్నమాట?' అని అన్నాడు.

'అవును, వెళతాను' అని అన్నాడు గౌతం. అతనికి భయంభయంగా వున్నది. గౌతం భయపడుతూంటే హరిశంకరుకు ఆశ్చర్యంకలిగింది. హరిశంకర్ మసలుతున్న వేశ్యకు మహత్తరమైనస్థానం లభించిన సమాజంలో. వేశ్యతో సంబంధం పెట్టుకొన్నవాడే నాగరికత కలవాడుగా గుర్తించేసమాజం అది. వెంటనే హరిశంకర్ చంపాబాయికి ప్రిల్‌దొర దగ్గరనుండి ఒక బెంగాలీబాబు వచ్చాడని, ఆమెను కలుసుకో కోరుతున్నాడని కబురు పంపాడు. రావచ్చునని వెంటనే సమాధానం పంపింది చంపాబాయి.

సాయంకాలం వట్టివేళ్ళసువాసన గాలిలో గుబాళించసాగింది. గులాబీ అత్తరు, మొగలి అత్తరులు కలిపిననీళ్ళు నగరమంతా చల్లబడ్డాయి. చౌకు రంగురంగుల దీపాలతో వెలిగిపోయింది. అప్పుడు గౌతం నీలాంబరుడి వాహనం పచ్చపచ్చగా నున్న చంపాబాయి మూడుఅంతస్తుల మేడముందు ఆగింది. సింహద్వారందగ్గర

రంగురంగులదుస్తులు ధరించిన కాపలావాళ్లు నిలబడివున్నారు. సంకోచిస్తూ గౌతం వాహనందిగి శాలువా బుజాలమీద కప్పుకొని మెట్లు ఎక్కడం ప్రారంభించాడు. గదిలో చాలామంది జనం వున్నారు. గదినిండా తెల్లని తివాచీ పరచబడివున్నది. సువాసనలు విరజిమ్ముతూ పూలగుత్తులు అక్కడక్కడ వ్రేలాడుతూ వున్నాయి. దీపాలవెలుగులు విరజిమ్ముతూ గాజుగ్లాసులు వ్రేలాడుతున్నాయి. చౌకవైపుకుగల ద్వారందగ్గర గులాబీమొక్కలు, పూవులు గోడలమీద చిత్రించబడివున్నాయి. నాలుగువైపుల ఎన్నో నిలువుటద్దాలు వున్నాయి. ఆ అద్దాలలో రకరకాల మనుష్యులఆకారాలు కనబడ్డాయి. ఆ మనుష్యుల్ని అదివరకెన్నడూ అతడు చూసియుండలేదు. వాళ్ళెవరో, ఎక్కడినుండి వచ్చారో, ఎక్కడికి వెళతారో, యీ సువాసనలు విరజిమ్మేగదిలో ఎప్పటివరకు వుంటారో తెలియదు. వాళ్ళు ధరించినదుస్తులు లక్నో ప్రత్యేకతను సూచిస్తున్నాయి. మోకాళ్ళవరకు వ్రేలాడే ఖరీదైన చొక్కాలు, పైజమాలు, కొసలుతేలిన చెమికీ టోపీలు, బుజాలనిండా కప్పుకున్న పిల్కు రుమాళ్ళు - వాళ్లు దిండ్లనానుకొని ఠీవిగా కూర్చొని, మెలమెల్లగా చర్చలు చేసుకొంటున్నారు. ఒకవైపున రాజా శివకుమార్ వఫా రచించిన ఒక పద్యంమీద చర్చలు సాగుతున్నాయి. మరోవైపున కొందరు సంగీతానికి సంబంధించిన ఒక రాగాన్నిగురించి తమతమ భావాలు వెల్లడిస్తున్నారు. గౌతం నీలాంబరుడు కొంచెంసేపు తలుపుదగ్గర సిగ్గుపడుతూ నిలబడివున్నాడు. అతడు తనదగ్గరగల అత్యంత ఖరీదైన వదులులాల్చీ ధరించివున్నాడు, తలపాగా పెట్టుకున్నాడు. అతడిదుస్తులు, రూపురేఖలుచూస్తే యితడు పరదేశి అని స్పష్టంగా అర్థమవుతుంది. ముఖ్యమైనచోట కూర్చొనియున్న నవాబ్ కమ్మన్ అతణ్ణి తనదగ్గరకు ఆహ్వానించి చోటునిచ్చి, క్షేమసమాచారాలు అడగసాగాడు.

'కలకత్తా వెళ్ళవద్దామని మనస్సు ఉవ్విళ్లూరుతూంది. కాని యా అల్లా, ప్రమాదకరమైన ప్రయాణం.' అంటూ కమ్మన్‌నవాబు గుడగుడ హుక్కాత్రాగుతూ పొగను వెళ్లగ్రక్కుతున్నాడు. అతని అందమైన ముఖంమీద దీపపుకాంతులు దాగుడుమూత లాడుతూవున్నాయి. 'బెంగాలులో పెద్దపెద్ద జమీందారులు వున్నారు కదూ. మీ జమీందారీలో ఏ యే తాలూకాలు వున్నాయో సెలవీయరూ.' అంటూ కమ్మన్ నవాబు తమలపాకులపళ్ళెం నీలాంబరునిఎదుట వుంచాడు.

'నాకు ఏ తాలూకాలు లేవు. నేను ఉద్యోగిని.'

'ఉద్యోగమా.'

గౌతం నీలాంబరుడికి మళ్ళీ విసుగు కలిగింది. 'నేను తెల్లవాళ్ళ కంపెనీలో ఉద్యోగం చేస్తున్నాను.'

'ఓహో' అంటూ నవాబ్ కమాల్ రజా ప్రక్కకు తిరిగి కూర్చున్నాడు.

'అయితే మీరు ఇంగ్లీషు చదివేవుంటారు కదూ' అని అన్నాడు మరొకడు.

'కొద్దిగా వచ్చును.'

'అంటే ఎంతవరకు? ఇంగ్లీషు ఉత్తరాలు చదవగలరా?'

నీలాంబరుడు చిరునవ్వు నవ్వాడు. 'అవును' అంటూ హాయిగా నిట్టూర్పు విడిచాడు. వీళ్ళంతా మంచిస్వభావంగలవాళ్ళు. అమాయకులు. వీళ్ళనుచూసి కంగారుపడ నవసరంలేదు. తాను వున్న ప్రపంచంలోనే వీళ్ళంతా వుంటున్నారు. అదీ విశేషం.

ఇంతలో వాయిద్యాలవాళ్ళంతా వాయిద్యాలు సరిచేసుకొన్నారు. ఒక పదిహేడు పద్దెనిమిది సంవత్సరాల వయస్సుగల వయ్యారి మెరుపులా ఆ గదిలో ప్రత్యక్షమైంది. నఖశిఖపర్యంతం ఆకర్షణీయంగావున్నది ఆమె ఆకారం. ముక్కుమీద ముత్యం తళతళలాడిపోతున్నది. ముఖమల్ పాయిజామా ధరించి, అమూల్యమైన ఆభరణాలు పెట్టుకొనివున్నది. ఎంతో అందంగావున్నది. ఒక్కపర్యాయం ఆగి వయ్యారంగా, నాజూకుగా గౌతం నీలాంబరుడికి స్వాగతం చెప్పింది. తరువాత-

'తారల జగత్తులో మునిగిపోయాడు ఆసిఫ్
తారలలోనే దర్శిస్తున్నాడు అల్లాను ఆసిఫ్'

అంటూ ఆసిఫ్ ఉద్దౌలా రచించిన గజల్ పాడటం ప్రారంభించింది. ప్రేక్షకులు మైమరచి ఆమెపాట వింటున్నారు. గౌతం నీలాంబరుడు ఆమెసౌందర్యాన్ని కళ్ళతోనే ఆస్వాదించ ప్రారంభించాడు. ఇంతటి అందాన్ని అతడు ఇంతవరకు చూసి ఎరుగడు. కలకత్తాకుచెందిన ఆ కుంఫిణీప్రభుత్వోద్యోగి లక్నోలో కనబడిన సౌందర్య జగత్తులో విహరించసాగాడు. రోజులు గడిచిపోసాగాయి. వర్షాలవలన కలకత్తాకు వెళ్ళేమార్గాలు మూతబడిపోయాయి. కృష్ణజన్మాష్టమి పండగ వచ్చింది. రేపల్లె నుండివచ్చిన నటకులు రాసలీలలు ప్రదర్శించారు. చంపాబాయి రాధగా నటించింది. ఎక్కడచూసినా చంపే చంప. మహా ఘనతవహించిన గాజీఉద్దీన్ హైదర్

దర్బారులో మధురకంఠంతో పాటలు పాడుతూంటే చంపను గౌతం నీలాంబరుడు చూశాడు. ఉత్సవాల్లో, ఉద్యానవనాల్లోకూడా ఆమెను చూశాడు. గోమతీనదిలో పడవపై చూశాడు.

సుజాతాదేవి చంపకు చెప్పమన్న విషయం గౌతం మరచిపోయాడు. పగళ్ళు ఉత్సవాలతో గడుస్తున్నాయి. రాత్రిళ్ళు కులాసాగా గడిచిపోతున్నాయి.

చంపాబాయి అక్కడి రాత్రిళ్లకు అధిష్ఠానదేవత. అందు గౌతం నీలాంబరుడికి చోటులేదు. అతనిజీవితంలో వేశ్య అను పదార్థానికి తావేలేదు. వేశ్యఅంటే అతనికి అసహ్యం. స్త్రీజన్మ మహత్తరమైనది. స్త్రీ దేవతాస్వరూపిణి. స్త్రీ వేశ్య కాకూడదు. ఇది చాలా అన్యాయం. స్త్రీ దుఃఖాలు సహించేందుకే జన్మిస్తుందని అనడం కద్దు. పురుషుణ్ణి ఆనందపరచడమే స్త్రీ జీవితలక్ష్యమని. అయినా పురుషుడు స్త్రీవిషయంలో ప్రసన్నంగావుండడని తండ్రి ఆస్థిలో భాగంపొందని స్త్రీలు పతివ్రతలని, బాలవితంతువులు, ఆవుల్లాంటి అమాయకమైన మూగజీవులగు అనాథలు, భర్తలు చనిపోగానే వాళ్ళతోబాటు సహగమనమైపోయే స్త్రీలు గొప్పవాళ్లని అంటూవుంటారు. కాని ఈ చంపను చూడండి. తాను మంటలోపడి కాలిపోకుండా యితరులను కాల్చిచంపుతూ వుంటుంది. 'స్త్రీకి స్వాతంత్ర్యం పనికిరాదు.' అని వ్రాశాడు మనువు. రామాయణంలో ఆరవకాండలో, ఆపదసమయంలోను, వివాహసమయంలోను, పూజాసమయంలోను స్త్రీ బయటికి రావచ్చునని వ్రాసివున్నది. స్త్రీ వేదాలు చదివితే అనిష్టం చుట్టుకొంటుందనికూడా వ్రాశారు.

జాగీర్దారీసమాజంలో సిగ్గువిడిచి బజారులోకివచ్చి కూర్చున్నప్పుడు స్త్రీకి స్వాతంత్ర్యం లభిస్తుంది. చంపాబాయి యిట్టిసమాజంలో పెరిగి పెద్దదైంది. గౌతముడు ఆమెస్థితిని అర్థం చేసుకోలేడు, అతడు బెంగాలులో యీమధ్యనే ఆవిర్భవించిన మధ్యమశ్రేణికి చెందినవాడు కావడమే అందుకు కారణం. ఈ మధ్యమశ్రేణి జాగీర్దారీ ఉచ్చులుత్రెంచుకొని బయటపడి క్రొత్తవిలువలను నెలకొల్పుతున్నది. సామాన్యంగా మధ్యమశ్రేణికి నైతికవిలువల్ని అమితంగా ఆరాధిస్తూవుంటుంది.

మున్షీ హరిశంకర్‌తోబాటు పడవలోకూర్చొని రమనా అనుచోట జరుగనున్న గొర్రెపొట్టేళ్ళ పోటీపందాలు చూసేందుకు వెళుతున్నాడు గౌతం నీలాంబర్.

నదిలో బంగారువన్నెగల పడవ ఒకటి ముందుకు సాగిరావడం అతడు గ్రహించాడు.

'కంపెనీఉద్యోగిగారికి నమస్కారాలు' అంటూ ఒక తీయనికంఠం విన పడింది. వెనక్కు తిరిగిచూశాడు. అది చంపాబాయి కంఠధ్వని. దగ్గరకు చేరుకొన్నది. ఆశ్చర్యంతో ఆమెవంక రెప్పవాల్చకుండా చూడసాగాడు గౌతం. ఆమె పకపక నవ్వింది.

'లక్నో రసికుల సాహచర్యం ఎక్కువగా లభించియుంటే తీయనిమాటల బాణాలు నా మీదనే ప్రయోగిస్తున్నావా మిటారీ.' అని అనివుండేవాడే. కాని అట్టి సాహచర్యం లేకపోవడంవలన గౌతం కంగారుపడ్డాడు. ఎదురుగా ఆగామీర్ చిన్నిపడవ వస్తున్నది. ఇంకా కొన్ని నగిషీపని చేయబడిన చిన్నిపడవలు త్వర త్వరగా అటే వస్తున్నాయి వాటిలో నగరంలోని ప్రధానోద్యోగులు, నవాబులు, ధనికులు నగరంలోని ప్రసిద్ధికెక్కినవేశ్యలు వున్నారు. అంతా పొట్టేళ్ళపందాలు చూసేందుకే వస్తున్నారు. ఇంతలో చంపాబాయి దగ్గరకువచ్చింది.

'మా పడవలోకి విచ్చేయండి' అని ఆహ్వానించింది చంపాబాయి.

'ఇతణ్ణికూడా ముంచుతారన్నమాట రంగులో' అంటూ ముసిముసినవ్వులు నవ్వాడు హరిశంకర్. ఆతరువాత యిద్దరూ శ్లేషగా మాటలు ప్రారంభించారు. నవ్వులమాటలతో అంతా రేవుకు చేరుకొన్నారు. ధైర్యంతెచ్చుకొని గౌతం సుజాతాదేవి తనకు అప్పగించినపని చేసితీరాలని నిర్ణయించుకొన్నాడు. చంపాబాయి పడవదిగి మెట్లెక్కడం ప్రారంభించినప్పుడు 'ప్రిల్‌దొరను ఎరుగుదువు గదూ?' అని ప్రశ్నించాడు గౌతం.

చంపాబాయి ఏమీ మాట్లాడలేదు.

'నే నడిగినప్రశ్నకు సమాధానం కావాలి' అని అన్నాడు గౌతం.

'ఆఁ ఎరుగును. దానితో నీకేం పని?'

'ఆయనభార్య కలకత్తాలో వున్నది' ఆ మాట వినేసరికి చంపాబాయి ముఖం వెలవెలబోతుందని అనుకొన్నాడు. పశ్చాత్తాపంవలన ఆమె ముఖంమీద చెమటలు పోస్తాయని ఆశించాడు. కాని అలాంటిదేమీ జరుగలేదు. 'అయితే ఏం? నన్ను కలుసుకొనేందుకువచ్చే మొగాళ్ళకందరికీ యిద్దరు ముగ్గురు, నలుగురైదుగురు పెళ్ళాలు వుంటూనేవుంటారు.' అని అన్నది నిర్లక్ష్యంగా.

'వాళ్లకు ఒక కుమార్తెకూడా వున్నది' అని అన్నాడు గట్టిగా నొక్కుతూ.

'అందరికీ ఉంటారు కూతుళ్లు. కూతుళ్లే కాదు మనుమలు, మనుమరాండ్రు కూడా వుంటారు. సరేకాని అసలు నీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పు స్వామీ!' అని అన్నది.

'ప్రిల్‌దొరతోగల సంబంధం వదులుకో. అంటే యీ పర్యాయం ప్రిల్‌దొర యిక్కడికి వచ్చినప్పుడు అతణ్ణి కలుసుకోకు. అతడు రెసిడెంటుగా యిక్కడికి వస్తోతున్నాడు.'

ఆశ్చర్యంతో చంపాబాయి ఒక్కక్షణంసేపు గౌతంవంక తదేకంగా చూచింది. 'మీరూ విచిత్రమైన మనుషులేనే. ఓహో అదా కథ. మీకూ నామీద మోజు పుట్టిం దన్నమాట.' అని అన్నది వ్యంగ్యంగా.

నీలాంబరుడికి తల తిరిగిపోయింది. ఏమిటో ఈ అర్థంలేనిమాటలు అనిపిం చింది. తిరిగి వెళ్ళిపోదామని అనుకొన్నాడు. కాని పోటీపందాలు ప్రారంభమైనాయి. చాలామంది జనం అక్కడ వున్నారు. పాదుషా మొదలుగాగల వాళ్ళంతా కుర్చీల మీద కూర్చున్నారు. బ్యాండువాయిద్యం మొదలైంది. అతడువెళ్ళి ఒకప్రక్కన నిలబడ్డాడు.

తిరిగి వచ్చేటప్పుడు కమ్మన్ నవాబు, రెసిడెంటుతోబాటు రేవుదాకా రావలసి వచ్చింది. రేవులో చంపాబాయి తన పడవమీదకు రమ్మని ఆహ్వానించింది. గౌతం చంప యిద్దరుమాత్రమే వున్నారు పడవలో. 'ఇదిగో చూడండి. ప్రిల్‌దొరను దగ్గరకు రానీయను కానీ నీవు నన్ను వదిలివెళ్ళకు. నా మనస్సుకు నచ్చావు.' అని అన్నది గోముగా అతడివంక ఓరగా చూస్తూ.

అతడు ఏమీ మాట్లాడలేదు.

చంపాబాయి మళ్ళీ ప్రారంభించింది - 'ఈనాటివరకు ఎవ్వరినీ నేను యీ విధంగా కోరియుండలేదు. నీమీద మనస్సు మళ్లింది. అహంకారీ, రోజులు గడిచి పోతాయి. వయస్సు మళ్లుతుంది. పిచ్చివాడా' అంటూ మళ్ళీ నవ్వింది. 'మాట్లాడటం కూడా చేతకాదు. నీమీద మోజుపుట్టింది. అంతా ప్రకృతివైచిత్ర్యం' అని అన్నది ముద్దుగా, నాజూకుగా. నీలాంబరుడు ఏమీ జవాబుచెప్పలేదు. ఇంతలో పడవ రేవు చేరుకొన్నది. నీలాంబరుడు పడవ దిగాడు. చంపాబాయికూడా దిగింది. ఆమె తన మేనావైపు వెళుతూ 'మా ఇంటికి వస్తావుకదూ' అంటూ అడిగింది నెమ్మదిగా.

'రామ' అంటూ త్వరత్వరగా తన పల్లకి ఎక్కాడు.

ఆ తరువాత అతనికి మూడురోజులవరకు నిద్రపట్టలేదు. ఈలోపున చంపా బాయి అనేకపర్యాయాలు అతనికి కబురుపంపింది. ఏమిటీ యీ స్త్రీ నాటకం? పెద్దపెద్ద ధనికులు, రాజులు, మహారాజులకు అలవాటుపడ్డ యీ ఆడదానిమనస్సు నా మీదకు మళ్ళడం ఏమిటి? అయినా ఆడదాన్ని అర్థంచేసికోవడం కష్టం అని అనుకొన్నాడు. ఇదంతా గ్రహించిన హరిశంకర్ 'ఆమెదగ్గరకు ఒక్కసారిపోయి రాకూడదు. ఇందులో నష్టం ఏమున్నది? ఆడది, అందులో చంపవంటిది రమ్మని స్వయంగా ఆహ్వానిస్తుంటే ఇంక ఆలోచించేదేమిటి? భగవంతుడు ఆడదాన్ని ఎందుకు సృష్టించాడంటావు? మొగవాళ్ళకోసమే గదా. మొగవాళ్ళను సంతోషపెట్ట డానికే గదా.' అని అన్నాడు. నీలాంబరుడు ఆశ్చర్యంగా అతనివంక చూశాడు. 'ఆడదంటే అంత చులకనగా మాట్లాడవద్దు. స్త్రీ బహువిచిత్రమైన వస్తువు' అని అన్నాడు గంభీరంగా.

* * *

వర్షాకాలం గడిచిపోయింది. పడవలు అలహాబాదునుండి కలకత్తాకు బయలు దేరుతున్నాయి. కాగితాలకట్టలు సర్దుకొని తిరిగి వెళ్ళిపోదామని నిర్ణయించుకొన్నాడు గౌతం. అతడు బండిమీద బయలుదేరాడు. కొంతదూరం వెళ్ళాక- 'యీ త్రోవ ఎటుపోతుంది?' అని అడిగాడు బండివాణ్ణి.

'నఖ్ఖాసుకు వెళుతుంది సర్కార్.'

'అయితే ఆ వీధికి పోనీ.'

'చిత్తం సర్కార్.'

బండి తిన్నగా చంపాబాయి యింటిముందు ఆగింది. నీలాంబరుడు మెల మెల్లగా మెట్లెక్కి పైకి వెళ్ళాడు. చంపాబాయి లోపల కూర్చొనివున్నది. నీలాం బరుణ్ణిచూసి వెలవెలబోయింది.

'ఓహో మీరు వచ్చారా?'

'లేదు, వెళుతున్నాను.'

'రెండుక్షణాలు ఆగండి. షర్బతు తెప్పిస్తాను.' అని అన్నది. అతడు సంకో చించడం గమనించి, 'పోనీ బ్రాహ్మణులకొట్టు దగ్గరలోనే వున్నది. అక్కడినుండి పదార్థాలు తెప్పిస్తాను' అని అన్నది.

'నాకు ఏమీ అక్కర్లేదు.'

'అవిషయం నాకు తెలుసు.'

'నేను చివరిసారి సెలవు తీసికొవేందుకు వచ్చాను.'

'సరే. మీయిష్టం. ఖుదాహాఫిజ్.'

నీలాంబరుడు ద్వారందగ్గర ఆగాడు.

'మా పట్టణంలో ఒక అలవాటు వున్నది. సెలవుతీసికొని దగ్గరవాళ్లు వెళుతూ వుంటే 'అల్లా చింతతప్ప యింకేచింత మీ చెంతకురాకుండా వుండుగాక' అని ఆశీర్వదించడం కద్దు. ఈవిధంగా మిమ్ము ఆశీర్వదించలేను. అల్లా చింతమాట దేవుడెరుగు. అసలు చింత అంటే ఏమిటోకూడా నీవు ఎరుగవు' అని అన్నది.

'చంపా. నీ జీవితం విలాసమయం. నన్ను త్వరలోనే మరిచిపోతావు. నాకు నీకు ఏమి సంబంధం చెప్పు? నామీదకు నీకు మనస్సు ఎందుకు మళ్లిందో తెలుసా? అందుకు కారణం ఒక్కటే. మిగతావాళ్లంతా నీ కొంగు తగిలితేనే చాలని ఎదురు చూస్తుంటారు. నేను ఆ రకం కాదు. అందుకనే నిన్ను ఆకర్షించాను. అంతే వెళ్ళి వస్తాను. సెలవు.' అని అన్నాడు గౌతం.

'ఎంత అహం? ఓహో రాజ్యసింహాసనం ఎక్కవలసినవాడివి. అందుకే వెళుతున్నట్లున్నారు.' అంటూ ఒక్కసారి నవ్వేందుకు ప్రయత్నించింది.

నలువైపుల చీకటి అలముకోసాగింది. పట్టణంలో కాగడాదీపాలు వెలిగించబడ్డాయి. క్రింద రోడ్డుమీద పెండ్లిఊరేగింపు వెళుతున్నది. ఊరేగింపులో ఒక ప్రక్కన నాట్యం జరుగుతున్నది. అలంకరించబడిన ఆ ఊరేగింపులో పెండ్లివాళ్లు బారులుతీరి నడుస్తున్నారు. మందుగుండుసామగ్రి విస్తారంగా కాలుస్తున్నారు. వాయిద్యాలు బ్రహ్మాండంగా మ్రోగుతున్నాయి. కాగడాలవెలుగు చంపాబాయి మేడమీద బాల్కనీమీద పడింది. ఆ వెలుగులో చంపాబాయి ధరించిన జరీఅంచు చీరెచెంగు రెపరెప లాడసాగింది. క్రిందనుండి పెండ్లిపాటలు వినబడుతున్నాయి. చంప కిటికీదగ్గరకువచ్చి తొంగిచూడసాగింది. ప్రక్కనే నిలబడివున్నాడు గౌతం. 'ఈ పెండ్లిఊరేగింపు ఏ అదృష్టవంతురాలిదో.' అని అన్నది. నీలాంబరుడు ఆమె ముఖంవంక చూశాడు. 'ఆ పెండ్లికూతురుపాపిట్లో సిందూరం వుంటుంది. పాదాలకు గోరింటాకు. ముక్కుకు బదోతవాన్ని చూపించే వజ్రంపొదిగిన బులాకీ

వుంటుంది.' అంటూ మెల్లగా తనపాపిటను వ్రేళ్ళతో తడిమింది. ఆమె పాపిట్లో పాపిట చేరువున్నది. సిందూరం లేదు.

'ఓహో, మళ్లీ చంప నాటకం ప్రారంభించింది' అని అనుకొన్నాడు నీలాం బరుడు.

'మొదటినుండి స్త్రీ పురుషులమధ్య సాగుతున్నదేగదా యీ రగడ' అని అను కొన్నాడు.

'రేపు తెల్లవారేసరికి లక్నోపట్టణంవదలి చాలాదూరం వెళ్లిపోతారు గదూ' అని ప్రశ్నించింది.

'అవును.'

'తెలతెలవారగనే ప్రియుడు కంటికి కనబడడోయీ
దయచూపుమోయి దేవా తెలవారనీయకుమోయీ.'

అనుపాట క్రిందినుండి వినబడుతున్నది. ఆ పాట వింటున్నారు కదూ. అంటూ చంప నీలాంబరునివంక చూసింది ఆప్యాయంగా.

నీలాంబరుడు కిటికీలోనుంచి క్రిందికి చూశాడు. పట్టణమంతా ఏదో ఉత్సవంలో పాల్గొనేందుకు బయలుదేరిన ట్లున్నది. వీధుల్లో మీసాలుత్రిప్పుకొంటూ తిరుగు తున్నారు జనం. రకారకాల ఆడవాళ్లు నడచివెళుతున్నారు. అంతా సంతోషంగా వున్నారు. ఓహో యీ ప్రపంచాన్నే కాబోలు భర్తృహరి రంగభూమి అని అన్నాడు. ఈ రంగభూమిమీద నిరర్థకమైన మరోనాటకం ఆడబడుతున్నది. చీకటి పడుతున్నది. క్రింద బండివిలబడి తనకోసం ఎదురుచూస్తున్నది. ఇంతలో నీలాంబరునిమనస్సు తేరుకొన్నది. 'వెళ్లు, త్వరగా వెళ్లు. కలకత్తా చాలాదూరం. నీవు వుండవలసింది అక్కడ. ఇక్కడ కాదు. తడబడుతున్నావు. కాలు జారకు. జాగ్రత్త' అంటూ అతనిమనస్సు తొందరపెట్టింది.

త్వరత్వరగా కాగితాలకట్ట పుచ్చుకొని మెట్లు దిగాడు. వెనక్కుతిరిగైనా చూడ లేదు. గబగబావెళ్ళి బండిలో కూర్చున్నాడు. బండి బయలుదేరింది. జనంమధ్య త్రోవచేసుకొంటూ బండి తోలుతున్నాడు బండివాడు. కొద్దిసేపటికి బండి నాకా దగ్గరకు చేరుకొన్నది. నేరేడుచెట్లుక్రింద కొంతమంది బైరాగులు కూర్చొని వున్నారు. అంబా భవాని మఠంముందు కుంపటి వెలుగుతున్నది. నీలాంబరుడు బండిదిగి భవానీవిగ్రహం దగ్గరకువెళ్ళి విగ్రహాన్ని తేరిపార చూశాడు. కాళికా

రూపంతో అమ్మవారిని నీలాంబరుడు ఎరుగును. ఇప్పుడు అమ్మవారు యోగ మాయరూపంలోకూడా దర్శనం యిచ్చింది. 'అమ్మా, నేను నీ యీ లీలనుకూడా చూశాను. ఇక తిరిగి వెళ్ళిపోతున్నాను. ఓ శ క్తిస్వరూపిణీ, యిలాగే నన్ను రక్షించు తల్లీ.' అని లోలోనే అంటూ చేతులు జోడించాడు.

మొదటిరోజున తనతో మాట్లాడిన యోగి 'త్వరగా వెళ్ళిపోతున్నావేం ?' అని ప్రశ్నించాడు.

'మృగజలందగ్గర ఎక్కువసేపు వుండటం మంచిదికాదు కనుక. మృగతృష్ణతో నిండిన నగరం యిది' అంటూ లక్నోనగరాన్ని ఉద్దేశించి నీలాంబరుడు అన్నాడు.

బైరాగి అతణ్ణి శ్రద్ధగా చూశాడు. 'మృగతృష్ణా-స్వరూపం యింత తేలిగ్గా బోధపడదు నాయనా' అని అన్నాడు.

'బాబా, యోగమాయ తన పదిచేతులతోను నన్ను తనవైపుకు లాగాలని చూసింది. కాని చూశావా తప్పించుకొని సురక్షితంగా బయటపడ్డాను.

'మనలో సురక్షితంగా వుండగలవాడు ఎవ్వడూలేదు. మనమంతా కుమ్మరివాడి కుండలం. పగిలిపోతూనేవుంటాయి. అందువల్ల గట్టిగా వున్నానని గర్వపడకు' అంటూ కొద్దిగా మట్టి చేతితోపట్టుకొని వాసన చూశాడు. ఇది ఎంత సువాసనగా వున్నదో చూడు. ఆ మట్టిని పట్టుకువెళ్లు. కటక్‌లో యోగమాయదేవళం వున్నది. ఈ మట్టిని అక్కడ సమర్పించు.' అని అన్నాడు బైరాగి. కాని నీలాంబరుడు మట్టి తీసికోవడానికి కొంచెం సంకోచపడ్డాడు.

'తీసుకో నాయనా, ఇది లక్నోమట్టి. దీన్ని నీ వెంట తీసుకొనివెళ్లు. వదలి వెళ్లినతరువాత యీ పట్టణమంతా మరింతజ్ఞాపకం వస్తూవుంటుంది. అదీ యీ పట్టణం మహిమ.'

బైరాగి పరిశుద్ధమైనభాష మాట్లాడుతున్నాడు.

'బాబా, నీవు బైరాగిగా ఎందుకు మారిపోయావు ?'

'నన్ను ఎరుగుదువా ?'

'లేదు నేను ఎవ్వరినీ ఎరుగను.'

'అవును, చాలా కష్టం. అసలు తెలుసుకున్నవాడిని తెలుసుకోగలిగినవా డెవండు ?' ఈమాటను ఉపనిషత్తుల్లో చదివాడు నీలాంబరుడు. బైరాగి బాగా చదువరిలా వున్నాడు. 'బాబా నీ వెవరో చెప్పవూ ?'

'ఏం తెల్లవారి గూఢచారివా?'

'ఛా ఛా. నేను ఎవ్వరి గూఢచారినీ కాదు.'

'నీవు చెప్పేది నిజమేనా?'

'ముమ్మాటికీ నిజం.'

'అయితే విను. నేను రాజా బేనీ బహాదుర్ కొడుకును. రాజా బేనీ బహాదుర్ పేరు వినలేదూ? అతడు మీర్జా జలాలుద్దీన్ హైదర్ నవాబ్ షుజాఉద్దౌలాదగ్గర పెద్ద ఉద్యోగి. అతడు అయోధ్యనవాబు జనాబే అలీతోను, బెంగాల్ నవాబు అలీ జాహ్‌తోను కలిపి మీ తెల్లవారితో భయంకరమైనయుద్ధం చేసినవాడు మా తండ్రి. గంగానదికి ఒకవైపున మా తండ్రి, బెనారస్ రాజా బలవంతసింగు, గుసాయీ హిమ్మత్ బహాదుర్, రోహిలాలు వున్నారు. రెండోవైపున తెల్లవాళ్ళపటాలం వున్నది. తెల్లవాళ్ళు మా నాన్నగారిమీద అకస్మాత్తుగా దాడిచేశారు. గుండ్లవర్షం కురిపించారు. మా నాన్నగారి సైనికులు అదిరిపోయారు. మా తండ్రి అశ్వారూఢుడై 'ఓ దౌర్భాగ్యుల్లారా, ఎక్కడికి పారిపోతున్నారు?' అంటూ అశ్వారూఢుడై అరవడం ప్రారంభించాడు. మొఘలులవంశంలో పుట్టి వెన్నిచ్చి పారిపోతారా అంటూ జనాబే అలీ అరవసాగాడు. అయినా లక్ష్యంచేయక మా సైనికులు దుర్గావతీనదిని దాటి పారిపోయారు. వేలాదిమంది నదిలో మునిగి చనిపోయారు. భారతదేశం దెబ్బ తినిపోయింది.' అంటూ ఉద్రేకంతో వణికిపోయాడు. 'ఆతరువాత మీ తెల్లవాళ్లు ఏం చేశారో తెలుసా? మనలో మనకు తగాదాపెట్టి విభజించడం ప్రారంభించారు. జనాబే అలీకి అలీజాహ్‌కు వైరం పెట్టారు. మనదేశంలో ఐకమత్యం దెబ్బ తిన్నది. ఒకరిమీద మరొకరు చాడీలు చెప్పుకోవడం ప్రారంభించారు. ఎవడికి వాడు కలకత్తాకువెళ్ళి ఇంగ్లీషువాళ్లతో లాలూచీ పడసాగారు. దానితో ఒకరిమీద ఒకరికి విశ్వాసంలేకుండా పోయింది. మా తండ్రి జనాబే అలీకి విశ్వాసపాత్రుడు. శత్రువులమాటలు నమ్మి మా తండ్రిని జనాబే అలీ నమ్మకద్రోహి అని భావించి హతమార్చాలని చూచాడు.

'ఒకనాడు జనాబే అలీ మా తండ్రితోపాటు భోజనంచేసి రాజా, మనిద్దరం వేటకు వెళదాం పద.' అని అన్నాడు. నేను మీ ఉద్యోగిని. ఇప్పటికి చాలా పర్యాయాలు వేటాడాను. ఇప్పుడు ఉత్సాహంగాలేదని మా తండ్రి చెప్పాడు. కాని జనాబే అలీ వినిపించుకోక మా తండ్రిని తనవాహనంలో కూర్చోబెట్టుకొని తన డేరాకు

బయలుదేరాడు. మా నాన్నకు విషయం బోధపడింది. అయినా ఏం చేయగలడు? జనాబే అలీని నమ్మి అతని గుడారానికి వెళ్ళాడు. అక్కడ ఏంచేశాడో తెలుసా? తనను నమ్మిన మా తండ్రి రెండుకళ్ళను ఎర్రగాకాల్చిన ఇనుపకడ్డీంతో కాల్చి వేయించాడు. మా తండ్రి రాజ్యాన్ని జప్తు చేయించాడు. పదమూడువందల అశ్వ దళం, పద్దెనిమిది ఏనుగులు, ఫిరంగులదళం, ఒక పెద్ద జమీందారీ మా తండ్రి ఆధీనంలో ఉండేది. అంతా పోయింది.'

'ఇప్పుడు నేను యీ మృగచర్మానికిమాత్రమే అధిపతిని.'

నీలాంబరుడు కదలకుండాకూర్చొని కథంతా విన్నాడు. బైరాగి మళ్ళీ ప్రారం భించాడు-'మృగ మరీచిక అంటే ఏమిటో నాకు బాగా తెలుసు. నీవు తెలుసుకో లేవు. నీవు దానిగొడవలో పడ్డావు. పడతావుకూడా. రాజ్యాలు లేచినా, కూలి పోయినా, కంపెనీవాళ్ళు సంతోషించినా, సంతోషించకపోయినా, పాదుషా కోపిం చినా, కోపించకపోయినా నాకు లెక్కలేదు. నా తండ్రిని అన్యాయంగా గ్రుడ్డివాణ్ణి చేశారు. భగవంతుడుతప్ప నన్ను ఎవరు గ్రుడ్డివాణ్ణిగా చేయగలరో చెప్పు? ఇక వెళ్లు. ఆలశ్యం అవుతున్నది. యోగమాయదేవళంలోకి వెళ్లు. లోపల నాలుగు వైపుల ద్వారాలు, లెక్కలేనన్ని తలుపులు వున్నాయి. ఒక ద్వారంతరువాత మరొక ద్వారం తెరుచుకుంటుంది. ఈ దాగుడుమూతలవ్యవహారం అంతటా నెలకొని వున్నది. వాటినుండి తప్పించుకోవడం సాధ్యంకాదు. నీవు యీ దాగుడుమూతల నుండి తప్పించుకొన్నానని అనుకొంటున్నావు. నీవు అనుకొంటున్నది సరికాదు. ఇక వెళ్లు.'

నీలాంబరుడు లేచాడు. వంగి బైరాగి కాళ్లదగ్గరగల మట్టి తీసికొన్నాడు. త్వరగావెళ్ళి బండిఎక్కి కూర్చున్నాడు. బండివాడు సీతాపూర్‌వైపుకు బండిని పోనిచ్చాడు. వంతెనదగ్గరికివచ్చి బండి ఆగిపోయింది. బండివాడు క్రిందకు దిగాడు. ఎదురుగా ఒక తెల్లమిలటరీదొర గుర్రందిగి త్రోవనపోతున్న ఒక ప్రయాణీకుణ్ణి కొరడాలతో కొట్టడం ప్రారంభించాడు. వాడు నోటికివచ్చినట్లు తిడుతున్నాడు కూడా.

చావబాది ఇంగ్లీషువాడు గుర్రంఎక్కి చీకట్లో మాయమైనాడు.

'చచ్చువెధవలు. మన సొమ్ముతింటూ మనల్నే కొడుతున్నారు.' అని కోపంతో అన్నాడు. గంగాదీన్ అను పేరుగల ఆ బండివాడు. జమన్‌పాదుషాకాలంలోకూడా

యింత అన్యాయమా? అంటున్నాడు. నీలాంబరుడు ఆలోచనలో పడిపోయాడు. ఆ రాత్రి రాజా పిక్తైల్ రాయ్ కట్టించిన ధర్మసత్రంలో ఆగాడు. నీలాంబరునితో బండినుండి దిగిన రెపిడెప్సీ సిపాయి, నౌకర్లనుచూచి ధర్మసత్రంలో అంతా గుసగుసలు ప్రారంభించారు. 'ఇతడు బెంగాలీబాబు. కలకత్తా వెళుతున్నాడు. ఇంగ్లీషు వచ్చును. మనపన్నులు కంపెనీవాళ్లు ఎప్పుడు తగ్గిస్తారో యితణ్ణి అడిగితే తెలుస్తుంది. కొత్తచట్టాలు లండనులో తయారయి మనదేశంలో అమలుపరచబడతాయని వింటున్నాం. ఓ బాబూ, పన్నులు తగ్గేలాచూడండి. మా నడుములు విరిగిపోతున్నాయి' అంటూ జనం నీలాంబరుణ్ణి చుట్టూ మూగారు. అంతా రైతులు. అంతా తమతమ కేసులు, ఫిర్యాదులనిమిత్తం రాజధానికి వచ్చారు. ఒక ముసలి హిందూ జమీందారు చేతికర్రసాయంతో నీలాంబరుడిదగ్గరకు వచ్చారు.

'ఎక్కడినుండి వచ్చావు?' అని ప్రశ్నించాడు.

'బెంగాలునుండి'.

'అయితే మాకు అతిథివన్నమాట. మా ఊరికి రా. ఆతిథ్యమిస్తాను. ఇక్కడకు మా ఊరు ఒక కోసుదూరాన వున్నది'.

నీలాంబరుడికి ఏడుపు వచ్చినంతపని అయింది. వీళ్లంతా ఎంతో అమాయకులు, ఇటువంటివాళ్ళనువదలి, అయోధ్యనువదలి వెళుతున్నందుకు అతనికి బాధ కలిగింది.

'తమ్ముడూ, మమ్మల్ని ఎక్కువగా బాధించవద్దని మీ తెల్లప్రభుత్వంవాళ్ళకి చెప్పు'. అని అటు యిటూ చూసి మెల్లగా అన్నాడు.

నీలాంబరుడు ఏమీ మాట్లాడలేదు.

'లక్నోనుండి వస్తున్నావా?'

'అవును.'

'అక్కడ మా పాదుషాను కలుసుకొన్నావా?'

'ఆ, కలుసుకొన్నాను.'

'డబ్బుకోసం కంపెనీవాళ్లు మా పాదుషాను విపరీతంగా బాధిస్తున్నారు.'

'తెలియదు.'

'బెంగాలీబాబూ, సరిగా సమాధానం చెప్పవేమయ్యా. నీకంతా తెలుసు. కంపెనీ వాళ్లు మొదటచేసిన వాగ్దానాలన్నింటినీ ఉల్లంఘించారు. బక్సర్‌లో జరిగిన యుద్ధంలో ఓడిపోయిన తరువాత జనాబే ఆలీవి ఏం చేశారో తెలుసా?'

బక్సర్. జనాబే ఆలీ కథ మళ్ళీ మొదలైందన్నమాట. నీలాంబరునికి విసుగ్గా వున్నది. 'మీకు యీ కథంటే యిష్టంవున్నట్లు లేదు. కాని యీ గాయాలు మా గుండెలకు తగిలాయి. మా దేశాన్ని కంపెనీవాళ్లు మట్టిలో కలిపివేశారు. బక్సర్‌లో ఓడిపోయిన తరువాత జనాబే ఆలీతో 35 వేలమంది సైనికుల్ని మాత్రమే వుంచుతామని వ్రాతకోతలు జరుపుకొన్నారు. ఇప్పుడు చూడండి దేశంలో ఎక్కడచూసినా తెల్లవాళ్ళే. కలకత్తాకు చెందిన అసఫ్ ఉద్దౌలా వైకుంఠవాసి ఏమనివ్రాశాడో తెలుసునా?' 'ఇంగ్లీషువాళ్ళు దేశంలోవున్న సొమ్మంతా తినివేశారు. ఇంట్లోని వాళ్ళకు తిండి మిగలకుండాపోయింది. పొలాలు పాడుబడ్డాయి. ఈ విధంగా ఎన్నాళ్ళు గొంతుకోస్తారు? ఫలితం ఏమయింది? మేం దరిద్రులమైపోయాం తమ్ముడూ. మేము చాలా బాధపడుతున్నాం. తెల్లవాళ్లతో మావాళ్ళు యుద్ధాలు చేశారు. కాని లాభంలేకపోయింది. ఇప్పుడు కంపెనీవాళ్లకు చెల్లించేందుకు మా దగ్గర కాణీకూడా లేదు.' అని ముసలిజమీందారు మౌనం వహించాడు.

దీపంవెలుగు గాలిలో అటూయిటూ కదులుతూ వున్నది. నీలాంబరుడు గోడ నానుకొని కూర్చున్నాడు.

## 17

కలకత్తా వచ్చినప్పటినుండి గౌతం తనపనుల్లో మునిగిపోయాడు. సుజాతాదేవిని కలుసుకోవాలని అతడు ధరంతల్లా వెళ్లాడు. అక్కడ ఆమె చనిపోయిందనువార్త విని చాలా బాధపడ్డాడు. వర్షపురోజుల్లో పూజచేసేనిమిత్తం ఆమె కాళీఘాట్ వెళుతూవుండగా పాముకరచి చనిపోయిందని. అప్పుడు ప్రిన్‌దొర పర్యటనలో వున్నాడనికూడా తెలిపింది.

నీలాంబరుడు తనయింటికి తిరిగివచ్చి పుస్తకాలుతీసి కూర్చున్నాడు. ఆ ఉద్యోగమంటే అతనికి విసుగుపుట్టింది. మానక్‌తల్లాలో అతని యింటికి కొద్ది దూరాన ఒక పెద్ద అందమైన తోటయిల్లు వున్నది. అక్కడ చాలామంది యువకులు సమావేశమవుతూవుంటారు. అది రామమోహన్‌రాయ్ నివాసగృహం.

ఒకరోజున తన స్నేహితులతో కలిసివెళ్ళి రామమోహన్‌రాయ్ ఉపన్యాసం విన్నాడు. అప్పుడు అతని మనస్సులోగల అనుమానాలు యింకా పెరిగిపోయాయి. కాళీమాటుకు వెళ్లడం విరమించుకొన్నాడు. ఇంట్లోనే కూర్చొని ఆలోచించడం ప్రారంభించాడు. సెరాంపురం క్రైస్తవులు చెబుతున్నది నిజమా? రామమోహన్ రాయ్ చెబుతున్నది నిజమా? ఎవరు సరియైనమార్గాన వున్నారో, ఎవరు లేరో ఎలా తెలుస్తుంది? అందువల్ల తానే అందుకు సంబంధించిన గ్రంథాలన్నింటిని క్షుణ్ణంగా చదవాలని. అప్పుడే సరియైన నిర్ణయానికి రావచ్చునని నిర్ణయించు కొన్నాడు. ఉద్యోగానికి రాజీనామాయిచ్చి హిందూకాలేజీలో చేరాడు. ఈ కాలేజీ లోనే పట్టణంలో పెద్ద జమీందారు ప్రిన్స్ ద్వారకానాథ్ టాగూరు కుమారుడు దేవేంద్రనాథ్ టాగూరుకూడా చదువుతూ వుండేవాడు. వారిద్దరికీ స్నేహం ఏర్పడింది. చదువు పూర్తికాగానే యిద్దరూ కూర్చొని పాశ్చాత్యదర్శనశాస్త్రాన్ని గురించి చర్చించి ఆత్మ, పరమాత్మలనుగురించి ఆలోచిస్తూ వుండేవారు. దేవేంద్ర నాథ్‌లో సూఫీమత విశేషాలు ఎక్కువ. నీలాంబరుడికి ఆ విశేషాలు ఆకర్షకంగా వుండేవి. సాయంత్రం నీలాంబరుడు రామమోహనరాయ్ గృహానికివెళ్ళి గోష్ఠిలో పాల్గొని, వేదాంతసంబంధమైన పండితుల చర్చలు వింటూ ఏకేశ్వరవాద భజనలు పాడుతూ వుండేవాడు. హాఫిజ్ రచించిన పారసీ పాటలు (గజల్సు) దేవేంద్రనాథ్ పాడి వినిపిస్తూ వుండేవాడు.

నీలాంబర్‌దత్ బి. ఏ. పరీక్షయందు త్తీర్ణుడైనాడు. అప్పటికి రామమోహన రాయ్‌గారి బ్రహ్మసమాజంలో చేరడమేగాక ఒక ప్రముఖ కార్యకర్త అయి పోయాడు. ఒకనాడు పత్రికల్లో ప్రిల్‌హావర్డ్ పక్షవాతంవచ్చి చనిపోయాడని వెలువ డింది. ప్రిల్ చనిపోయే సమయంలో మూడు సంవత్సరాలక్రితమే అతడు పెళ్ళి చేసుకొన్న భార్య తన రెండు సంవత్సరాల వయస్సుగల కుమారునితోబాటు డార్జి లింగులో వున్నదనికూడా వార్తలో వున్నది.

బీహారు ప్రాంతానికిచెందిన ఒక సామాన్యమైన డాక్ బంగళాలో ప్రిల్ దొర దిగి చచ్చిపోయాడు. పర్యటనచేసి బంగళాకు తిరిగివచ్చి బూట్లువిప్పి ప్రిల్ పడకకుర్చీలో కూర్చున్నాడు. ఇంతలో నౌకరు ఒకజాబుతెచ్చి యిచ్చాడు. ఆ వుత్తరం అమిత గర్విష్టి, కురూపి, చెడ్డస్వభావంగల అతనిభార్య వ్రాసినజాబు. డార్జిలింగ్ సొసైటీకి సంబంధించిన వివరాలు అందులో వ్రాసింది. జాబు చదివినతరువాత పత్రికలు

చదువుదామని ప్రిల్ పత్రికల నందుకొన్నాడు. ఇంతలో అతడిశరీరంలో ఒక కుదుపు వచ్చింది. చావు దగ్గరకువచ్చిందని గ్రహించాడు. నౌకరును పిలుద్దామని నోరు తెరిచాడు. కాని నోట మాటరాలేదు. నాలుక ఎండిపోయి తడబడిపోయింది. మరుక్షణమే కన్ను మూతబడిపోయింది.

కలకత్తా పేపర్లలో అతనికి సంబంధించిన వ్యాసాలు వెలువడ్డాయి. తన జీవితంలో నలభై సంవత్సరాలు అతడు బెంగాలులో గడిపాడు. బెంగాల్ ఏషియాటిక్ సొసైటీవాళ్లు అతనికి శ్రద్ధాంజలి సమర్పించేందుకై సభ ఏర్పాటు చేశారు. కాలేజీలలో అతణ్ణిగురించి సభలు జరిగాయి. పదిహేనురోజులతరువాత అతణ్ణి అంతా మరిచిపోయారు. లేడీ ఐష్లే మద్రాసులోని చీఫ్ జస్టిస్ సోదరి. విపరీతంగా మద్యం త్రాగుతుంది. తన కొడుకును వెంటబెట్టుకొని సామానంతా వెంటబెట్టుకొని ఇంగ్లండు వెళ్ళిపోయింది. చనిపోయేటప్పుడు ప్రిల్ దొర పెద్ద కోటీశ్వరుడు. అతడి డబ్బు సిటీలోనూ వున్నది. కలకత్తాలోకూడా వున్నది.

పెద్దవాడైనతరువాత ప్రిల్ ఎడ్విన్ దేరిక్ ఐష్లే తన తండ్రి సంపాదించి కూడబెట్టి వదలిపెట్టివెళ్లిన డబ్బుతో వ్యాపారం ప్రారంభించాడు. ఆంగ్లసామ్రాజ్యం ప్రపంచమంతటా వ్యాపించింది. బర్మాలో టిన్నుఖనులు, మలయాలో రబ్బరు తోటలు, చైనాలో నల్లమందు వ్యాపారం అంతా ఇంగ్లీషువాళ్ళచేతుల్లోకి వచ్చేశాయి.

1857 తరువాత భారతదేశం చట్టప్రకారం విక్టోరియామహారాణి సామ్రాజ్యంలో చేరిపోయింది. తూర్పుప్రాంతమంతా కీ. శే. ప్రిల్ హావర్డ్ ఐష్లే కుమారుడు లార్డ్ ప్రిల్ దేరిక్ ఎడ్విన్ ఐష్లే చేతుల్లోకి వచ్చేసింది. అతనికి తిరుగులేని వాతావరణం ఏర్పడింది.

## 18

ఒకరోజు ప్రొఫెసర్ గౌతం నీలంబర్‌దత్ గుర్రబగ్గీనుండి దిగి తనయింటి వరండాలో అడుగు పెట్టాడు. వెంటనే తోటమాలివచ్చి 'మటియా బర్జ్ నవాబుగారు

మీకోసం వచ్చి చాలాసేపు కూర్చొని, యిప్పుడే వెళ్లిపోయారు' అని చెప్పారు. వెంటనే పీలాంబరుడు గబగబా బైటకువచ్చి నాల్గువైపుల చూశాడు. కొద్దిదూరాన ఒక వృద్ధుడు తెల్లని లాల్చీధరించి, చేతికర్రసాయంతో రోడ్డు అంచున మెల్ల మెల్లగా నడచివెళుతూ కనిపించాడు. పీలాంబరుడు త్వరత్వరగా నడచివెళ్లి అతణ్ణి కలుసుకొన్నాడు.

'ఓహో, పీలాంబర్ దత్, ఎంతకాలానికి ? ఎంతకాలానికి చూశాను ?' అంటూ పరమానందభరితుడై నవాబు పీలాంబరుణ్ణి హృదయానికి హత్తుకొన్నాడు. 'మిమ్ము చూడటం యిక సాధ్యపడదని వెళ్లిపోతున్నాను' అని అన్నాడు.

'నవాబ్ సాహబ్, క్షేమంగా వున్నారా ? సంవత్సరాలు గడిచిపోతున్నాయి. మిమ్మల్ని కలుసుకోవడం పడటమేలేదు. లోపలికి రండి. కొద్దిసేపు కూర్చోండి. నా మనమరాలు స్కూలు బోర్డింగ్‌హౌసునుంచి వచ్చింది. మీరు యిప్పటివరకు చూసియుండరు.'

సరేనంటూ నవాబు డ్రాయింగ్‌రూములో సోఫామీద కూర్చున్నాడు.

'మిమ్ము చూశాను. మీ పిల్లల్నికూడా చూసివెళతాను. జీవితంలో యిక తిరిగి రాగలనో లేదో. యా అల్లా....'

'ఏం ? ఎక్కడికి ప్రయాణం ? లక్నోకా ?'

'కర్బలాకు వెళుతున్నాను. అల్లా అక్కడే నా సమాధికి ఏర్పాటుచేస్తే అంతే చాలు. ఇక్కడ యిక ఏమున్నది గనుక ?' అతడికంఠం గద్గదమైంది. వణుకు తున్నచేతులతో రుమాలుతీసి కన్నీరు తుడుచుకొన్నాడు.

పీలాంబర్‌దత్ ప్రేమతోను, శ్రద్ధగాను అతణ్ణి చూస్తూవున్నాడు. నౌకరు టీ తెచ్చియిచ్చాడు. డ్రాయింగ్‌రూము విక్టోరియాపద్ధతిలో అలంకరించబడివున్నది గోడలమీద చాలాపటాలు అమర్చబడివున్నాయి. వాటిలో ప్రకృతిదృశ్యాలకు సంబంధించినవే ఎక్కువ. పరదాలుకూడా తలుపులకు, కిటికీలకు అమర్చబడి వున్నాయి. దగ్గరలోనే గల గదినుండి పియానోవాయిద్యం వినబడుతున్నది. పియానోవాయిద్యం వినబడినప్పుడు పీలాంబరునికి ఉత్సాహం కలుగలేదు. 'పీలిమా, పియానో ఆపు. ఇక్కడికి రా, మటియాబుర్జ్ బాబాయి వచ్చారు.' అంటూ పిలిచాడు.

పదిహేనుసంవత్సరాల అమ్మాయి లోపలికి వచ్చింది. 'ఈ అమ్మాయే నా మనమరాలు. ఈమెను మీరు ఇప్పటివరకు చూడలేదు. స్కూల్లోనే ఉంటున్నది.'

నవాబు ఆమెను పరిశీలించి చూశాడు. పదిహేనుసంవత్సరాల పడుచు. పెండ్లి చేసుకొని పిల్లవాణ్ణి కని ఒడిలోకి ఎత్తుకొని ఆడించకుండా హాయిగా యింకా స్కూల్లో ఇంగ్లీషు చదువుతున్నది. పియానో వాయిస్తున్నది.

కమ్మన్ నవాబు సోఫామీదకూర్చొని కిటికీలోనుండి బైటకు చూస్తూవున్నాడు. కలకత్తా వెలుగులు నలువైపుల ప్రసరిస్తున్నాయి. నీలాంబరుడు నవాబు పిచ్చాపాటీ మాట్లాడారు. గత యుగ విశేషాలనుగురించితప్ప వాళ్ల మాటలకు విషయమే లేదు. గతించిన యుగాన్ని ఎంతవరకు లాగడం? ముందున్నదంతా భవిష్యత్తు. కమ్మన్ నవాబుకు గడిచినకాలం తప్ప మరేమీ పట్టడంలేదు. ఇద్దరూ ఏదో కలుస్తూవుంటారు. లక్నో పాడుబడిపోయింది. మటియాబుర్జ్‌తో మరో లక్నో వెలిసింది. అప్పుడు కమ్మన్ నవాబు ఆలం సుల్తానుతోపాటు యిక్కడికివచ్చి నీలాంబరునికి కబురుపంపాడు. నీలాంబరదత్ అప్పటికి కలకత్తాలో పత్రికా సంపాదకుడుగా ప్రసిద్ధికెక్కాడు. నీలాంబరుడు సంవత్సరానికి కనీసం రెండుపర్యాయాలైనా అతణ్ణి కలుసుకొంటూ వుంటాడు. సురేంద్రనాథ్‌టాగూరు యింట్లో క్రొత్తసంగీతానికి పునాదులు వేయబడినాయి. దేశమందంతటినుండి గాయకులు కలకత్తా వచ్చినప్పుడుకూడా నీలాంబరుడు నూతన సంగీతగోష్ఠులకు కమ్మన్ నవాబును ఆహ్వానిస్తూ వుండేవాడు.

గదిలో దీపాలు వెలిగించారు. నీలాంబర్‌దత్ యింటి పైఅంతస్తుమీద అతని పెద్దకుమారుడు మనోరంజన్‌దత్, అతని విశ్వవిద్యాలయస్నేహితులు అంతాకలిసి ఒక ఇంగ్లీషునాటకం రిహార్సలు జరుపుకొంటున్నారు. మనోరంజన్‌దత్ స్నేహితుడు మాయికేల్ మధుసూదన్‌దత్ క్రొత్తనాటకం వ్రాశాడు. అంతాకలిసి ఆ నాటకం రిహార్సలు జరుపుతున్నారు. పకపక నవ్వుకొంటున్నారు. కాంప్‌బెల్ మెడికల్ కాలేజీకిచెందిన ఒక యువకుడు కిటికీలోకూర్చొని హార్మోనియం వాయిస్తున్నాడు.

మనోరంజన్‌దత్ చారులత రచించిన కొత్త ఆంగ్లకవిత్వం చదువుతున్నాడు. హార్మోనియంమ్రోత, కాలేజీవిద్యార్థుల పకపకలు, నాటకసంభాషణలు క్రింది భాగంలోనున్న డ్రాయింగ్‌రూములో కూర్చున్నవారికి వినబడుతున్నాయి.

నవాబు చేతికర్రకు గల వెండిపిడిని వ్రేళ్లతో నిమురుతున్నాడు. కాలం మారి పోయింది. ఇది మరోయుగం. క్రీస్తుశకం 1871 ప్రారంభమైందన్నమాట. అతని ప్రపంచం మునలిదై పోయింది. నీలాంబర్‌దత్‌కూడా అతని నమవయస్కుడే. కాని విచిత్రమేమంటే నీలాంబర్‌దత్ ప్రపంచం యౌవనంలో అడుగుపెడు తున్నది. ఈ క్రొత్తప్రపంచంలో తనబోటివారికి చోటులేదని నవాబు కమ్మన్‌కు అనిపించింది. రాజధానీనగరంలో అత్యాధునికమైన డ్రాయింగ్‌రూములో కూర్చొని తాను చాలా హాస్యాస్పదమైనస్థితిలో నున్నట్లు అతనికి అనిపించింది.

'నవాబ్‌గారూ ! మా అబ్బాయి మనోరంజన్‌కు లక్నోలోగల కేనింగ్ లా కాలేజిలో ఉపాధ్యాయుడి ఉద్యోగం దొరికింది' అని అన్నాడు నీలాంబరుడు. నవాబు ఉలిక్కిపడినంత పనైంది. 'అంతా అల్లాదయ. ఇంకా పెద్ద ఉద్యోగాలు రావాలని నా ఆశీస్సులు' అంటూ లేచి నిలబడ్డాడు నవాబ్ కమ్మన్. సెలవు తీసికొని మటియాబుర్జ్‌కు వెళ్ళిపోయాడు. నీలాంబరుడు కొద్దిసేపు డ్రాయింగ్‌రూములో పచార్లు చేస్తూవున్నాడు. తరువాత బీరువాలోనుండి ఒక గ్రంథం తీసుకొని పుటలు త్రిప్పుతూ కూర్చున్నాడు. కాని అతనిమనస్సుకు ఏమీ తోచలేదు. నాలుగువైపుల పరిశీలించి చూశాడు. ఎటుచూచినా పుస్తకాలే పుస్తకాలు, పత్రికల పైళ్ళు. కమిటీ రిపోర్ట్లు, తీర్మానాలు, అంతటా నమస్యలే నమస్యలు. సమస్యలను పరిష్కారం చేసేందుకు పూనుకొని పనిచేశాడు.

అవును. నమస్యల్ని పరిష్కరించేందుకు ప్రయత్నించాడు. ఊపిరాడటం లేదు. గాలి వీచటంలేదు. రాత్రిపూట బాగా ఉక్కపోస్తున్నది. బైట రోడ్డుమీద దీపాలు కొద్దికొద్దిగా వెలుగును విరజిమ్ముతున్నాయి. నగరాలకు రాణివంటి కలకత్తా నగరం ఎందుకో అతనికి భయంకరంగా కనబడసాగింది. కొంచెం భయం వేసింది. వరాండాలోకివచ్చి నిలబడ్డాడు. ఇంటిముందు అరటిచెట్ల ఆకులు నిశ్చలంగా కదలకుండా నిలబడివున్నాయి. అక్కడ ఒక కుక్క తలను మోకాళ్ళమధ్య దూర్చుకొని పడుకొనివున్నది. పునర్జన్మలమీద నమ్మకం కలిగినవాడైతే యీ కుక్క కూడా దుఃఖపడే ఏ ఆత్మదో బాహ్యస్వరూపమని అనుకొనేవాడే.

ఇంతలో ఆకాశంలో చంద్రబింబం కనబడింది. అది అలా కదులుతూ 'దత్ హౌస్' పైగా వచ్చింది. చంద్రకిరణాలు క్రింద నీటిమీద ప్రతిబింబితమయాయి. చంద్రుడు నీలాంబరునికి ఎన్నోకథలు చెప్పాడు. అది పూర్ణిమనాటి రాత్రి.

ఆనాటిరాత్రి నవాబ్ అబుల్ మంసూర్ కమాలుద్దీన్ అలీ రజాబహాదుర్ యింటికి చేరుకొని పడుకొన్నప్పుడు మానవజీవితాన్నిగురించిన ఆలోచన అతనికి కలిగింది. మనిషి ఒక్కపర్యాయమే భూమిమీద పుడుతున్నాడు. చనిపోతున్నాడు. తిరిగి యీ ప్రపంచాన్ని చూడలేడు. గాజా ఉద్దీన్ హైదర్‌పాదుషా చనిపోయాడు. నసీరుద్దీన్ హైదర్, మొహమ్మద్ అలీషా, అమజద్ అలీషాలాంటివాళ్లు చని పోవడం తాను కళ్లారాచూశాడు. వీళ్ళు అయోధ్యను పరిపాలించారు. మృత్యువు దరికివచ్చేసరికి వున్నన అంతా చనిపోయారు. పాపం సుల్తాన్ వాజిద్ అలీషా కూడా ప్రక్కనేవున్నా రాధా మంజిల్‌లో ఇంద్రసభను ఏర్పాటుచేస్తున్నాడేగాని ఎప్పుడో ఒకప్పుడు కన్నుమూసి తీరుతాడు. పాదుషా సింహాసనం, మాతృదేశాన్ని వదిలివెళ్ళడం, అమిత ఆనందం, అపారమైన దుఃఖం అన్నీ మృత్యువుముందర తలవంచివేస్తాయి. చనిపోయినతరువాత ఏం జరుగుతుందో! అనుకొంటూవుండ గానే అతనికి ఒళ్లంతా నీరసమైపోయింది. వేడివల్ల ఊపిరాడటంలేదు. మంచం మీదినుండి లేద్దామని ప్రయత్నించాడు. కాని లేవలేక క్రింద పడిపోయాడు.

కర్బలయాత్రకు వెళదామనుకొన్న నవాబ్ అబుల్ మంసూర్ కమాలుద్దీన్ అలీ రజా బహాదుర్ మరుక్షణంలో శాశ్వతంగా కన్నుమూశాడు.

## 19

నవాబ్ సఫదర్ జంగ్ లగాయతు సుల్తానే ఆలం వరకు మొత్తం తొమ్మిదిమంది పాదుషాలు అయోధ్యను పరిపాలించారు. సఫదర్‌జంగ్ తన బాహుబలంతో రాజ్యాన్ని స్థాపించాడు. ఢిల్లీ పడిపోయినతరువాత భారతదేశంలో స్వతంత్ర రాజ్యంగావున్న బలవత్తరమైన రాజ్యాలలో యిది ఒకటి. ఫ్రాంసుదేశపు పద్నా లుగవ లుయీకంటే ప్రతాపవంతుడు అయోధ్యపాదుషా. ఆ తరువాత సలీమన్ వచ్చారు. అతడు ఒక్క ఊదు ఊదేసరికి దీపాలన్నీ ఒక్కసారి ఆరిపోయాయి. హైవలాక్ జయంపొందాడు. సుల్తానే ఆలం ఓడిపోయాడు. లక్నోలోగల

ఇంద్రపురి పాడైపోయింది. రామలీల హంగామాలు, విలాసతోటలో ఉత్సవాలు, మహర్రం వేడుకలు అన్నీ ఆగిపోయాయి. దిల్‌కుష్‌మహలు పాడుబడిపోయింది. హజరత్‌గంజ్‌లో తెల్లవాళ్ల దుకాణాలు వెలిగాయి. అమీనాబాదులో కాలేజీలు స్కూళ్లు బయలుదేరాయి. పత్రికలు వెలువడసాగాయి. తంతితీగెలు క్రమమన సాగాయి. అయోధ్యానగరంలో రాముని సింహాసనం తలక్రిందులైపోయింది. అంతా గారడీగావున్నది. ఇంద్రలోకం పూర్తిగా మూతబడిపోయాయి. ఇంగ్లీషు వాళ్ల చట్టాలయుగం ప్రారంభమైంది.

కలకత్తా ప్రొఫెసరు, పీలాంబర్‌దత్ తన కుమారుణ్ణి కలుసుకొనేందుకై లక్నో వచ్చాడు. పట్టణస్వరూపం పూర్తిగా మారిపోయింది. నేటికి నలభై ఎనిమిది సంవత్సరాలక్రితం అనగా 1823 లో లక్నో వచ్చాను. అది పాదుషాల లక్నో. ఇప్పటి లక్నో ఆంగ్లేయుల నిలయం. ఇప్పుడు ఘూమీబేగ్ కొత్వాల్‌మాట సాగటం లేదు. ఆంగ్ల డిప్టీకమీషనరుమాట చెలామణీ అవుతున్నది. ఈ దొర నూర్‌బక్ష్ కోఠీలో వుంటున్నాడు. కేసర్‌బాగ్‌లో కైనింగ్ కాలేజీ వున్నది. అక్కడే మహో రంజన్‌దత్ ఉపాధ్యాయుడిగా ఉద్యోగం చేస్తున్నాడు. పట్టణంలోని వీధుల పేటలు ఆవేగాని కాలంమారిపోయింది. గుడిసెల్లోను, యిండ్లలోను జనం చితికిపోయిన జీవితాలుచూపి చేయగలిగింది ఏమీలేక తలవంచుకొని వుంటున్నారు. ధనవంతులు దరిద్రులైనారు. దరిద్రులు ధనికులైనారు. విద్రోహులు ఉరితీయబడ్డారు. ఆంగ్ల ప్రభుత్వానికి సాయంచేసిన స్వామిభక్తులకు తాలూకాలు లభించాయి. అఖ్తర్‌పియా అనగా వాజిద్ అలీషా వెళ్ళిపోయినప్పటినుండి పట్టణం దుఃఖపూరిత మయి పోయింది. ఇది అయోధ్యానగరం. రాముడుకూడా యీ దేశాన్నుండి అడవులకు వెళ్ళిపోయాడు.

గుర్రపుబగ్గీ స్టేషనునుంచి బయలుదేరింది. తలకు తువాలు చుట్టుకొని బండివాడు పీలాంబరదత్ వంకచూసి "బాబుగారూ ? నౌకరు వెనుక కూర్చున్నాడు. ముసలి వాడు. పడిపోతే చచ్చిపోతాడు. లోపల కూర్చుంటాడు. పిలవనాండి ?" అంటూ అడిగాడు.

'పిలు' అని అన్నాడు పీలాంబర్. వెంటనే ఒక ముసలివాడువచ్చి బండిలో కూర్చున్నాడు. బండి బయలుదేరింది.

'బాబుగారు కలకత్తానుంచి దయచేశారా ?'

'అవును.'

'ఇక్కడ ఏమీ తోచడంలేదు. కలకత్తా వెళ్ళిపోదామని వున్నదిబాబూ?'

'ఎవరీయన?' అంటూ ముసలివాడు బండివాణ్ణి మెల్లగా ప్రశ్నించాడు.

'కలకత్తా బాబుగారు' అంటూ సమాధానం చెప్పాడు బండివాడు.

అతడిపేరు శంభు.

'కలకత్తా....?' అంటూ అనుమానంగా అడిగాడు ముసలివాడు.

అతడిపేరు గంగాదీన్. అతనికి బాగా చెవుడు.

'అవును. కలకత్తా' అని అన్నాడు శంభు.

గంగాదీన్ పీలాంబర్‌వంకచూసి 'బాబుగారూ! మమ్మల్ని కలకత్తాకు పంపించండి. అక్కడ మా పాదుషా వుంటున్నారుకదా!' అని దీనంగా అన్నాడు.

'బాబుగారూ! యితడిమాటల్ని లెక్కచేయకండి. ఎప్పుడూ యిలాగే అంటూ వుంటాడు. కలకత్తానుండి వస్తున్నారని తెలిస్తే వెంటనే మా పాదుషా అక్కడ వున్నారుకదా! మేము వెళతాం అని అంటూవుంటాడు. అసలే పాదుషా అవస్థలు పడుతూవుంటె తామకూడా అక్కడికి ఎందుకు చెప్పండి?' అని అన్నాడు శంభు.

పీలాంబరుడు ఏమీ మాట్లాడలేదు. బండి అమీనాబాద్‌కు బయలుదేరింది.

'బాబుగారూ! లక్నో ఇదివరకుకూడా ఒకపర్యాయం వచ్చారా?' అని అడిగాడు శంభు.

'ఆఁ వచ్చాను' అని అన్నాడు పీలాంబర్.

'ఎప్పుడు?'

'చాలాకాలమైంది. అప్పటికి నీవు పుట్టివుండవు. గాజీఉద్దీన్ హైదర్‌కాలంలో వచ్చాను.'

బండివాడు ముసలివాడివంక చూసి 'మీ గాజీఉద్దీన్ హైదర్‌కాలంలో యిక్కడికి బాబుగారు ఒకసారి వచ్చారట' అని అన్నాడు బిగ్గరగా. 'బాబుగారూ! యితడు గాజీఉద్దీన్ పాదుషావారి బండితోలేవాడండి. సుల్తానే ఆలం కూడా యితడంటే ప్రేమగా వుండేవారటండి' అని అన్నాడు.

'బాబుగారూ! మా పాదుషాగారిని మీరు చూశారా? క్షేమంగా వున్నారాండి?' అని అడిగి పసిపిల్లవాడిలా గంగాదీన్ దుఃఖించటం ప్రారంభించాడు.

నీలాంబరుడు ప్రభావితుడైనాడు. జనం యింత భావుకులై వుంటారని అతడు ఊహించలేదు. తాను చాలాకాలం బుద్ధిపక్షాన్ని మాత్రమే సమర్థిస్తున్నవ్యక్తి. ఇప్పుడు హృదయపక్షాన్ని కండ్లారా చూశాడు. బండి అమీనాబాద్ చౌరాస్తా చేరుకొన్నది.

'ఓ ముసలిదానా! బండిక్రిందపడి చస్తావా ఏం?' అంటూ పగ్గాలు గట్టిగా లాగి పట్టి గుర్రాన్ని ఆపుతూ అరిచాడు బండివాడు. ఒకముసలిది చింపిరిగుడ్డలు కట్టుకొని బండిఎదుటకు వచ్చింది చేతులుచాచి 'అయ్యా, అల్లా మీకు మేలుచేస్తారు. భగవంతుని చింతతప్ప మరేమీ చింత మీకు కలగకుండుగాక' అంటూ యంత్రంలా అప్పచెప్పసాగింది.

నీలాంబరుడు దిండును ఆనుకొని కూర్చున్నారు. లక్నో ముసలివాళ్ల పట్టణమా ఏం? ఇక్కడి యువకులు ఏమైపోయారు? అని అనుకొన్నాడు.

ముసలిది కళ్లుమూసుకొని అదేవిధంగా అరవడం ప్రారంభించింది. గౌతం నీలాంబర్ ముసలిదాన్ని పరిశీలించి చూశాడు. విస్మెరబోయాడు. ఈ కంఠం బాగా వినివున్న కంఠం. ఇది ఎన్నో తీయనిమాటలు పలికిన కంఠం. రాగాలుతీసిన కంఠం. పకపకలు వినిపించిన కంఠం. కండ్లజోడు సరిచేసికొని తల బైటకుపెట్టి శ్రద్ధగా చూశాడు. ఆ ముసలిది కిసిబడింది

'బాబుగారూ! దీనికి ఏమీ యివ్వకండి. దీనికి నల్లమందు బాగా అలవాటు. కాణీ యిచ్చినవెంటనే వెళ్ళి నల్లమందు తింటుంది.' అని అన్నాడు బండివాడు.

నీలాంబర్ జేబులోనుండి ఒక్కరూపాయ బైటకుతీసి ముసలిదానిచేతిలో వుంచాడు.

బిచ్చగత్తె పీకుడుకండ్లుఎత్తి తెల్లనిగడ్డంతోవున్న బెంగాలీబాబును ఒక్కపర్యాయం చూపింది ఆశ్చర్యంతో.

ముసలిదాన్ని గౌతం నీలాంబరుడు గుర్తుపట్టాడు. ముసలిది ఎవరోకాదు చంప.

రూపాయిచూసి ఆశ్చర్యపడిపోయింది ముసలిది. కాణీ అడిగితే వెండిరూపాయ యిచ్చిన యీ బాబుగారు ఎవరా అనిచూసి 'బాబయ్యా! మీ మనుమలు, మునిమనుమలుకూడా వేయికాలాలపాటు చల్లగా వుండాలి. నేను ఒకకాలంలో బాగా బ్రతికినదాన్నే. నా యింటిముందు ఏనుగ వుండేది. బండ్లు ఎప్పుడూ నా యింటిముందు

అగివుండేవి. పెద్దపెద్దవాళ్ళంతా వాచుట్టూ మూగివుండేవారు. ఇప్పుడు ఒక్కడూ చూసేవాడు లేడు బాబయ్యా! అల్లా నీకు మేలుచేయుగాక' అని అంటూవుండగానే బండివాడు గుర్రాన్ని అదిలించాడు. 'చూశారా బాబూ! దీనియింటిముందు ఏనుగ వుండేదట. ఎవర్ని చూసినా యింతే. పాదుషాగారి కాలంలో నేనంతవాణ్ణి. ఇంత వాణ్ణి అని అంటూవుంటారు. ఈ ముసలివాణ్ణి చూడండి! బాగా బ్రతికినవాడు. ఇప్పుడు గుర్రాలకు మాలీసుచేసికొని బ్రతుకుతున్నాడు' అని అన్నాడు.

చంప కొద్దిసేపు రూపాయిని అటూ యిటూ త్రిప్పిచూసింది. మెల్లమెల్లగా ఒక చీకటిసందులోకి వెళ్ళిపోయింది. అక్కడ నల్లమందుకొట్టు వున్నది. బండి ముందుకు పాగుతూవున్నప్పుడు నీలాంబర్ ఒక్కపర్యాయం వెనక్కు తిరిగి చూశాడు. చంప నిలబడి రూపాయిని శ్రద్ధగా చూస్తున్నది. ఆమెజుట్టు వెండిలా తెల్లబడిపోయింది. ఆమెముఖం బాగా ముడతలు పడిపోయింది. కట్టుకున్నగుడ్డకు అన్నీ అతుకులే. బండిలో కూర్చొని ఒక్కపర్యాయం కళ్ళు మూసుకొన్నాడు - వైశాలీనగరపు ఆమ్రపాలి గౌతం నీలాంబర్ కళ్ళముందు సాక్షాత్కరించిన ట్లని పించింది.

గోమతీనది ఆవలిఒడ్డున ఒక భవనం అద్దెకుతీసికొని మనోరంజన్‌దత్ వుంటున్నాడు.

ఆరాత్రి మనోరంజన్‌దత్ పైకివెళ్ళి పడుకొన్నాడు. ఇంటిదీపాలు ఆర్పి వేయ బడ్డాయి. నీలాంబర్‌దత్‌కు నిద్రపట్టలేదు. లేచి యింటివరాండాలోకివచ్చి నిలబడి ఎదురుగావున్న నదివంక చూడసాగాడు. చల్లగా వున్నది. లోపలికివెళ్ళి పడుకో కుండా బయటకువచ్చి గోమతినదిఒడ్డున ముందుకు నడువసాగాడు ఎటుచూచినా నిశ్శబ్దంగావున్నది. ఆయనవెనుక భూతాలసమూహం బయలుదేరింది ఎదురుగా కొద్దిదూరాన వంతెనక్రింద పడవలు నిలబడివున్నాయి. చండికాదేవళం అక్కడే కనబడుతున్నది. చెట్లమీద ఎర్రనికళ్ళుగల కోతులు నిద్రిస్తున్నాయి. అతనివెనుక వడుస్తున్నదెయ్యాలు అన్నీ పేరు ప్రసిద్ధికలిగినవే.

ముందువరుసలో అయోధ్యను పరిపాలించిన పాదుషా నఆదత్ అలీఖాన్ వున్నాడు. జాన్ బైలీ, నసీరుద్దీన్ హైదర్, అతని ఆంగ్లఉద్యోగి, కుదూసియా మహల్, మహమ్మద్ షా, ప్రిల్ హోవర్డ్ బిస్లె, సుజాత, లార్డు మెకాలే, బిషప్ హైబర్ వీళ్ళనందరినీ అతడు ఎరుగును. చచ్చిపోయినతరువాత వీళ్ళంతా ఎక్క

డికిపోయారో। ప్రపంచంలో ఆటుపోటులన్నీ గౌతం చూశాడు. ఇంక తాను చూడవలసిం దేమున్నది? నది ప్రవహిస్తున్నది. ఒడ్డున యిళ్ళువున్నాయి. ఆ యిళ్ళ న్నింటికీ పేర్లు వున్నాయి. ఆ యిళ్ళలో మనుష్యులు నివసిస్తున్నారు. ఆ మనుష్యు లకుకూడా పేర్లు వున్నాయి. ఇళ్ళన్నీ రాతితో కట్టబడివున్నాయి. ఇళ్ళచుట్టుకూడ రాతిబండలు పడివున్నాయి. కాలం మహాప్రవాహంవంటిది. కాలం ఆ బండరాళ్ళలో యిమిడిపోయివున్నది. శ్మశానంలో చితిమంటలు రేగుతున్నాయి. ఆ రోజున ఎవ రెవరు చనిపోయారో తెలియదు.

పీలాంబర్‌దత్ ముందుకుసాగాడు.

ఎదురుగా శ్మశానం వున్నది అక్కడ కాళికాదేవి నాట్యం చేస్తున్నది. కాళికా దేవి సృష్టినంతటినీ చివరకు తనలో లీనం చేసికొంటుంది తన కోరికలన్నింటిని జయించి ఆమెలో లీనం కాగలిగినవారుమాత్రమే భయపడకుండ ఆ మహాశక్తిని ఆరాధించగలరు.

శ్మశానం. ఇక్కడ కోరికలన్నీ మంటలోమండి భస్మమైపోతాయి. బుద్ధిని, వాక్ చైతన్యాన్ని అధిగమించి సమస్తప్రాణిజగత్తుకు శక్తిస్వరూపం కల్పించగల దేవి కాళిక. శూన్యాన్ని పూర్ణం చేయగలదు. పూర్ణమే వెలుగు. పూర్ణమే శాంతి.

కాళికకు సమాధియే పరిధానం. ఆమెకు పరిధిఅంటూ ఏమీ లేదు. అంతటా వ్యాప్తమైయున్నది. ఆమె మహాశక్తి. మాయకు అతీతమైనది. ఆమె మాయా స్వరూపిణిగ ప్రపంచాన్ని సృష్టిస్తుంది.

శ్మశానంలో కాళిక శివుని తెల్లనిశరీరంమీద నిలబడియున్నది. మంటలనుండి వెలువడుతున్నపొగల్లో కాళిక నృత్యం చేస్తున్నది. ఆమె కాళిక. ధూమవతి తార. ఆమె శాంతరసప్రధానమైన నృత్యం చేస్తున్నది. సృష్టి జయజయధ్వానాలు చేస్తున్నది.

గౌతం పీలాంబరుడు కాళికను సతిగాను, గౌరిగాను, యోగ మాయగాను చూచివున్నాడు. శ్మశానమంతా పరిశీలించిచూసి ఆమెను గుర్తుపట్టాడు. కొద్దిసేపు వంతెనమీద నిలబడి మంటలను చూశాడు. ఆతరువాత మెల్లమెల్లగానడిచి పింఘాడా వాలీ కోఠీదగ్గరకు చేరుకొన్నాడు.

తెల్లవారగట్ల నాలుగింటికి యింటియజమానురాలు నిద్రలేచి వనిమనిషిని నిద్ర లేపింది. 'పిల్లలబడి ఉదయం ఆరింటికే. లేచి పొయ్యి అంటించి టీకి నీళ్ళుకాచు'

మని ఆదేశించింది. పనిమనిషి ఆవలిస్తూ లేచివిలబడి జుట్టు ముడివేసికొంటూ పీటి వంపుదగ్గరకు వెళ్ళసాగింది. మొహం కడుక్కొని కాలకృత్యాలుతీర్చుకొని పెద్ద బాబుగారు నిద్రలేచేవరికి టీ అందించాలి. ఇంటి యజమానురాలు కాలకృత్యాలు తీర్చుకొని పూజ చేసికొనేనిమిత్తం పూజాగృహంలోకి అడుగుపెట్టింది. పై అంతస్థులో తూర్పువైపున గదిలో పూజామందిరం వున్నది. బాగా ఉక్కపోస్తున్నది. పూజామందిరంలో స్థిరంగావున్న పరమేశ్వరుడు కళ్ళు తెరుచుకొని ఎదురుగా చూస్తున్నాడు. ఆయన గోపీనాథుడు. ఆయన ధరించిన దుస్తులమీద నగిషీపని చేయబడింది. అతని నెత్తినగల కిరీటంలో ఒకే ఒక నెమలికన్ను కొంచెం వంకరగ ఎగురుతున్నది. ఒంటికాలుమీద నిలబడి, మరోకాలు ఆ కాలికి అన్చి, పిల్లనగ్రోవి పెదవులదగ్గర పెట్టుకొని ఆ చిన్ని పూజామందిరంలో అణిగిమణిగి వున్నాడు. ఆయన ముఖంమీద చిరునవ్వు భయంభయంగ తొంగిచూస్తున్నది. దోమలు గది నిండా నిండివున్నాయి. వరండాలో ఆడపిల్లలందరు నిద్రపోతున్నారు. వరండా పై భాగంమీదగల అంతస్థులో ఆడపిల్ల లిద్దరిసోదరుడు నిద్రిస్తున్నాడు. దగ్గరలోనే బల్లమీద పంకా గిర్రున తిరుగుతున్నది. అలమారులు పార్సీ, ఉర్దూ, ఇంగ్లీషు పుస్తకాలతో నిండివున్నాయి. పడకమంచం సమీపంలోనున్న బల్లమీద ఉర్దూ పత్రికలు కువ్వతిప్పలుగ పడివున్నాయి. గోడలమీద నందలాల్ బోసు, అవనీంద్రనాథ్ టాగూరు, ఖ స్తిగర్, ఎం. ఎల్. పేన్, వాటర్ క్లర్జ మొదలుగాగలవారు రచించిన వర్ణచిత్రాలు అమర్చబడివున్నాయి. మరోవైపున విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఛాయాచిత్రాలు వున్నాయి. 1937, 1938, 1939 ల్లో గెలుచుకొన్న ట్రాఫీలు ఒకప్రక్కన వున్నాయి.

క్రింది అంతస్థులో డ్రాయింగ్‌రూం వున్నది. అక్కడ ఒక తైలచిత్రం వ్రేలాడుతున్నది. అది పాదుషాలకాలంలో ఒక ఇంగ్లీషువాడు తయారుచేసిన తైలచిత్రం. 'రాయ్‌బాదా బక్షీ మెహతాబ్ చంద్' అని చిత్రంక్రింద ఉర్దూలో వ్రాయబడివున్నది.

ఆ మేరకు అక్కడివాళ్ళదృష్టిలో విశ్వకేంద్రం. (ప్రతియిల్లు ఆ యింట్లో నివసించేవారిదృష్టిలో విశ్వకేంద్రమే గదా.)

ఇక్కడ ఎంతమంది శవాలు బయటికివెళ్ళాయో చెప్పలేము. ఎన్ని పెళ్ళిళ్ళు జరిగాయో, పండగలు జరుపబడ్డాయో, ఎంతమంది పిల్లలుపుట్టారో, ఎన్ని తగా

దాలు జరిగాయో, ఎంతమంది నవ్వారో. ఎంతమంది ఏడ్చారో చెప్పడం కష్టం. ఇల్లు అంతా మౌనంగా చూస్తుంది. కాని ఆ యింటికథమమాత్రం వినేవారు వుండరు. ఏండ్లు గడుస్తాయి. కాలాన్ని ఎదుర్కొంటూ యిల్లు నిలబడివుంటుంది. ఒక్కొక్కప్పుడు కాలసముద్రం తాకిడికి తట్టుకోలేక యిల్లు కొట్టుకుపోతుంది.

అది నవాబ్ సఆదత్ అలీఖాన్ సమయంలో అతని ఆర్థికశాఖామాత్యుడు రాయబాదా బక్షీ మెహతాబ్‌చంద్ కట్టించిన మేడ. ఇప్పుడు అతని మునిమనుమలు యిందు వుంటున్నారు. అతడు బారిష్టరు. అతనికి ఒక కొడుకు, యిద్దరు కూతుళ్ళు. ముగ్గురూ చిన్నవాళ్లే. చదువుకొంటున్నారు.

బారిష్టరుగారి సమయమంతా కాంగ్రెస్‌గొడవల్లో గడచిపోతూవుంటుంది. జమానా. నిగార్ అను పత్రికల్లో ఉర్దూ కావ్యసాహిత్యంమీద వ్యాసాలు వ్రాస్తూ వుంటాడు. ప్రాక్టీసుమీద అతనికి ధ్యాసలేదు. పూర్వులు సంపాదించిపెట్టిన ఆస్తి వున్నది. అందువలన సుఖంగా బండినడుస్తున్నది. ఆడపిల్లలు పెళ్ళియీడుకు వచ్చివున్నారు. కుమారుణ్ణి కేంబ్రిడ్జి పంపాలని అనుకొంటున్నాడు. పై అంతస్థులో దోమతెరమంచంమీద నిద్రపోతున్నాడు భార్యగొడవకు ఆయనకు మెలకువ వచ్చింది. తెల్లవారకముందే లేచి చెక్కచెప్పులు తొడుక్కొని అటూ యిటూ నడుస్తూ అందరినీ లేవగొడుతూవుంటుంది. పూజకు కూర్చుందో బిగ్గరగా రామాయణం చదవడం ప్రారంభిస్తుంది. ఆమెగొడవకు అంతా లేవవలసిందే.

చల్లనిగాలి వీస్తున్నది. ఎదురుగా ప్రవహిస్తున్న నదిని యింకా పొగమంచుతెరలు వదలలేదు. మోతీమహల్ బ్రిడ్జిదగ్గర సందడి ప్రారంభం కాలేదు.

'లే తల్లీ! మీ బడి ఆరుగంటలకే ప్రారంభమవుతుంది.' అంటూ జమ్నాదాసి వచ్చి అమ్మాయిని లేపింది. అమ్మాయి లేచి కూర్చున్నది. లేచి త్వరత్వరగా స్నానాలగదిలోకి వెళ్ళిపోయింది.

పెద్దమ్మాయికి యింకా నిద్రమత్తు వదలలేదు. పడుకొని ఎదురుగానున్న నది వైపు చూడసాగింది. ఆమెకి పదిహేడు పద్దెనిమిదిసంవత్సరాలు వుంటాయి. కాలేజీలో చదువుతున్నది. కాలేజీ జూలై పద్నాలుగవతేదీన తెరుస్తారు. త్వరలోనే ఆమెకు పెళ్ళి జరుగబోతున్నది. అందువలన ఆమెకు కాలేజీమీద అంతగా శ్రద్ధ లేదు. హాయిగా పడుకొని నదివంక చూడసాగింది.

పైన పడుకొన్నపిల్లవాడు చెప్పులకాళ్ళతో నల్లమందు భాయిలా నడచివచ్చి స్తంభాన్ని ఆనుకొని నదివైపు చూడసాగాడు. విద్రమత్తు యింకా అతణ్ణి పూర్తిగా వదలలేదు. పెద్దగా ఆవలించి తువ్వాలు బుజంమీదవేసుకొని ఏదో పాట వినడానికి శ్రావ్యంగా లేకపోయినా పాడుకొంటూ స్నానాలగదిలోకి వెళ్ళిపోయాడు.

పూజామందిరంనుండి బైటకువస్తూ పుస్తకాలు తీసికొని స్కూలుకు బయలు దేరిన చిన్న అమ్మాయినిచూసి 'ఛుట్కీ! మీ స్కూల్లోవున్న దర్జీవాణ్ణి సాయంత్రం వచ్చి పెద్దమ్మాయి లంగాలు కుట్టివెళ్లమని చెప్పు' అని అన్నది. ఇంతలో యింటి ముందు నిలబడ్డ స్కూలుబస్సు హారన్ వినబడింది. చిన్నమ్మాయి త్వరత్వరగా టీ త్రాగి పుస్తకాలు తీసికొని నరేనని అమ్మకు సమాధానంచెప్పి. మెట్లుదిగి రోడ్డు మీదకు వచ్చింది.

ఇంటి యజమానురాలు పెద్దమ్మాయిని లిలీ అని. చిన్నమ్మాయిని ఛుట్కీ అని పిలుస్తుంది. బారిష్టరుగారు ఆమెకు బొంబాయి. కలకత్తా. కాశ్మీరు మొదలుగా గల ప్రదేశాలన్నీ చూపించారు. ప్రతిసంవత్సరం నైనీటాల్. మసూరీ వెళుతూ వుంటుంది. ఏది ఏమైనా ఆమె నిత్యకృత్యాల్లోమాత్రం ఏమీ మార్పు రాలేదు.

ఇంతలో పెద్దమ్మాయి లేచి మేడమీదినుండి క్రిందకు తొంగిచూసింది. క్రింద రోడ్డుమీద స్కూలుబస్సు నిలబడివున్నది. ఇద్దరు ముగ్గురు హిందూదేశపు ఆడ పిల్లలుమాత్రం అందులో వున్నారు. మిగతా బస్సంతా ఇంగ్లీషువాళ్ల ఆడపిల్లలతో నిండివున్నది. హిందూదేశపు ఆడపిల్లలు బస్సునుండి తొంగిచూచి చేతులు ఊపి 'సాయంత్రం తిరిగివస్తాం' అంటూ బిగ్గరగా అన్నారు.

'మంచిది' అంటూ పెద్దమ్మాయి చేయి ఊపింది.

బస్సు బయలుదేరి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటికి పిల్లవాడు ఈలవేసుకొంటూ క్రిందికి దిగివచ్చారు. బైటగదిలో సైకిలు వున్నది. ఒక నోట్ బుక్కు గొప్పస్టైలుగా సైకిలు హేండిల్‌కు అమర్చి నిర్లక్ష్యంగా సైకిలుఎక్కి కాలేజీకి బయలుదేరాడు.

సూర్యుడు ఉదయించాడు. ప్రపంచం యిక తనపని ప్రారంభించింది.

ఆ మేడ క్రిందిభాగంలోగల వరండానుండి నలుగురైదుగురు బాలికల పక పకలు వినబడసాగాయి. వాళ్ళంతా చిన్నవయస్సులో వున్నారు. ప్రపంచమంతే

ఏమిటో దుఃఖాలంటే ఏమిటో వాళ్ళకింకా ఏమీ తెలిసినట్లులేదు. హాయిగా విశ్రాంతగా ఆడుకొంటున్నారు.

సంధ్యాసమయం సమీపించింది. సూర్యుడు అస్తమించాడు. నదిలో నిలబడి వున్న నావల్లో దీపాలు వెలిగాయి. నది తనయాత్ర సాగిస్తూనేవున్నది.

# 20

సూర్యుడు అస్తమించేముందు బండి మేరిస్ కాలేజీనుండి తన సామాన్యమైన వడకలో బయలుదేరి నదిమీదగల వంతెనమీదకు చేరుకొంటుంది. వంతెన దాటిన తరువాత తిన్నగా ఒకరోడ్డు పోతుంది. దాన్ని యూనివర్సిటీరోడ్డు అని అంటారు. దానికిప్రక్కగా నదిఒడ్డున రెండు మట్టిరోడ్లుకూడా వున్నాయి. అక్కడనుంచి చాంద్‌బాగ్‌వరకు మేడలు వున్నాయి. అక్కడ ఇజాబేలా థావర్న్ కాలేజి వున్నది. అది విశ్శబ్దంగా ప్రశాంతంగావుండే ప్రదేశం. అప్పుడప్పుడు ఏదైనా కారో లేక సైకిలు త్రొక్కుకుంటూ వెళుతున్న కాలేజి యువకులో. యువతో అక్కడ కనబడతారు. ఉపనగరం లేక డాలీగంజివెళ్ళే గుర్రంబగ్గీలు సైజాబాదురోడ్డుమీద వెళుతూ వుంటాయి. ఇంకా ముందుకువెళితే ముస్లింగరల్స్ కాలేజి వున్నది. ఆతరువాత కందిగింజల పొలాలు, చెరకుపొలాలు వున్నాయి. ఆతరువాత పెద్దచెరువు, పేపరు మిల్లు వున్నాయి. ఆ చే కొయ్యవంతెన వున్నది. అక్కడనుంచి ఒకరోడ్డు చిరైయా సరస్సు, బైంసాకుండికి వెళుతుంది అక్కడే సికిందరాబాగ్, బనారసీబాగ్ వున్నాయి. అక్కడ గవర్నమెంటుహౌసు వున్నది. దానివెనుక గాజీఉద్దీన్‌వాగు వున్నది. లామార్టినేయర్‌రోడ్డు ఆ ప్రక్కగా హజరత్‌గంజ్, లామార్టినేయర్ కాలేజిమీదుగా దిల్‌కుష్ పాలెస్‌వైపుకు వెళ్లుతుంది. ఆతరువాత పెద్ద పచ్చికబయళ్లు వున్నాయి.

మోతీమహల్ బ్రిడ్జి దాటగానే మేరిస్ కాలేజీ, కేసరీబాగ్ వున్నాయి. ఆతరువాత అమీనాబాద్ పార్కు, అమీరుద్దౌలా పార్కు వున్నాయి. అక్కడ మెడికల్‌కాలేజి

షా హమీనాదర్గా, ఇమాంబాడా హుసేనాబాద్ వున్నాయి. అక్కడ అక్బర్‌దర్వాజా, గోల్‌దర్వాజాలు వున్నాయి. ఇదంతా పాత లక్నో ప్రాంతం. ఇది క్రొత్త లక్నోకు బాగా దూరంగావున్నది. అయినా క్రొత్తలక్నోలోకూడా పాతలక్నో అడుగడుగునా కనబడుతూనేవుంటుంది. పాదుషా హర్మ్యం వుండేచోట గవర్నమెంటుహౌసు వున్నది. నదిఒడ్డునగల మోతీమహల్లో ఇంపీరియల్ బ్యాంకు వున్నది. హరజత్ గంజ్ మధ్యభాగంలో బేగంకోఠీ వున్నది. ఛతర్‌మంజిల్‌లో క్లబ్బు వెలిసింది. ఇక్కడివస్తువులు క్రొత్తవే అయినప్పటికీ పాతదనాన్ని పూర్తిగా వదలలేదు.

పై దృశ్యాలన్నింటినీచూస్తూ బండి మోతీమహల్ బ్రిడ్జిదగ్గరకు చేరుకొంటుంది. గంగాదీన్ బండితోలుతూ ముందుకూర్చునేవాడు. 'అమ్మాయీ! సింఘాదేవాలీ కోఠీకి వస్తారా!' అని అడిగేవాడు.

'ఆఁ వెళదాం.' అని అన్నది అమ్మాయి. బండి మెల్లగా మట్టిరోడ్డుమీద ముందుకు సాగింది. అంతా నిశ్శబ్దంగా వున్నది. 'అమ్మాయీ! నిర్మలదగ్గరకు వెళతారా!' అని అడిగాడు గంగాదాస్. బండి సింఘాదేవాలీ కోఠీ చేరుకొన్నది. 'అన్నయ్యా, ఇదిగో నీ పుస్తకం' అంటూ కేక బెట్టింది.

అన్నయ్య అంటే హరిశంకర్ శ్రీవాత్సవ అన్నమాట. యూనివర్శిటీలో బి. ఏ. చదువుతున్నాడు. ఫార్సీ చదువుతున్నాడు.

'నిర్మల అక్క లాజ్ వరండాలోకివచ్చి' కుసుమకు జ్ఞాన్ ఏం సమాధానం చెప్పాడో చెప్పు' అంటూ ప్రశ్నించింది.

మేరీస్ కాలేజి రాజకీయాలు ప్రారంభమైనాయి. లాజ్ అక్కడ చదివింది. యిక ఆమెకు పెండ్లి కాబోతున్నది.

'రాజకుమారి లాహోరు వెళుతున్నది.'

'లాహోరా! బాపరే బాప్!'

'లాహోరు చాలా దూరం. భూగోళానికి ఆవలిప్రక్క నన్నమాట.'

సూర్యుడు అస్తమించాడు. నాలుగువైపులా మసకమసకగా కనబడసాగాయి భావిజీవితంలా. ఇక మా సంభాషణ తిరిగి ప్రారంభమైంది.

'ఆతరువాత ఏం జరుగుతుంది?'

'అప్పీ ఆ తరువాత ఎక్కడికి వెళుతుందో!' అని అడిగింది నిర్మల.

'అన్నయ్య ఎక్కడికివెళితే అక్కడికి వెళుతుంది' అని అన్నాను.

'అన్నయ్య ఎక్కడికి వెళతాడు।'

'నాకు తెలియదు.'

ఇంతలో కమాల్ లేచి మాదగ్గరకు వచ్చాడు. తలత్‌మాట పూర్తికాగానే కమాల్ అందుకొన్నాడు—'అన్నయ్య నా పినతండ్రికుమారుడు. అతడు పెద్దవాడైనతరువాత అప్పిని పెండ్లిచేసికొని తీసికొనివెళతాడు. చాలాఏండ్లనుండి మా యింట్లో వుంటున్నాడు. మా పినతండ్రి స్విట్జర్లెండులో వుండేవాడు. మా నాన్న అతణ్ణి కలుసుకొనేందుకు వెళ్ళినప్పుడు మా పినతండ్రి చనిపోయాడు. అప్పుడు అన్నయ్య లూజాన్ స్కూల్లో చదువుకొంటూ వుండేవాడు. అతణ్ణి స్విట్జర్లెండు నుండి మా యింటికి తీసికొనివచ్చారు. బొంబాయిలోదిగి తిన్నగా అల్మోడాలో నున్న మా యింటికి వచ్చేశాడు. అతడు నన్ను, అప్పిని దగ్గరకుపిలిచి కౌగలించుకొని భోరున ఏడ్చాడు. అప్పుడు తలత్ చాలా చిన్నది. ఆ తరువాత అన్నయ్య మాతోటాటే వుండసాగాడు. మా నాన్న, అమ్మలకు అతడంటే ప్రాణం. అన్నయ్య అమ్మ చిన్నతనంలోనే చనిపోయింది. అందువల్ల అందరూ అన్నయ్యను ప్రేమగా చూసేవారు.

'వేసవికాలపు సెలవులు పూర్తికాగానే అన్నయ్యను లా మార్టినేయర్ కాలేజీలో చేర్చారు. ఈ కాలేజి నూట ఏభై సంవత్సరాలక్రితం నవాబ్ ఆసిఫ్ ఉద్దౌలా ప్రత్యేకసలహాదారు జనరల్ క్లాడ్ మార్టిన్ ఫ్రాంసీసీ యిచ్చినదబ్బుతో యూరోపియన్ పిల్లలకోసం స్థాపించబడింది.

'అసలు యీకథకు హీరో ఎవ్వరా అన్నయ్యేనా అని సందేహం కలుగవచ్చు. అసలు అన్నయ్యలో హీరోకి వుండవలసిన లక్షణాలన్నీ వున్నాయి. నేను చెప్పిన దాన్నిబట్టి తెలివిగల మీరు హీరో అన్నయ్యే అనువిషయం తేలికగా గ్రహించే వుంటారు. పాతరకం పాఠకులుకాకపోతే అన్నయ్య అందగాడనువిషయం మీకు తెలిసేయుంటుంది. ఫ్రాంసు, స్విట్జర్లెండు దేశాలస్కూళ్లలో చదవడంవల్ల ప్రారంభంలో అతడి ఉచ్చారణకూడా ఫ్రాంసువాడిలా వుండేది. త-ద అను అక్షరాల దగ్గర ఆగిఆగి అతడు ఇంగ్లీషు మాట్లాడుతుంటే ఎజాబేలా థావర్న్ కాలేజి అడపిల్లలు ముగ్ధులైపోతూ వుండేవారు.

'అప్పి, అన్నయ్య పరస్పరం ఏ విషయాల్లోనూ జోక్యం కలిగించుకొనేవారు కారు. ఇద్దరి టీములు వేరువేరుగా వుండేవి. అప్పి అన్నయ్య స్నేహితుల్లో

వైరుధ్యం పెంపొందిస్తూవుండేది. లాజవతీ శ్రీవాత్సవ అప్పికి మంచి స్నేహితురాలు, ఆమె నా ప్రాణస్నేహితుడు హరిశంకర్ చెల్లెలు. ఎందుకోగాని చంపాబాజీ విషయం ఎత్తితే లాజవతి మౌనం వహించేది. అప్పి నిర్లక్ష్యంగా కూర్చొని నవ్వుతూ వుండేది. మూర్ఖుడిలా హరిశంకర్ పిగరెట్టు కాల్చడం ప్రారంభించేవాడు. చంపాబాజి మాలో ఎవ్వరిటీములోను చేరలేదు. మా అందరికీ దూరంగా వుండేది. మేమంతా చిన్నప్పటినుండి ఒకరినొకర్ని ఎరుగుదుము. కాని చంపాబాజీవిషయం మాకు తెలియదు. చంపాబాజి లోవర్ మిడిల్‌క్లాసుకు చెందినదని నాకు గట్టి అనుమానం.

'అన్నయ్య 'లా' చదువుతున్నప్పుడు చంపాబాజి బెనారస్‌నుండివచ్చి ఇజాబేలా థావర్న్ కాలేజీలో చేరింది.

'అది క్రీస్తుశకం 1941 నాటిమాట.

'అప్పికూడా లా మార్టినేయర్ స్కూలునుంచి ఇజాబేలా థావర్న్‌కాలేజీలో చేరింది. అప్పి చదువు ఆపివేసినసంవత్సరమే అప్పికి అన్నయ్యకు జరుగుతుందనుకొన్నపెండ్లి ఆగిపోయింది.

'ఇప్పుడు ఒక్కవిషయం ఆలోచిస్తున్నాను. ఆనాటికథ విస్తరించి చెబుతున్నాను. ఇందు సఫలీకృతుణ్ణి అవుతానో కానోనని అనుమానంగా వున్నది. ఇంకా చాలా చిన్నచిన్నవిషయాలు వున్నాయి. పాదుషాబాగ్‌కు చెందిన సింహద్వారం, పుష్పాలగుత్తులు, త్రోవన వయ్యారంగా నడచివెళ్ళే గొల్లపడుచులు, ఎర్రరంగు లంగాకట్టుకొని రెండుజాములప్పుడు చింతకాయలు ఏరుకుంటూ తిరుగుతూ ఒకనాడు రైలుక్రిందపడి చనిపోయిన మునలిది యివన్నీ నాకు ముఖ్యమైనవే మీకు నచ్చకపోతే నేను చేయగలిగిందేమీలేదు. అప్పటికథ చెబుతున్నప్పుడు వాతావరణం సృష్టించాలనే నా తహతహ. నేను ఆర్టిస్టును కాను. ప్రస్తుతం యిక అసలువిషయం వినండి.

ఇదిగో యిది బెన్‌ట్‌హాలు. నేను ఒక ఎత్తైనచోట కూర్చొని రేడియోలో కాన్వొకేషనుగురించి కామెంట్రీ వినిపిస్తున్నాను. క్రింద విశాలమైన హాల్లో నల్లటోపీలు, గౌన్లు అటుయిటు తిరుగుతూ కనబడుతున్నాయి. సమయం త్వరత్వరగా గడచిపోతున్నది. అన్నయ్య ఎర్రని తివాచీలప్రక్కగా చంపాబాజీతోబాటు నడచి స్టేజిపైపు వెళుతున్నాడు. లౌడ్‌స్పీకర్ న్యూ థియేటర్స్‌వారి సరిక్రొత్త రికార్డు

వివిపించసాగింది. 'యహ్ కూచ్ కే వక్త్ కై సీ ఆవాజ్ (పయన మయేసమయంలో ఏమిటీ మాటలు) అంటూ వినబడుతూంది పాట. అది పహారీ సన్యాల్ కంఠం. ఎదురుగా వైస్‌ఛాన్సలర్ వస్తున్నారు. వారివెనుక చాలామంది ప్రొఫెసర్లు గౌన్లు తొడుక్కొని నడచివస్తున్నారు. వీళ్లలో ఒక్కడుకూడా శాశ్వతంగా కనబడకుండా కన్ను మూసే రోజుకూడా ఒకటి రావచ్చునని అనిపించింది. నేను మైక్రోఫోను నా ప్రాణ స్నేహితుడు హరిశంకర్‌కు అందించాను. హలో....నామాట వినబడుతున్నదా! హలో....'

'హలో....ఆఁ వినబడుతూంది.' లాంపువెనుక చీకట్లోదాగి కూర్చున్న హరి శంకర్ సమాధానం యిచ్చాడు. స్టేజి బైటనుండి అతని మాటలు వినబడుతున్నట్లనిపించింది. అతడుమాత్రం కంటికి కనబడటంలేదు.

హలో....హలో....నేను హరిశంకర్‌ను మాట్లాడుతున్నాను. నేను హరి శంకర్ శ్రీ వాత్సవను. కమాల్‌కు స్నేహితుణ్ణి. లాజ్, నిర్మలకు అన్నను. చంపాబాజీకి అనుచరుణ్ణి. నా పార్టుకూడా ముఖ్యమైనదే. నా పార్టుకు చాలా పద్ధతులు వున్నాయి. నేను కథలో వేరువేరుగావుండే పాత్రలు అభినయిస్తున్నాను. ఎక్కడ మొదలుపెట్టాలో, స్టేజీమీద ఎప్పుడు ప్రవేశించాలో అంతా గొడవగా వున్నది.

అప్పికి నిర్ణయమైనపెండ్లి ఆగిపోయినప్పటివిషయం.

లాజ్ లోపలినుండి బైటకు వచ్చింది. సిందూరం రంగుచీర కట్టుకున్నది.

అప్పికూడా ఆమెతోబాటు బైటకు వచ్చింది.

అప్పి నువ్వు యిక్కడకు ఎంతసేపైంది వచ్చి? స్టేషనునుండి వచ్చీరాగానే కమాల్ నిన్నుగురించే అడిగాడు. భైంసాకుంద్‌నుండి వస్తున్నప్పుడు అక్కడ చంపాబాజీ యింటిదగ్గర యిద్దర్నీ చూశాను.

'ఎవరెవరినీ:'

'అన్నయ్యా-కమ్మన్‌భయ్యా. ఇద్దరూ చెట్టుక్రింద కూర్చున్నారు. నేను బండిలో వస్తూవుంటే నవ్వి చేతులు ఊపింది. చాలా అందంగా వున్నది.'

'అన్నయ్య మీర్జాపూర్ వెళ్ళాడుకదూ!' మాలతి ప్రశ్నించింది.

'ఇవాళఉదయమే వచ్చాడు. వచ్చీరాగానే తిన్నగా చంపాబాజీయింటికి వెళ్ళాడు. ఇప్పుడూ అక్కడే వుండివుంటాడు' అని అన్నది నిర్మల.

అప్పుడు నాకు కదీర్ బీబీ అన్నమాటలు జ్ఞాపకంవచ్చాయి. కాలేజీనుండి వచ్చి టీ తాగబోతూవుంతగా కదీర్ బీబీ వచ్చి ఎన్నోరహస్యాలు తెలిపినదానిలా చేతులు త్రిప్పుతూ 'పెద్దమ్మాయి పెండ్లి చేసికోనని అన్నదట' అని చెప్పింది.

'అప్పిపెండ్లిలో కట్టుకొనేందుకు నేను మంచిచీరె తెప్పించుకోబోతుంటే ....' అని అన్నది విర్మల.

ఇంతలో తలత్ మౌనం వహించింది. 'నా గడచిపోయినకాలం నాకుమాత్రమే ముఖ్యమైనదని, ఇతరులకు దానితో ఏమీ సంబంధంలేదని అనుకొంటున్నాను' అని అన్నది కమాల్‌వంకచూపి.

'గడచిపోయినరోజులు నా జీవితంలో పూర్తిగా గడిచిపోయినరోజులే' అని అన్నాడు కమాల్.

ప్రపంచానికి కేవలం 'ఈనాటితోనే సంబంధం' అని అన్నాడు హరిశంకర్.

'కాని గడచిపోయిన నిన్నయే నేడు అని గుర్తించాలి. మీరు గడచినకాలంలో వున్నారు. రాబోయేకాలపు దాగుడుమూతల్లో నేను హైరానా పడుతున్నాను. నేను కాలంచేతుల్లోపడి విసిగిపోతున్నాను. మీలో ఒక్కరైనా నాకు సాయం చేయ కూడదా!' అని అన్నది ఖిన్నంగా తలత్.

'నీకు సాయంచేయడమా? తలత్‌బేగం? అయినస్టీనుకూడా నీకు సాయం చేయలేదు' అని అన్నాడు హరిశంకర్.

'కాలం ఎప్పుడూ వుంటుంది. ఇప్పుడూ వున్నది' అని అన్నది తలత్.

వీళ్ల క్రీస్తుశకం 1954 డిశంబరు 15 వ తేదీన సాయంత్రం లండనులోని సెంట్ జాజ్‌వుడ్‌లో కూర్చొని యిలా మాట్లాడుకొంటున్నారు. వారినీడలు కిటికీలకు అమర్చబడిన అద్దాలు రకరకాలుగా ప్రతిబింబిస్తున్నాయి. విశాలమైన కాల చక్రపు చీకట్లో, ఎత్తైన గోడలమీద రోడ్లు, వీధులు, మాటలు మొదలుగాగల వాటి దాగుడుమూతల్లో పడివున్నారు యీ ముగ్గురూ.

కాలచక్రపు ఆ చీకట్లోనే తలత్ క్రీస్తుశకం 1940 జూలై మాసంలో సింహాదేవాలీ కోఠీ వరండాలో కూర్చొని విర్మల, మాలతితో మాట్లాడుతున్నది. ఈ తలత్‌కు ఆ తలత్‌కు ఏమీ తేడాలేదు. ఇద్దరివీ రెండు అస్తిత్వాలు. గౌతమబుద్ధుడు చెప్పినట్లు మనుష్యుడు ప్రతిక్షణం మారిపోతూవుంటాడు. మనిషి చిన్నతనంలో ఒకరకంగాను, యౌవ్వనంలో మరోరకంగాను, వృద్ధాప్యంలో యింకోరకంగాను

వుంటాయి. నీవు క్షణానికిముందు యీలా లవు. మిగిలేది నిరంతంతత్వం మాత్రమే. దూరాన మంచుకొండలు విరిగి పడిపోతున్నాయి. గాలి, చీకటి—కాలం మంచులో పేరుకుపోతాయి.

'మన కథ చెప్పుకొని శాంతిద్దాం. నాకు భయంగావున్నది' అని అన్నాడు హరిశంకర్.

మనం కాలానికి, చీకటికి భయపడతాం. కాలం ఒకానొకప్పుడు మనల్ని చంపివేస్తుంది. తలదాచుకొనేందుకు చివరికి చీకటే మనకు శరణ్యం అవుతుంది. అందుకే అవంటే మనకు భయం' అని అన్నది తలత్.

'గౌతం నీలాంబరుడివ్యవహారం ఏమిటి? వీరికివాడని తేలిపోలేదూ!' అని అన్నాడు కమాల్.

'గౌతం నీలాంబరుణ్ణిగురించి ఏమీ అనవద్దు. అసలువిషయాన్ని విడచివేయడం మంచిదికాదు. జీవితంలో అసలువిషయం ఏమిటో నిర్ణయించాలి. నేను పధ్నాలుగు సంవత్సరాలక్రితం వున్నాను. పధ్నాలుగుసంవత్సరాల తరువాతకూడా హరిశంకర్ గానే గుర్తింపబడతాను. కాలతాకిడివల్ల కలిగే అనుభవాలనన్నింటినీ మనవిగా చేసుకొంటే మనమంతా అంతమైపోతాము. ఈ కథలో పేర్కొనబడుతున్న వాళ్ళందరిస్థితి అంతే' అని అన్నాడు హరిశంకర్.

కాలచక్రపు పరిభ్రమణలో తలత్ అక్కడ వున్నది. కాని ఆమెయే కాలచక్రపు పరిభ్రమణలో మరోచోటకూడా వున్నది. అయితే యీ రెండుకోణాలకుమధ్య కొన్నిఏండ్ల వ్యత్యాసం వున్నది. ఈ వ్యత్యాసంలో మానవుడు ముందుకు నడువవలసిందే. ముందుకు యింకా ముందుకు నడువవలసిందే. వెనకకు నడవడం అసంభవం. అద్దం పగిలితే ఒకేముఖం వేరువేరు అద్దంముక్కల్లో విడివిడిగా కనబడినట్లే వేలకొలది తలత్ బేగములు వేలకొలది ముక్కల్లో వేలకొలదిచోట్ల కనబడుతూ వుండవచ్చును.

# 21

క్రీస్తుశకం 1940. లక్నో.

అన్నిచోట్ల దీపాలు వెలిగాయి. నదిఒడ్డునగల పడవల్లోకూడా దీపాలు వెలిగాయి. నది తన ప్రయాణాన్ని ఆపలేదు. వరండాలో లాంపులు వెలిగించబడ్డాయి. వాటిమీద వర్షాకాలపు పురుగులు ఎగురుతున్నాయి.

బాలికలు వరాండాలో కూర్చొనివున్నారు.

బాగా చీకటిపడుతూవుండటంచూసి యిప్పటివరకు మేడ క్రిందిభాగంముందు కూర్చొని యింటి పనిమనిషితో మాట్లాడుతున్న గంగాదీన్ 'అమ్మాయీ! యిక వెళదాం పదండి.' అని అన్నాడు.

తలత్ వా రందరివద్ద సెలవుతీసికొని క్రిందకువచ్చి బండిఎక్కి కూర్చున్నది. బండి రాయ్ బిహారీలాల్ రోడ్డువైపుకు బయలుదేరింది.

కొద్ది ఫర్లాంగులదూరం వెళ్ళాక బండి ఒక పెద్దసిమెంటుతో కట్టబడిన భవనంలోకి ప్రవేశించింది. ఇంటిలోనివారు ఒకవైపునగల అరుగుమీద కూర్చొనివున్నారు. ఒకవైపున కుర్చీలు అమర్చివున్నాయి. మంచందగ్గర బల్లమీద పంకా పెట్టివున్నది. ఆ యింటిని 'గుల్ ఫిషా' అని అంటారు. గుల్ ఫిషావంటి భవనాలు చాలావున్నవి. వాటిలో ఒకేరకమైన జనం వుంటున్నారు. వారందరికీ కార్లువున్నవి. వాళ్లంతా గొప్పవాళ్ళు. ధనికులు. వాళ్ల నివసించేవిధానంకూడా గొప్పగానే వుంటుంది. వాళ్లందరియిండ్లలోవుండే సోఫా, కుర్చీలు, తోటలు, పుస్తకాలు, వస్త్రాలు, తదితరవస్తువులు అన్నీ ఒకేరకంగా వుంటాయి. వాళ్ళ నౌకర్లు, వాళ్ల పనులు, సుఖదుఃఖాలు, అలవాట్లు అన్నింటిలోను సమానత్వం కొట్టవచ్చినట్లు కనబడుతూవుంటుంది. ఇతర భవంతులలోమాదిరిగానే తలత్ యింటిలోకూడా వంటవాడు వున్నాడు. అతడిపేరు హుసేనీ.

వంటలవాళ్ళందరిపేర్లు హుసేనీ అనో, హుసేనీ బక్ష్ అనో, మదార్ బక్ష్ అనో వుంటాయి. చాకళ్ళందరినీ నత్థూ అని అంటారు. బండ్లు తోలేవాళ్ళంతా గంగాదీనులే. పనిమనుషులపేర్లు బులాకన్, రసూలియా, హమీదన్ కీమా అని వుంటాయి. బైరాగులందరినీ అబ్దుల్ అని అంటారు. హోటళ్లలో వైలిన్

వాయించేవాళ్ళందరినీ టోపీ అని అన్నట్లే తండ్రులందరినీ ఖాన్‌బహదూర్ అనో. తకి రజాబహాదుర్ అనో అంటారు.

నవలల్లోవుండే తండ్రులపేర్లు అంతే. నిజంగా యిండ్లలోవుండే తండ్రుల పేర్లు అంతే.

కదీర్ మోటారుడ్రైవరు. అతడిది మీర్జాపూరు. మాటకారి. ఎండాకాలపురోజుల్లో మిట్టమధ్యాహ్నం యిళ్ళల్లోవారంతా నిద్రపోతున్నప్పుడు కదీర్ వుండేచోట పాటలు వినబడుతూవుండేవి. ఎప్పుడైనా వెళ్ళిచూస్తే ఖాళీ పెట్రోలుడబ్బాలు వాయిస్తూ కదీర్ కూర్చొనివుండేవాడు. కమరున్ ఒకవైపున కూర్చొని అల్లికపని చేస్తూ వుండేది. ఎవరైనా యింటికివస్తే వెంటనే తమలపాకుల యిత్తడిపెట్టె ముందుకు నెడుతుంది. కమరున్ సలోనీ కదీర్ భార్య.

కమరున్, కదీర్ యిద్దరూ రైతుబిడ్డలే. డ్రైవరు కాకపూర్వం కదీర్ తన జిల్లా రైతుమహాసభలో మెంబరుగా వుండేవాడు. రాట్నాన్నిగురించి ప్రచారం చేస్తుండే వాడు. మోతీలాల్ నెహ్రూగారి కుమారుడు జవహర్‌లాల్ నెహ్రూ విదేశాలనుండి వచ్చి దేశంలో గ్రామగ్రామము తిరిగి రైతులకు నాయకుడైపోయిన రోజులవి. రైతులదురవస్థనుగురించి కదీరుకు బాగా తెలుసు. అందువలన కమాల్‌తోబాటు అతనిస్నేహితులు యింటిదగ్గరచేరి సోషలిజాన్నిగురించి చర్చించేటప్పుడు కదీర్ కూడా దగ్గరకువెళ్ళి వింటూవుండేవాడు. తనఊరి జమీందారుకు పన్ను చెల్లించ లేదని తనతండ్రిని పిలుచుకొనిపోయి జమీందారు పూల్‌సింగ్ భటులు చావబాది చంపివేయడం అతనికి తెలుసు. తత్ఫలితంగానే తను కలకత్తావెళ్ళి క్లీనరుగా పని చేయవలసి వచ్చింది. డ్రైవరుగా పనిచేస్తున్నప్పటికి దారిద్ర్యం అతణ్ణి పట్టుకు పీడిస్తూనేవున్నది. కాని లక్నోలో ఏమి జరుగుతున్నదో కదీరుకు బోధపడటం లేదు. ప్రజల్లో అసంతృప్తికి మూలకారణం ఆర్థికదారిద్ర్యమే. జమీందార్లకు రైతులకుమధ్య రగుల్కొన్న సంఘర్షణకుకూడా ప్రధానకారణం అదే. కాని ఆంగ్లప్రభుత్వం అసంతృప్తికి మతసంబంధమైన కారణం పులిమి ప్రజలదృష్టిని మరల్చేందుకు ప్రయత్నిస్తున్నది.

కమరున్ బీబీకి కదీరుకు చిన్నప్పుడే పెండ్లి అయినది. భార్యాభర్తలిద్దరూ అన్యోన్యంగా వుంటారు. వారిద్దరిప్రేమనుగురించి నౌకర్లంతా ఉదాహరణగా పేర్కొంటూవుంటారు. కదీర్ బంధువుల్లోకూడా వారిరువురిప్రేమ బాగా ప్రచారం

ఆయనది. కమరున్ బీబీ యితరనౌకర్ల భార్యలతో కలిసిమెలిసివుండదు. మోటారు డ్రైవరుభార్య కావడంవలన యితరనౌకర్ల భార్యలకంటె తనహోదా గొప్పదను భావం ఆమెకు కలదు. సర్వెంట్సు క్వార్టర్సు (నౌకర్లయిళ్ళ సొసైటీలో తమ స్థాయి గొప్పదని ఆమెభావం. మధ్యాహ్నం భోజనాలుకాగానే గిన్నెలు తోముకొని యిల్లుతుడిచి శుభ్రంచేసికొని ఫర్దన్‌కొడుకును చంకనెత్తుకొని కోఠీలోకివెళ్ళి అమ్మాబీగంగారి పడకగది చేరుకొనేది. అక్కడ మీటింగు ప్రారంభమయ్యేది. అమ్మాబీగం మంచంమీదపడుకొని నైరంగ్ ఏ ఖయాల్ లేక ఇస్మత్ అను మాస పత్రికలు చదువుతూవుంటుంది. ఖాలాబీగం నమాజు (ప్రార్థన) చేసుకొనే తివాచీమీద పడుకుంటుంది. ఎవరైనా అతిథులు ఆడవాళ్ళువస్తే వాళ్ళుకూడా మంచంమీద పడు కొంటారు. తమలపాకులు, వక్కలుగలపెట్టె ముందు వుంటుంది.

'వచ్చావా కదీర్ బీబీ ! రా ... కూర్చో.'

కమరున్ ఎంతో వినమ్రతతో తలవంచి అందరికీ సలాంచేసి అక్కడే పరిచి వుండే తివాచీమీద కూర్చుంటుంది. ఫర్దాన్ కొడుకుని అక్కడే ఒకప్రక్కన పడుకోబెట్టి నిద్రపుచ్చుతుంది. బాజీ అమ్మ ఆకు వక్క అందిస్తుంది.

'ఏం బీ ! ఇవాళ అన్నంలోకి ఏం చేశావు ?' అని అడుగుతుంది ఖాలా బీగం.

'కందిపప్పు, బీగంసాబ్.'

ఇక ప్రారంభవుతుంది తిండిని గురించిన చర్చ. కూరలధరలు, నేతిధరల మీద చర్చ జరిగినతరువాత అసలువిషయంమీద చర్చలు ప్రారంభమవుతాయి. పెండ్లి పేరంటాళ్ళనుగురించిన కథలు కుటుంబాల రాజకీయాలు అంటే అందరూ చెవికోసుకొంటారు. ఈ విధమైన సంభాషణల్లో కమరున్ పూర్తిగా పాల్గొంటుంది.

కమరున్ డ్రైవరు భార్యగా ప్రసిద్ధికెక్కింది. అందువలన కదీర్‌కూడా ఆమెను డ్రైవరు బీబీసాహిబా అని పిలుస్తూవుండేవాడు. సాయంత్రం కమాల్, అప్పీ, తలత్, అన్నయ్య తమతమ కాలేజీలనుంచి యింటికి తిరిగివచ్చేసరికి యిల్లంతా కళకళలాడిపోతుంది. వంటయింటిలో గిన్నెలచప్పుడు ప్రారంభమవుతుంది. టీ కప్పులు వాళ్ళవాళ్ళ గదులకు పంపబడతాయి. లేకపోతే అంతా అమ్మాబేగం దగ్గరకు చేరుకుంటారు. ఒకకప్పు టీ కమరున్ బీబీకికూడా యిస్తారు. అప్పీ, తలత్ కూడా కమరున్‌తో మాట్లాడుతూ వుంటారు. ఇంతలో మోటారు యింటికివచ్చేది. నవాబుగారిని కోర్టునుండి యింటికి కారులో కదీర్ తీసికొనివస్తూవుంటాడు. ప్రతి

రోజా నవాబుగారు పెద్దకోర్టుకు వాదించేందుకు వెళుతూనే వుంటారు. మోటర్ హారన్ వినగానే కమరున్ లేచి ముసుగువేసుకొని పిల్లవాణ్ణి ఎత్తుకొని త్వరత్వరగా తన కాటేజీకి వెళ్ళిపోతుంది.

గంగాదీన్ అన్నయ్యకు చాలాదగ్గరగా వుండేవాడు. అందుకు కారణం గంగాదీన్ మొదట అన్నయ్య తండ్రిదగ్గర కొలువుచేస్తూ వుండేవాడు. అక్కడి నుండి వచ్చి యిక్కడ ఉద్యోగంలో చేరాడు. అప్పటికి, అన్నయ్యకు జరుగవలసిన పెళ్ళిగురించికూడా గంగాదీన్ తన అభిప్రాయం వెల్లడించలేదు. ప్రపంచమంతా యీ పెండ్లి జరగాలని అన్నది. కాని అన్నయ్యకూడా యీ విషయమై తన అభిప్రాయం ఎవ్వరిదగ్గరా ప్రకటించలేదు.

# 22

1940 డిశంబరు మాసంలో తలత్ జూనియర్ కేంబ్రిడ్జి పరీక్షలో కూర్చోవలసి యున్నది. కాని సెప్టెంబరు మాసంలో ఆమెకు డబల్ నిమోనియా వచ్చింది. ఒక సంవత్సరం వృధా అయిపోయిందని ఆమె ఏడ్చిఏడ్చి ఆరోగ్యం పాడుచేసికొన్నది. ఇంట్లోవివాళ్ళంతా ఆమెకు నచ్చచెప్పేందుకు ప్రయత్నించారు. కాని నిమోనియా రావడాన్ని ఎవరాపగలరు?

ఒకరోజు ఉదయం హరిశంకర్ ఆమెదగ్గరకువచ్చి - 'తలత్! నీమేలుకోసం మేము ఒక ఏర్పాటుచేస్తున్నాం. నిన్ను టట్టర్‌వాలా స్కూల్లో చేరుస్తాము. ఏప్రియల్‌లో హైస్కూలు పరీక్షకు కూర్చోవచ్చు. ఆ తరువాత ఐ. టి. కాలేజీలో చేరవచ్చును.' అని చెప్పాడు.

'రఘువీర్‌మామ స్కూల్లోనా?' అని అడిగింది తలత్.

'అవును' అంటూ సమాధానంచెప్పి నాటకపద్ధతిలో రెండోవాకిలిగుండా బయటికి వెళ్ళిపోయాడు హరిశంకర్. తలత్ హైస్కూలు పరీక్ష ప్యాసై ఐ. టి. కాలేజీలో చేరబోతున్నదని తెలిసి నిర్మల గందరగోళం చేసింది. ఆమెమకూడా లామార్టినేయర్ కాలేజీనుండి తొలగించి తలత్‌తోబాటు క్రొత్తస్కూల్లో చేర్చారు.

టట్టర్‌వాలా స్కూలుకు ప్రత్యేకత వున్నది. అది ఒక పెద్దభవనం. ఇది రఘు మామ స్కూలు. బెనారస్ యూనివర్శిటీతో సంబద్ధ మొనర్చబడింది. ఎన్నిక చేయబడిన ఆడపిల్లలు మాత్రమే అందు చేర్చుకొనబడుతారు. గృహవాతావరణం అక్కడ ఎక్కువ. ఆ ప్రక్కనేగల యింట్లో రఘుమామ కుటుంబంతో వుంటున్నాడు. సాధుస్వభావం కలవాడు. పాత అభిప్రాయాలుకల కాయస్థుడు. పట్టణంలోని పెద్ద కుటుంబాలకు చెందిన ఆడపిల్లలు కార్లలోవచ్చి యీ స్కూల్లో చదువుకొంటూ వుంటారు.

లా మార్టి నేయర్ స్కూల్లో ఆంగ్ల వాతావరణం ఎక్కువ. టట్టర్‌వాలా స్కూలు మరోవిధంగా వుంటుంది. ఈ వాతావరణం వేరు. తలత్, నిర్మల యిద్దరూ తమ వర్గానికిచెందిన యితర కుటుంబాల బాలికలవలెనే ఇండో-యూరోపియన్ సభ్యతకు చెందిన వాతావరణంలో పెరిగారు. తెల్ల దొరసానుల చేతుల్లో పెరిగి పెద్దవాళ్ళయినారు. విద్యకూడా వాళ్ళకు చిన్నప్పటినుండి అలాంటిదే లభించింది. పెళ్లిళ్ల జరిగేటప్పుడుమాత్రం యీ విధమైన ఆడపిల్లలకు సిగ్గుపడటం మొదలుగాగల విషయాలు నేర్పడానికి భారతీయస్త్రీలను ప్రత్యేకించి నియమించేవారు. ఆడపిల్లల అభిప్రాయం తెలుసుకోకుండానే వాళ్ళ పెళ్ళిళ్ళు తల్లితండ్రులు చేస్తూ వుండేవారు. వాళ్ల 'మోడరన్లేకాని' అల్ట్రా మోడరన్లుమాత్రం కారు. పైకి యూరోపియన్ పద్ధతిని అలవర్చుకొన్నారే కాని అంతరంగంమాత్రం భారతీయ విధానాన్నిమాత్రం వదలలేదు. రెండురోడ్ల కూడలిలో వీళ్ళు యిళ్ళు కట్టుకొన్నారన్నమాట. అది జాగీర్దార్ల సమాజ సహకారంతో మారిపోతున్న భారతదేశంలో పాతపునాదులపై నిలబెట్టబడిన ఆంగ్ల మానసపుత్రుల సమాజమన్నమాట.

పంధొమ్మిదవశతాబ్దంలో దేశంలో రాజకీయచైతన్యం వచ్చింది. తత్ఫలితంగా ప్రాచీన భారతీయసంస్కృతికి క్రొత్తరూపం యివ్వవలెననే ఉద్యమం బయలుదేరింది. దేశంలో ఎక్కడచూసినా భారతీయ సంగీతం, భారతీయకళలు, భారతీయ నడవడికలనుగురించి ప్రచారం ప్రారంభమైంది. పాశ్చాత్యపద్ధతుల వలవాటు చేసికొనే నల్లదొరలను ఎగతాళిచేయడం ప్రారంభమైంది. కాంగ్రెసుఉద్యమం యీ క్రొత్తరకం ఉద్యమానికి బలం చేకూర్చింది. కాని మతతత్వాలుకూడా మరో వైపున తలఎత్తి ప్రాచీన హిందూసంస్కృతినిగురించి ఇస్లాం స్వర్ణయుగాన్ని గురించి చర్చలు ప్రారంభించాయి. దానితో సమైక్యజాతీయత, విరుద్ధ భారతీయ

సభ్యతలనే ఆదర్శం చెడ్పతిన్నది. భారతీయత అంటే ఏమిటి అనుప్రశ్న బయలు దేరింది. హిందువులు వ్యాప్తంచేసిన రాజకీయనాటకం అని ఒక రాజకీయపార్టీ ప్రచారం చేయసాగింది. ఈ దేశంలో పూర్వంనుండివుండేది హిందువులేనని, ముస్లిములు విదేశీయులని మరో రాజకీయపార్టీ ప్రచారం మొదలుపెట్టింది. గుల్‌షిషా భవనానికి సంబంధించిన సర్వెంట్సు క్వార్టర్సులో నివసిస్తున్న మీర్జాపూరుకు చెందిన కమరున్నీసానుగాని, రమదయ్యా పనిమనిషినిగాని యీవిషయంలో మీ అభిప్రాయం ఏమటని అడిగినవాళ్ళు ఒక్కరూ కనబడరు.

తలత్, నిర్మల లిద్దరూ ఇండో-యూరోపియన్ సభ్యత నలవర్చుకొంటున్న ఈ వర్గానికి చెందినవాళ్లు. అందువల్ల లామార్టినేయరునువదలి రఘుమామ స్కూల్లో చేరగానే అక్కడివాతావరణానికి అనుకూలంగా త్వరలోనే వాళ్ళు మారి పోయారు. అక్కడివాళ్లతో కలిసిపోయారు.

యుద్ధం ప్రారంభమై ఒకసంవత్సరం గడిచిపోయింది. కాంగ్రెస్‌మంత్రులు రాజీనామా లిచ్చేశారు. రాజకీయవాతావరణం రోజురోజుకీ పాడైపోసాగింది.

మార్చినెలలో బాలికలు పరీక్షల్లో కూర్చునేందుకు వారణాసి బయలుదేరారు. హరిశంకర్, కమాల్-తలత్, నిర్మలలను బండి ఎక్కించేందుకు స్టేషనుకు వచ్చారు. 'మీరు పదండి. మా పరీక్షలుకాగానే మీవెనక మేమూ వస్తాము. రాంనగరం మామిడిపండ్లు తిని చాలారోజులైంది' అని అన్నారు కమాల్. కమాల్ హరి శంకర్ యిరువురికి యిది అలవాటే. ఎండాకాలపు సెలవులువచ్చాయో యింట్లో వుండరు. దేశమందంతటా తిరుగుతూవుంటారు. విద్యార్థుల సమితిసమావేశాలకి ఢిల్లీ వెళుతున్నామని, ఇందిరాగాంధీ పిలిచింది, అలహాబాదు వెళుతున్నామని చెప్పడం, వెళ్ళిపోవడం యిదీ వాళ్ళపద్ధతి.

'వారణాసినుండి యింకా ఎక్కడికివెళతారు?' అని అడిగింది నిర్మల.

'అరే మేము సన్యాసులం. తలఎత్తి ఎటుచూస్తామో అటు బయలుదేరి వెళ్ళి పోతాం.' అంటూ కమాల్ సమాధానం చెప్పాడు. ఆడపిల్లలు ప్లాట్‌ఫారంమీద తమ పెట్టెలదగ్గర నిలబడి మాట్లాడుతున్నారు. రఘుమామ వాళ్ళప్రయాణానికి నానాఅవస్థలుపడి అవసరమైన ఏర్పాట్లు చేస్తున్నారు.

'గొప్పసన్యాసులే బయలుదేరారు. దొంగసన్యాసులు' అంటూ ఫక్కున నవ్వింది నిర్మల.

ఇంతలో రైలువచ్చింది. అంతా వారణాసి బయలుదేరారు.

# 23

చంపా అహమద్ బిసెంట్ కాలేజీ కిటికీలోనుంచి క్రిందికి తొంగిచూసింది. వడగాలి వీస్తున్నది. దూరాన రోడ్డుమీద ఒక కొంగ ఎగురుతూ వున్నది. క్రింద విశాలమైన కాలేజీమైదానం మటమటలాడే ఎండలో కాలిపోతున్నది. వర్షం ఎప్పుడు కురుస్తుందోనని అనుకున్నది చంప. గంట మ్రోగించి. బాలికలంతా బైటకువచ్చారు. లీలాభార్గవతో కలిసి చంప మెట్లుదిగి రోడ్డుమీదకు వచ్చింది. గుర్రపుబండిలో కూర్చొని వాళ్లు విశ్వవిద్యాలయానికి బయలుదేరారు.

బిసెంట్ కాలేజి. విశ్వవిద్యాలయం. ఇల్లు యివి చంపజీవితంలో నిత్యము జరిగేకార్యక్రమం. తరువాత చలికాలం, ఎండాకాలం, వర్షాకాలం, వారణాసి పట్టణం, తనపేట, బంధువులు, పుస్తకాలు - ఇవిమాత్రమే ఆమెకు తెలుసు. ఆమెకు పద్దెనిమిదిసంవత్సరాల వయస్సు. కాని వయసుమీరినవారివలె ఆలోచిస్తూ వుంటుంది. కవుల్లా భావలోకంలో విహరిస్తుంది. చిన్నపిల్లల్లా నవ్వుతుంది. దుఃఖి స్తుంది. ఆమెతండ్రి మధ్యమవర్గానికి చెందిన పెద్దమనిషి. తల్లికూడా అంతే. ఆమెది మంచిస్వభావం. వాళ్ళయింటిలో 'ఆర్భాటం' లేదు. చారిత్రిక కథలు లేవు. పాత అలవాట్లు లేవు. చంపతండ్రి వకీలు. మురాదాబాద్ నివాసి. చంప మేన మామలవూరు వారణాసి. అక్కడికేవచ్చి చంపతండ్రి వకీలువృత్తిసాగిస్తున్నాడు. ఆదాయం సామాన్యం. వాళ్ళయింట్లో టెలిఫోనులేదు. కారులేదు. పెద్దభవనంలో వుండటంలేదు. తల్లితండ్రులకు చంపఒక్కతే కుమార్తె. అందువలన గారాబం ఎక్కువ. ఆమెపెళ్ళికి కావలసినసొమ్ము తండ్రి ముందే కేటాయించివుంచాడు. సంబంధాలు బాగావస్తున్నాయి. బి. ఏ. ప్యాసైనతరువాత చంపకు పెళ్ళిచేద్దామని తల్లితండ్రులు అభిప్రాయపడ్డారు. చంప కాన్వెంట్‌స్కూల్లో చదవలేదు. ఎండా కాలంలో ఎన్నడూ మసూరీవెళ్ళి మంచుకొండలమీద షికార్లు చేయలేదు. చంపకు ఒక మేనమామ లక్నోలో వుంటున్నాడు. అతనిపని ఆర్థికంగా బాగా వున్నది. వజీర్‌హసన్ రోడ్డుమీద ఆయనగారికి ఒక భవనం వున్నది. చంపతండ్రికి రాజ కీయాలంటే యిష్టం. అప్పుడప్పుడు రాజకీయాల్లో పాల్గొంటూవుంటాడు. ఆమె పినతండ్రి ఒకడు మురాదాబాద్‌నగర ముస్లింలీగుకు అధ్యక్షుడు.

చంప కాలేజినుండి యింటికివచ్చి పై అంతస్థుమీదకువెళ్ళి ఆకాశాన్నంటుతూ వుండే శివాలయాల గోపురాల్ని చూస్తూవుంటుంది. వినుగుపుడితే వెళ్ళి ఇంగ్లీషు నవలలు చదువుతుంది. జేన్ ఆస్టిన్ అంటే ఆమెకు యిష్టం. వంధొమ్మిదవశతాబ్దపు కీట్స్, రాజటీ లన్నా ఆమెకు యిష్టమే. యూనివర్శిటీ లైబ్రరీలో అవనీంద్రనాథ్ టాగూర్, నందలాల్‌బోసుల పటాలుచూచి ఆమె ఎంతో వంతోషవడుతుంది. చంపా అహమద్ కూడా చక్కని అభిరుచిగలవ్యక్తి అని చెప్పవలసిన అవసరం లేదనుకొంటాను.

లీలాభార్గవతోబాటు ఆమె విశ్వవిద్యాలయం చేరుకొన్నది. అక్కడకూడా వరీక్షావాతావరణం అలుముకొనివున్నది. పరీక్షలహడావుడి ఎక్కువగా వున్నది. అన్నీ తెలిసినముఖాలే. ఈ ఆడపిల్లలు, మొగపిల్లలు అంతా ఆమె ప్రపంచపు వాసులే. ఇది ఒకనమాజం. విచిత్రమైన సమాజం. విద్యార్థులు, విద్యార్థినులు, లెక్చరర్లు, దాక్షిణాత్యులు, బెంగాలీలు, మునలి ప్రొఫెసర్లు, అంతా ఆమెకు తెలిసిన వారే. విశ్వవిద్యాలయం జ్ఞానానికి నిలయం. పెట్టనికోట. జ్ఞానజగత్తులో మత సంప్రదాయాలకు తావు ఎలా చిక్కుతుందో ఆమెకు తెలియదు. మతతత్వం, సంకుచితత్వం, సందేహాలు, అనుమానాలు, పిడివాదం మొదలుగాగల దయ్యాలతో ఆమెకు పరిచయం కలుగలేదు. పరిసరప్రపంచం ఎక్కువ గొడవచేస్తూ వుంటుందని, ప్రశాంతంగా వుండదనీ, ఆమె అభిలషించే శాంతిని లేకుండా చేస్తుందనిమాత్రం ఆమెకు తెలుసు. అందుకే ఒక్కొక్కప్పుడు రొదచూసి విసుక్కుంటూ వుంటుంది.

ఎదురుగా ఒక పెద్దఅరుగుమీద పందిరిలో హైస్కూలు విద్యార్థులకు వంగీత వరీక్ష జరుగుతూవున్నది. నాలుగువైపులనుండి ఆడపిల్లల కూనిరాగాలు వినబడుతున్నాయి. లక్నోనుండివచ్చిన ఆడపిల్లలజట్టుకూడా అక్కడే వున్నది.

ఇంతలో గంటమ్రోగింది. పందిరినుండి బాలికలు బైటకు రాసాగారు. ఇద్దరు ఆడపిల్లలు చిన్నపిల్లల్లా ఎగురుతూ మెట్లమీదినుండి క్రిందికి దిగారు. ఇంతలో యిద్దరు యువకులు గుంపులోనుండి వాళ్ళదగ్గరకు వచ్చారు. ముఖాలుచూస్తే వాళ్లు ఆ ఆడపిల్లల అన్నల్లా వున్నారు. రామనగర్‌స్టేటుకు చెందిన కారువచ్చి ఆగింది. వాళ్ళు నలుగురువెళ్లి ఆ కారులో కూర్చున్నారు. మరుక్షణమే కారు దుమ్ము రేగ గొడుతూ వచ్చినదారిన తిరిగి వెళ్ళిపోయింది.

వారణాసి చేరినతరువాత తలత్, నిర్మల మిగతా ఆడపిల్లలు ఒకమేడలో వున్నారు. విశాలమైన మైదానంవంటి ఆవరణలో కట్టబడిన మూడంతస్తుల మేడ అది. ఆ మేడయజమానురాలు ఒక బ్రాహ్మణవితంతువు. ఆమెకు పిల్లలులేరు. ధనవంతురాలు. ఎప్పుడూ తీర్థయాత్రలు చేస్తూవుంటుంది. 'థీరీ ఆఫ్ మ్యాటిక్' పరీక్ష కాగానే కమాల్, హరిశంకరలు అమాంతం ఊడిపడ్డారు. తలత్, నిర్మల్ పరీక్ష కాగానే బైటకువచ్చారు. సరస్వతీదేవాలయందగ్గర యిద్దరు ఆడపిల్లల్ని శ్రీమతి కేల్కార్‌తో మాట్లాడుతూవుంటే చూశారు. ఆడపిల్లలనమీపాన్నుంచే కమాల్,హరిశంకర్లు ప్రత్యక్షమైనారు. వారిలో ఒక అమ్మాయి కుందనపుబొమ్మలా వున్నది. మంచి అంగసౌష్ఠవం. కమాల్, హరిశంకర్ లిరువురు వారణాసివచ్చి రామనగర్ దివాన్‌గారింట్లో మకాం బెట్టారు. తలత్, కమాల్ బంధువు ఆ దివాన్. ఎండలో కారుఎక్కి ఆ నలుగురు దివాన్‌గారియింటికి చేరుకొన్నారు. తలత్‌కు త్రోవలో కదీర్‌డ్రైవరు జ్ఞాపకం వచ్చాడు.

'కమరున్‌కోసం చీరెలు, గాజులు కొనాలి' అని అన్నది బిగ్గరగా తలత్.

'ఇంకా నీ కొనుగోలువ్యాపారం ప్రారంభం కాలేదన్నమాట' అని అన్నాడు కమాల్.

'లేదు. ఏదీ డబ్బు!' అంటూ చేయిచాచింది తలత్.

మొగపిల్లలిద్దరు కోపంతో ఆడపిల్ల లిద్దరివంక చూశారు.

'మేము గొప్ప ధనికులమనా మీ అభిప్రాయం? అసలు మనయిల్లు గడుస్తుందా?' అని అన్నాడు గద్దిస్తూ కమాల్.

'మేము బీద బ్రహ్మచారులం. దిక్కులేనివాళ్లం. విద్యార్థులం. దానాలమీద విరాళాల మీద కాలం గడుపుతున్నాం' అని అన్నాడు హరిశంకర్.

'అయినా మేము పాదుషాలవంటి విండుహృదయం కలవాళ్ళం' అని అన్నాడు కమాల్.

'నీవు అంటున్నది నిజం' అని అన్నాడు కంఠం సరిచేసికొంటూ హరిశంకర్.

'సరేకాని ఆ సరస్వతీమందిరందగ్గర నిలబడివున్నదే ఆ మహాసుందరాంగి ఎవరో తెలుసుకొని మాకు చెబితిరా, వారణాసిలోనున్న గాజులన్నీ కొనితెచ్చి మీ ముందు పోస్తాం' అని అన్నాడు కమాల్.

'ఎవ రా మహాసుందరాంగి ?' అంటూ శలత్, నిర్మలలు ఒకరిమొహం ఒకరు చూచుకొన్నారు.

'ఆమెజాడ, చిరునామా తెలుసుకొంటిరో చాలు' అని అన్నాడు హరిశంకర్.

'అన్నయ్యలూ! మీకోసం ఆడపిల్లల చిరునామాలు తెలుసుకోవడమే మా ఉద్యోగం అనుకొన్నారా!' కోపంతో అన్నది నిర్మల.

ఈవిధంగా పోట్లాడుకొంటూ నలుగురూ రామనగర్ చేరారు. అక్కడ హాయిగా మామిడిపళ్ళు తిన్నారు. బంధువులతో గప్పాలుకొట్టారు. దివాన్‌గారి బీగంసాహబా, హరిశంకర్‌కు వారణాసిలో పెద్దకుటుంబాలకు సంబంధించిన చాలా మంది ఆడపిల్లలనుగురించి చెప్పి పెండ్లికి ఒప్పుకోమని తొందరపెట్టింది. సంతోషంగా కాలం గడచిపోయింది.

వైశాఖం గడచింది. జ్యేష్ఠ ఆషాఢమాసాల్లో ఫలితాలు వెలువడ్డాయి. చంపా అహమద్ పరీక్ష ప్యాసయింది. పై చదువు లక్నోలో సాగించాలని నిర్ణయించారు తల్లితండ్రులు. లక్నోలోనున్న ఆమె మామగారికి చంపాబీగం లక్నో వస్తున్నదని జాబు వెళ్ళింది.

లీలను ఆమె యింటిదగ్గరవదలి రోజూమాదిరిగా చంప యింటికి వచ్చింది. వెళ్ళి వరాండాలో కుర్చీమీద కూర్చున్నది. లైట ఆఫీసురూములో ఆమెతండ్రి ఎవరితోనో కోర్టువిషయాలు మాట్లాడుతున్నాడు. ఇంతలో వాళ్ళమ్మ వచ్చి 'నీకు ఓ జాబు వచ్చిందటమ్మా' అంటూ ఒక కవరు ఆమెచేతికి అందించి వంటయింట వైపుకు వెళ్ళిపోయింది.

చంపకు ఆశ్చర్యం వేసింది. కవరుచింపి జాబుతీసి చూచింది. వ్రాత ఎవరిదో బోధపడలేదు. మసూరినుండి వచ్చిందా జాబు. ఇంగ్లీషులో వున్నది. 'మై డియర్ చంపా!' అంటూ సంబోధన వున్నది. ఈ సంవత్సరం నీవు మా కాలేజీకి వస్తున్నావనితెలిసి చాలా సంతోషించాము' అంటూ ఆ కాలేజీనిగురించిన వివరాలు అందు వ్రాయబడివున్నాయి. తరువాత హాస్టల్సునుగురించినవివరాలు వున్నాయి. చివరకు లక్నోవస్తున్న క్రొత్తఅమ్మాయినిగనుక నన్ను నీకు 'సలహాదారు'గా వుండమని కోరినందున తాను అంగీకరించానని, 16-వ తేదీన ఆమె కాలేజి వచ్చినప్పుడు ఫ్లారెన్సు నికల్స్ హాల్ మెట్లమీద కలుసుకోగలనని, అప్పుడు సమక్షంలో మిగతా

సమస్యల్నిగురించి చర్చించవచ్చుననికూడా వ్రాసివున్నది. క్రింది 'తహమీనా రజా. రోజ్ మౌంట్-మసూరీ' అని వ్రాయబడివున్నది.

ఈ తహమీనా రజా ఎవరా అని, ఆమెకు తన చిరునామావివరాలు ఎలా తెలిసి నవా అని ఆలోచించసాగింది చంప. ఈ జాబువెనుక ఏదో రహస్యంవున్నదని ఆమెకు అనిపించింది. ఇలాంటివిషయాలు తరుచు నవలల్లోమాత్రమే చదువుతూ వుంటాము. తాను ఒక విచిత్రమైన వాతావరణంలోకి, ఒక విచిత్రమైన ప్రపంచం లోకి అడుగుపెట్టబోతున్నట్లనిపించింది.

ఆమె అభిప్రాయం సరియైనదే.

# 24

మాటప్రకారం తహమీనారజా పదహారవతేదీనాడు ఫ్లారెన్సు నికల్సహాలు మెట్ల మీద చంపా అహమద్ ను కలుసుకొన్నది. ఆరోజున చంప కొంచెం కంగారుగా మెట్లమీదచూస్తూ నిలబడింది. ఇంతలో ఆమెకు సమవయస్కురాలైన ఒక యువతి ముందుకువచ్చి 'చంపా అహమద్ నీవేనా?' అని అడిగింది.

'అవును.'

'నావెంట నడు.'

మరుక్షణంలో చంప చాంద్ బాగ్ ప్రపంచంలో కలిసిపోయింది. ఆ రాత్రి క్రొత్తగా వచ్చిచేరిన ఆడపిల్లలకు కాలేజీవిధానాలనుగురించి ఒక లెక్చరు ఏర్పాటు చేశారు. కాలేజి అధికారులు అక్కడి జీవితవిధానాలనుగురించి పరిచయంచేశారు. ప్రతిసంవత్సరం కాలేజీ ఆఫీసువారు క్రొత్తగావచ్చిచేరే ఆడపిల్లల చిరునామా వివరాలు సీనియర్ బాలికలకుపంపి వారిని సలహాదార్లుగా నియమిస్తారని చంప తెలుసుకొన్నది.

తహమీనా చెల్లెలు తలత్ఆరా మొదటిసంవత్సరంలో చేరింది. 'అరే చంపా బాజీ! నిన్ను వారణాసిలో చూశాను.' అని అన్నది ఎంతో పరిచయంవున్నదానిలా.

చంప మిగతా అంపల్లలతోకలిసి గుల్‌ఫిషా బంగళాకి వెళ్ళవచ్చింది. అక్కడ అంతా ఆత్మీయంగా ఆమెను కలిశారు. ఆదరంగా చూశారు. సింఘాడావారీ భవనంకూడా ఆమెకు స్వాగతం చెప్పింది. శంకర్ శ్రీవాత్సవ వ్యయంగా ట్రేలో టీ తెచ్చి ఆమెముందు వుంచారు.

ఒక ఆదివారంనాడు మూడుజాములప్పుడు చంప గుల్‌ఫిషాం వెళ్లింది. తలత్, తహమీనా వెనుకనున్న వరండాకు ప్రక్కగదిలో కిటికీదగ్గర కూర్చొనివున్నారు. నిర్మల ఆ ప్రక్కనే కూర్చొని బంగాళాదుంపలు వొలుస్తున్నది. ప్రక్కనే పెద్ద ఉల్లిపాయలు, పచ్చిమిరపకాయలు వున్నాయి. సాయంత్రం అక్కడ విందు ఏర్పాటు వున్నట్లున్నది.

చంపకూడా కూర్చొని బంగాళాదుంపలు చేతిలోకితీసికొని పనిలో లీనమై పోయింది. ఇంతలో అన్నయ్య లోపలికివచ్చారు. టెన్నిస్ రాకెట్ అతనిచేతుల్లో వున్నది. ఎంతో అందంగా వున్నాడు. తహమీనా స్నేహితురాండ్రు యింట్లో వున్నప్పుడు సామాన్యంగా అన్నయ్య లోపలికి అడుగుపెట్టడు. అసలు తహమీనా వెంటవుండే గుంపుఅంటే అతనికి గిట్టదు. తహమీనాకు నిజమైనస్నేహితులు కమాల్ హరిశంకరులే.

ఏది ఏమైనా అన్నయ్య అన్నయ్యేకదా!

చంపా కూర్చుని చాకుతో బంగాళాదుంపలు వొలుస్తున్నది. వ్రేలు కోసుకో లేదు.* సాయంత్రం జరుగబోయే విందునుగురించి ఏమో అడుగుదామని తహమీనాదగ్గరకు అన్నయ్య వచ్చాడు. ఆమెతో మాట్లాడి తిరిగి వెళ్లిపోయాడు.

కాని తనగదికివచ్చి గంగాదీన్‌నుపిలిచి 'అక్కడవున్న ఆ క్రొత్తఅమ్మాయి ఎవరు?' అని ప్రశ్నించాడు.

'నాకు తెలియదండి' అంటూ కంగారుపడ్డాడు గంగాదీన్. ఇంతవరకు ఎప్పుడూ అన్నయ్య ఆడపిల్లల్నిగురించి అడుగలేదు.

---

* హజరత్ యూసఫ్ చాలా అందగాడు. మిశ్రదేశంలో పాదుషా కుటుంబంలోని నవ యువతులు నిమ్మకాయలు తరుగుతున్నారు. ఇంతలో యూసఫ్ వాళ్ళ కంటబడ్డాడు. యూసఫ్‌నుచూస్తూ యువతులు మైమరచిపోయారు. నిమ్మకాయలకుబదులు వ్రేళ్ళు కోసు కొన్నారు.

అసలు పెద్దమ్మాయిగారికీ అన్నయ్యగారికి పెళ్ళి జరుగుతుందని అందరూ అనుకొంటూవున్నారు. 'పెద్దమ్మాయిగారిదగ్గరకు చాంద్ బాగ్ పిల్లలు చాలామంది వచ్చిపోతూవుంటారు బాబూ!' అని అన్నాడు గంగాదీన్.

'సరే. మంచిది. పో.'

కమాల్ వచ్చాడు. అతణ్ణి ఎలా అడగడం ఆ అమ్మాయి ఎవరని? తలత్ కోపస్వభావాన్నిగురించి అన్నయ్యకు తెలుసు. పౌండ్లులద్వారానైనా తెలుసుకొనేందుకు తాను ప్రయత్నిస్తే పట్టణమంతా టమటమా వేస్తుందని తెలుసు. పెద్ద చిక్కే వచ్చింది. తహమీనాతో 'అధికారయుతంగా' (అఫీషియల్)గా ముడిపడిపోవడం వలన యింకో అమ్మాయిని కన్నెత్తిచూసేందుకుకూడా వీలులేకుండాపోయింది. ఏమిటీ ఖైదు! ఏమిటీ బాధ!

నిజానికి అతడు పూర్తిగా ఏకాకి అయిపోయాడు.

అన్నయ్య తన సొంతవిషయాల్లో తానే మునిగివుండిపోయాడు.

'ఇతగాడు తహమీనాకు కాబోయే వరుడని, కాని తహమీనామాత్రం అతగాణ్ణి లక్ష్యపెట్టదని' అమల అనే స్నేహితురాలు చంప చెవిలో ఊదింది.

నిజంగా ఇదొక ప్రత్యామ్నాయమైన పరిస్థితి. గుల్ ఫిషాంవంటి హర్మ్యాలలో నివసించేవాళ్ళనుగురించి చాలాకథలు చంప వినివున్నది. అన్నింటిలోను యిటువంటి వ్యవహారాలే సాగుతుంటాయన్నమాట.

దగ్గరగావుండిచూస్తే యీ కథల్లో ఏమీ వుండదు. ఇతరుల జీవితాలను కథలుగా భావించేవాళ్ల జీవితంకూడా ఒక కథే కదా! తన జీవితకథనుకూడా మరొకరు చదువుతున్నారనేవిషయం చంపకు అప్పుడు బోధపడలేదు.

వర్షాకాలం గడచిపోయింది. కార్తీకపూర్ణిమ వచ్చింది. మాఘ పుష్య మాసాల గాలి వీచింది. గదుల్లో చలికుంపట్లు వెలిగాయి. పార్కులన్నీ మంచుతెరలతో కప్పబడిపోయాయి. రాత్రిళ్ళు పుష్పాలమీద మంచుబిందువులు కురిశాయి. చాంద్ బాగ్ లో క్రిస్మస్ కు ఏర్పాట్లు ప్రారంభమైనాయి. ఆ సంవత్సరం చలి విపరీతంగా వుండటంవలన ధనవంతులు క్రొత్తరకంప్యాషను చలికోట్లు కుట్టించారు. బీదవాళ్లు చలికి కొంకర్లుపోయి చనిపోయారు. చలిరోజులు గడిచాయి. వసంతఋతువు వచ్చింది. ఎండాకాలం ప్రారంభమైంది. వట్టివేళ్ళతడికెలు విపరీతంగా అమ్ముడుపోయాయి. మల్లెపూలు విపరీతంగా పూశాయి. వడగాలులు బాగా వీచాయి. గోమతీ

వది యమునలో పుచ్చకాయలు, పెద్ద దోసకాయలు విపరీతంగా పండాయి. శ్రావణ మాసం వచ్చింది. మామిడిచెట్టు కొమ్మలకు ఊయలలుకట్టి జనం ఊగారు. ముఖ్యంగా ఆడవాళ్ళసంబరానికి అంతులేదు. ఒకసంవత్సరం గడచిపోయింది. చూస్తూచూస్తూండగ జీవితంలో అమూల్యమైన ఒక విందుసంవత్సరం పూర్తిగా గడచిపోయింది. అదిగో దీపావళి వస్తున్నది.

తలత్ గుల్‌ఫిషాం మహలు వెనుకభాగంలోని వరాండాలో కూర్చొనివున్నది. అక్కడినుండి పూతోట ఎంతో అందంగా కనబడుతూవున్నది. ఆకాశమంతా నీలంగావున్నది. భూమిమీద పచ్చదనం వ్యాప్తమైవున్నది. నీలిరంగు పచ్చరంగులో కలిసిపోయిందా అన్నట్లున్నది. లోపల అన్నయ్య వైలిన్ వాయిస్తున్నాడు. తలత్ నేలమీద పడుకొన్నది.

మరోసంవత్సరం గడిచిపోయింది. అన్నయ్య విశ్వవిద్యాలయం వెళ్లడం విర మించుకొన్నాడు. పోటీలలో పాల్గొనేందుకు సిద్ధపడుతున్నాడు. కమాల్, హరి శంకర్ యిద్దరూ ఎం. ఏ. ఆఖరిసంవత్సరం చదువుతున్నారు. అప్పీ బి. ఏ. పూర్తిచేసింది. తలత్ నిర్మలలు రెండోసంవత్సరంలో వున్నారు. అన్నయ్య వ్యవహారంలో మార్పు కనబడుతున్నది. చంపాబాజీని ప్రేమిస్తున్నట్లున్నది. చంపకుకూడా అన్నయ్య అంటే యిష్టమే. చంపాబాజీ అంటే ప్రపంచమంతా పడి చస్తున్నది. కమాల్ హరిశంకర్‌లు ఎప్పుడూ ఆమెను పొగడుతూ వుంటారు. 'నీవు పెద్దదానివైతే చంప ఎంత అందగత్తో నీకే తెలుస్తుంది' అని తలత్‌తో వాళ్లిద్దరూ అంటూవుంటారు. 'అంధగత్తె అయితే ఏం? కానియ్యండి' అని మౌనం వహిస్తుంది తలత్.

అప్పీ అంటే వాళ్ళందరికీ యిష్టమే. అప్పీ మంచిమనిషి. అందరితో మంచిగా కలివిడిగా వుంటుంది. ఆమెది గొప్పహృదయం. అప్పీ-చంపాబాజీ యిద్దరిలో ఎవరిది గొప్పహృదయం? హృదయం ఎవరికి కావాలి? తలత్‌కు బాధ కలిగింది. మొగవాళ్లు పైపై అందంచూసి మురిసిపోతారు. చంపాబాజి ఎర్రగా బుర్రగా వుంటుంది. అప్పీ అలావుండదు. అంతేగదా! శరీరలావణ్యానికేనన్నమాట మురిసి పోవడం? ఏం మొగవాళ్లు!' అంటూ నిట్టూర్పువిడిచింది తలత్.

కమాల్ దెహరాదూన్ రోడ్డుమీద నడుస్తున్నాడు. ప్రతిసారిమాదిరిగానే యీ పర్యాయంకూడా అతడు దీపావళిసెలవుల్లో పర్యటనకు బయలుదేరాడు. అతనికి

తెలిపిన లా మార్టినేయర్ కాలేజీలో పనిచేసిన పాత ఆంగ్ల ప్రొఫెసరు కొద్ది సంవత్సరాలక్రితమే ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయంనుండి బయటకువచ్చి సాధువుగా మారి యింటినుండి పారిపోయాడు. అతణ్ణి పట్టుకొనేందుకై కమాల్ పంపబడ్డాడు. ఆ ప్రొఫెసరుకు కమాల్ ప్రియశిష్యుడుగా వుండేవాడు. హరిశంకర్‌తోబాటు బయలుదేరి కమాల్ హరిద్వారంచేరుకొని ప్రొఫెసర్‌కోసం గాలించిచూశాడు. ఒకరోజున యోగమాయ దేవళందగ్గర సాధుమహారాజ్ దొరికాడు. 'నాయనా! జంజాటంనుండి బయటపడ్డాను. ఇక ఆ రొంపిలోకి అడుగుపెట్టను. నన్ను తిరిగి తీసుకువెళ్లకు బాబూ?' ఇక్కడ హాయిగావున్నాను. అని అతడు చేతులు జోడించాడు. 'ప్రచారంకోసం మీరు ఒక రాకెట్ వదిలారని లక్నోలో అంతా అనుకొంటున్నారు' అని అన్నాడు కమాల్.

'నమస్కారం బాబూ! ఎవరు ఏమనుకొన్నాసరే. నన్ను వదలండి నాయనా!' అంటూ కట్టుకొన్న కాషాయబట్టలు సర్దుకొని గబగబా లేచివెళ్ళిపోయాడు. అడవుల్లోకివెళ్ళిపోయి మాయమైనాడు. కమాల్ హరిశంకర్ లిరువురు యిక లాభం లేదని నిర్ణయించుకొన్నారు. డెహరాడూన్ రోడ్డుమీద హరిశంకర్‌తోబాటు నడుస్తున్నాడు కమాల్.

'హరిశంకర్!' అని అన్నాడు కమాల్.

'ఏమిటి బంధూ!'

'ఈ ప్రొఫెసర్ హామిల్టన్ అన్నమాటలు నిజమేనోయ్. దేవుడితోడు. మనం చాలాగొడవల్లో పడివున్నాము. ఎందుకొచ్చిన జంజాటంచెప్పు ఇదంతా' అని అన్నాడు కమాల్.

ఆరోజున కమాల్ మనస్సు ఏమీ బాగుండలేదు. ఏదో వేదాంతధోరణిలో పడ్డాడు. మనస్సు అదోలా వుంది. మాటమారుస్తూ హరిశంకర్. 'ఈ ఇండ్ల పేర్లు చదువుదాం పద! పేర్లనుబట్టి యిండ్లవాళ్ల మన స్తత్వం తేలికగా బోధపడుతుంది.' అంటూ హరిశంకర్ ఒక యింటి సింహద్వారందగ్గర ఆగిపోయాడు.

'మన కెందుకా గొడవ! మనమేం యిళ్ళు కడతామా పెడతామా! రాజుల కెందుకోయీ పేదలచింత!' అని అన్నాడు కమాల్.

'సరేకాని యిటుచూడు. ఆ పేరు చదువు. మనసుకి సంబంధించిన వ్యవహారం. ఆ పేరు చదువు.'

'ఖ్వాబిస్తాన్' (స్వప్నజగత్తు) బలేబలే.'

'నీవు వుండేదీ గుల్‌ఫిషాంలోనే కదా!'

'అవును.'

'కమాల్!'

'ఏమిటి!'

'కొంచెం ఆలోచించు. ఇళ్లు కట్టుకొన్నారుకదా జనం. ఈ కొననుండి ఆ కొన వరకు మేడలే మేడలు. అందమైనవి.'

'అవును విచిత్రంగానే వున్నది. అన్నీ ఎంతో అందంగానే వున్నాయి.'

వాళ్ళిద్దరూ ఒకద్వారంముందు అరుగుమీదకూర్చుని యీ సమస్యనుగురించి యోచించడం ప్రారంభించారు. నిజానికి యౌవ్వనంలోవున్న ఇంగ్లీషుప్రొఫెసరు ప్రపంచాన్ని వదలివేసి వెళ్ళిపోయినఘట్టం వాళ్లమనస్సులో బాగా నాటుకు పోయింది. ఏమిటో బాధపడుతున్నారు. ఒక తెలివైనవాడు, విజ్ఞానవేత్త, యువకుడు అడవులకు వెళ్ళిపోయాడు.

'అందుకు ఏదో కారణం వుంటుంది.'

చీకటిపడిందాకా వాళ్ళిద్దరూ యిళ్ళపేర్లు చదువుతూ తిరుగుతూవున్నారు. దౌలత్ ఖానా, ఆషియానా, రాజమహల్, షమరాక్ వగైరా వగైరా ఏమేమో పేర్లు కనబడ్డాయి.

ఈ మేడల్లోవున్న చెట్లు, తోటలు పూలుతోను - పళ్లతోను కళకళలాడు తున్నాయి. నిజానికి ప్రపంచం ఎంతో అందమైనచోటు.

వాళ్ళిద్దరు మళ్ళీ ఒకయింటి సింహద్వారంముందు కూర్చున్నారు. ప్రక్కనే ఒక పెద్ద వాగు ప్రవహిస్తున్నది. రోడ్డుకు ప్రక్కప్రక్కగా ప్రవహిస్తున్నది ఆ వాగు. ఆ నీటిప్రవాహంలో ఒక తెగిపోయినచెప్పు మునుగుతూ తేలుతూ వేగంగా కొట్టుకు పోతున్నది.

# 25

ఇంకా రెండుసంవత్సరాలు గడిచాయి. 1942 ఆగష్టు ఉద్యమంకూడా పాతపడి పోయింది. పండిత జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా అజాద్‌వంటి నాయకు లంతా అహమద్‌నగర్‌కోటలో నిర్బంధింపబడ్డారు. ప్రపంచరంగు త్వరత్వరగా మారిపోతున్నది. సమాజంలో ఎటుచూపినా మిలటరీవాళ్ళు కనబడుతున్నారు.

గుల్‌ఫిషాఁకుచెందిన సైయద్ అమిర్ రజాకూడా ఇంపీరియల్ సర్వీసుపోటీల్లో విజయం సాధించలేక చివరకు నౌకాదళంలో కమీషన్ స్వీకరించాడు. తహమీనా ఎం. ఏ. ఆఖరిసంవత్సరంలోకి వచ్చేసింది. చంప ఎం. ఏ. మొదటిసంవత్సరంలో వున్నది. కైలాష్ హాస్టల్లో వుంటున్నది. తలత్, నిర్మలు ఇంకా పట్టభద్రులు కాని విద్యార్థినులు. వాళ్లిద్దరూ పదిమంది పెట్టు. చంపలో గొప్పమార్పు వచ్చింది. 'ఆధునిక వివేకవంతుల బృందం'లో ఆమెకూడా చేరిపోయింది. ఆ పట్టణంలో ఆ బృందానికి ప్రత్యేకతవున్నది.

ఎన్నో పేర్లు, ఎన్నో మొహాలు, ఎన్నో మతాలు. ఎవరిభావాలు వారివి. ఆమెకు నల్లమొహాలు, ఎర్రమొహాలు ఎన్నో కనబడుతున్నాయి. వాళ్ళందరిమధ్య ఆమె ఒంటరిగా నిలబడివున్నది. చివటికి వచ్చేసరికి విలువలు కట్టవలసివచ్చినప్పుడు మనిషి ఏకాకిగానే వుండిపోతాడు. అయినా రకరకాలమనుష్యులతో ఏవేవో సంబం ధాలు పెట్టుకొనేందుకు మానవులు ప్రయత్నిస్తూవుంటారు. ఈ సంబంధాలు తప్పని తోచినప్పుడు మానవులు యితరుల్ని సామాన్యులని, పనికిమాలినరకమని అనడం కద్దు.

ఈ మాటల్నే చంప అన్నయ అనబడే సయ్యద్ అమిర్‌రజాతో స్పష్టంగా అన్నది.

ఆరోజున సయ్యద్ మద్రాసుకు బయలుదేరబోతున్నాడు. చంపను కలుసు కొనేందుకు కైలాస్ హాస్టలు వచ్చాడు. అప్పుడు ఆమె గ్రంథాలయానికి వెళ్ల బోతున్నది. సైకిలుపట్టుకొని ఆయనవెంట రోడ్డుమీదకు వచ్చింది. 'నేను యిక్కడి నుండి పారిపోదామని అనుకొంటున్నాను. పరారీ అయిపోయేందుకు నాకు మంచి అవకాశం దొరికింది. నీవు....నీవు నన్ను పెండ్లిచేసికో. వెళ్ళిపోదాం నాతోరా' అని అన్నాడు ఉద్వేగంతో.

అసలు సయ్యద్ మంచి రూపసి. విండువిగ్రహం అతనిది. అందులోను నౌకా దళంలో చేరాక అనుకూలమైన దుస్తులుకూడా దొరికాయి. బ్రహ్మాండంగా వున్నాడు మనిషి.

చంపమొహం వెలవెలబోయింది. జీవితంలో ముఖ్యమైనమాటలు తాను వింటున్నది. ఒకయువకుడు అందులోను మంచి అందగాడువచ్చి తనజీవితంలో ప్రవేశించమని ఆహ్వానిస్తున్నాడు. అందులోను అతడు తనకు ఎంతో నచ్చినవాడు.

మనస్సును దిటవుపరుచుకొన్నది. 'ఇలాంటిమాటలు మాట్లాడుతున్నారే. సిగ్గు రావడంలేదూ?' అని అన్నది.

'మరి నువ్వు నన్ను ఎందుకు ఆకర్షించావు? నన్ను యింతగా ముందుకు ఎందుకు రప్పించావు?' అని అన్నారు కోపంగా.

'నేను మిమ్మల్ని ఎక్కడికీ రమ్మనలేదే.

'గుండెమీద చేయివేసుకొని చెప్పు. నావిషయంలో నీవు శ్రద్ధవహించలేదూ? నీ స్నేహితురాలు తహమీనాకు, నాకు పెండ్లి జరుగుతుందని తెలిసికూడా నీవు నావైపు మొగ్గు చూపించలేదూ?'

ఆమె మౌనం వహించింది. అతడిమాటలు ముమ్మాటికీ నిజమే. మొట్టమొదటి పర్యాయం తన బలహీనతలు ఆమెకు కొట్టవచ్చినట్లు కనబడ్డాయి. సిద్ధాంతాలు, ఉదాత్తమైనభావాలు, దర్శనశాస్త్రం మొదలుగాగలవన్నీ వేరు, యధార్థజీవితం వేరు. పరిశుద్ధమైన వేదాంతానికి నైతికతత్వానికి వాస్తవ జీవితానుభవాలకు వ్యత్యాసం ఎక్కువ. నిజానికి మనం వాస్తవజీవితంలో చాలా బలహీనులము.

అన్నయ్య ఆమెభావాలు గ్రహించారు. 'నువ్వు పూర్తిగా సామాన్యమైన మనిషివి' అని అన్నారు.

'సామాన్యమనిషికంటె గొప్పదాన్నని ఎప్పుడు మీకు నేను చెప్పలేదే' అని అన్నది. అప్పటికి వారిరువురు పాదుషాబాగ్ సింహద్వారందగ్గరకు చేరుకొన్నారు. 'ఆగండి. నావెంట వచ్చేస్తున్నారు. నాకు పనివున్నది. మీరు యిక యింటికి దయ చేయండి' అని అన్నది గంభీరంగా.

'నాకు యిల్లు అంటూ ఎక్కడా లేదు.'

'మనలో ఎవ్వరికీలేదు యిల్లు. ఇప్పుడు మీతో వేదాంతంగురించి చర్చించే ఓపిక నాకులేదు. గుల్‌షెషాం అను మహలు మీకు వున్నది. ఎంతపెద్ద పేరో,

అంతా బూటకపువ్యవహారం. అక్కడ మీకోసం తహమీనా వున్నది. తిరిగి వెళ్ళి పొండి.'

'నువ్వు చాలా తేలికరకం మనిషివి. సామాన్యమైన ఆడదానిలా నాతో పోట్లాడుతున్నావు. నీ ప్రవర్తన చాలా సామాన్యమైనది. నాసిరకం. నీలాంటి ఆడవాళ్ళు వందలాదిమంది ప్రపంచంలో వున్నారు. ఇప్పటిదాకా నావెంట తిరిగావు. జీవితమంతా నాతో వుండమనేసరికి ధైర్యంలేక తప్పుకుంటున్నావు. ఇదన్నమాట నీ వ్యవహారం!'

'సామాన్యమైన మొగవాళ్ళలా మీరు నాతో దెబ్బలాడుతున్నారు. మనలో ఎవ్వరం దేవతలంకాదని తేలిపోయింది. మరి సెలవు. భగవంతుడు కాపాడనీ' అంటూ సైకిలుఎక్కి చరచర వెళ్ళిపోయింది.

గుల్‌ఫిషాంవచ్చి సయ్యద్ సామాను సర్దుకోవడం ప్రారంభించాడు. ఆ రోజునే తహమీనా ఎం. ఏ. చివరిప్రశ్నపత్రానికి జవాబువ్రాసి యింటికివచ్చింది. రోజంతా యింట్లో గుసగుసలు నడిచాయి. పెద్దమ్మాయి చదువు పూర్తిఅయింది. సయ్యద్ నౌకాదళంలో పెద్దఉద్యోగి అయినాడు. ఇక పెండ్లికి ఆలశ్యం ఎందుకు?

ఆరాత్రి సయ్యద్ నిశ్శబ్దంగా కారెక్కి స్టేషనుకు వెళ్ళిపోయాడు.

ఇల్లంతా చిటచిటలు, పటపటలుగా వున్నది.

కమాల్ హరిశంకర్‌లు తహమీనా ఎదుటకు వెళ్ళకుండ తప్పించుకొంటున్నారు. ఎండాకాలం సెలవులు ప్రారంభమైనాయి. చంప వారణాసి వెళ్ళిపోయింది. గుల్‌ఫిషాం వాసులందరు ప్రతిసంవత్సరంలాగ చల్లదనంకోసం పర్వతప్రాంతానికి అంటే నైనీతాలుకు బయలుదేరారు. కమాల్ తన మేనత్తగారి ఆహ్వానంమీద మసూరీ వెళ్ళిపోయాడు.

జ్యూలైలో అంతా తిరిగివచ్చారు. గుల్‌ఫిషాంతలుపులు తెరుచుకొన్నాయి. ఒక రోజున అకస్మాత్తుగా సయ్యద్ యింటికివచ్చారు. మూడురోజులు గుల్‌ఫిషాంలో వున్నాడు. మూడురోజులు తనగదిలో కూర్చొనివుండిపోయాడు. బయలుదేరడానికి ఒకరోజుముందు అమ్మాబీగం గదిలోకి వెళ్ళాడు.

'మీ అమ్మాయి ఎం. ఏ. ప్యాసైంది. సంతోషం' అంటూ ప్రశాంతంగా బల్లమీద కూర్చున్నాడు.

అమ్మాజీగం ఏమీ మాట్లాడలేదు.

'ఇక పెద్దమ్మాయికి పెండ్లి చేయాలి.'

'ఎవరికిచ్చి?' అని అడిగింది అమ్మాజీగం గట్టిగా.

'నాకిచ్చి పెండ్లి చేయండి' అని అన్నారు అదేస్వరంలో అతను.

'ఇంట్లో ఎదిగివున్న బంగారుబొమ్మనువదలి పరాయి అమ్మాయిలలో పడి పోయావు. అంతా వేలెత్తి చూపుతున్నారు. తలవంపులైంది.'

'నేను ఎదురుతిరిగానని ఎలా అనుకొన్నారో చెప్పండి? చిన్నప్పటినుండి యిక్కడే పెరిగి పెద్దవాణ్ణయినాను. ఇంతవాణ్ణయినాను. తహమీనాను నా కివ్వా లనేగదా నన్ను మీరు పోషించింది? ఇంతదూరంవచ్చాక మీ అమ్మాయిని చేసికో నని అనేటంత నమ్మకద్రోహివిమాత్రం కాను. నమ్మండి' అని బైటకు వచ్చి వేశారు.

పోసన్ వెంటనే తహమీనాదగ్గరకువెళ్ళి 'అమ్మాయీ! పెళ్ళిపాటలు పాడేం దుకు ఇమాన్‌బాందీని పిలిచేందుకు వెళుతున్నాం. మీకు పెళ్ళి నిర్ణయమైంది.' అని అన్నది.

'పోసన్! ఇటు సూర్యుడు అటు పొడిచినాసరే నేను యీ పెండ్లికి అంగీక రించేదిలేదని. నయ్యద్‌గారితో పెండ్లి చేసుకోనని అందరికీ చెప్పివేయి.' అని అన్నది తహమీనా.

తహమీనాకు ఏడ్పువచ్చింది. వెక్కి-వెక్కి ఏడ్వసాగింది. పోసన్ నివ్వెర పోయింది.

ఈవార్త 'భవనం' అంతటా పొక్కిపోయింది. అత్యయికస్థితి ప్రక టించబడింది. ఫోన్లు ట్రంక్ కాల్సు ప్రారంభమైనాయి. వెంటనేవచ్చి సోదరికి నచ్చచెప్పమని ముస్సోరీకి ఫోనుచేసి కమాల్‌ను పిలిపించారు. ప్రతివ్యక్తి తహ మీనాకు నచ్చచెప్పేందుకు శాయశక్తుల ప్రయత్నించారు.

కాని తహమీనామాత్రం సరే ననలేదు. రాత్రంతా వెక్కి-వెక్కి ఏడుస్తూనే వున్నది.

కమాల్ ముసోరీనుండి యింటికివచ్చి పరిస్థితంతా గమనించాడు. చంపను కలుసుకొందామని కైలాష్ హాస్టలుకు వెళ్ళాడు. చంప తన మేనమామగారి యింటి దగ్గరేవున్నదని, వచ్చేవారంలో హాస్టలుకు వస్తుందని అక్కడ తెలిపింది. ఆ తరు

వాత చంపను కలుద్దామని వెళ్ళారు. అక్కడ సయ్యద్ కనబడ్డారు. చంపదగ్గరకు సయ్యద్ ఎందుకువెళ్ళారో కమాలుకు అర్థంకాలేదు. సయ్యద్ వెంటనే బయలు దేరి యింటికివెళ్ళి ఆరోజే మద్రాసుకు వెళ్ళిపోయారు.

నెమ్మదిమీద పరిస్థితులు కుదుటపడ్డాయి. తహమీనాకు, చంపకు యిరువురికి స్నేహం చెడలేదు. ఒకరినొకరు గౌరవించుకుంటూ యిద్దరూ వ్యవహరిస్తున్నారు. ఎప్పుడూ సయ్యద్‌నుగురించి వారిమధ్య సంభాషణ జరుగలేదు. ఎవరికివారు ఆవిషయంలో గంభీరంగా వున్నారు.

కాలచక్రం విచిత్రమైనది. తాత్కాలికంగా కొన్నిఘట్టాలు చాలా ప్రమాదకర మైనవని అనిపిస్తాయి. కాని సమయం గడిచినతరువాత అప్పటి ఘట్టాలనుగురించి ఆలోచించుకొంటే అవి చాలా చిన్నవిషయాలుగాను, అనవసరంగా బాధపడ్డామనీ అనిపిస్తుంది.

## 26

కరువుసహాయ కార్యక్రమంలో పాల్గొనేందుకు కమాల్ కలకత్తాకు బయలుదేర బోతూవుండగా బావగారిజాబు అందింది. లాక్ పెండ్లిఅయి ఒకసంవత్సరం గడచింది. ఆమె తన భర్తతోబాటు కొత్తఢిల్లీలో వున్నది. అక్కడే ప్రభుత్వ కార్యాలయంలో బావగారు ఏదోశాఖలో ఉపకార్యదర్శిగా పనిచేస్తున్నారు. నిర్మల పెళ్ళినిమిత్తం మాటలు జరుగుతున్నాయి. ఆ విషయాన్నిగురించే కమాలుకు జాబు వ్రాశాడు—'నీవు కలకత్తా వెళుతున్నావు. సర్ దీపనారాయణ్ కుమారుడు గౌతం కూడా అక్కడేవున్నాడు. అతనికి నిర్మలనిచ్చి వివాహంచేద్దామని మా అభి ప్రాయం. అతడుకూడా మీ బెంగాల్ రిలీఫ్, 'ఇష్టా విష్టా'గొడవల్లోపడి అక్కడికి వెళ్ళాడు. విశ్వభారతిలో ఏమైన చేస్తున్నాడో తెలియదు. ఏది ఎలావున్నా నీవు అతణ్ణి తప్పక కలుసుకొని అతడు ఎలాంటివాడో కొంచెం తెలుసుకో. గంభీర మైన స్వభావంకలవాడో లేక మీ అందరిమాదిరిగానే సంఘవ్యతిరేకియో తెలుసుకో' అని ఆ జాబులో వ్రాసివున్నది.

కమాల్ జాబుమడిచి జేబులో పెట్టుకొన్నాడు. 'బావగారు చాలా విచిత్రమైన మనిషి. జనం ఆకల్లాపడి చచ్చిపోతున్నారు. దేశం నాశనమైపోతున్నది. ఈయన పెళ్ళిళ్ళవ్యవహారంతో సతమతం అవుతున్నాడు.' అని అనుకొన్నాడు.

కమాల్ మంచి విద్యార్థికార్యకర్త. ఉద్రేకస్వభావం కలవాడు. తహమీనా సయ్యద్‌ల పెళ్ళిరభస చూసినప్పటిమంది పెళ్ళిళ్ళవ్యవహారమంటే మండిపడు తున్నాడు. 'నేను కలకత్తావెళ్ళి కరువుబాధితుల శవాలను మోయనా లేక నిర్మల కోసం పెళ్ళికొడుకుని వెతుక్కుంటూ తిరగనా?' అంటూ తలత్‌ముందు మండి పడ్డాడు. కాని సర్ దీపనారాయణ్ అడ్రసుమాత్రం జాబులోవున్నప్రకారం పుస్త కంలో వ్రాసుకొన్నాడు. కమాల్ యాత్రకు బయలుదేరాడు. అతనితోబాటు విశ్వ విద్యాలయానికిచెందిన యువతీయువకులుకూడా చాలామంది బయలుదేరారు. త్రోవ పొడుగునా ఇక్బాల్, జోష్, టాగూరు, నజరుల్ ఇస్లాం రచించిన ఆవేశపూరిత పాటలు పాడుతూనేవున్నారు. కమాల్ కిటికీదగ్గర భారతదేశపు పచ్చపచ్చని పొలాలుచూస్తూ యిది నాదేశం - యిది నాదేశం అంటూ ఆలోచిస్తూ కూర్చు న్నాడు. దేశభక్తి, విప్లవం, జాతీయ ఆవేశం, ఆంగ్లప్రభుత్వంమీద కోపం మొద లుగాగల భావాలు అతని హృదయాన్ని మధించసాగాయి.

గంగానదిఒడ్డున ఒక చిన్న అందమైనస్టేషనులో రైలు ఆగింది. పిల్లలు కిటికీ మండితొంగి బైటకు చూడసాగారు. నాలుగువైపుల చెరువులు వున్నాయి. పచ్చ పచ్చని పచ్చికబయళ్ళు వున్నాయి. వెదురుగడలపొదలు వున్నాయి. దూరాన సూర్యుడు గంగానదిలో నీటిలో అస్తమిస్తున్నాడు. స్టేషనుదగ్గర రెండు పల్లకీలు వున్నాయి. ప్లాట్‌ఫారంమీద గ్రామప్రజలు గుంపులుగుంపులుగా వున్నారు. వాళ్ళంతా బియ్యంకోసం కలకత్తావెళ్ళాలని రైలుమీద విరుచుకుపడుతున్నారు. ప్లాట్‌ఫారం రెండోవైపున పైనికులు రైలు నిలబడివున్నది.

'ఈ సిపాయిలబండి వెళ్ళిపోవంతవరకు మనరైలు కదలదని' గార్డు కమాలుకు చెప్పాడు.

'ఇప్పటికే నాలుగైదుగంటలు ఆలస్యంకదా' అని అన్నాడు కమాల్.

'యుద్ధసమయం బాబూ!' అని అన్నాడు గార్డు.

కమాల్ సహచరులందరూ దిగి ప్లాట్‌ఫారంమీద నిలబడ్డారు. పాటలు పాడి పాడి విసుగుబుట్టింది. ఎంతసేపటికి రైలు కదలదు.

ఉన్నట్లుండి రేఖ కెవ్వున కేకబెట్టి ఒకవైపుకు పరుగెత్తింది. మిగతావాళ్లకూడా ఆమెవెంట పరుగెత్తారు. ప్లాట్‌ఫారానికి ఒక కొసన రైతులు గుంపులుగుంపులుగా ఒదిగి కూర్చొనివున్నారు. ఒక బక్కచిక్కిన నల్లగడ్డంగల యువకుడు అప్పుడే మరణించి పడివున్నాడు. సన్నగా, నల్లగావున్న అతనిభార్య తలబాదుకొని ఏడుస్తున్నది. ప్రక్కనే విలబడి ఆమె యిద్దరు పసిబిడ్డలు ఏడుస్తున్నారు.

'కమాల్! పద. శవాలుమోసేపని యిక్కడినుండే ప్రారంభించుదాం' అని అన్నాడు నరేంద్ర.

వెక్కివెక్కి ఏడుస్తు తను, తనభర్త అబుల్ మోన్‌ఘూర్ అన్నంకోసం కలకత్తాకు బయలుదేరామని, ఒక వారంరోజులనుండి ఏమీ తినలేదని, సిపాయిలు తిని పారేసిన రొట్టెముక్కలు మాత్రం ఏరితెచ్చి యిద్దరు బిడ్డలకు పెట్టానని చెప్పి తానుకూడా ఆకలికి తట్టుకోలేక కండ్లు తేలేసి నేలమీద ఒరిగిపోయింది భార్య.

స్టేషన్‌మాష్టరు ఒక ఆంగ్లో ఇండియన్. అక్కడకువచ్చి 'గడబిడచేస్తున్నారు. రోజు వందమందిదాకా యీ ప్లాట్‌ఫారంమీద చచ్చిపోతున్నారు. ఎవరెవరికోసం మేము బాధపడగలం? ఇది రైలుస్టేషను. ఆసుపత్రికాదు. ఈ బెంగాలీలు ఎప్పుడూ ఆకలిగొట్టుగాళ్ళే. ఏం బాధపడవద్దు. వెళ్లిపొండి.' అని తొందరపెట్టాడు.

'ఇక్కడ శవాల పాతిపెట్టేస్థలం ఎక్కడవున్నది?' కోపంతో ప్రశ్నించాడు కమాల్.

'మాకుతెలీదు. వీళ్ళకు గోరీకట్టిస్తావా? తమాషాగావుంది' అంటూ తిరిగి వెళ్ళిపోయాడు స్టేషన్‌మాష్టరు.

కమాల్ అనుచరులు గోరీలస్థలాన్ని, మౌల్వీని వెతకడంకోసం ఊరివైపుకు బయలుదేరారు.

కమాల్ శవాలదగ్గర వుండిపోయాడు. ప్లాట్‌ఫారమంతా చీకటిగావున్నది. తన హోల్డాలులోనుండి పంచతీసి శవాలమీద కప్పాడు. ఆ భార్యాభర్తల శవాలురెండు ఆ శవం గుడ్డచాటున ఒదిగిపోయాయి.

అక్కడికి కొంచెందూరాన గంగానది ప్రవహిస్తూవున్నది. ఒకపడవ నీటిమీద నడుస్తున్నది. పడవలో దీపం వెలుగుతున్నది. పడవలోకూర్చున్న సరంగు బిగ్గరగా పాట పాడుతున్నాడు. ఆ పాటభావం కమాలుకు అర్థం కాలేదు. కాని విన డానికిమాత్రం పాట బాగున్నది. స్టేషనుకు కొంచెందూరాన జిల్లాకలెక్టరు భవనం

వున్నది. ఇంగ్లీషు అధికారుల దర్పాన్ని వేనోళ్ల చాటుతున్న దా మేడ. అక్కడికి కొద్దిదూరాన జిల్లాకంతటికీ పెద్ద జమీందారైన రాజా విరీశచంద్రరాయ్‌గారి మేడ వున్నది. అక్కడ రేడియోమ్రోత వినబడుతున్నది. రాత్రిపూట నలువైపుల వ్యాప్తమైయున్న ఆ విశ్శబ్దంలో బి. బి. సి. నుండి ప్రసారంఅవుతున్న లలిత సంగీతం స్పష్టంగా వినబడుతున్నది. కమాల్‌మనస్సు మనస్సులో లేదు. కండ్లు మూసుకొన్నాడు. ఇది రవీంద్రనాథుడు, సరోజినీదేవి, శరత్‌బాబులను కన్నదేశం. నవలాకురుల్ని, కవుల్ని కన్నదేశం.

మనమంతా రకరకాలపుస్తకాలకు కథావస్తువులం - చరిత్రప్రకరణాలు, శబ్దాలు, అంకెలు, రిపోర్టు, కాంగ్రెసు, ముస్లింలీగుల లీడర్ల ఉపన్యాసాలు, కమ్యూనిస్టుపార్టీ తీర్మానాలు, రాష్ట్రాలకు స్వయంనిర్ణయాధికారం కావాలనడం లెనిన్‌సిద్ధాంతాలకు పూర్తిగా అనుకూలమేనని గతవారం డాక్టర్ అశరఫ్ అన్నాడు. పాకిస్తాన్ మహమ్మదీయులంతా పాకిస్తానీయులైపోతారా? ఏమవుతుంది? లెనిన్, స్టాలిన్, గోర్కీ, డాక్టర్ అశరఫ్, సజ్జాద్ జహీర్, జిన్నా, మహాత్మగాంధీ, పండిట్‌జీ.... కమాల్ మనసులో అనేకఘట్టాలు, పేర్లు, వ్యక్తులగుంపులు తిరగసాగాయి. ఇప్పుడుమాత్రం ప్రపంచానికంతటికీ కేంద్రబిందువులుగా వున్నాయి యీ రెండు శవాలు. మెదడులో పరుగులెత్తేవిషయాలన్నీ శవాలదగ్గరకువచ్చి ఆగిపోతున్నాయి. అబుల్ మోన్‌ఘూర్, అతనిభార్య అమ్నాబీబీ యిద్దరిశవాలు పడివున్నాయి.

రెండోరోజుప్రొద్దున్నే అంతా యాత్రకు బయలుదేరారు. సాయంత్రం రైలు హౌరా చేరింది. అంతా సామాన్లతోసహా మకాముకు బయలుదేరారు. ప్రమోద కుమార్‌గారి ఇల్లు వీళ్ళందరు కలుసుకోవలసినచోటు. మర్నాడు అంతా అక్కడికి రావాలి. కమాల్ మానిక్‌తల్లాకు బయలుదేరాడు. అక్కడ అతడి మేనమామ మటియాబుర్జ్‌వాలే నవాబ్ వున్నాడు.

మానక్‌తల్లాలోగల ఒక పెద్దమేడముందు బండివచ్చి ఆగింది. అది ఈస్ట్ ఇండియా కంపెనీ నాటి పాతరకం మేడ. ఇలాంటిమేడలు కలకత్తాలో చాలా వున్నాయి. విశాలమైన ఆవరణలో చెట్లమధ్యగల మేడ చూసేందుకు బాగా వుంటుంది. 'కమ్మన్ అన్నయ్య వచ్చాడు, కమ్మన్ అన్నయ్య వచ్చాడు' అని పై అంతస్తుమీదనుండి ఆడపిల్లలు అరవడం ప్రారంభించారు. ఇల్లంతా ఆ వార్త వ్యాపించింది. నౌకర్లు, దాసీమనుషులు పరుగెత్తుకొంటూ బైటకు వచ్చారు. నవాబు

గారు మేనల్లుడు లక్నోనుండి వచ్చారని విని పడకకుర్చీమీదినుండిలేచి స్వాగతం చెప్పేందుకు బై టకు వచ్చారు.

ఈ మేడ అర్ధ్వైసంవత్సరాల్క్రితం దత్తుకుటుంబందగ్గర మటియాబుర్వాలే నవాబు కమాల్ రజాబహాదుర్గారి చిన్నబావమరిది కొన్నారు. ఇక్కడ ఆకాలంలో బ్రహ్మసమాజం సమావేశాలు పెద్దస్థాయిలో జరుగుతూవుండేవి. పై అంతస్తు గోడలమీద యిప్పటికీ దత్తుకుటుంబంవారి పటాలు అక్కడక్కడ వున్నాయి. గ్రూప్ ఫొటోకూడా ఒకటి వున్నది. అందు మహర్షి దేవేంద్రనాథ్టాగూరు మధ్యలో వున్నారు. ఆ గదిలో ఒకప్రక్కన చలువరాతిలో కట్టబడిన ఒక అరుగు వున్నది. దానిమీదకూర్చొని మహర్షి దేవేంద్రనాథ్ హార్మోనియంమీద భజన గీతాలు గానం చేసేవాడట. లక్నోలో కేనింగ్ కాలేజీలో ఉపాధ్యాయుడుగ పని చేసిన బాబూ మనోరంజన్దత్ చనిపోయినతరువాత ఆయనబిడ్డలు యీ మేడను అమ్మివేసి బాలీగంజ్లో మరో పెద్దభవంతి కట్టించుకొన్నారు. వారిబిడ్డల్లో చాలా మంది ఐ. సి. యస్. అధికారులు. మరికొంతమంది కమ్యూనిస్టు నాయకులు. ఆయన కుమార్తెలు యూరపులో విద్య నభ్యసించేవారు. బాబూ మనోరంజన్దత్ గారి ఒక మనుమరాలివివాహం చట్గాందగ్గర ఒక రాజాతో జరిగింది.

ఈ మేడలో ప్రస్తుతం వుంటున్న నవాబు చితికిపోయిన లక్నోనవాబు. పెన్షను వస్తున్నది. అదే ఆధారం. కలకత్తాలో వుంటున్నారు. జీవించడమే వారి వృత్తి.

నవాబ్ కమాల్రజా బహదూర్ సుల్తానే ఆలం వాజిద్ అలీషాతోబాటు మటియా బుర్జ్ వచ్చేవాడు. నవాబ్ అలీ రజా బహాదుర్షాగారి చిన్న చెల్లెలి భర్త. ఆరోజుల్లో కలకత్తాలో పాశ్చాత్యప్రభావం పెరిగిపోసాగింది. రాజకీయ, సాంస్కృతిక ఉద్య మాలు దేశమందంతట బయలుదేరాయి. అనేక కళాశాలలు, పత్రికలు వెలిశాయి. ఇన్నిజరుగుతున్నా నవాబ్ అలీ రాజాబహాదుర్ వాటితో ఏమీ సంబంధం పెట్టుకో లేదు. అలీగడ్లో ఎం. ఏ. ఓ. కాలేజీ స్థాపించబడింది. కాని నవాబుగారికి ఇంగ్లీషు నేర్చుకొందామనే ధ్యాసే లేదు. ఆయన సమయం ఎక్కువగా లక్నో. ఢిల్లీ. అజీమా బాదుల్లో జరుగుతూవుండే సాహిత్యచర్చల్లోను, కావ్యగోష్ఠుల్లోను గడిచిపోతుం డేది. పెన్షను వస్తున్నది గనుక డబ్బుకు యిబ్బందిలేకుండా పోయింది. ఆంగ్ల పరిపాలకుల అండదండలతో బండి నడుస్తున్నది.

అప్పుడు వారివంశంలో మొదటిపర్యాయం ఒక విచిత్రం జరిగింది. లక్నోలో వుంటున్న నవాబ్ అలీ రజా అల్లుడు తన పెద్దకుమారుణ్ణి అలీగఢ్ పంపించాడు.

నవాబ్ అలీ రజాగారి రెండో అల్లుడు పాట్నాలో వుంటున్నాడు. ఆయనకూడా చాలా అభ్యుదయవాది అని తేలింది. పాట్నాలో ఆ రోజుల్లో లా చదువు ఎక్కువగా వున్నది. దానితో నవాబ్ అలీ రజాగారి పాట్నామనుమలు బారిస్టరీ చదువు నిమిత్తం ఇంగ్లండు వెళ్ళారు.

లక్నోలోవుంటున్న రజాఅలీ అల్లుడు ఆంగ్లశిక్షణమీద అభిమానం చూపడమే గాక రాజకీయాల్లోకూడా ముఖ్యంగా కాంగ్రెసుపార్టీ వ్యవహారాల్లో పాల్గొన సాగాడు. లక్నోలోని గోలాగంజ్‌లో వాళ్ళయిల్లు వున్నది. అక్కడ రోజు లాలా బ్రదర్స్‌వచ్చి కూర్చుంటూవుండేవారు. వీళ్ళంతా ఆంగ్లప్రభుత్వానికి అనుకూలురు. కేవలం రాజకీయసంబంధమైన సదుపాయాలు, అవకాశాలు, సాంఘికసంస్కరణలు కోరుతున్నారు. చాలామంది ముస్లిములు యీ ఉద్యమంలో చేరారు.

హిందూదేశంలో మహమ్మదీయుల రాజకీయస్థాయి పెద్దసమస్యగా పరిణమించింది. హిందువులు నూటపాతిక సంవత్సరాలనుండి ఇంగ్లీషు చదువుకోవడం ప్రారంభించారు. మహమ్మదీయులు దేశాన్ని పరిపాలించినప్పుడు ఫార్సీ చదువుకొని పరిపాలనావ్యవస్థలో పాల్గొన్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ రాగానే హిందువులు వెంటనే పరిస్థితులతో రాజీపడ్డారు. మొఘలులదగ్గర ఉద్యోగిగావున్న హిందూ మున్షీ ఈస్ట్ ఇండియా కంపెనీవాళ్ళ కార్యాలయంలో గుమాస్తాగా మారిపోయాడు. గత వందసంవత్సరాలనుండి పాశ్చాత్యసభ్యతను విధానాన్ని అంగీకరిస్తూవచ్చారు. ఇంగ్లీషువాళ్లు 1857 తరువాత మహమ్మదీయుల్ని పూర్తిగా అణచివేశారు. హిందువుల్లో బూర్జువాతత్వం బయలుదేరింది. నాయకత్వం. ప్రజాప్రభుత్వరాజనీతికి ఆ తత్వం సిద్ధపడింది. మహమ్మదీయులు యింకా భూమిశిస్తుకు సంబంధించిన దశనుండి ముందుకు సాగలేదు.

ఇంగ్లీషువాళ్ళు జమీందార్లతో రాజీపడ్డారు. వాళ్ళిద్దరిమధ్య సయోధ్య పెరిగింది. బెంగాలులో మహమ్మదీయపరిపాలనాకాలంలో ప్రభుత్వమిచ్చిన భూములనుండి వచ్చే ఆదాయంతో పాఠశాలలు నడిచేవి. కాని ఈస్ట్ ఇండియా కంపెనీవాళ్ళు వచ్చీ రాగానే ఆ భూముల్ని స్వాహాచేశారు. దానితో ముస్లింపాఠశాలలు మూతబడిపోయాయి. ముస్లిములు చదువులో వెనకబడిపోయారు. హిందువులుమాత్రం

ఇంగ్లీషు చదువుతూనేవున్నారు. ముస్లిం జాగీర్దార్లు చితికిపోయారు. మహమ్మదీయ నవాబుల పతనం ఆదరణలేక మూలబడిపోయింది. లార్డ్ కార్న్‌వాలిస్ చేసిన స్థిరమైన ఏర్పాటు ననుసరించి క్రొత్తగా బయలుదేరిన హిందూ జమీందార్లు హిందూ మధ్యమవర్గంవాళ్ళు ఆధిక్యం సంపాదించారు. దానితో బెంగాలులో తారుమారయింది. ఎక్కువమంది రైతులు మహమ్మదీయులు. కాని జమీందార్లుమాత్రం హిందువులు. ఈవిధమైన మార్పులతోబాటు బెంగాల్‌లో మిగతాప్రాంతా లన్నింటి కంటె ముందు జాగృతి కలిగింది. క్రొత్తరకం హిందూ భూస్వామ్యవర్గం నాయకత్వంకోసం సిద్ధపడింది.

బెంగాలులోనే హిందూ పునర్జాగరణ ప్రారంభమైంది. బంకించంద్రచటర్జీ 1770 లో కరువు, సన్యాసులతిరుగుబాటు ఆధారంగాతీసికొని వ్రాసిన 'ఆనంద మఠం' అను నవలయే అందుకు మంచి తార్కాణం. ఈ నవల మహమ్మదీయులకు వ్యతిరేకంగా వ్రాయబడింది. మహమ్మదీయుల్ని పూర్తిగా అణచివేయాలని యీ నవల్లో స్పష్టంగా వ్రాయబడింది. భారతదేశంలో క్రొత్తగా బయలుదేరిన విశ్వస నీయులగు భూస్వామ్య ప్రతినిధియైన బంకింబాబు యీ నవల్లో ఇంగ్లీషువాళ్ళ న్యాయబుద్ధిని ప్రశంసించారు. వాస్తవానికి 1770 లో బయలుదేరిన కరువుకు ముఖ్యకారకులు ఇంగ్లీషువాళ్ళే. వాళ్ళు దేశాన్ని కొల్లగొట్టడంవలన దేశంలో కరువుకాటకాలు వచ్చాయి. 'ఆనందమఠం'లోని సన్యాసులు మహమ్మదీయులతో బాటు ఇంగ్లీషువాళ్ళతోకూడా యుద్ధం చేస్తారు. ఆ విషయాన్నిగురించి బంకించంద్ర చటర్జీ పేర్కొని ఇంగ్లీషువాళ్లు భారతదేశాన్ని ఉద్ధరించేందుకు వచ్చారని, ఆ విషయం సన్యాసులు గ్రహించలేకపోయారని వ్రాశారు. ఇంగ్లీషువాళ్ళ పరిపాలన వలన, ఇంగ్లీషువిద్యవలన హిందువులఉద్ధరణ జరుగుతుందని బంకించంద్రుని అభిప్రాయం. ఇదేవిధంగా మహమ్మదీయుల పునర్జాగరణకు పూనుకొన్న నాయకులుకూడా ఆంగ్లపరిపాలనను, ఆంగ్లవిద్యను పొగడటం ప్రారంభించారు. మహమ్మదీయులకు వ్యతిరేకంగా విద్వేషాన్ని హిందువుల్లో వ్యాప్తం చేసేందుకు కృషిచేసిన 'ఆనందమఠం' నవలలో వ్రాయబడిన 'వందేమాతరం' అను పాటను జాతీయగీతంగా ప్రచారంలోకి తెచ్చారు. ఈ కారణాలవల్ల ముస్లిములు జాతీయ సమైక్యతకు దూరమైపోయారు. దానితో అడుగడుగునా జాతీయోద్యమానికి అవ రోధాలు ప్రారంభమైనాయి.

ఉద్యోగాలవేటలో కూడా హిందువులు మహమ్మదీయులను వెనక్కు నెట్టి వేశారు. మహమ్మదీయుల్లో భయం, సందేహాలు ఏర్పడ్డాయి. ఈ అవకాశాన్ని ఇంగ్లీషుపరిపాలకులు మంచిసమయంలో ఉపయోగించుకొన్నారు. అగ్నికి ఆజ్యం దాగా పోశారు.

ఈ పరిస్థితుల్లో ఇంగ్లీషువాళ్ళకు విశ్వాసపాత్రులైన ముస్లిముల మధ్యమవర్గం ఒకటి దేశంలో బయలుదేరి త్వరత్వరగా పుంజుకోసాగింది. దేశంలో నడుంవంచి మట్టిలోదిగి పనిచేసే రైతులనుగురించిగాని, కాయకష్టంచేసి పొట్టలు నింపుకొనే ముస్లిం సాలెవాళ్ళనుగురించిగాని, తదితర ముస్లిం శ్రమజీవుల్నిగురించిగాని ముస్లింలీగ్ నాయకులు పట్టించుకోలేదు. ముస్లింలీగ్ నాయకులకు కావలసింది ఉద్యోగాలు, వాళ్ళకు కావలసింది ఆర్థికవనరులు, ఆంగ్లపరిపాలకులు యీ నాయకుల వీపుతట్టి ప్రోత్సహించారు.

మొదటి ప్రపంచయుద్ధం జరిగింది. డాక్టర్ అన్సారీ వచ్చారు. ఖిలాఫత్ఉద్యమం బయలుదేరింది. గాంధీవచ్చారు. సంపూర్ణస్వరాజ్యంకావాలని కాంగ్రెసు స్పష్టంగా కోరింది. పరిస్థితులు త్వరత్వరగా మారిపోసాగాయి. దేశమందంతట విచిత్రమైన ఆవేశం ఆవిర్భవించింది.

నవాబ్ అలీ రజా బహాదూర్ అల్లుడు జాగీర్దారు నకీ రజా బహాదూర్ బాహాటంగా జాతీయోద్యమంలో పాల్గొనలేకపోయాడు. 1857 లో అయోధ్యను రక్షించేందుకు అక్కడి జాగీర్దార్లంతా ఇంగ్లీషువాళ్ళతో ప్రాణాలకుతెగించి పోరాటం జరిపారు. కాని ఆతరువాత ఆ జాగీర్దార్లంతా ఇంగ్లీషువాళ్ళకు భక్తులైపోయారు. ఇంగ్లీషు వాళ్ళతో చేతులుకలిపితేనేగాని రైతులమీద రాజ్యం చేసేందుకు అవకాశం దొరకదు. అందువల్ల ఇంగ్లీషువాళ్ళవంచన ముస్లిము జాగీర్దార్లు చేరిపోయారు. అవి నవాబ్ సర్ హార్కోర్ట్ బట్లర్ లక్నోలో పరిపాలన సాగిస్తున్నరోజులు. అతడు జాగీర్దార్ల అలవాట్లు చేసుకొన్నాడు. అది లక్నో జాగీర్దార్లకు స్వర్ణయుగం. ఒక వైపున స్వాతంత్ర్యపోరాటం ముమ్మరంగా సాగుతూంటే మరోవైపున ముషాయరాలు, భోగాలు విలాసాలు సాగుతున్నాయి. లక్నోలో మహారాజా మహమూదాబాద్, ఠాకుర్‌నవాబ్ అలీ, రాయ్ రాజేశ్వరబలీల ప్రాబల్యం పెరిగిపోయింది.

ఆ రోజుల్లోనే అలీగర్‌లో చదువుకొనివచ్చిన నవాబ్ నకీ రజా బహాదూర్ కుమారుడు నవాబ్ అబుల్ మకారంతకీ రజా బహాదూర్‌కు ఒక మొగపిల్లవాడు

పుట్టాడు. అతనికి కమాల్ అని పేరుపెట్టారు. తాతమ్మగారి మామగారయిన మటియాబుర్జ్‌వాలే నవాబ్ కమాలుద్దీన్ అలీ రజా బహాదూర్ పేరట. కమాల్ అని పేరు పెట్టారు.

అప్పటికే రెండుసంవత్సరాల ఆడపిల్ల పుట్టివున్నది. ఆ అమ్మాయిపేరు తహ మీనా బేగం. కమాల్‌నుకూడా మిగతాపిల్లలమాదిరిగా ప్రారంభికవిద్యకోసం డేరా డూన్ పంపించారు. తరువాత అతడు లా మార్టినేయర్ కాలేజీలోచేరి చదివాడు. ఈ కాలేజి ఇంగ్లీషువాళ్ల అలవాట్లకు, పద్ధతులకు, ఫ్యూడల్ వ్యవస్థకు పెట్టినికోట.

కమాలుకు బాల్యంలోజరిగిన ఘట్టాలు బాగా జ్ఞాపకం వున్నాయి. అప్పుడు యింట్లో పెద్దవాళ్ళు రాజకీయాలు మాట్లాడుకొంటూంటే తాను వినేవాడు. నవాబ్ అబుల్ మకారమ్ తకీ రజా బహాదూర్ వంశం వెనుకటిమాదిరిగాగాక చాలా మారి పోయింది. ఆ వంశంలోనివారు చాలామంది ప్రభుత్వోద్యోగాలు చేయసాగారు. కమాల్ పినతండ్రి అంటే అన్నయ్యతండ్రి అన్నమాట. బారిష్టరు. కాంగ్రెస్ నాయకుడు. నడివయస్సులో అకస్మాత్తుగా చనిపోయాడు. పాట్నాలోవుండే మామకూడా కాంగ్రెస్‌వాదే. ఎప్పుడూ చెరసాలకు వెళుతూవుండేవాడు. పాట్నా మామ కమాలునుకూడా తనతోబాటు మీటింగులకు తీసికొనివెళుతూ వుండేవాడు. కమాల్ దేశభక్తితోకూడినపాటలు మైకుదగ్గరనిలబడి పాడుతూవుండేవాడు. మామయ్య ఉపన్యాసాలు యిస్తున్నప్పుడు పోలీసులువచ్చి లాఠీచార్జిచేసి జనాన్ని బాధించడం యిప్పటికి కమాలుకు గుర్తువున్నది. రాజకీయాలు పత్రికలతోటి ఆగక నిత్యజీవితంలోకూడా ప్రవేశించాయి.

కమాల్ కొంచెం పెద్దవాడైనాడు. భారతీయుడైనందుకు అతడు గర్వపడుతూ వుండేవాడు. గతకాలపువైభవాన్ని తలుచుకొని పొంగిపోతూవుండేవాడు. అటు వంటి ఉపన్యాసాలే నాయకులు యిస్తూవుండేవారు. సూటుకుబదులు ఖాదీదుస్తులు ధరించసాగాడు. అతడి దాయాది ఒకడు జామియా మిల్లియాలో చదువుతున్నాడు. 'నేనుకూడా ఢిల్లీవెళ్ళి జామియాలోచేరి చదువుతాననీ' బ్రతిమిలాడాడు. కాని అతని మాటను ఎవ్వరూ వినిపించుకోలేదు. కర్నల్ బ్రౌన్స్ స్కూలు. లామార్టి నేయర్‌లో చదువుతున్న ఆంగ్లబాలురతోబాటు తాను అనగా భారతీయుడు చదువు తున్నాడని గర్వపడేవాడు. భారతదేశమంటే అతనికి ప్రాణం.

ఈ హిందూదేశమంటే ఏమిటో సచేతనరూపంలో అతడు ఎప్పుడూ వ్యాఖ్యానించలేదు. తను యిక్కడ పుట్టాడు. అతనిపూర్వీకులుకూడా యిక్కడే పుట్టారు. ఏడు ఎనిమిదివందల సంవత్సరాలనుండి అతవిపూర్వీకులు యీ మట్టిలోపుట్టి యీ మట్టిలో కలిశారు. ఇక్కడ రకరకాలధాన్యం పండుతుంది. దేవాలయాలు, మసీదులు, దర్గాలు వున్నాయి. ఒక దేవాలయందగ్గర బి. ఏ. ప్యాసైన మహంతు వున్నాడు. అతవితల్లి ఒకపర్యాయం తననుకూడా అక్కడికి తీసికొనివెళ్ళింది. పదిరూపాయలనోటు భక్తితో ఆ మహంతుకు యిచ్చింది. అత దేదో ప్రసాదం పెట్టాడు. మరోపర్యాయం దర్గాదగ్గరకువెళితే అక్కడి ముస్లింఫకీరు బత్తాయిపండు కమాలుకు యిచ్చాడు. ఆ పండు చాలా తియ్యగావున్నది. కదీర్ డ్రైవరుతల్లి మీర్జాపూర్‌స్టేషనులో మట్టిబొమ్మలుకొని తనకు యిచ్చింది. సివిల్‌లైన్సులో సాయంత్రంపూట దొరలయిండ్లలో పనిచేసే పనికుఱ్ఱాళ్లు కుక్కల్ని వెంటబెట్టుకొని వాటిని షికారుకు రోడ్లమీద త్రిప్పుతూవుంటారు.

సీతాలాదేవి దేవళంముందు రెండుచేతులు జోడించి నమస్కరించే ఆ ముసలి మహమ్మదీయుడు ఎవరు? భారతీయుడు. కమాల్‌అమ్మ, వంటమనుషులు, యితర స్త్రీలు అంతా భారతదేశానికి చెందినవారే. చిన్నప్పటినుండి రామాయణం కథలు, ముస్లింకథలు యింట్లో వింటూవుండేవాడు. గత చరిత్రనుగురించిన గర్వం, వర్తమానాన్నిగురించి పశ్చాత్తాపం, భవిష్యత్తునుగురించి ఆశ యీ మూడుతత్వాలతో అతవి మస్తిష్కం నిర్మాణమైంది. జవాహర్‌లాల్‌నెహ్రూ భారతదేశపు క్రొత్త ప్రతీకగా రూపొందారు. ఈ దృశ్యాలు కమాల్‌హృదయంమీద అంకితమైనాయి.

ఈ హిందూదేశంలో చాలా రహస్యాలు వున్నాయి. మతం, దర్శనశాస్త్రం, కళ, సంగీతం, ప్రేమసాహిత్యం అన్నీ యిక్కడ లభిస్తాయి. ఒకవైపు భారతీయ సభ్యత, మరోవైపు ఆంగ్లసభ్యత రెండు దేశంలో పోటీపడుతున్నాయి. దొరల పరిపాలన సాగుతున్నది. అసెంబ్లీచట్టాలు, గవర్నర్ దర్బారులు జోరుగా వున్నాయి. ఆంగ్లేయాధికారులు 'గుల్‌షిషాం' భవనానికి విందులకు వస్తున్నారు. అక్కడ కూర్చొని ముహర్రం పండుగనాడు జరిగే పెద్దపెద్ద ఊరేగింపుల్ని చూస్తున్నారు. ఈ ఆంగ్లేయాధికారులకు విచిత్రమైనశిక్షణ గరపబడుతుంది; ఫలానా భారతీయులు యింటికివచ్చినప్పుడు వాళ్ళను యింటివరాండాలోనే కూర్చోపెట్టమని, ఫలానా భారతీయుల్ని డ్రాయింగ్‌రూములోనికి పిలిచి గౌరవించమని, ఫలానా భార

తీయుల్ని కూర్చోమనికూడా అనకుండా నిలబెట్టే తిరిగి పంపివేయమని. ఫలానా వాళ్ళయిండ్లకు వెళ్ళమనిచెప్పమని ముందే వాళ్ళకు నేర్పడం జరుగుతుంది. ఇంగ్లీషువాళ్ళను యింటికి పిలిపించుకోగలిగిన అదృష్టంపట్టినవర్గంలో అనగా భారతదేశపు భూస్వామ్యవర్గంలో కమాల్ జన్మించాడు.

1934 లో నెహ్రూ భారతీయముస్లిములనుగురించి మాట్లాడుతూ ముస్లిం రాజకీయాలమీద 'ఫ్యూడల్' తత్వప్రభావం ఎక్కువగావున్నదని వారిలో మధ్యమవర్గప్రజలు, నిమ్నవర్గప్రజలు పారిశ్రామికంగా చాలా వెనుకబడివున్నారని, వారిలో మతసంబంధమైన సమాజపరమైన నమ్మకాలప్రభావం ఎక్కువగా వున్నదని, వీళ్ళు క్రింది మధ్యతరగతికిచెందిన హిందువులకంటేకూడా త్వరగా సమాజవాద పథాన ముందుకు సాగగలరని ఆశాభావం వ్యక్తంచేశారు. 'మనదేశంలోని ధనవంతులు, పరిశ్రమల యజమానులు, మిల్లు యజమానులు, అభివృద్ధి నిరోధకులు. క్రొత్తయుగానికి అనుగుణ్యంగా మారిపోగల సామర్థ్యం వీళ్ళకు లేదు. కాంగ్రెసులో హిందువులసంఖ్య ఎక్కువగా వున్నది. హిందువుల్లో ఎక్కువమందిమీద మతసంబంధమైనప్రభావం కనబడుతున్నది. ఇట్టిస్థితిలో మహమ్మదీయులకు సందేహం కలగడం సహజం. వాళ్ళు భయపడటంకూడా సహజమే. ఈ పరిస్థితుల్ని ఇంగ్లీషుప్రభుత్వం తన స్వార్థానికి చక్కగా ఉపయోగించుకొంటున్నది. దేశంలోని సామాన్యప్రజలు ఆర్థికంగా బలపడటంకూడా యీ 'ఫ్యూడల్'వ్యవస్థకు యిష్టంలేదు. అందువల్ల ఫ్యూడల్వర్గం ఇంగ్లీషువాళ్లతో చేతులుకలిపి కుట్ర పన్నుతున్నది. మధ్యతరగతి బుద్ధిజీవుల్లో 'నియంతృత్వపరిపాలన' ప్రబలుతున్నది. ఈ ప్రమాదాలనన్నింటిని ఎదుర్కొనేందుకు మనం మన సర్వశక్తుల్ని వినియోగించి పనిచేయాలి' అనికూడా నెహ్రూ ప్రకటించారు. పండిత నెహ్రూ గొప్ప సమాజవాది. కమాల్, అతనివంటి యువకులకు నెహ్రూ పూర్తిగా ప్రాతినిధ్యం వహిస్తున్నారు.

జాగీర్దార్లు, మధ్యతరగతినాయకులు, బుద్ధిజీవులు, విశ్వవిద్యాలయాల్లోని ఆవేశపరులైన విద్యార్థులేగాక మరో భారతదేశం వున్నది. అదే నిజమైన భారతదేశం. అది కార్మికులు, కర్షకులు కోట్లాదిగా నివసిస్తున్నదేశం. రైతులవిషయంలో ఆంగ్లప్రభుత్వం వివిధప్రాంతాలలో వివిధవిధానాలను అమలుపరచింది. బెంగాలు ప్రాంతంలో మహమ్మదీయుల చేతులమండి అధికారం లాక్కొని వాళ్ళను

పూర్తిగా నాశనంచేసి అక్కడ హిందువులకు బలం చేకూర్చింది. సిక్కులచేతుల నుండి లాక్కున్న పంజాబులో మహమ్మదీయుల్ని దగ్గరకుచేరదీసి అందలం ఎక్కించింది. ఎక్కువకాలం ఇంగ్లీషువాళ్ల అధీనంలోవున్న ప్రాంతాలు బెంగాలు, బీహారు, ఒరిస్సా, మద్రాసుప్రాంతాలు మరీ అమితంగా నష్టపడిపోయాయి. బెంగాల్లో ఎప్పుడుచూసినా కరువు కాటకాదులే. పంజాబు చివరకు వాళ్ల చేతికి వచ్చింది. అందువల్ల పచ్చపచ్చగ కళకళలాడుతూవున్నప్రాంతం ఇదొక్కటే. ఉత్తరప్రదేశ్‌లోని రైతు అందరికంటె దారిద్ర్యంతో చితికిపోయారు. అందువలన రైతులోకం కాంగ్రెసుఉద్యమంలో చేరుతున్నది. స్వరాజ్యం, సురాజ్యంవస్తుందని, అప్పుడు వ్యవసాయపద్ధతులు చక్కబడతాయని, తమ దారిద్ర్యం తొలగిపోతుం దని జన్మజన్మాంతరాలనుండి తాము పడుతున్నబాధలు అప్పులు తొలగిపోతాయని రైతులు నమ్మారు.

1937 లో కమాల్ లా మార్టినేయర్‌లోవున్నప్పుడు లక్నోలో అఖిల భారత ముస్లింలీగు మహాసభ, కాంగ్రెసు మంత్రిమండలి ఏర్పడటం అనే రెండు మహత్తరమైనఘట్టాలు జరిగాయి.

1942 ఆగస్టు 7 వ తేదీన 'క్విట్ ఇండియా' తీర్మానం ఆమోదించబడింది. దేశంలో తిరుగుబాటు ప్రారంభమైంది. విశ్వవిద్యాలయవిద్యార్థులు యీ ఉద్య మంలో ఎక్కువగా పాల్గొన్నారు. పోలీసుల కాల్పులవలన పదివేలమంది భార తీయులు చనిపోయారు.

బెంగాలులో ఆ తరువాత మృత్యుదేవత ప్రళయనృత్యం ప్రారంభించింది.

ముప్పైనాలుగులక్షలమంది జనం కరువువలన ఆకలితో చచ్చిపోయారు.

ముప్పైనాలుగులక్షలమంది ప్రజానీకం.

ముప్పైనాలుగు సంవత్సరాల మానవుడు—

ముప్పైనాలుగు లక్షలమంది అమ్నాబీబీ అబుల్ మన్సూరులు—

మరునాడు ఉదయం కమాల్ త్వరత్వరగా ఫలహారంచేసి దత్ హౌసుమంది బయలుదేరి ప్రమోద్‌దాగృహం చేరుకొన్నాడు.

పాక్ సర్కస్‌దగ్గర ప్రమోద్‌దా ఇల్లు వున్నది. అక్కడ కలకత్తా విశ్వవిద్యాలయ విద్యార్థులు, ఇప్టా కార్యకర్తలు, పార్టీ కార్యకర్తలు - లక్నోనుండి వచ్చిన యువక విద్యార్థులబృందం అంతా వున్నారు. వాతావరణం హడావుడిగా వున్నది.

ప్రమోద్‌దా కలకత్తావిద్యార్థులకు నాయకుడు. చందా వసూళ్ళనిమిత్తం ప్రదర్శించబడే కార్యక్రమపు ఒద్దిక ఒకవైపున జరుగుతున్నది. ఒకవైపున హార్మోనియం పెట్టివున్నది. ఇద్దరు ముగ్గురు ఆడపిల్లలు రవీంద్రనాథ్ టాగూర్ రచించిన 'చిత్రాంగద' పాటలు అభ్యసిస్తున్నారు. హాలుకు ఒకవైపున అద్దాలతెర అమర్చబడివున్నది. అక్కడ ప్రమోద్‌దా సోదరి స్టూడియో వున్నది. స్టూడియోలో ఒకయువకుడు తెల్లని లాలువాకప్పుకొని నిలబడి ఒక తైలచిత్రానికి చివరి అలంకరణ చేస్తున్నాడు. నాటకం అయిపోయినతరువాత ఆ తైలవర్ణచిత్రాన్ని వేలం వేసి వచ్చినడబ్బు క్షామనివారణనిధికి జమకడతారు.

అంతా ఎవరిపనుల్లో వారు మునిగివున్నారు.

కుంచె తుడిచి ఒకప్రక్కనబెట్టి, నుదుటిమీదిజుట్టును ప్రక్కకునెట్టి ఆ చిత్రకారుడు హాలు వాకిలిదగ్గరకువచ్చి నిలబడ్డాడు. హాలులోని దృశ్యాన్ని పరిశీలించి చూచాడు. ఎవరిపనుల్లో వారు పూర్తిగా మునిగివుండటంచూసి అతని ముఖంమీద మందహాసం తొణికిసలాడింది.

అతడు ఉత్తరప్రదేశ్ వాసి. జమీందారు కుటుంబానికి చెందినవాడు. విశ్వభారతిలో చేరాడు. ఎం. ఏ. ప్యాసైనాడు. లా పట్టంకూడా పుచ్చుకొన్నాడు. ఇక ఏం చేయాలో స్పష్టంగా నిర్ణయించుకోలేదు. పత్రికలు నడపడం, రాజకీయాలు, గంభీరమైన విషయాలమీద గ్రంథాలు వ్రాయడం - ప్రజలంతా సెభాష్ అనేలా కళమీద విమర్శలు వ్రాయడం వగైరా వగైరా కార్యక్రమాలు చాలావున్నాయి. ఇంకా ఏ ఒక నిర్ణయానికీ రాలేదు. రాజకీయంగా అతడు సామ్యవాది. ఐ.సి.యస్. కూడా పూర్తిచేయమని తండ్రి చాలాసార్లు చెప్పాడు. తండ్రి బారిష్టరు. విశ్వవిద్యాలయం చదువు పూర్తిఅయినతరువాత 'నాన్నా, విశ్వభారతికి వెళతాను' అని అన్నాడు. మొదట తండ్రి అంగీకరించలేదు. 'నీకు పిచ్చేమైనా ఎక్కిందా ఏం? చిత్రకారుడు

అప్పుడామనా!' అని అన్నాడు తండ్రి. ప్రపంచంలోని తండ్రులంతా యిట్టిస్థితిలో అలాగే అంటారు. కాని ఒక్కడే కొడుకు కావడంవలన అతనియిష్టప్రకారం తండ్రి అతణ్ణి విశ్వభారతికి పంపించాడు. రెండుసంవత్సరాలమండి అతడు బోల్పూర్‌లో వున్నాడు. విశ్వభారతిలోని మిగతావిద్యార్థు లందరితోపాటు తానుకూడా క్షామనివారణ కార్యక్రమాల్లో పాల్గొనేందుకు కలకత్తాకు వచ్చాడు.

'లక్నోమండి వచ్చినవాళ్ళను కలిశారా!' అని అటువెళుతూ ఒకరు అతణ్ణి ప్రశ్నించాడు. లేదు అని అంటూ లక్నోమండివచ్చిన వాళ్లవున్నహాలులోకి వెళ్ళాడు. అక్కడ కమాల్, అతని అనుచరులు బిగ్గరగా పాటలుపాడుతున్నారు. ఆ పాటలు కూడా కార్యక్రమాల్లో భాగమేనట.

ఎటుచూపినా అంతా బెంగాలీ మాట్లాడుతున్నారు.

కమాల్ తలఎత్తి ప్రక్కనే నిలబడివున్న అతణ్ణిచూపి 'నొమస్కార్' అని అన్నాడు. అతడు 'నమస్కారం' అంటూ జవాబిచ్చాడు. హార్మోనియం ప్రక్కకు పెట్టాడు కమాల్. బెంగాలి వినివిని విసుగుపుట్టింది. ఉర్దూలో 'ఆదాబ్' (నమస్కారం) అని వినేసరికి కమాల్‌కు ప్రాణం లేచివచ్చినంత పనైంది.

నా పేరు 'గౌతం పీలాంబర్' అని అన్నాడు తననుతానే పరిచయం చేసుకొంటూ.

నా పేరు 'కమాల్ రజా' అని జవాబిచ్చాడు. ఇద్దరూ చేతులు కలుపుకొన్నారు.

ఇద్దరూ ఒకేరకం దుస్తుల్లో వున్నారు. పిక్కల్నిపట్టే పాయిజామా, చొక్కా, నెహ్రూ వేస్కోటు, పైన కాశ్మీరుశాలువ. అక్కడ వున్నవారిలో చాలామంది యిదేవేషంలో వున్నారు.

'ఇక్కడ అంతా బెంగాలీ బెంగాలీ. విసుగుబుట్టి పోతూంది. బైట చౌకుకు వెళ్దాం.'

ఇద్దరూ సమీపంలోనువ్న ఫలహారశాలకివెళ్ళి కాఫీత్రాగి తిరిగివచ్చారు.

'నాతో పద. నా చిత్రాలు చూపిస్తాను' అంటూ గౌతం అరుణాదీదీ చిత్రశాలలోకి తీసికొనివెళ్ళాడు.

'మిత్రమా! హరిశంకర్‌ని కలిశావా!' అని అడిగాడు కమాల్.

'హరిశంకర్ ఎవరు!' గౌతం ప్రశ్నించాడు. పెద్ద చిత్రకారుడిలా నిలబడి రెండుపెదిమలమధ్య సిగరెట్టువుంచి చిత్రాన్ని పూర్తి చేయసాగాడు.

'హరిశంకర్ నా నేస్తం. మంచివాడు.'

'ఏడీ? ఎక్కడ వున్నాడు? పిలు' అని అన్నాడు నవాబుదర్జాగా గౌతం.

'అతడు యిక్కడ లేడు. లక్నోలో వున్నాడు. జబ్బుపడ్డాడు. అందువల్ల రాలేకపోయాడు.'

'మీరంతా లక్నోలో ఎందుకు వుంటున్నారు?' సిగరెట్టుపొగ వదలుతూ అన్నాడు గౌతం.

'అయితే ఎక్కడ వుండాలి?'

'అవును. నీ వనేదీ నిజమే.'

'ఈ బొమ్మముక్కు సరిగా వేయలేదు.'

'పెదవులు చిత్రించడం చాలా కష్టం.'

'బలే! బలేమాట అన్నావు.'

'ఇదిగో సిగరెట్, తీసుకో.'

'నీవు చిత్రకారుడివా?'

'కాదంటావా? ఎలా కనబడుతున్నానేం నీ కంటికి?'

'అరెరే. నిన్నుగురించే బావగారు జాబు వ్రాశారు.'

'బావగారా? ఎవరా పెద్దమనిషి?'

'మా లాజ్ భర్త.'

'మీ లాజ్ ఎవరు?'

'ఏం చెప్పమంటావు? బావగారు నిన్ను ఎరుగుదురు.'

'నన్ను చాలామంది ఎరుగుదురు.'

'ఓహో. ఇలాంటి భ్రమకూడా వున్నదన్నమాట!'

'నీకేమీ భ్రమలేదా?'

'లేకేం, వున్నది. కాని....'

'సరే' అంటూ బొమ్మ వేయసాగాడు గౌతం.

'శాంతినికేతనంలో నాలుగైదుసంవత్సరాలు యింకావుంటే క్రిందపడో మీద పడో చిత్రకారుడివి అయ్యేలాగున్నావు. ప్రస్తుతం అట్టి ఆశ ఏమీ కనబడటం లేదు' అంటూ బొమ్మను శ్రద్ధగాచూచి కమాల్ అన్నాడు.

'ఒట్టి చిత్రరచనేనా ఖర్మం ? బెంగుళూరువెళ్ళి రాంగోపాల్‌దగ్గర భరతనాట్యం కూడా నేర్చుకొందామని అనుకొంటున్నాను.' అన్నాడు గౌతం.

'అట్టి అభిప్రాయం మనకుకూడా ఒకానొకకాలంలో వుండేది. కాని మన అభిప్రాయం వెల్లడించేసరికి అక్కయ్యలు విరగబడి నవ్వడం ప్రారంభించారు. నన్ను బాగా ఎగతాళి చేశారు. అసలు ఆడపిల్లలకు కళ అంటే ఏమిటో, దాని విలువ ఏమిటో తెలియదు. అంతా మోసం.'

'అయితే, నీకు అక్కయ్యలుకూడా వున్నారన్నమాట.'

'ఆఁ వున్నారు. నీకు లేరా ?'

'లేరు....'

'అయ్యోయ్యో. అక్కయ్యలంటే జీవితంలో ఒక కోమలభావం కలుగుతుందన్నమాట.'

'ఆఁ. ఆయితే ఏం అయింది ?'

'ఏమిటి ?'

'నీవేదో చెబుతున్నావుకదా !'

'నీవు పార్టీలో చేరావా ?'

'పార్టీయా ! లేదు. ఇంకా అంత సామర్థ్యం రాలేదు. అందుకు యింకా బాగా అనుభవం కావాలి.'

'నీ వన్నది నిజం. నిన్ను చూస్తే విప్లవవాదిగా కనబడటంలేదు.'

గౌతం కోపంగా చూశాడు కమాలువైపు.

'మహాత్మగాంధీ మీ గురుదేవ్ టాగూరుతో ఏమన్నారో తెలుసా ? దేశంలో నిప్పు అంటుకుపోతున్నది. మీరు కూర్చొని పక్షులకూతలు వింటున్నారు.' అని అన్నారు.

గౌతం బ్రష్ విదిలించాడు. 'తెలివితక్కువగా మాట్లాడకు. నీ హరిశంకర్ కూడా నీలాగే పసివాడిలా మాట్లాడుతాడా ?'

'మా అన్నయ్యనుకూడా కలుసుకోవడం అవసరం' అని అన్నాడు కమాల్.

'అత డెవరు ?'

'మా పినతండ్రిగారబ్బాయి.'

'ఆయన సమర్థుడా ?'

'అవును.'

'లక్నోలోనే వుంటున్నారా?'

'అవును. కాని యిప్పుడు యుద్ధరంగానికి వెళ్ళారు.'

'అంటే లక్నోలో ఒకణ్ణిమించినవాళ్లు ఒకళ్లు వున్నారన్నమాట.'

'మ రేమనుకున్నావు?'

'అయితే పద. గ్రాండ్ హోటలుకు వెళ్ళి భోజనంచేసి వద్దాం.' అంటూ చిత్తరువుమీద తెర కప్పివేశాడు.

'గ్రాండ్‌హోటల్లోనా? నీవు 'బూర్జువా'లా వున్నావే?'

'అనవసరంగా వాగకు.'

'ఒక్క విషయం చెబుతున్నాను. నేను ఏ విషయాన్నిగురించైనాసరే హృదయం విప్పి మాట్లాడుతాను.'

'మంచిది.'

'వర్గనమాజంగురించి నీ అభిప్రాయం ఏమిటి? శ్రామిక కర్షకయుగం రాబోతుందనే నమ్మకం నీకు వున్నదా?'

'వున్నది.'

'ఏదీ చేయి కలుపు.'

'భూస్వామ్యసమాజం కుక్కచావు చస్తుందనీ నీ యభిప్రాయం?'

'అవును.'

'ఏదీ ఇంకోమారు కరచాలనం చేయి.'

'భూస్వామ్య సమాజమంటే అసహ్యం రోత నీకు నిజంగా వున్నదా? దాన్ని మొదలంట పెకలించివేయాలనేభావం నీకు వున్నదా?'

'నాకు ఆ భావంవున్నది సరే. కాని మరి నీవు ఆ భూస్వామ్యవ్యవస్థకు, వర్ణానికి చెందినవాడవే కదా!'

'నీకు ఎలా తెలుసు?' కంగారుపడుతూ అడిగాడు కమాల్. చేసిన దొంగతనం బయటపడినంత పనైంది.

'ఇప్పుడిప్పుడే ఎవరో చెప్పారు మటియాబుర్జ్‌వాలా నవాబు నీకు బంధువని. దత్ హౌస్‌కు చెందిన నవాబుగారి........'

'కావచ్చు. అందుకు నేనేం చేయగలను? చరిత్రమీద నాకేమీ అధికారం లేదు కదా? ఇప్పుడుమాత్రం నన్ను నేను డీ క్లాసులో చేర్చుకోవాలని గట్టిగా ప్రయత్నిస్తున్నాను.'

'నీ హరిశంకర్ కూడా భూస్వామ్యవాదేనా?'

'అవును. కాని పాపం అతడుమాత్రం ఏం చేస్తాడు?'

'మంచిది. నేనుమాత్రం పూర్తిగా మధ్యతరగతివాణ్ణి సుమా?' అంటూ గౌతం చిరునవ్వు నవ్వాడు.

'బాధపడకు. మనం క్రొత్తగా ఆవిర్భవిస్తున్న సమాజంలోవివాళ్ళం. అంటే జనతా సమాజం అన్నమాట.'

ఈవిధంగా విద్యార్థుల్లా చర్చ సాగించినతరువాత యిద్దరూ బైటకు వచ్చి వేశారు.

లక్నో తిరిగివచ్చినతరువాత కమాల్ బావగారికి ఉత్తరం వ్రాశాడు. గౌతం నీలాంబరుణ్ణిగురించిన పొగడ్తలతో ఆ జాబును నింపివేశాడు.

ఆ సంవత్సరం వేసవికాలంలో గౌతం లక్నో వచ్చాడు. తను వున్నచోటునుండి గుల్‌షిషాకు ఫోనుచేశాడు. అంతా రేడియోస్టేషను వెళ్ళారని తెలిపింది. రేడియో స్టేషనుకు ఫోనుచేస్తే యిప్పుడే అంతా సింహాదేవాలీ కోఠీకి వెళ్ళారని చెప్పారు.

'సింహాదేవాలీ కోఠీయా? ఏమిటి అర్థం పర్థంలేని పేరు? క్రొత్తరకంపేర్లు యిళ్ళకు పెడుతున్నారే. ఖర్బూ జావాలీ హవేలీ, తర్బూజా మహలు, ముల్లంగి మంజిల్, గుమ్మడికాయల హౌస్ 'భలేపేర్లు' అని అనుకొని నవ్వుకున్నాడు గౌతం. బహుశ వీళ్ళు సింహాదాలు అంటే పరికెగడ్డలు తింటుంటారేమో అని అనుకొంటూ సింహాదేవాలీ కోఠీకి ఫోనుచేశాడు. చంప రిసీవరు ఎత్తింది. 'హలో' అని అన్నది చంప.

'హలో, ఆదాబ్ అర్, చూడండి నాపేరు గౌతం....గౌతం నీలాంబర్. మీరు అక్కడినుండి ఎక్కడికివెళ్ళనంటే వెంటనే అక్కడికి వచ్చేస్తాను.'

'తప్పకుండా రండి. ఎక్కడికీ వెళ్లం' అంటూ చంప రిసీవరు పెట్టివేసింది.

సింహాదేవాలీ కోఠీలో అంతావెళ్ళి నదికి ఎదురుగావున్న వరండాలో కూర్చున్నారు. 'మీలో తలత్ అరా బేగం ఎవరండీ?' అని ప్రశ్నించాడు గౌతం.

'నేనేనండి. ఏమిటో చెప్పండి.'

'చూడండి - కలందట్టుకొని కూర్చొని రాపేస్తామంటే ఆపేవాళ్లెవరూ వుండరు. కాని మీరు అలా చేయకుండావుంటే ఎంత బాగుండేదండి ?'

ఓహో అదా సంగతి. మీరు 'ఇప్టా' ఆధ్వర్యాన ఎన్ని చమ్మనాటకాలు కల కత్తాలో ప్రదర్శించారో కమాల్‌ద్వారా తెలుసుకొన్నాను. మీకు అవకాశం యిస్తు న్నాను. పదిహేను నిమిషాలసేపు మీ యిష్టంవచ్చినట్లు మాట్లాడి మమ్మల్ని ప్రభా వితుల్ని చేయండి. ఆ తరువాత అంతటైము మాకు యివ్వండి. అలా యివ్వడం మంచిది. అప్పుడు మీరు మామూలు అయిపోవాలి. మామూలు అయిపోవడం మంచిది. యిక ప్రారంభించండి. మీ ప విశ్వభారతిలోచేరి దానికి అలంకారం చేకూరుస్తున్నారట కదూ ! ఇక్కడకూడా తక్కువతిన్నవాళ్ళు ఎవ్వరూ లేరు. ఏరకం కావాలంటే ఆ రకం కళాకారులు వున్నారు. వీళ్లంతా మొదట ఒక్కొ క్కరుచొప్పున, ఆ తరువాత అంతాకలిసి మిమ్మల్ని ప్రభావితులు చేసేందుకు ప్రయ త్నిస్తారు. మొదట మీరు మీ రాజకీయసిద్ధాంతాలను మా ముందుంచండి. మీరు ప్రగతి విరోధకులా, లేక హిందూమహాసభవారా ?'

'మీరు ముస్లింలీగువారా ?' అంటూ గౌతం వెంటనే తిరుగుదాడి చేశాడు.

'మీరు చిన్నరకం గురుదేవులు కాబోతున్నారని కమాల్‌భయ్యా అన్నాడు లెండి.'

'అయితే మీరు శిష్యపరమాణువుల్నికూడా చేర్చుకొంటారా అండి ?' అని అన్నది నిర్మల.

'సామాన్యంగా చేర్చుకోను. కాని అప్పుడప్పుడు చేర్చుకొంటానుకూడా.'

'గౌతం అనునది మీ కలం నామధేయమాండి ?' తలత్ అడిగింది.

'లేదండి. బహరాయిచ్ పండితులున్నారు చూశారూ ! వాళ్లు ఏమేమో ఎవ్వరికీ తెలియనిరహస్యాలు తెలుసునని అంటూవుంటారులెండి. వాళ్లు నాకు యీ పేరు పెట్టారండీ.'

'అన్నయ్య యింకా రాలేదు. టీ అక్కడే త్రాగుతానని ఫోను చేశాడు' అని అన్నాడు కమాల్.

'అన్నయ్యా ! అంటూ తలత్ గదియూరంచూసి గుర్రపుస్వారీకోసం వెళ్ళాడు. ఇప్పుడు ఈత ముగించి వస్తున్నాడన్నమాట' అని అన్నది. అంతా నిగ్గువడ్డారు.

'అరే అల్లా! ఆయన ఎవరందోయ్? పిపీ నటుడా? అశోకకుమార్ వగైరా వగైరా?' అని ప్రశ్నించాడు గౌతం.

'నేను మీకు చెప్పలేదూ అన్నయ్యనుగురించి? ఆయనే' అని అన్నాడు కమాల్.

'అయోధ్య జాగీర్దార్లనుగురించి నాకు బాగా తెలియదు. మీరంతా గుర్రపుస్వారి, ఈత వగైరా చేస్తుంటారా? మధ్యతరగతిజనంలా నేనుకూడా ధనికవర్గమంటే మోజుపడుతూవుంటాను. యుద్ధానికిపూర్వం మా నాన్నగారితోబాటు ఇంగ్లండు వెళ్ళాను. బ్రిటిష్ లార్డుల్ని చూడాలని తెగతిరిగేవాణ్ణి. దూరాన ఎవరైనా లార్డు కనబడ్డాడో అమాంతం అక్కడికి ఒక్కదూకు దూకేవాణ్ణి. ఆ తరువాత అక్కడి శవవాహకులుకూడా అలాంటి డ్రస్సే వేసుకొంటారని తెలిసింది.'

'అయితే మేముకూడా శవవాహకులమా ఏం' అని అన్నాడు కమాల్.

'కాదులేవోయ్. గతకాలపు సమాధులపూజారుల్లేవోయ్ మీరు.' అని అన్నాడు హరిశంకర్.

'అయినా మీరు మమ్మల్ని అంగీకరించక తప్పదు. మేము మాయిష్టంమీదనే ఆధారపడి జీవిస్తున్నాం.' అని అన్నాడు కమాల్.

'ఓ తప్పకుండా అంగీకరిస్తాను. నా హృదయం చాలా విశాలమైంది' అని అన్నాడు దర్జాగా గౌతం.

# 28

చంపకూడా ఆ జట్టులో చేరిపోయింది. ఆ జట్టు నియమాలతో ఆమె రాజీపడింది. జట్టులో అందరికీ సానుభూతి వున్నది. మనం ఎప్పుడూ ఆధారంకోరుతూవుంటాం. వాతావరణంలా జట్టుకూడా ఒక పాత్రవంటిది. కల్పనలకు సాకారస్వరూపం మానవసంబంధాలు చాలా నాజూకైన సున్నితమైన పునాదులపై ఆధారపడి వుంటాయి. ఈ సంబంధాలు తరచు తెగిపోతూకూడా వుంటాయి. అందుకనే మీర్ అనీస్, మీర్ తకీమీర్‌వంటి ఉర్దూకవులు యీవిషయంలో జాగ్రత్తసుమా

అని మానవజగత్తును హెచ్చరించారు. ఎటుచూసినా గాజుపాత్రలు, అవన్నీ గాజు గృహాల్లో వున్నాయి. అసలు యంత్రశాలంతా గాజుతో నిర్మించబడిందే. అంతా బహు సున్నితం. కమాల్ అందుకొని 'చంపాబాజీ! నలుగురితో కలిసిమెలిసి వుండండి. మీరు మా యింటికిరండి, మేము మీయింటికి వస్తాం. మిమ్ము ఎప్పుడూ ఒంటరిగా వదలం. అయితే మీ మనస్సునుమాత్రం కాస్త క్రమశిక్షణలో వుంచు కోండి. అదే అసలువిషయం. మీరు ప్రేమైకజీవులు. అదే వచ్చిన పెద్దకష్టం.'

'అసలు జీవితంలో క్రమశిక్షణ అవకాశం ఎక్కడ వున్నది? ఇక్కడ అంతా ఊహాపోహలేనాయి. మీరు కళాకారులయివుంటే సరిపోయేది. ఈ గొడవకు శబ్దాల తొడుగు తొడిగివుండేవారు. మీరు ఏమీ వ్రాయరు. మరోరూపంలోనూ మనస్సును వ్యక్తంచేయరు. అందుకనే మీకు క్రమశిక్షణ అవసరం' అని అన్నాడు కమాల్.

'ఈ రచయితలంతా సమానస్థాయిలో వుంటారా?' అని అన్నది చంప.

'లేకపోయినా కళాఖండాన్ని తీర్చిదిద్దే ప్రయత్నంలో వాళ్ళు తమకంఠాన్ని వెతుక్కుంటారు....చంపాబాజీ! లేకపోతే మీరు బొమ్మలైనా వేస్తూవుండండి.'

'నన్ను విక్టోరియారాణి కాలంనాటి ప్రేమపూజారిణిగా చిత్రిస్తున్నావే? కమాల్. నేను పదిలంగానే వున్నాను. నేను మీ అందరితోబాటే వుంటాను. నేను తహమీనాతోకూడా కలిసివుంటాను.'

'కాని మనస్సుకు, బుద్ధికి ఏవిధంగా సమన్వయిస్థ—— కుదిరించుకోవాలో యోచించుకోండి. దాన్ని నిర్ణయించుకొంటే తెప్ప అవలిఒడ్డుకు చేరినట్లే.'

'మళ్ళీ అవే మాటలా?'

'అయితే మీరు ప్రయోగం చేయాలనుకుంటున్నారా? చంపాబాజీ! మీమీద ప్రయోగం చేసుకోకండి. ప్రపంచం గొప్ప గుణపాఠం నేర్పుతుంది. ఆ దెబ్బకు బుర్ర గిర్రున తిరిగిపోతుంది సుమా!'

ఈవిధంగా కూర్చొనో, రోడ్డుమీదన నడుస్తూనో చర్చించుకొంటూ వుంటారు.

ఇప్పుడు చంప, తహమీనా, నిర్మల, తలత్ తరుచు కలసేవుంటున్నారు. ఒక నాడు తహమీనా చంపానుపిలిచి 'చూడు! యీ సమస్యను పెద్దవాళ్లస్థాయిలో పరిశీలిద్దాం. అన్నయ్య డిశంబరులో మద్రాసునుండి వస్తున్నారు. ఈ సంవత్సరం నాకు ఎం. ఏ. పూర్తి అవుతుంది. ఆత్మికంగా కష్టాలు సహించగలనని, ధైర్యంగా వుండ గలనని అనకు. నామాట విను. ఆయన్ను పెళ్ళిచేసికో' అని అన్నది గట్టిగా.

'ఏమిటి నీ పిచ్చిమాటలు?'

'నిజంగానే చెబుతున్నాను.'

'అయితే నీవే ఆయన్ని పెళ్ళి చేసికోరాదూ?'

'నేను వీకు నీడనై బ్రతుకదలచుకోలేదు.'

'పిచ్చిమాట' అని మౌనం వహించింది చంప. 'అసలు అన్నయ్యే జీవిత లక్ష్యం కాకూడదు. ఇంతగా గొప్పచేసి ఆకాశంమీద ఎక్కించేందుకు తగినవాళ్ళు కాదు యీ మొగవాళ్ళు' అని అన్నది తహమీనా.

'అవును. నిజమే.'

'జీవితానికి ఒక లక్ష్యం ఏర్పడాలి. అది కమ్యూనిస్టుపార్టీ. చెప్పు, అవునని చెప్పు.'

'అవును' అని అన్నది కొంచెంసేపు ఆగి.

తలత్ అవతలిగదిలో కూర్చొనివున్నది. ఈమాటలు ఆమెచెవిన బడ్డాయి. చాలా సంతోషించింది. 'వీళ్ళిద్దరికీ అసలువిషయం బోధపడింది. అంతా దేవుడి దయ' అని అనుకొన్నది. ఈవిషయం ఫోనుమీద నిర్మలకు చెప్పింది తలత్. నిర్మలకూడా దేవుడికి నమస్కారాలు చేసింది.

కాని అన్నయ్య శిశంబరులో లక్నో వచ్చాడు. చంపను కలిగిన నూతన దృక్పథాలన్నీ ఆయన్ని చూడగానే మాయమైపోయాయి. రోజంతా తెలియని సంతోషం ఆమెకు కలుగసాగింది.

గౌతం సీలాంబర్‌కూడా అప్పుడే అక్కడకు వచ్చేశాడు. ఒక ఆంగ్ల దినపత్రి కాఫీసులో అతనికి ఉద్యోగం దొరికింది.

వీళ్ళందరుకలిసి గడిపిన ఆ రోజులు వాళ్ళజీవితాల్లో అమూల్యమైనవి. అలాంటి రోజులు యిక తిరిగిరావు.

## 29

'శాంతా! ఇక్కడ చాలా ప్రశాంతంగావున్నది. చెట్లకొమ్మలమీద కోయిలలు కూర్చొని వుంటాయి. మామిడితోపులు ఎక్కువ. గౌరవనీయులు, రిచెర్డ్

కలెక్టర్లు, జమీందార్లు, జాగీర్దార్లు, బారిష్టర్లు యిక్కడ పెద్దపెద్ద మేడలు కట్టుకొని వున్నారు. ఆదివారంనాడు ఆడపిల్లలు బర్మారకం గొడుగులు వేసుకొని ఒకరి యిండ్లకు మరొకరు వెళుతూవుంటారు. పచ్చికబయళ్లలో కూర్చొని సరదాగా కాలంగడుపుతూ వుంటారు. ఉన్నతతరగతి బుద్ధిజీవుల్లా వీరి చర్చలు సాగుతూ వుంటాయి. ఇక్కడివారి జీవితాల్లో అన్నిరంగాల్లోను హాయే హాయి. ఇక్కడి యిండ్లకు పెద్దపెద్ద వాకిళ్లు, పెద్దపెద్ద తలుపులు వుంటాయి. వాటికి రంగురంగుల తెరలు కట్టివుంటాయి. వెడల్పాటి మెట్లు, పెద్దపెద్ద కుర్చీలు, పచ్చికబయళ్లు, పెద్దపెద్ద చెట్లు వీటిమధ్య యిండ్లు కప్పబడివుంటాయి. ఇక్కడి యిండ్లమీద ఇటాలియన్ పద్ధతిలో గదులు వుంటాయి. ఇలాంటియిండ్లు యీ ప్రాంతమంతటా వున్నాయి. వీటి పునాదులు చాలా గట్టివి. బలమైనవి. నేను జన్మించిన బహరాయిచ్ లోని మా యిల్లుకూడా యిదేరకంగా వున్నది. నేను యిండ్లకథ వ్రాస్తూ కూర్చున్నాను. కాంతా, ప్రతివిషయాన్నిగురించి విస్తారంగా ఆలోచించడం అనే అలవాటు పోగొట్టుకొందామని ప్రయత్నిస్తున్నాను. విసుగుపుట్టింది. ఇండ్లవిషయం వదులుతున్నాను. ఇక వీళ్ళపేర్లు విచిత్రంగా వుంటాయి.

'ఉదాహరణకు ఒకామెపేరు చంపాబేగం. పేరు బాగున్నదికదూ. కాంతా: నీవు చాలాదూరాన వున్నావు. ఇక్కడి ప్రతివస్తువును నాకండ్లతో నీవు చూడాలని నా అభిలాష. కాంతా! చాలారోజులైందికదూ నీవు నన్ను అదిలించి బెదిరించి, నీలో దాగివున్న మాతృత్వాన్ని నేను కదిలించడంలేదూ! కాంతా! నీవు యిక్కడ వుండివుంటే ఎంతో బాగుండేది.

'విచిత్రమైనవిషయం మరొకటున్నది. నేను అనధికారంగా చూపుడు పెండ్లికొడుకుగా యిక్కడికి పిలిపించబడ్డాను. ఇక్కడ నిర్మలారాణి అనే అమ్మాయి వున్నది. సామాన్యంగా ఆడపిల్లలు సిగ్గుపడుతూ వుంటారుకదూ! అట్టిసిగ్గులేమీ లేకుండానే యీ అమ్మాయి హార్మోనియంమీద పాటలుపాడి వినిపిస్తుంది. తన తల్లితండ్రులు తనను నాకిచ్చి పెండ్లిచేద్దామనుకొంటున్నారనువిషయం ఈమెకు తెలిసినట్లు లేదు. మొత్తంమీద నేనంటే యీమెకు పెద్ద శ్రద్ధవున్నట్లు లేదు. ఈమెకు ఎప్పుడూ తీరికవుండదు. ఈమె కార్యక్రమాలు చాలావున్నాయి. కేంబ్రిడ్జి వెళ్ళి డాక్టరేట్ చేస్తుందిట. నిర్మల, తలత్ వీళ్ళిద్దరూ చురుకైన తెలివిగల ఆడపిల్లలు. వసబోసినపిట్టల్లా ఎప్పుడూ మాట్లాడుతూనే వుంటారు.'

'ఏమండీ : ఉపన్యాసం వ్రాయడం పూ ర్తిచేశారా?' అంటూ దూరాన్నుంచే అడిగింది నిర్మల.

'వ్రాస్తున్నాను.'

'ఏదీ చూపించండి.'

'అరే. అసలు వ్రాసింది ఉపన్యాసంకాదు. అవసరమైన జాబు వ్రాయవలసి యిప్పుడే ప్రారంభించాను.'

'ఇది ఉత్తరాలువ్రాసే సమయమా చెప్పండి?'

ఇంతలో గదిలో అంతాకలిసి కవ్వాలీ మొదలుపెట్టారు.

'పదండి. కవ్వాలీలో పాల్గొని పాడండి.' అంటూ నిర్మల ఆదేశించింది.

సింహాదేవాలీ భవనానికి సంబంధించినంతవరకు కవ్వాలీపాట గొప్పదే అయి వుండవచ్చు. గౌతం నిర్మలను శ్రద్ధగా చూశాడు. పిచ్చిపిల్ల ఎంత సంతోషంగా వున్నదో!'

ఇంతలో మెట్లమీద సయ్యద్ నిలబడివుండటం గౌతం చూశాడు. ఆయన కంగారుపడుతున్నట్లున్నాడు. ఆయన మొహంమీద చిరునగవు తొంగిచూస్తున్నది. ఆయనకు స్వాగతం చెప్పేందుకు అంతా వరండాలోకి వచ్చారు.

'ఈయన కంగారుమనిషిలా వున్నాడే?' అని మెల్లగా అన్నాడు గౌతం.

'ఆడపిల్లలంటే కంగారుపడతారు పాపం. ఎంతో పెద్దమనిషి.' వెంటనే జవాబిచ్చింది నిర్మల.

'ఆయన పెద్దమనిషా? అయితే మేమంతా రౌడీలమన్నమాట: భలే భలే.' అంటూ హరిశంకర్ తన అనమ్మతిని ప్రకటించాడు.

'అచేతనంగావున్న ఆయన మనస్సులో ఏదో పేచివున్నదన్నమాట.' అంటూ గౌతం తన అభిప్రాయం ప్రకటించాడు. హరిశంకర్ చేత్తో గౌతంను ఒక్క పర్యాయం నొక్కాడు.

అన్నయ్య పైభాగమంతాచూపి చంప వుండేచోటుకు వెళ్ళిపోయాడు. చంప కుర్చీమీదనుండిలేచి ఆయనకోసం టీ తయారుచేయసాగింది.

'ఓహో యిదా వ్యవహారం?' అంటూ గంభీరంగా అన్నాడు గౌతం.

'అన్నయ్యగారు బలేగా నాట్యం చేస్తారు' అంటూ పరిస్థితిని సరిచేయాలని ప్రయత్నించింది నిర్మల. వాళ్లు ముగ్గురు వరండాలో దూరంగా విడిగా కూర్చున్నారు. 'జానపదనాట్యమా లేక శాస్త్రీయనృత్యమా?' అని అడిగాడు గౌతం.

'రెండూకాదు, చాలపాతరకంలే' అంటూ యిష్టంలేనట్లుగా సమాధానం చెప్పింది నిర్మల. లోపలినుండి బిగ్గరగా జరుగుతున్నచర్చ వినబడసాగింది.

హరిశంకర్‌మాటలు వినబడుతున్నాయి. 'ఏమిటయ్యా లోపలగొడవ, ఎప్పుడూ ఏదోచర్చ చేస్తూనేవుంటారు?' అని అన్నాడు గౌతం.

'జీవితం అనేకయుగాల్లో విభజింపబడివున్నది' అని అన్నాడు కమాల్.

'అంటే!'

'ఇది పూర్తిగా మాటలయుగం.'

'చేతలయుగం ఎప్పుడు వస్తుందంటావు?'

'అదే ప్రధానమైనవిషయం. దేవదూతలు, తత్వవేత్తలు, చింతనాపరులు యిటువంటివిషయాలనుగురించి ఏమీ మాట్లాడక మౌనం వహించియుంటే ప్రపంచంలోగల యీనాటి గ్రంథాలయాలలో మనుషులెవరో కనబడక గాడిదలుమాత్రం దొర్లుతూ కనబడుతుండేవి. నేను మాట్లాడుతూవుంటే నీవు వింటున్నావు. ఇది గొప్పవిశేషమనుకో. మా మాటలకోసం నీ చెవులు ఆరాటపడేరోజుకూడా ఒకటి వస్తుంది. గుర్తుపెట్టుకో' అని అన్నాడు కమాల్.

'చాలావిషయాల్ని కాలం అణచివేస్తుందనే నమ్మకం నీకు వున్నదా!'

'అవును.'

సూర్యుడు నదిలో మునిగిపోతున్నాడు. ఎదురూగా ఒకపడవ ప్రశాంతంగా నదిలో ముందుకు సాగిపోతున్నది.

'సంకేతాలలో రహస్యాలు దాగివుంటాయని అంగీకరిస్తావా? గౌతం ప్రశ్నించాడు. 'అవును' అని అన్నాడు కమాల్.

'అదుగో ఆ వెళుతున్న పడవను చూడు. ఆ సంకేతంలో గొప్పరహస్యం దాగివున్నది' అని అన్నాడు గంభీరంగా గౌతం. ప్రతిమాటను తూచితూచి అనడం, నాటకఫక్కీలో మాట్లాడటం గౌతమునకు అలవాటు. అతడు మాట్లాడుతుంటే విన బుద్ధిపుడుతుంది. హరిశంకర్ కూడా అతనిదగ్గరకువచ్చి కూర్చున్నాడు.

వాళ్లు మెట్లమీదకువెళ్ళి నిలబడ్డారు. మెట్లు నదినీటి లోపలివరకు వున్నాయి.

నది గడిచిపోతున్న కాలం వంటిది. బండరాయి కాలానికి సఘనరూపంవంటిది. ఎలుక చావువలె ప్రపంచమంతా గిట్టితీరుతుంది. అది అంత మహత్తరమైనది కాదు కూడా. ఈ నది మనజీవితాలకు 'గుర్తు' అని వేదాంతంలో వ్రాసివున్నది.

'అందుకనే నాకు నదులంటే యిష్టం. నీకూ యిష్టమేనా?' అని హరిశంకర్ కమాల్‌వైపు తిరిగి అడిగాడు.

'ఆఁ, యిష్టమే.'

'నేను నదినీటిలోమునిగి చచ్చిపోతా'నంటూ మరోప్రకటన చేశాడు గౌతం.

'గౌతం ఏమిటీమాటలు! 'పెట్టీబూర్జువా అయిపోతున్నావు రోజురోజుకీ' అంటూ తలత్ అతనికి దగ్గరకువస్తూ అన్నది బాధగా.

'తలత్ బేగం! ఇది కాలమహిమ, నీకు కాలంయొక్కశక్తి తెలియదు.'

వంతెన ఆవలివైపునుండి నౌబత్‌ఖానామ్రోత వినబడింది. నిశ్శబ్దంగావున్న ఆ సాయంసమయంలో అంతా ఆ మ్రోత వింటూవున్నారు.

'పదండి. దయ్యాల్ని వెతుకుదాం.'

'పదండి.'

ఆ నలుగురూ బైటకు వచ్చారు.

'చంపాబేగం! అన్నయ్యగారూ! అప్పీ! మనమంతావెళ్ళి దయ్యాల్ని వెతుకుదాం రండి' అంటూ గౌతం గౌరవంగా ఆహ్వానించాడు.

అంతా కారువైపుకు ముందుకుసాగారు. కారు క్రమంగా వంతెనమీదుగా పోతున్నది.

'మానవుడు యిక తిరిగిరాలేని రోడ్డు మలుపుఒకటి జీవితంలో వస్తుంది.' అని లోలోన అనుకున్నాడు అమిర్‌రజా.

కమాల్ కారుఆపి 'రండి, కెరటాల్ని లెక్కపెడదాం' అంటూ కారుదిగి వంతెనమీదినుండి నదిని చూడసాగాడు.

క్రింద నదిలో పడవలు వరుసగా వెళుతున్నాయి. వాటిలో కూర్చున్నవాళ్ళు రంగురంగుల విచిత్రమైన దుస్తులు ధరించియున్నారు. వాళ్లు చేతులెత్తి వంతెన మీద నిలబడి తమవైపు చూస్తున్నవాళ్ళను రమ్మని పిలువసాగారు. వాళ్ళమాటలు ఏమీ బోధపడలేదు. నదిఒడ్డున కుక్కలు నక్కలు అరుస్తున్నాయి. శ్మశానవాటిక దగ్గర కట్టెలచప్పుడు వినబడుతున్నది.

'ఇక్కడమంది పోదాం. ముందుకు పదండి' అని అన్నది చంప.

'ఈ చప్పుడును తప్పించుకొని ఎంతదూరం పోగలం? ఇదే చివరిచప్పుడు. ఎవరికైనా తప్పదు' అని అన్నాడు గౌతం.

'నాకు తల తిరిగిపోతున్నది. దయ్యాలనుండి నన్ను రక్షించండి' అంటూ అమిర్‌రజా వంతెన అంచుమీద తలవుంచాడు. చంప అతనికిదగ్గరగా నిలబడి వున్నది.

'అందమైన మనిషీ ! నీ హృదయాన్ని నేను తెలుసుకోగలిగితే ఎంతో బాగుండి వుండేది' అని అన్నది చంప.

'నీవు తెలుసుకోలేవు. ఎవ్వరూ తెలుసుకోలేరు.' అని అన్నాడు అమిర్‌రజా.

అంతా కారు ఎక్కారు. కారు ముందుకుసాగింది. వెన్నెలలో అందరిముఖాలు తళతళలాడుతున్నాయి. కమాల్ పాట ప్రారంభించాడు.

'వంతెనలు. ఎక్కడచూసినా వంతెనలే వంతెనలు' అని అన్నాడు విసుగ్గా గౌతం.

కారు సికిందర్‌బాగ్ రోడ్డుమీదకు వచ్చింది. ఇంతలో ఒక ఏనుగు ఎదురుగా వస్తూ కనబడింది. దానిమీద అయోధ్య చక్రవర్తి గాజీఉద్దీన్ హైదర్ కూర్చొని వున్నాడు. చంప అతణ్ణి శ్రద్ధగా చూసింది. అతడు ఒక విదూషకునిలా కనబడ్డాడు.

'కనీసం అతణ్ణి 'హౌ డూ యు డూ' అని అన్నా పలకరించండి.'

'ఇతడు ఇంగ్లీషువారల్నే మించిపోయాడు. విదేశీవారల్లా దుస్తులు వేసుకొన్నాడు' అని అన్నాడు కమాల్.

కారు ముందుకు సాగింది. 'గంటలకొద్ది నేను వీళ్లతో గడుపుతున్నాను. వీళ్లు ఏం కోరుతున్నారో తెలియడంలేదు. వీళ్ళతో తిరగడం శుద్ధదండుగ. ఒంటరిగా వుండటమే మంచిది.' అని లోలోన అనుకొన్నది చంప.

కమాల్ హఠాత్తుగా కారు ఆపివేశాడు. ఎదురుగా లా మార్టినేయర్ కాలేజి వున్నది.

'ఇక్కడ ఎన్నో విషయాలు నేర్చుకొన్నాం' అని అన్నాడు కమాల్. అమిర్ రజా, హరిశంకర్! 'నీవు ఎప్పుడూ విపరీతంగా ఎందుకు చదువుతూ వుంటావు?' అని అడిగారు గౌతంవంక చూచి.

'వీళ్ళహృదయాలు పాడైపోయాయి. వీళ్ళకు తెలియజెప్పేందుకు ప్రయత్నించడం అనవసరం' అని అన్నది తలత్. గౌతం ఏమీ మాట్లాడలేదు.

వాళ్ళంతా దిగి భవనందగ్గరకువెళ్ళి కిటికీలగుండా లోనికి తొంగిచూడసాగారు. లోపలిగదులు చీకటిమయంగా వున్నాయి. తెల్లవారితే యీ గదుల్లో తరగ...

జరుగుతాయి. గోడమీద జోఫనీ చిత్రించిన జనరల్ మార్టిన్ వివాహంచేసికొన్న భారతీయసతీమణి పటం వ్రేలాడుతూవున్నది. తలత్ కిటికీఅద్దానికి ముక్కు ఆనించి నిలబడిపోయింది. మిగతావాళ్లు తలవంచుకొని ఏటివైపుకు వెళ్లిపోయారు.

'అమ్మాయీ : యిటురా....నాదగ్గరకు రా !' అను పిలుపువిని తలత్ వెనక్కు తిరిగి చూసింది. జనరల్ మార్టిన్ వివాహంచేసికొన్న భారతీయ సతీమణి ఏటి ఒడ్డున నిలబడివున్నది. సైగచేసి దగ్గరకురమ్మని ఆమె తిరిగి పిలిచింది.

'నాతో మాట్లాడు. నాతో ఎవ్వరూ మాట్లాడరు. పగలంతా యిక్కడ హంగామా ఎక్కువగా వుంటుంది. పుస్తకాలు చదువుతూవుంటారు. ఉపన్యాసాలు యిస్తూవుంటారు. కాని నావంక ఎవ్వరూ చూడరు. పిలిచినా పలుకరు.' అంటూ వెక్కివెక్కి ఏడ్వసాగింది. ఈమెను ఎలా ఓదార్చడమో బోధపడక తలత్ కంగారుపడి అనంతమగు బిందువుమీద దృష్టి కేంద్రీకరించండి. కాలచక్రపు వేరువేరుముక్కలు నిజానికి....' అని ఏమో చెప్పబోయింది. ఇంతలో కమాల్ గౌతంమాటలు బిగ్గరగా వినబడసాగాయి.

'ఎప్పుడూ చదవనని మాట యివ్వు' అని అన్నాడు కమాల్.

'ఇక్కడినుండి మా ఇంగ్లీషు ప్రొఫెసరొకడు పుస్తకాలువదలి హిమాలయాలకు పారిపోయాడు. అక్కడ యింకా అతడు బ్రతికేవున్నాడో లేక ఏ సింహమైనా అతణ్ణి తినివేసిందో ఎవరికి తెలుసు ?' అని అన్నాడు హరిశంకర్.

'ఓమ్, ఓమ్, ఓమ్' అంటూ ధ్వని వినబడింది. హరిః ఓమ్, హరిః ఓమ్.'

అంతా బయలుదేరి లాల్‌బజరీవాలా రోడ్డుదగ్గరకు చేరారు. చంప చేయిచాచి పూవులకొమ్మను ముట్టుకొన్నది. ఒక ఆకు రాలి పడిపోయింది.

'విష్ణువు ఆకురాల్పులో దాగివున్నాడు. హరి, హరి' అని అన్నది చంప.

గ్రంథాలయపు పైభాగంమీదుగా ఒక పెద్ద గద్ద ఎగురుతూ వెళ్ళింది. లాటిన్, ఫ్రెంచి, ఇంగ్లీషుభాషల శబ్దాలు గుంపులుగుంపులుగా బయలుదేరి నలువైపుల క్రమ్ముకున్నాయి. చాలాశబ్దాలు దాబామీదవున్న ఫిరంగిమీదకు ఎక్కి కూర్చున్నాయి. 'నాపేరు లార్డ్ కార్న్‌వాలిస్. నేను శ్రీరంగపట్టణంలో ఉపయోగించబడ్డాను' అంటూ ఫిరంగి గర్జిస్తూ అన్నది. దాబామీదకూర్చున్న రాతిసింహాలు, విగ్రహాలు బిగ్గరగా నవ్వసాగాయి. ఎందుకో తలత్‌కూడా పకపక నవ్వింది.

పదండి 'దిల్‌కుషా'కు పోదాం అంటూ ముందుకు సాగింది. అందరూ 'దిల్‌కుషా' వైపుకు నడక సాగించారు.

త్రోవలో కనబడకుండాపోయిన కమాల్ వచ్చి కలుసుకొన్నాడు. అంతా దిల్ కుషాలోకి ప్రవేశించారు.

'ఎక్కడికి వెళ్లిపోయావు' కోపంతో అడిగాడు గౌతం.

'గాజీఉద్దీన్‌గారి మహల్లో వసంతోత్సవం బ్రహ్మాండంగా జరుగుతుందని విని చూద్దామని వెళ్ళాను. అక్కడ అంతా విచిత్రంగా వున్నది. ఒక తెల్లవాడు ఒక ప్రక్కన కూర్చొని బాగ్‌పైప్ వాయిస్తున్నాడు. రజబ్‌అలీ-ఫజల్‌అలీ కవ్వాల్ బసంత్‌రాగం ఆలాపించసాగాడు. వరాండాలో ఇంగ్లీషువాళ్ల బ్యాండు మ్రోగుతూ వున్నది. తరువాత లండనులోగల రాజుగారి ఆరోగ్యం బాగుండాలని కోరుతూ అంతా మద్యం సేవించారు. గాజీఉద్దీన్ పాదుషాకు ఇంజనీరింగ్‌పిచ్చి ఎక్కువై పోయినందున ప్రపంచంలో దొరికిన రకరకాల మిషన్లన్నీ కొని తెచ్చిపెట్టాడు. రాబర్ట్ హోమ్ అను కళాకారుడు కూర్చొని బొమ్మలు గీస్తున్నాడు. హేబర్ బిషప్‌కూడా అక్కడే వున్నాడు. నన్నుచూడగానే ధర్మోపదేశాలు ప్రారంభించాడు. మెట్లమీదనిలబడి పాదుషా అతిథుల్ని ఆహ్వానిస్తున్నాడు. తరువాత అతడు అంద రినీ చిత్రపటాలకి తీసికొనివెళ్ళారు. బల్లలమీద ఇంగ్లీషువాళ్ల పద్ధతిలో భోజన పదార్థాలు తయారుగావున్నాయి. దర్బారంతా ఆంగ్లేయులపద్ధతిలో వున్నది. నాకు విసుగుపుట్టింది. బైటకు వచ్చేసరికి రెసిడెంట్‌వారి తలపాగాధరించి భారతీయుల పద్ధతిలో పల్లకీలోకూర్చొని వెళ్ళిపోతున్నాడు. ఎక్కడికి వెళ్లుతున్నారని అడిగాను. 'పాదుషా ఊరేగింపు జరుగబోతున్నది' అని అన్నాడు.

'ఏ పాదుషా! ఒకరి దర్బారునుండి యిప్పుడే వస్తున్నాను' అని అన్నాను.

'అతడు చనిపోయాడు. ఆయన కుమారుడు నసీరుద్దీన్ హైదర్ సింహాసనం ఎక్కాడు. అంతా చిత్రవిచిత్రం. హరిశంకర్! ఈ పాదుషాలుకూడా చనిపోతారు' అని మౌనం వహించాడు.

అంతా దిల్‌కుషాతోటల్లో ప్రవేశించారు. పూర్ణిమనాటివెన్నెల అంతట వ్యాప్తమై వున్నది. 1857 లో యిక్కడ చనిపోయిన ఆంగ్లేయులసమాధులు బంగళావెనుక వున్నాయి. అక్కడికివెళ్లి సమాధులమీదగల రాతిపలకలమీద వ్రాయబడిన వ్రాతల్ని

చదువసాగాడు. లెఫ్టినెంట్ పాల్‌ఫోర్డ్ పంజాబ్ రైఫిల్స్. కెప్టెన్ మాగ్డనాల్డ్. 93 హైలెండర్స్. లెఫ్టినెంట్ చార్లీ డాష్‌వుడ్.'

'హలో! బాగున్నారా?' అంటూ వాళ్లుముగ్గురూ ఎదురుగావచ్చి చేతులు ముందుకు చాచారు కరస్పర్శకోసం.

'హలో చార్లీ! యిదుగో పైపుత్రాగు' అంటూ గౌతం హొగాకు అందించాడు.

'నాకు ఆత్మశాంతి ఎవరైనా కలిగించితే వాళ్ళకు నారాజ్యం యిచ్చివేస్తాను' అంటూ బేగం కుదపియా మహలు ముందున్న మల్లెతీగలచాటునుండి బయటకు వచ్చింది.

'నేవు విషం ఎందుకుత్రాగావోనని అనేకపర్యాయాలు ఆలోచించాను' అని అన్నది చంప. ఇరవైనాలుగుసంవత్సరాల వయస్సుగల అయోధ్యనవాబు సతీమణి ఒకరాతిమీద నాజూకుగా కూర్చున్నది. మిగతావాళ్లంతా దిల్‌కుషామహలు సందలి శిథిలాలవైపుకు వెళ్ళారు.

'ఒకరోజు ఒక ఫ్రెంచివాడు పెద్ద గాలిగుమ్మటం తీసికొనివచ్చారు. జనం విప రీతంగా ప్రోగైనారు. మా మామగారుకూడా వింత చూసేందుకువచ్చారు. ఆ ఫ్రెంచి వాడు గాలిగుమ్మటంలో కూర్చొని ఎగిరి పట్టణానికి పన్నెండుమైళ్ల దూరానవున్న పావురాళ్ల చౌకీదగ్గర దిగాడు. నీ వెప్పుడైనా గాలిగుమ్మటంలో ఎగిరావా?' అని అడిగింది బేగం.

'ఎగరలేదు. కాని నీవు విషం ఎందుకుపుచ్చుకున్నావో చెప్పు' అంటూ బల వంతంచేసింది చంప. కాని బేగం సమాధానంచెప్పక తప్పించుకోసాగింది. 'నీవు చాలా దయార్ద్రహృదయం కలదానివని ప్రసిద్ధి. లక్షలాదిరూపాయలు బీదలకు పంచేదానివి. ప్రజల్ని ఎంతోప్రేమగా చూసేదానివి. ఈ ప్రేమకు, దానాలకు ఫలితం ఏం లభించిందో చెప్పు?' అంటూ వత్తిడిచేసింది చంప.

''ఇందుగల డందులేడని సందేహమువలదు' అంటూ నా నవాబు ఎప్పుడూ అల్లాను స్మరిస్తూ వుండేవారు.'

'వర్షఋతువు. దిల్‌కుషామహలుకు నీవు వచ్చావు. పాదుషా నీమీద కోపంగా వున్నాడు. అందువల్ల నీవు విషం మింగావు. నిజం కదూ! పురుషులంతా యింతే కదూ? వాళ్ల యిష్టావిష్టాలకోసం యితరులు అనగా స్త్రీలు ప్రాణాలు కోల్పో

వలపించేనా? నీతానికి యీ మొగవాళ్ళను ఏమీ లక్ష్యపెట్టకూడదు. లక్ష్యపెట్ట కూడదు' అంటూ ఆవేశంగా అన్నది చంప.

కుదిపియామహల్ ఏమీ మాట్లాడలేదు.

'అదుగో నవాబు వస్తున్నారు. ఇవాళ పూర్ణిమకదా! పాదుషా యిక్కడకు వస్తూవుంటారు. నన్నుచూస్తే కోప్పడతారు. ఇక నేను వెళ్లిపోతాను.'

'ఎక్కడికి వెళతావు?' కంగారుపడుతూ అడిగింది చంప.

'ఎక్కడికీ వెళ్లను. మేమంతా యిక్కడే వుంటున్నాము. నీవు నేను వేరుగా లేము. ఇక నీవు వెళ్ళిపో. నీతోవచ్చినవాళ్లు నిన్ను పిలుస్తున్నారు.'

'చంపాబాజీ! చంపాబాజీ!' అంటూ చీకట్లో దూరాన్నుండి కమాల్ పిలుపు వినబడింది. చంప అక్కడినుండిలేచి దిల్‌కుషామహలువైపుకు బయలుదేరింది. శిథిలమైపోయిన ఒక పెద్దమేడ పైమెట్టుమీద అంతావున్నారు. అయోధ్యనవాబు పెళ్లిచేసికొన్న ఆంగ్లదొరసానులు లోపలకూర్చొని సంగీతం వింటూవున్నారు. అంతా మెట్లుదిగి తోటవైపుకు వెళ్ళిపోయారు. చంప ఒంటరిగా వుండి పోయింది. వెనక్కు తిరిగిచూపింది. నసీరుద్దీన్ పాదుషావగ్గర పనిచేసిన ఫ్రెంచి వాడు నిలబడి చిరునవ్వు నవ్వుతున్నాడు. కుచ్చులటుమాలు పరిచి తలవంచి దయ చేసి దీనిమీదకూర్చోమని ఆమెను ఆహ్వానించాడు.

రెప్పవాల్చకుండా చంప అతణ్ణి చూడసాగింది.

'మీరు చాలా అందంగావున్నారు. ఆనందించండి. చింతపడవద్దు రండి. చని పోయిన ఆడవాళ్లపాట వినిపిస్తాను' అంటూ అతడు ఫిడేలు వాయించడం మొదలు పెట్టాడు.

'లేడీ ఫ్లోరా, అందగత్తె హాయిపేష్వా.
రూపసి తాయిస్. అంతా ఏమైపోయారో!
ఎవరైనా చెప్పండి ఎందు దాగిపోయారో.
ఇంగ్లీషువాళ్లు తగులబెట్టిన జీన్ ఏమైనదో,
గడచినకాలపు మంచుగడ్డల్ని ఎవరుచూశారో

'అందమైన ఆడవాళ్లు రెండుపర్యాయాలు చచ్చిపోతూవుంటారు. మీ అందాన్ని చూచుకొని గర్వపడండి. డబ్బుంది. అందం వుంది. గౌరవం వుంది. అన్నీ వున్నాయి. కాలం గడిచిపోతుంది. రోజులు మారిపోతాయి. అందం, డబ్బు,

గౌరవం అన్నీ తరిగిపోతాయి. స్థిరంగా వుండవు. నేను పారిస్‌నుండి వచ్చిన మంగలిని. పాదుషాకు క్షవరం చేసిచేసి యిరవై నాలుగులక్షల రూపాయలు సంపాదించాను. లక్నోలో నా రాజ్యం సాగింది. నేను ఎలా చెబితే పాదుషా అలా నడిచాడు. దేశాన్ని నిజానికి పరిపాలించింది నేనే. ఇప్పుడు నా పేరు ఎవ్వరికీ జ్ఞాపకం లేదు. అంతా నన్ను మరిచిపోయారు' అంటూ కాలిబూట్లవంక దుఃఖంతో చూచుకోసాగాడు ఫ్రెంచివాడు.

చంప మెట్లు దిగసాగింది. 'నామాట జ్ఞాపకం పెట్టుకోండి. మరి నేను వెళ్ళిపోతున్నా'నంటూ వంగి నమస్కరించాడు.

అంతా కారుదగ్గరకు చేరుకొన్నారు. కారులో బయలుదేరి కానల్పు రోడ్డు మీదుగా హజరత్‌గంజ్ చేరి అక్కడినుండి కేసరబాగ్‌కు బయలుదేరారు.

'ఇవాళ యిక్కడ వసంతోత్సవం' అని అన్నది సంతోషంతో తలత్.

'లోపలికి వెళదాం పదండి.'

'ఎలా వెళ్ళడం? మనకు ఆహ్వానాలు లేవు కదా!'

'వెళ్ళి నౌకర్లచాటున నిలబడదాం' అని అన్నాడు శంకర్.

అందరూ లోపలికి ప్రవేశించారు. స్టేజిమీద దేవేంద్రునిదర్బారు అమర్చబడి వున్నది. ఎటుచూపినా అద్దాలే అద్దాలు. అంతా మెల్లగా నడచి రంగస్థలంవెనుకకు చేరి నిలబడ్డారు.

అప్సరస గజల్ ప్రారంభించింది.

'ఓ వసంతీ తనువు సొంపులుపొంగిపొరలె నహో
ఓ వసంతీ నాదుమిత్రుని దుస్తులందమైన వహో
చల్లగాలులు మేనిసొంపుల గుబాళించు నహో
ఓ వసంతీ ప్రియుడు మత్తుగ తిరుగుచుండె నహో.'

హాలులో 'వాహ్వావాహ్వా' అను ధ్వనులు ప్రతిధ్వనించసాగాయి. అక్కడనుండి ముందుకువచ్చి ద్వారంవైపుకు చేరుకొన్నారు.

అప్సరస పాడుతూవున్నది.

'ఇవి శ్రావణమాసపు మేఘములు
ఇవి భాద్రపదం పిల్లగాలులు

ఇవి నా మిత్రుని చెవులపోగులు
ఇవి నా ప్రియుని నల్ల ముంగురులు.'

ఇంతలో నల్లని విశాలకాయ డొకరు పెద్దగా పాట ప్రారంభించారు.

'యువరాజును తెచ్చితి భారతావనికి
ఓ అప్సరసా! గుర్తించుము నీ ప్రియుని
నీ ప్రియుని....నీ ప్రియుని....'

గుల్ఫామ్ యువరాజు స్టేజీమీదకు వచ్చారు —

'మేడల్లో నివసిస్తాను. సుఖంగా వుంటాను.
భారతావనికి యువరాజును, నాపేరే గుల్ఫామ్.
మాటలమాటలలోనే తెలతెలవారె నహో
భైరవిరాగం వీనులవిందుగ వినిపించగ రారండీ!'

అంతా బైటకు వచ్చివేశారు. లోపలినుండి యువరాజుకంఠం వినబడుతున్నది.

'ఎగిరి ఎగిరి వెళతావు నిముషంలో నీవు
తిరిగి తిరిగి నిలిచేను ఊహలలో నేను'

అంతా రోడ్డుమీదకు వచ్చివేశారు. ఛత్రమంజిల్‌లోకివెళ్ళి కారు ఆపారు. మెట్ల క్రిందుగ గోమతినది ప్రవహిస్తున్నది. మెట్లమీద నసీరుద్దీన్ హైదర్‌షా కూర్చొని వున్నారు. ఒక కాలిచెప్పు నీళ్లలో విసరివేసి ఆనందిస్తున్నారు. నౌకరు ఎవ్వరూ రాకపోతే తానే నీళ్ళల్లోకిదిగి చెప్పు తెచ్చుకొని రెండో చెప్పు నీళ్ళల్లోకి విసరివేస్తు న్నారు. ఆవిధంగాచేస్తూ ఎంతో ఆనందం పొందుతున్నారు పాదుషా. గౌతం ముందుకువచ్చి సిగరెట్లు అందించబోయాడు.

'సిగరెట్లు వద్దు. నాకు హుక్కా కావాలి. ఎవరక్కడ?'

'క్షమించండి, యిక్కడ మేమే వున్నాము.' అని అన్నాడు గౌతం.

'ఎవరు మీరు?'

'మేమంటే మేమే.'

'అతడేమీ మాట్లాడలే. పదండి పోదాం అని అన్నాడు కమాల్.

'ప్రొఫెసర్ బెనర్జీదగ్గరకు వెళదాం పదండి' అని అన్నారు అంతా.

అంతా కాలువమీదగల వంతెనమీద కూర్చున్నారు. విశ్వవిద్యాలయ భవనాల మీద వెన్నెల విరుస్తున్నది. అది నసీరుద్దీన్ హైదరు తోట. పాపం నసీరుద్దీన్ హైదర్.

ఆతరువాత ఉపాధ్యాయులువుండే గృహాలవైపుకు నడకసాగించారు. దూరాన ప్రొఫెసర్ బెనర్జీ తన యింటిముందు పచార్లు చేస్తూ కనబడ్డారు.

'ఈ ప్రొఫెసర్లు నమస్యల్ని బహుతేలికగా పరిష్కరిస్తూ వుంటారు.'

'ఏమిటో రహస్యం!' అని అన్నాడు కమాల్.

'తెలిసుకొందాం' అని అన్నాడు గౌతం.

అర్థరాత్రి అయింది. అంతా ఎవరిదారిన వాళ్ళు యిండ్లకు చేరుకొన్నారు.

'నేను శాంతకు వ్రాసినజాబు పూర్తిచేయలేకపోయాను' అని పడుకొనబోయే ముందు అనుకొన్నాడు గౌతం.

# 30

ప్రొఫెసర్ బెనర్జీ ప్రపంచప్రఖ్యాతిగడించిన అర్థికశాస్త్ర విపుణుడు. ఆదివారంనాడు కాలేజీ యువతీయువకులు ఆయనయింటికి వస్తారు. ప్రొఫెసరు వాళ్ళందరితో గోష్ఠి జరుపుతూవుంటాడు. గౌతం నీలాంబరుటు అక్కడిసమావేశాల్లో గౌరవం సంపాదించుకొన్నాడు.

'ప్రొఫెసర్! మనస్సుకు భావాలకుకలిగే సంఘర్షణ తొలిగేమార్గం ఏమిటి? జాతులు, దేశాలు, ప్రభుత్వాలు, సంప్రదాయాలు అన్నీ పరస్పరం ఘర్షణపడుతూనే వున్నాయి. నా దరిదాపుల్లో నలుదెసల భయంభయంగా వున్నది. అపనమ్మకం, అసహ్యం, భయం, సంకోచం విపరీతంగా వున్నాయి. నా మనస్సుకు, భావాలకు ముమ్మరంగా సంఘర్షణ సాగుతున్నది. తొలగించుకునేమార్గం ఏమిటి?' అని ప్రశ్నించింది చంప.

'వారణాసిలో చదువుకొంటూవున్నప్పుడు రెండుజాతుల సిద్ధాంతమంటే ఏమిటో నాకు తెలియదు. కాశీయందలి శివాలయాలు, వీధులు అంటే నా స్నేహితు

రాలు శీలాభార్గవవలె నాకూ మక్కువగా వుండేది. కాని పెద్దదాణ్ణయినతరువాత శివాలయాలమీద నాకు ఏమీ అధికారంలేదని. హారతి పట్టకూడదని నమాజు మాత్రమే చేయాలనీ నాకు అర్థమైంది. నా నమ్మకాలు వేరని, పద్ధతులు వేరని అర్థమైంది.

వసంత్ కాలేజీలో త్రివర్ణపతాకక్రింద నిలబడి జనగణమన పాట పాడాను. కాని అక్కడవున్నవారిలో నేను విడిగా పరిగణింపబడటం గమనించాను. నేను యీ దేశంలో పుట్టాను. మరోదేశంతో నాకేమిటి సంబంధం ? దేశాన్ని వదలడమనే తత్వం నాకు అర్థం కాలేదు. యూరపులో యుద్ధం ప్రజ్వరిల్లినప్పుడు మరో సమస్య బయలుదేరింది. విజయం సాధించినదేశం ఓడిపోయినదేశప్రజల్ని అక్కడి నుండి వెళ్ళగొట్టడం, వాళ్ళు రాజకీయశరణార్థులై ప్రపంచంలో అపంచన అపంచన తలదాచుకోవడం చూస్తున్నాను. ఈ శరణార్థులుకూడా రెండురకాలు. తమ యిష్ట ప్రకారం దేశంవదలి వెళ్ళినవారు, బలవంతాన దేశంవదలి వెళ్ళిపోవలసి వచ్చిన వారు. ముస్లిం రాజనీతిలో క్రొత్తమలుపు వచ్చింది. నాతోబాటువున్న చాలామంది ముస్లిములు తమయిష్టప్రకారం దేశంవదలివెళ్ళేందుకు సిద్ధపడి మరోదేశాన్ని నిర్మాణం చేయాలనేతలంపుతో వుండటం గమనించాను. ఈవిధమైన యోచనా విధానం నాకు నచ్చింది. కాని యీరకమైన స్వప్నానికి మరోరకమైనస్వప్నానికి ఘర్షణ ప్రారంభమైంది. శాంతియుద్ధం అను సమస్య జటిలమైనది. కాని శాంతి అంటే ఏమిటి ? విశ్వాసం అంటే ఏమిటి ? జాతిసిద్ధాంతం చాలా ప్రమాదకరమైన దని నాకు తెలుసు. ఒక్కపర్యాయం విడిపోతే విడిపోవడమే. తిరిగి కలవడం చాలా కష్టం.'

చంప అన్నమాటలన్నీ ప్రొఫెసరు ప్రశాంతంగా విన్నాడు.

'ఇంగ్లీషువాళ్లు రాకపూర్వం మనదేశంలో మతసంబంధమైన కొట్లాటలు జరిగేవికావు. యుద్ధాలు జరుగుతూవుండేవి. అవి రాజకీయసంబంధమైనవి. హిందూ రాజుల సైన్యాధిపతులుగా ముస్లిములు వుండేవారు. ముస్లిము పాదుషాలకోసం హిందువులు యుద్ధాలు చేస్తూవుండేవారు. అవి రాజకీయసంబంధమైన యుద్ధాలు మాత్రమే. కాని ఆతరువాత ఇంగ్లీషువాళ్ళు చరిత్రలువ్రాసి హిందూ ముస్లిములలో విద్వేషం కలిగించారు. ఈనాటి మతసంబంధమైన విద్వేషం, కొట్లాటలు అన్నీ....'

'మీ దృష్టిలో మతానికి విలువలేదన్నమాట. అయితే మీరు వైష్ణవులు కదా! దాని మాటేమిటి?'

'వైష్ణవమతం భక్తికి సంబంధించింది. దానిపునాది పరిశుద్ధమైన ప్రేమ.'

'ప్రొఫెసర్! ప్రతిమతానికి పునాది పరిశుద్ధమైన ప్రేమయే.'

'మీమాటలు చాలా కటువుగావున్నాయి. ఇలా మాట్లాడకు.'

'ఇక్కడ వాతావరణమంతా కటువుగానే వున్నది. నేనేం చేయను? గతాన్ని గురించి యోచించేవాళ్లం మనం. కాని వర్తమానాన్నిగురించికూడా యోచించ వలసినతరుణం వచ్చింది. చరిత్రకు మనకు ఏమిటి సంబంధం? ఏం జరగాలి? మనం ఎప్పుడూ అన్యాయాల్ని, దుర్మార్గాల్ని ఎదుర్కొంటూనేవున్నాం. గత కాలంలో జరిగినదానికి యీనాడు మనం ప్రాయశ్చిత్తం చెల్లించవలసి వస్తున్నది. ఇప్పుడు జరుగుతున్న వ్యవహారాలప్రభావం నామీద పడింది. నేను యోచిస్తున్న దానికి రాబోయే తరాలవాళ్ళు ప్రాయశ్చిత్తం చెల్లించవలసి వస్తుంది. చరిత్రలో జరిగిన మతవిద్వేషాలను, కలహాలను పరిశీలించిచూస్తే నాకు భయం వేస్తుంది. ప్రత్యేకించి ఏ హిందువుకు నామీద ద్వేషం వుండదు. కాని సామూహికంగాచూసిన అందరితోపాటు తాము నన్ను ద్వేషించక తప్పదంలేదు. ఈ భారతదేశం ఆధ్యాత్మికమైనది. ఆర్థికసంబంధమైన అసంతృప్తి మతకలహాలకు దారితీసింది. బెంగాలులో పద్దెనిమిదవశతాబ్దిలో బయలుదేరిన సన్యాసుల ఉద్యమం, అయోధ్య, బెంగాలులో జరిగినయుద్ధాలు అన్నీ ఏమిటి? ఈ ఆధ్యాత్మ సంబంధమైన నాయకులు ఒకరిగొంతులు మరొకరు కోసుకుంటూ తిరిగారు' అని అన్నాడు కమాల్.

'అల్పసంఖ్యాకుల సమస్య భారతదేశంలో తప్పదు' అని అన్నది చంప.

'కాని రష్యావలె భారతదేశాన్నికూడా బహుళజాతిరాజ్యంగా రూపొందించ వచ్చు.' అని అన్నాడు కమాల్. నాకు మతం అక్కరలేదు. శాంతికావాలి. సౌఖ్యంకావాలి. తిండికావాలి. ఆ తరువాతనే మతం, ఆధ్యాత్మం.' అని పార్టీ పద్ధతిలో అన్నాడు కమాల్.

కమాల్ క్రొత్తతరానికి ప్రాతినిధ్యంవహించే యువకుడు. మేధావి వర్గానికి బౌద్ధిక సిద్ధాంతాలకు చెందిన యువకుడు. చంప కమాల్‌వంక శ్రద్ధగా చూసింది.

'మరోవిషయం. నగరాలకు సంబంధించిన రాజకీయాలే మీకుతెలుసు. గ్రామాల విషయం మీకుతెలియదు. పట్టణాల్లో తమ స్వార్థాలకోసం మతకలహాలు రేకెత్తించి

యితరులు నరుక్కువస్తుంటే దానివల్ల ప్రయోజనం పొందవలెనని కాంక్షించే నాయకమ్మన్యులు వీరవిహారం చేస్తున్నారు. మన రాజనీతిఅంతా నౌకరీలచుట్టు, పదవులచుట్టు ప్రదక్షిణం చేస్తున్నది. ఇదంతా మధ్యతరగతి రాజనీతి. మాతండ్రి బాబా ఖాన్‌బహాదుర్ నవాబ్ తకీరజాబహాదుర్ కళ్యాణపుర్ ముస్లింలీగులో చేరి పోయారు. కాంగ్రెసు జమీందారీ విధానాన్ని తొలగించివేయాలని భావిస్తున్నదని మా నాన్న అభిప్రాయం. వారు భూస్వామ్యవిధానానికి ప్రతినిధివంటివారు. మా నాన్న గారి భావసరళి నాకు బాగా తెలుసు. ఆయనతో యీ విషయాన్నిగురించి నేను చర్చించను.'

'పాకిస్థాన్‌లోనే మహమ్మదీయులకు శాంతిసౌఖ్యాలు లభిస్తాయని వారు అభిప్రాయ పడుతూవుంటే నీవు ఎలా అడ్డుచెప్పగలవు? భావనాస్వాతంత్ర్యం వుండ కూడదని నీయభిప్రాయమా?' అని అడిగింది చంప.

తలత్ ఆమెను శ్రద్ధగాచూపింది. ప్రొఫెసర్ టీ కోసం పిలుస్తున్నారు. పదండి పోదాం' అంటూ విషయాన్ని మధ్యలోనే ఆపివేసింది.

ప్రొఫెసరు దగ్గరగా గౌతం కూర్చొనివున్నాడు. లేచి నిలబడి చంపకు నమస్కారం చేశాడు.

'చంపాబాజి ముస్లింలీగులో చేరిపోయినట్లున్నది. హిందువుల్ని బహిష్కరించమని జిన్నాగారి ప్రకటన యీనాటి పత్రికల్లో వెలువడింది. బహుశ ఆమె రేపటి నుండి మన చర్చల్లో పాల్గొనదనుకొంటాను.' అని అన్నాడు కటువుగా కమాల్.

వాతావరణం సరిగాలేదు.

# 31

కైలాస్ హాస్టల్లో 'అనార్కలి' నాటకం ప్రదర్శింపబడింది. తెర పడినతరువాత అంతా బైటకు వచ్చారు.

'చంపాబాజీ! బలేవేషం వేశారు. అనార్కలికంటే మంచికథ ఏమీ దొరకలేదా మీకు?' అంటూ జనంలో కలిసిపోయాడు కమాల్.

గౌతం చంపాబాజీదగ్గరకు వచ్చాడు. 'ఏమండీ! కమాల్‌మీద కోపంగావున్నారు కదూ! ప్రొఫెసర్ యింటిదగ్గర కమాల్ కఠినంగా మాట్లాడాడు. అతనిపక్షాన మిమ్మల్ని క్షమించమని వేడుకొంటున్నాను' అని అన్నాడు గౌతం.

'కమాల్‌మీద నాకు కోపం ఏమీలేదు. ఎవ్వరిమీదా నాకు కోపం లేదు. అటు వంటిహక్కు నాకు లేదు.'

'అమరజీవుల స్థాయికి చేరుకొంటున్నారే! ఈవిధమైనమాటలు అంటున్నా రెందుకు?'

'మీరు....మీరంతా పనికిమాలినవాళ్ళు' అని అన్నది కఠినంగా.

'మేము స్పష్టంగా మాట్లాడుతాం. మా హృదయాలూ అంతే. అన్నయ్యకూడా అంతేననుకొంటాను.'

'మీరు యిలా ఎందుకు మాటలంటారో బోధపడటంలేదు.'

'చంపాబాజీ! మీది సొంతసమస్య. సయ్యద్దంటే మీకు అమితప్రేమ. అదీ అసలురహస్యం. మిగతాదంతా మాటలగారడీతప్ప మరేమీలేదు.' అంటూ గౌతం సూటిగా మాట అనేశాడు. 'కోపపడకండి. మీయింటికి తీసికొనివెళ్ళి కాఫీ యివ్వండి. అక్కడ మిగతావిషయాలనుగురించి చర్చిద్దాం. బాధపడకండి. మానవుడు ఒక్కపర్యాయమే జన్మిస్తాడు. పోదాం పదండి.'

చంప చాంద్‌బాగ్‌లో పనిచేసే ఒక లెక్చరర్ సీతాదీక్షితతోబాటు కాలేజీ వెనుక ఒక చిన్నయింట్లో వుంటున్నది. అక్కడికివెళ్ళి యిద్దరూ వరాండాలో కూర్చున్నారు. ఎదురూగా జామపండ్లతోట వున్నది. కాపలావాడు రామచిలకల్ని తోలుతూ కేకలేస్తున్నాడు.

గౌతం కుర్చీమీద కూర్చున్నాడు. చంప లోపలికివెళ్ళి కాఫీ తయారుచేసికొని వచ్చింది. ఎదురుగా సోఫామీద కూర్చున్నది.

'దేవునితోడు. చంపాబాజీ! మీరు చాలా గొప్పవారు.'

'నిజంగానా!'

'ఒక్కమాట చెబుతారా?'

'అడగండి.'

'సయ్యద్‌గారిని ఎంతకాలామ్నుండి ఎరుగుదురు?'

'చాలా ఏండ్లనుండి.'

'అప్పటినుండి మీరు ఏం చేస్తూవున్నారు?'

'చదువుతూ వున్నాను.'

'ఆ తరువాత?'

'ఇంకా చదివాను.'

'ఆ తరువాత?'

'ఆ తరువాతకూడా చదువుతూనేవున్నాను.' విసుగ్గా అన్నది చంప.

'ఆయితే ఆయన్ని యింతకాలాన్నుండి సహిస్తున్నారన్నమాట. మొట్టమొదటి సారి ఆయన్నిచూపినప్పుడు మీ వయస్సు పదిహేడు పద్దెనిమిది సంవత్సరాలు వుండివుండవచ్చు. మీరు జమీందారీకుటుంబంలో జన్మించకపోయినప్పటికీ, వారిని గురించినభావం మీలో జమీందారీతత్వాన్ని రేకెత్తించినట్లు కనబడుతుంది. మీరు కొంచెం శ్రద్ధగా ఆలోచించిచూసుకోండి. మీరు ఆయన్ను ఎంతగా ప్రేమిస్తున్నారో....'

'అనవసరమైనమాటలు విరమించండి.'

'అనవసరమైనమాటలా? భగవంతుడా! ఏమిటిది? ప్రేమించడం తప్పా. మంచిదికూడా. నేను అప్పుడప్పుడు ప్రేమలో పడిపోతూవుంటాను. కాని మధ్య తరగతికిచెందిన ఆడపిల్లలు యిటువంటిమాటల్ని పెద్దగా భావిస్తారు. చంపాబాజీ! క్షమించాలి. పొరపడ్డాను. ఇంతటి మనోహరమైనసమయంలో మీరు ఒకపాట పాడితే హాయిగా వినవలసింది. లేనిపోనిది మీసమస్యల్నిగురించి ప్రారంభించాను.'

'ఇతరులసమస్యలనుగురించి మాట్లాడటంకూడా గొప్ప తంత్రంగా భావించవచ్చు. మీలాంటి విద్యార్థులకు రోజూ కాలేజీలో పాఠం చెబుతూవుంటాను. పొరబడకండి.'

'మీరు యిలా అంటారని నాకు తెలుసు. మనజీవితమంతా యిటువంటి బట్టీ బట్టినమాటలతోనే గడిచిపోతుంది' అంటూ చిన్నమొహంచేసికొని రోడ్డువంక చూడటం ప్రారంభించాడు. 'అసలు మీపాలిటి నాయకుడయ్యేందుకు అన్నయ్య ఏం మాటలు ప్రారంభించారో? ఏం పోజు అలవాటుచేసికొన్నారో! ఫ్రెంచిభాష మంచిగా మాట్లాడేవారట గదా!'

'మీకు సయ్యద్ అంటే యింతకోపం దేనికండీ?'

గౌతం సిగ్గుపడ్డాడు. అతడిముఖం ఎర్రబడింది.

'కోపంవస్తే రానీయండి' అని అన్నాడు గౌతం.

చంప గౌతం పరిస్థితినిచూసి ఆశ్చర్యపడింది. ఇంత గట్టిమనిషి యింత బల హీనంగా మారుతాడని ఆమె అనుకోలేదు.

'మన గ్రూపులోవివారంతా సయ్యద్‌గారిని పెద్దవాడుగాభావించి గౌరవిస్తారు. కనీసం మీరు యీవిషయాన్నయినా పాటించివుండవలసింది. ఇక్కడికి వచ్చారు గనుక కొద్దిగా సభ్యత నేర్చుకోవడం మంచిది. ఎప్పుడూ గొడవ, రగడ, కొట్లా టలు. వున్నవాళ్లు చాలకనా మీరుకూడా పూరిపడ్డారు. ఇదేనా మీ వ్యవహారం!'

'మరోమాట. చంపాబాజీ! మీకూ సయ్యద్‌కు పెండ్లేమిటి? ఎంత ఎగతాళిగా వుందేదో తెలుసా? విదూషకురాలుగా తయారయ్యేదానివి. తహమీనాసంగతి వేరు. ఆమె అందుకే జన్మించింది....కాని నీసంగతి వేరు.'

'మిమ్మల్ని సలహాలు ఎవ్వరూ అడగలేదు.'

'సలహా అడిగివుంటే పరిస్థితి యింతదూరందాకా వచ్చివుండేదే కాదు. చదువు కొన్నదానివి. అర్థికశాస్త్రంలో పండితురాలివి. అనవసరంగా ఏమి టీ గొడవలో చిక్కుకున్నావు? ప్రేమవలలో చిక్కుకుపోయిన అమాయకురాలివి' అంటూ లేచి విలబడ్డాడు గౌతం.

'గౌతం నీకేమైనా పిచ్చి ఎక్కిందా?' అంటూ ఫక్కున నవ్వింది చంప.

'ప్రతిరోజూ క్లబ్బుకువెళ్ళి నాట్యాల్లో పాల్గొంటూ, పిక్నిక్కులకు, కాలేజీ యువతులతో వెళ్లుతూ, ఆడదానిలా వుండేవాణ్ణి మీరు ప్రేమించడం? మీరు ప్రేమించదలచుకుంటే నన్నే ప్రేమించరాదూ? కమాల్‌మగాని, హరిశంకర్‌మ గాని, లేక ఎవరినైనాసరే మీయిష్టం ప్రేమించరాదూ? చంపాబాజీ! అదికాదు అసలువిషయం. మీకు కావలసింది పెద్దకుటుంబాల యువకులు. నవాబుదర్జా కావాలి. అందరిమాదిరిగా మీరూ వ్యవహరిస్తే ఎలా? క్రొత్తమార్గం త్రొక్కాలి క్రొత్తపనిచేసి చూపాలి' అని అన్నాడు గౌతం ఆవేశంతో.

గౌతం వదిలినమాటలకు చంప నీరసపడిపోయింది. అతడు మాటలతో తిన్నగా దెబ్బకొడుతున్నాడు. ఇన్నాళ్ళబట్టి తన ఎదలో దాచుకొన్న రహస్యాలన్నింటిని యితడు బహిర్గతం చేస్తున్నాడు. అందువల్ల ఏమీ సమాధానం చెప్పలేక 'చదువు చెబుతున్నామకదా!' అని అన్నది.

'ఆపని చేసేవాళ్లు చాలామంది వున్నారు. మీరు మరోపని చూడండి. ఏం! ఏమీ కనబడటం లేదా?'

'కనబడకేం? చాలాపనులు వున్నాయి. కాని నేను బ్రతకాలికదా? ఉద్యోగం చేసుకొంటూవుంటే మూడువందలరూపాయలు దొరుకుతున్నాయి. మా నాన్న సామాన్యకుటుంబీకుడు. మీవంటి ధనికుల్లాగా నేను బీదతనంమీద ఉపన్యాసాలిచ్చే రకంమనిషిని కాను. బీదతనం అనుభవిస్తున్నదాన్ని. బీదతనంలోవుండే బాధ లేమిటో, కష్టాలేమిటో నాకు బాగా తెలుసు.'

'సయ్యద్‌ను పెండ్లిచేసుకొంటే మీరుకూడా 'బాల్ డాన్సు'లకు వెళతారన్న మాట!'

'అయితే ఎర్రజండా పుచ్చుకొని బజార్లల్లో తిరగమంటారా?'

'ఆర్థికసమస్యలకు పరిష్కారమార్గం మీదృష్టిలో పెండ్లన్నమాట. చంపా లేగం! మిమ్మల్నిగురించి ఏమేమో అనుకొన్నాను. ఇతర ఆడవాళ్లకంటే గొప్ప వారనుకొన్నాను. ఆ మహానుభావుడు అంతగా ఎందుకు నచ్చాడో కాస్త చెప్పండి!' అని అన్నాడు గౌతం!

'ఏమో? నాకే తెలియదు' చిన్నపిల్లలా సమాధానం చెప్పింది.

'అందమైనముఖాలు మాకు నచ్చుతాయన్నమాట? మీది కవులస్వభావం అన్న మాట.' అంటూ అద్దందగ్గరకువెళ్ళి తనముఖం అద్దంలో చూసుకొంటూ, 'నేను అంత అందవిహీనుణ్ణి కాననుకొంటాను. నన్నూ ఏ ఆడపిల్లఅయినా యింత గొప్పగా ప్రేమిస్తుందా?' అంటూ ప్రశించాడు అమాయకంగా గౌతం.

'శాంత నిన్ను గొప్పగా ప్రేమించడంలేదా!' అని అన్నది చంప.

గౌతం నివ్వెరబోయాడు. అతడిముఖంచూసి చంపకు సంతోషం కలిగింది.

'గౌతం మహాశయా? నీవూ గొప్ప వీరుడివే. నీవు వుండేది అద్దాలగదిలోనే. ఇతరులమీద రాయి విసిరేముందు తమస్థితి ఏమిటో సరిచూచుకోవడం మంచిది.'

'శాంతనుగురించి మీకు ఏం తెలుసు?'

'నీకు శాంత అంటే యిష్టంలేదా? ఆమె నీ మేనమామ భార్య. నీకంటె ఐదేళ్లు వయస్సులో పెద్ద. ఎవరికి ఉపదేశాలు యివ్వగలం? ఇప్పుడు నీవు శాంతా నీలాం బర్‌ను మరిచిపోతున్నావు. ఇక్కడినివేదిక వ్రాసినంపి చాలారోజులైంది. ఆమె నీకు తెలివితేటలకు సంబంధించిన మిత్రురాలు. నీవు ఆమెను పెండ్లి చేసుకో

లేవు. ఎవ్వరినీకూడా నీవు పెండ్లి చేసుకోలేవు. నిర్మలనుకూడా చేసికోలేవు. గౌతం మహాశయా! ఇదంతా లౌకికమైన వ్యవహారం. ఈరంగంలో సిద్ధాంతాలు పని చేయవు. నాకు పయ్యదంటే యిష్టం. అయితే బుద్ధికి సంబంధించినంతవరకు అతనితో నాకు సామ్యంలేదు. గౌతం నీలాంబర్ నీవంటేకూడా నాకు యిష్టమే. కాని ఏం చేయగలం చెప్పు? మానవసంబంధాలు విచిత్రంగా వుంటాయి. నెమ్మది నెమ్మదిగా నీవుకూడా నాకు నచ్చుతున్నావు. నా హృదయంలో చోటు చేసుకొంటు న్నావు. అంతమాత్రాన నేను దిగజారిపోయానా? లేదు. నాది చెడ్డస్వభావం కాదు. నేను విచ్చలవిడిగా విహరించేరకాన్ని కాదు. మనుష్యులంటే ప్రేమిస్తాను. ఆద రిస్తాను. ఇంతగా బయటపడి మాట్లాడుతున్నానంటే ఎందుకో తెలుసా? నీ అద్దాల గదికూడా పగిలిపోయింది. నీ గదిని కూలద్రోసుకున్నది ఎవరోకాదు. నీవే. చేజేతులా కూలద్రోసుకున్నావు. ఇంకా కొద్దిరోజులపాటైనా దాన్ని నిలబెట్టుకో' అంటూ విషయాన్ని ముగించింది.

చీకట్లో ఆమె ఎక్కడనపడవ తుపానుగాలికి కొట్టుకొని ఎటో వెళ్ళిపోయింది. గౌతం మౌనంగా నిలబడివున్నాడు.

చంపకు అతనిమీద దయకలిగింది. పాపం మంచివాడు. హరిశంకర్, కమాల్ వలెనే గంభీరమైనవాడు. అల్లరివాడుకూడా. ఇతడు ఎలాదొరికాడో వాళ్ళిద్దరికీ!' అని లోలోనే అనుకున్నది.

'శాంతనుగురించి నీకేమి తెలుసు?' గద్దించి అడిగాడు గౌతం.

అతడిధోరణి తగాదా లాడుతున్నట్లున్నది. ఆమెను బెదిరించేంతదగ్గరకు వచ్చా డన్నమాట. ఆమెను విమర్శించేస్థితికి వచ్చాడన్నమాట. చంపాబాజీకి యిలా జరగడం నచ్చలేదు.

'గౌతం? ఇది అందరికీ తెలిసినవిషయం. ఇక విరమించడం మంచిది. మనం దరం తెరచివుంచబడిన పుస్తకాలవంటివాళ్ళం. ఇందు ఏవిధమైనరహస్యాలు, దాపరికాలు లేవు. నన్నుగురించి నీవు అనేకవిషయాలు తెలుసుకొన్నావు. ప్రతివాడి స్థితి యింతే. ప్రతిమనిషి పెద్ద వెలుగులోవున్నాడు. నిన్ను నీవు దాచుకోవాలంటే కొద్దిపాటిచీకటి ఎక్కడా దొరకదు. నిన్ను చూస్తూవుంటే నేనుకూడా పెద్ద వెలు గులో నిలబడివున్నానని, నన్ను పూర్తిగా నీవు పరిశీలించి చూస్తున్నావని, నేను

విన్ను పూర్తిగా పరిశీలించి చూస్తున్నానని అనిపిస్తూవుంది. అందువల్లనే నివ్వు వన్ను....'

'చంపా! యిటువంటిశబ్దాలు ప్రయోగించకు. అవి మనల్ని తినివేస్తాయి.'

'శబ్దాలను కట్టిపెట్టినా అర్థాలు పోవుగదా? మనం యీస్థితిలో ఏం చేయగలమో చెప్పు?' అని అన్నది చంప ఖిన్నమనస్సుతో.

# 32

'నిర్మలా! విన్నావా? మా సయ్యద్ గౌతం నీలాంబర్‌మీద కారాలు మిరియాలు మారుతున్నాదేమిటి విశేషం?' అని అన్నది తలత్.

'గౌతంమీదనా? నిజంగా ఆశ్చర్యమే. ఇందులో ఏం రహస్యం వున్నదో? పాపం ఆ అమాయకుణ్ణి ఎవరూ కోప్పడరే! అలాంటివాడు కాదే!'

'అదే మరి? కారణం ఏమిటో బోధపడటంలేదు.'

'చంపాబాటీ ఏమైనా సాగించిందా ఏమిటి?' దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నది నిర్మల.

'ఛీ ఛీ, పసిదానిలా మాట్లాడకు.'

'ఇందులో పసితనం ఏమున్నది? సమయాసమయాలుకదా?' అని అన్నది గంభీరంగా నిర్మల.

'అలా అనకు నిర్మలా! చంపాబాటీ అంత తేలికరకం కాదు. సరేకాని నీవు గౌతముణ్ణి ప్రేమిస్తున్నావుకదూ?' అని అడిగింది తలత్.

'నేనా? గౌతముణ్ణా? వ్యవహారం యింత ముదిరినతరువాత గౌతముణ్ణి ప్రేమించడమా? ప్రేమించాలి అంటే అవతలివ్యక్తికి పాత్రత వుండొద్దూ!' అని అన్నది నిర్మల.

'అసలు ఈ చంపాబాటీ గొడవ ఏమిటి? ఈమె ప్రేమకలాపం మనందర్ని బుర్రల్ని పాడుచేస్తున్నది. ఏక్షణంలో యిక్కడకు అడుగుపెట్టిందోకాని ఆమె

ప్రేమపురాణం సాగుతూనేవున్నది. నిజంగా ఒక్తి 'తక్కువరకం' వ్యవహారమై పోయింది.

'నూటికి నూరుపాళ్ళు అలాటి వ్యవహారం.'

'నయ్యర్ యింత తొందరపడుతూంటే ఆయన్ని పెండ్లి చేసికోవచ్చుమగదా! ఎందుకు చేసుకోదు!' అని అన్నది తలత్.

ఇంతలో సైకిలుమీద గౌతం నీలాంబర్ అక్కడికి వచ్చారు.

'మన నివాసం మారిపోయిందని చెప్పడానికి వచ్చాను.'

'ఎక్కడికి వెళుతున్నావు?' అని అడిగింది తలత్.

'ఏమీలేదు. అదే ఇంగ్లండుదాకా వెళ్ళవద్దామని.'

'అదే ఇంగ్లండుదాకా వెళ్ళవద్దామనా?' అని అందుకొన్నది వెటకారంగా తలత్.

'మీరేనన్నమాట ఇంగ్లండు వెళ్లేది? పద మీవెనక మేమూ వస్తాం. ఏమను కొన్నావో?'

'మిత్రమా? నీవు వెళ్లుతున్నందుకు నిజంగా మాకు చింతగా వున్నది.' అని అన్నాడు హరిశంకర్.

తలత్ వాళ్ళిద్దరినీ అక్కడేవదలి లోపలికి నిర్మలదగ్గరకు వెళ్ళింది.

'గురువుగారు వెళ్ళిపోతున్నాడు!'

'నేనూ విన్నాను' అంది ఏడుస్తూ నిర్మల. తలత్‌కు ఆశ్చర్యం వేసింది.

'ఎంత పిచ్చిపిల్లవు? ఏడుస్తున్నావా? పెండ్లిచేసుకొని నీవుకూడా అతనితో బాటు వెళ్ళిపో. మీ యిద్దరిపెండ్లికి చాలారోజులనుండి మాటలు జరుగుతున్నాయి కదా!'

'అతడు నన్ను పెండ్లి చేసుకొంటాడా? చంపాబాజీమోహంలో పడిపోయాడు. ఒకచే పౌగర్త. బ్రతికివున్నంతవరకు ఆమెకు నన్ను పోటీపెడతాడు. చంపా బాజీకి సీడనై నేను బ్రతకగలనా?' ఏడుస్తూ అన్నది నిర్మల.

'ఎక్కడినుంచి వచ్చావమ్మా చంపాబాజీ! నీకంటె చెడ్డది యింకెక్కడా వుండదు. ఇంకా ఎవరెవరిఅదృష్టాల్ని నాశనంచేస్తావు మహాతల్లీ! అంటూ తలత్ మోకాళ్లమీద కూర్చొని 'పిచ్చిదానా! ఏడవకు అంటూ గద్గదకంఠంతో నిర్మలను ఓదార్చబోయింది. బయటవరండాలో గౌతం హరిశంకరుల పకపకలు వినబడు తున్నాయి.

తలత్‌కు చంపాబాజీమీద పరమఅసహ్యం కలిగింది. ఇంత అసహ్యం ఆమెకు ఎవ్వరిమీదా ఎప్పుడూ కలుగలేదు.

* * *

చంప కిటికీదగ్గరనిలబడి సాయంకాలపు ఆకాశాన్ని చూడసాగింది.

'నల్లనివాడు ఎక్కడే చెలీ! నల్లనివాడు ఎక్కడే! ఆతని ఎడబాటు సహింపలేనే! చెలీ, నల్లనివాడు ఎక్కడే!' అంటూ ప్రక్కయింటి అరబడుచు కమ్మగా పాడుతూవున్నది.

చంపకు ఆ పాటకుగల అర్థమేమిటో బోధపడింది. నిజానికి విరహాన్నే ప్రేమ అని అంటారు.

బయట పచ్చగడ్డిమీద బాలికలు తిరుగుతున్నారు. అతిథులగదిలో పియానో మ్రోగుతున్నది. ఎటుచూసినా గోపికాహృదయం కండ్లకు కనబడుతున్నది. మెట్లు దిగి క్రిందకు వచ్చింది. పాదుషాతోటవైపుకు బయలుదేరింది. ప్రొఫెసరుగారింటి దగ్గర చాలామంది వున్నారు. ఆమెకు ఆశ్చర్యం కలిగింది.

'డైరెక్టు యాక్షన్. కలకత్తా—కలకత్తా.... రెండువేల చావులు.' ఏమిటీ కేకలు? స్వప్నంలో ఎవరో పట్టుకొని గుంజినట్లనిపించింది. ఎదురూగా గౌతంకూడా వున్నాడు. వంగి ఏమిటో కాగితంమీద వ్రాస్తున్నాడు.

'ఏమైంది?' అని అడిగింది కంగారుపడుతూ.

'మీ నాయకులను వెళ్ళి అడుగు చంపాబేగం!' అని అన్నాడు ఎవరో ఒక వ్యక్తి దగ్గరగావచ్చి.

'నా నాయకులా?' భయపడుతూ అడిగింది. ఆమెకంఠం ఎండిపోసాగింది.

'అవునవును, నీ నాయకులనే. గొప్పగా ముస్లింలీగుకు ఓటు వేస్తానని వెళ్ళావు కదూ!' అని ఎవరో అన్నారు.

ఆమె ఒక్కపర్యాయం గౌతంవంక చూసింది. కాని గౌతం ముఖం ప్రక్కకు తిప్పుకొన్నాడు.

అక్కడివాళ్ళంతా క్రూరంగా ఆమెవంక చూశారు.

మరోవ్యక్తి హరిశంకర్‌నుచూచి 'ఏమయ్యా! నీ కమ్యూనిస్టుపార్టీకికూడా శివం ఎక్కిందా ఏం? పాకిస్తాన్‌కోరిక ప్రజలకోరిక అంటూ గొంతు చించుకొంటున్నది' అని అన్నాడు.

'మనం శాంతిని కోరుతున్నాం' అని అన్నాడు గౌతం.

'శాంతిట శాంతి! గాంధీవాదులకంటే మించిన మిధ్యావాదుల్ని ఎక్కడా చూడ లేదు' అని అన్నాడు మరోవ్యక్తి.

చంప వెనక్కు తిరిగింది. కైలాస్ హాస్టల్లో యూనియన్‌సమావేశం జరుగు తూన్నది. వాతావరణం ప్రమాదకరంగా వున్నది. అక్కడినుండి ముందుకు సాగింది. రాయ్ బిహారీలాల్ రోడ్డున నడుస్తూ అన్నియిండ్లను శ్రద్ధగా పరిశీలించి చూసింది. తనకు స్వాగతంపలికే యిల్లు ఒక్కటీ ఆమెకు కనబడలేదు.

మరునాడు తన బృందంవాళ్ళంతా ప్రాణాలకుతెగించి కలకత్తాకు బయలుదేరా రని ఆమెకు తెలిపింది. నిర్మల, తలత్, తహమీనాకూడా వెళ్ళారు. తన ఒక్కతె మిగిలిపోయింది.

కొద్దినెలలు గడిచాయి.

బృందంసభ్యులు కలకత్తానుండి బెంగాల్, బీహారు ప్రాంతాలలో శాంతిశాంతి అంటూ తిరుగుతున్నారు. రాత్రిళ్ళు గాంధీజీ సన్నిధిన కూర్చొని 'రఘుపతిరాఘవ రాజారాం' అంటూ ప్రార్థనలుచేస్తూ, పగలు గాయపడినవాళ్ళకు సేవచేస్తూ వున్నారు.

ఆడపిల్లలంతా తిరిగి యింటికివచ్చారు. లక్నోజీవితం మామూలుపద్ధతిలోనే సాగుతూంది. బీహారులో ఫల్గూనదిఒడ్డున గూండాలు కొందరు కొంతమంది కార్య కర్తలమీద దాడివేశారని, గాయపడినవాళ్ళలో కమాల్, శంకర్, గౌతంకూడా వున్నారని చంప పత్రికలో చదివింది. కంగారుపడి వెంటనే సైకిలెక్కి గుల్ ఫిషాంకు బయలుదేరింది. గేటుదగ్గరకువెళ్ళేసరికి సామానుతోసహా తలత్, నిర్మల, తహమీనాలు ప్రయాణానికి సిద్ధంగావుండి కనబడ్డారు. అదృష్టవశాత్తు శంకర్ పిన తండ్రి అప్పుడు గయలో వున్నారని, ఆ ముగ్గురిని కారుమీదవేసుకొని గోరఖ్ పూర్ తీసికొనివెళ్లి ఆసుపత్రిలో చేర్చారని, ఆయన అక్కడ సివిల్ సర్జనని, మేము ముగ్గురంకూడా గోరఖ్‌పూరు వెళుతున్నామని తహమీనా చంపకు చెప్పింది.

'నీవుకూడా మాతోబాటు రా. కొంతకాలాన్నుండి నీవు మాకు దూరందూరంగా వున్నావు-తీరికలేక రావడంలేదని అనుకొన్నాం. కాలేజీకి సెలవులు యిచ్చారు కదా! నీవుకూడా మాతోబాటు రా. తిరిగి వచ్చేటప్పుడు నిన్ను వారణాసిలో విడిచి వస్తాం' అని తహమీనా బలవంతం చేసింది. చంప అంగీకరించింది.

మొత్తంమీద విడిపోయిన చంప మళ్లీ బృందంలో చేరిపోయింది.

కమాల్, గౌతం, శంకర్ ముగ్గురూ పివిల్ సర్జన్‌గారి యింటివరాండాలో పడుకొని పెద్దగా పాటలు పాడుతున్నారు. ముగ్గురూ బాగా గాయపడ్డారు. రోజంతా పడివుండటంవలన ఏమీతోచక పాటలుపాడుతూ వుంటారు. గౌతం నిత్యమూ వార్తలు తెలుసుకొంటూ తన భావిజీవిత కార్యక్రమాన్నిగురించి పథకాలు వేసు కొంటూవున్నారు. అతని ఎడమచేతి మూడువ్రేళ్లకు 'ప్లాస్టరు' వేశారు. ఆ మూడు వ్రేళ్ళు గట్టిదెబ్బతిన్నాయి. 'ఈ మూడువ్రేళ్ళు పనిచేస్తాయో లేదో, పియానో వాయించగలనో లేనో చంపా?' అంటూ గౌతం బాధపడుతూవుండేవాడు. చంప అతణ్ణి ఓదారుస్తూవుండేది. కమాల్‌కూడా గౌతం నీలాంబరునికి ధైర్యం చెబుతూ వుండేవాడు. అతని కాలిఎముకకు గట్టిదెబ్బ తగిలింది.

ముగ్గురి ఆరోగ్యం కుదటపడినతరువాత యింటికి ప్రయాణమైనారు. 'వెళ్లే ముందు యిక్కడి పరిసరాలు చూచివద్దాం పదండి. తిరిగి రాగలమో లేమో' అని అన్నాడు కమాల్.

'ఇక్కడిగ్రామాలు చూద్దాం. మీర్జాపూరుకూడా వెళదాం. అక్కడ మా 'కమరున్' యిల్లు వున్నది.'

అక్కడ ప్రయాణం చేయాలంటే ఏనుగులమీద వెళ్ళవలసిందే. వాళ్ళు ఏను గులమీదఎక్కి కపిలవస్తు చేరుకొన్నారు. ఆ గ్రామప్రజలు ఆశ్చర్యంగా వాళ్లను చూడసాగారు.

'కమాల్ అతిశ్రద్ధగా ఒకరాయిని రుమాలుతో తుడిచి ఖుర్రం చేయసాగాడు.

'తామరపూవులతో నిండిన చెరువులు, బంగారువన్నెల లేళ్ళు, చెట్లు, చేమలు, పూదోటలు ఏవీ? అవన్నీ ఏమైపోయాయి?' అని లోలోన చంప అనుకొన్నది.

'అంతా నిశ్శబ్దంగా వున్నది మిత్రమా!' అని అన్నాడు కమాల్.

'నిజం. ఏమీ బాగుండలేదు. పోదాం పదండి. ఏనుగ మనకోసం ఎదురు చూస్తున్నది' అని అన్నాడు హరిశంకర్.

కమాల్‌కు ఏమీ తోచలేదు.

'శంకర్! చరిత్ర బహు విచిత్రమైనది. అంతా దగా. మనల్ని చరిత్ర మోస గిస్తూనే వుంటుంది.'

'అవును నీవు చెప్పింది నిజం' ఎప్పటిమాదిరిగానే హరిశంకర్ కమాలను సమర్థించాడు.

వాళ్లు మెలమెల్లగా నడుచుకొంటూ ఏనుగదగ్గరకు వచ్చారు. వాళ్ల నీడలు విచిత్రంగా వున్నాయి.

# 33

తిరిగివస్తూ చంప వారణాసిలో ఆగింది. కంటోన్‌మెంటు స్టేషన్లో దిగి స్నేహితుల దగ్గర సెలవుతీసికొని గుర్రపుబండీఎక్కి యింటికి బయలుదేరింది. ఊళ్ళో రామ లీల ఉత్సవాలు ప్రారంభమైనాయి. తనపేటకు వచ్చినతరువాత దూరాన తన యింటిగుమ్మం ఆమెకు కనబడింది. వాళ్లింటిదగ్గర బాగా వెలుగుగా వున్నది. ఇంట్లోకి వచ్చినప్పుడు దగ్గరిచుట్టాల చెల్లెలిపెండ్లి జరుగుతున్నట్లు తెలిసింది. ఇల్లంతా పెండ్లివాళ్ళతో కిటకిటలాడుతున్నది. పెండ్లికివచ్చిన మత్తైదువులు లోపల పాటలు పాడుతున్నారు. చంపవెళ్ళి గదిలో మంచంమీద కాళ్ళుజాచుకొని పడు కొన్నది. ఆమె తలవైపున బంధువుల పసిపిల్లవాడు నిద్రపోతున్నాడు. ముత్తైదువ పాటపాడుతున్నది—

'ఎవరు నీవని నన్ను అడిగాడు అల్లా
నీవాడనే నని అన్నాను నేను
పని ఏమిటని నన్ను అడిగాడు అల్లా
నిన్ను స్మరించుటే పనని అన్నాను నేను.'

ఎదురుగా గోడమీద అటుయిటు వెళుతున్నవాళ్ల నీడలు కనపడుతున్నాయి. ఎవరో మంచినీటిచెంబు గచ్చుమీద పడేసినచప్పుడు వినవచ్చింది. ముత్తైదువ పాడుతూనే వున్నది—

'పని ఏమిటని నన్ను అడిగాడు అల్లా
నిన్ను స్మరించుటే పనని అన్నాను నేను.'

కండ్లుమూసుకొని చంప వింటూవున్నది. వంటయింటిలో మానెదీపం వెలుగుతూవున్నది. నాలుగువైపుల పొగ క్రమ్ముతూవున్నది. అగరువత్తుల సువాసన యిల్లంతా గుప్పుమంది.

'ఇల్లు....ఇల్లు....యిది తన ఇల్లు....'

రాత్రిపూట కిటికీదగ్గరగా బయట ఎద్దులబండి చప్పుడు కిర్రుకిర్రుమంటూ వినబడింది. ఆ ధ్వని కర్ణకఠోరంగా వున్నది. చిన్నప్పుడు దాసీమనిషి చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి. ఇటువంటి బండిచప్పుడు వినబడిందాఅంటే ఏదో కీడుతప్పదు. ఇది అపశకునం' అని ఆమె చెప్పింది.

చంపకు ఆ మాటలు జ్ఞాపకం వచ్చేసరికి భయంవేసింది. ఏం జరుగుతుందో ఏమోనని అనుమానం కలిగింది. ఆఁ, ఏం జరుగుతుంది? అంతా అనుమానం దప్ప అని తార్కిక బుద్ధిచెప్పింది. ఇంతలో యీ విషయంమీదుగా కమాల్ తర్కం జ్ఞాపకంవచ్చింది. అరవితర్కాన్ని త్రోసిపుచ్చింది. గౌతం నీలాంబర్, కమాల్ చూపించే ఆవేశం, తలత్ వాచాలత్వం, గంభీరమైన తహమీనా వ్యక్తిత్వం ఒక్కొక్కటే ఆమె మస్తిష్కంలో చోటుచేసుకొన్నాయి. అసలు తను ఎవరు? ఏమిటి? తననుగురించి జనం ఏమనుకుంటున్నారు? గౌతం ఏమనుకుంటున్నాడు? నరకంలో పడసీ అతణ్ణి. అమిర్ రజా, అమిర్ రజా ...

మరునాడు బాగా ప్రొద్దుఎక్కినదాకా నిద్రపోతూనేవున్నది. రోజులు గడిచాయి. రామలీల ఉత్సవంరోజులు శూర్పణఖ ముక్కు చెవులు తెగాయి. రావణుడు తగులపెట్టబడ్డాడు. పాదుకాపట్టాభిషేకం జరిగింది. ఇద్దరు సన్నపాటి యువకులు రామలక్ష్మణులవేషం వేసుకొన్నారు. ఎంతో ఠీవిగా సింహాసనంమీద కూర్చున్నారు. సామాన్యప్రజలకు వాళ్ళలో భగవంతుడు కనిపించాడు. సెలవులు అయిపోగానే చంప లక్నోవచ్చింది. దీపావళిపండుగ వచ్చింది. లక్ష్మీపూజ బ్రహ్మాండంగా జరిగింది.

ఊరంతా జూదం ఆడసాగింది. రామావతార్, కదీర్‌లు జూదం ఆడేందుకు వెళ్ళారు. రోజులు త్వరగా త్వరగా గడిచిపోతున్నాయి. 'నౌటంకీ' ప్రదర్శనలు జరిగాయి. శివరాత్రి, ఆతరువాత మొహర్రం పండుగ వచ్చింది. ప్రజలు మొహర్రం పండుగ వేడుకగా జరుపుకొన్నారు. శోకగీతాలు ఏడుస్తూ అంతా పాడారు.

అంతా బుద్ధిభ్రమ. మనస్సుకువట్టిన మాయ. కంటికి నచ్చిన వ్యవహారం నిజానికి వీటిలో దేనికీ అర్థం పర్థంలేదు. వ్యక్తిగతమైన ఆనందమే వీటన్నింటికీ ఆధారం. ఎంతటిమూల్యం చెల్లించవలసివచ్చినా, ఎక్కడ లభించినా ఆనందం - వ్యక్తిగతఆనందం పొందవలసిందే. నీ సిద్ధాంతాలు, నీ జైలుయాత్రలు, నీ కాంగ్రెసు నీ ముస్లింలీగు అంతా దండుగమారివే; మానవత్వాన్ని రక్షిస్తామని చెప్పడమేగాని అందునిమిత్తం ఎంతటి రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయో గమనించడం లేదు. ఇదంతా ఏమీ వద్దు. నాకు కావలసింది కేవలం వ్యక్తిగత ఆనందమే. ఆనందం కావాలి. ఇల్లు, శాంతి, పిల్లలు, భర్తప్రేమ కావాలి.

'ఏమిటిది చంపాబేగం! ఏమిటీ ఆలోచనలు? సిగ్గు సిగ్గు, సిగ్గు సిగ్గు' అంటూ గోడకు వ్రేలాడుతున్న ఆమెఫొటో అరిచింది. గాలిలో ఆ కేక ప్రతిధ్వనించింది.

చంపాబేగం రోడ్డుమీద ముందుకుసాగింది. ప్రక్కనే ప్రొఫెసర్ బెనర్జీగృహం వున్నది. ఆయన ముందుగదిలో జనం వున్నారు. ఇవాళ ప్రపంచంలో ఎన్నో మహత్తరమైన నిర్ణయాలు జరిగాయని అంతా అక్కడ కూర్చొని అంటున్నారు. (వీళ్లు నిర్ణయాలు చేసేటప్పుడు నన్నుగురించి ఎందుకు ఆలోచించరు? ఇక్కడ ఒంటరిగా చంపా అహమ్మద్ ను నిలబడివున్నానే! నన్నుగురించి యోచించరేం?) ఆ గదిలో తెరవెనుక అంతా వున్నారు. ఆమె మెలమెల్లగా మల్లెతీగచాటుగవచ్చి లోపలికి తొంగిచూసింది. ప్రొఫెసరు తెల్లనిధోవతి కట్టుకొని కుర్చీమీద కూర్చొని వున్నాడు. గౌతం, కమాల్ కూడా వున్నారు. గౌతం భారతరాయబారి కార్యాలయంలో ఉద్యోగిగా నియమింపబడి మాస్కో వెళుతున్నాడు.

ఢిల్లీ, సిమ్లా, నెం 10 ఔరంగజేబ్ రోడ్డు, వైస్రీగల్ లాడ్జి, భంగికాలనీ అనుమాటలు ఆమెచెవిన బడ్డాయి. అక్కడినుండి చంపాబాజీ బైటకు రోడ్డుమీదకు వచ్చివేసింది.

ఇక ఆమెఎదుట రెండుప్రపంచాలు వున్నాయి.

ఒకవైపున యీ జనమంతా వున్నారు. వాళ్ళమనస్సు, మస్తిష్కం, వాళ్ళ ఆదర్శాలు, సంఘర్షణ వున్నాయి. కాని యిక్కడ భవిష్యత్తు అస్పష్టంగా వున్నది. రెండవవైపున శాంతి, రక్షణ, వ్యక్తిగత ఆనందం వున్నాయి. అమిర్ రజా పాకిస్తాన్ వెళుతున్నాడు. ఎందుకు వెళ్ళాడు? కమాల్ మాదిరిగా తలతిరిగినరకం కాదుకదా? ఇక్కడ ఆయనకు భవిష్యత్తు ఏముంటుంది? క్రొత్తదేశంలో అభి

వృద్ధికి రావచ్చు. పెద్దపెద్దపదవులు రావచ్చు. సొంత ఆనందం, సొంత ఔన్నత్యం, సొంత ఉద్దేశ్యాలు. తప్పేముంది? రాజకీయాలే జీవితపరమార్థం కాదుగదా! ఇతరుల్నిగురించి నేనెందుకు ఆలోచించాలి? ఇతరులు నాకేం యిచ్చారు? ఈవిధంగా ఆలోచించసాగింది. అమిర్ రజాను పెండ్లిచేసుకొని పాకిస్తాన్ వెళ్ళిపోతాను. ఎంత తేలికై పోయింది. బరువుదింపినట్లయింది. పీడ విరగడై పోయినట్లనిపించింది. అంతట శాంతి వ్యాప్తమైంది. 'బేగం అమిర్‌రజా, కరాచీ' అని ఊహాలోకంలో తనపేరు చదువుకొన్నది. పీళ్ళు జ్ఞాపకం వస్తూవుంటారు. మనుష్యులకు ప్రపంచంలో అనుకొన్నవన్నీ దొరుకుతాయా? కేక్ తీసికోవాలి, తినాలి అంటే అసంభవం. ఇలా ఆలోచిస్తూ ఆమె ముందుకు సాగిపోతున్నది. ఆమె వెనుకనే గౌతం వస్తున్నాడు.

'చంపాబాజీ! ఖుదాహాఫిజ్!'

'మాస్కో వెళుతున్నావా?'

'ఆఁ, జ్యూలై లో వెళుతున్నాను. కంత్, నిర్మలకూడా వెళుతున్నారు. వాళ్ళందరికీ కేంబ్రిడ్జిలో సీట్లు దొరికాయి.'

పాదుషా పార్కుద్వారం గోడనుఆనుకొని నిలబడింది. 'నే నేంచేయాలో చెప్పవేం?' అని అన్నది గట్టిగా.

'మీరు ఏ యే విషయాల్లో నా సలహా తీసికొన్నారో చెబుతారా? ఎవరికి ఎవరు సలహాలిస్తారు? ఎవరికెవరు ఉపదేశాలిస్తారు అని మీరు ఆరోజున అనలేదూ? నేను అల్పజ్ఞి కాదు. నేను యధార్థవాదిని మాత్రమే.'

'నాకోసం మీదగ్గరవున్నది యీ మాటలేనా?'

'మీరు శబ్దాలఅర్థాలను చూడరు. అందువలన నేను ఏమిచెప్పినా మీదృష్టిలో దానికి అర్థం వుండదు. ఖుదాహాఫిజ్, గుల్‌షిషాఁ వెళ్లితే అప్పీకి చెప్పండి. నేను రేపు ఢిల్లీకి బయలుదేరుతున్నాను.' అంటూ ముందుకుసాగి వెళ్ళిపోయాడు.

ఇంతలో కమాల్ ఆమెను సమీపించాడు. 'చంపాబాజీ మీ పాకిస్తాన్ ఏర్పడింది' బహు కటువుగా అన్నాడు.

మరో ఉపన్యాసం యిస్తాడని, నానామాటలు అంటాడని అనుకొన్నది. కాని ఆశ్చర్యమే. కమాల్ ఏమీ అనలేదు. అనడానికి ఏమీ మిగిలినట్లు లేదు. పాకిస్తాన్

ఏర్పడిపోయింది గనుక యిక ఏమన్నా ఏం ప్రయోజనం? కొంచెం సేపు ఆలోచిస్తూ నిలబడి కమాల్ ఆ తరువాత వెళ్ళిపోయాడు.

ఆమెఒక్కతే కాస్సేపు పూలచెట్లదగ్గర నిలబడివున్నది. అందరూ ఆమెను ఒంటరిగావదిలి ఎక్కడివాళ్ళక్కడ వెళ్ళిపోయారు.

ఆమె రోడ్డుమీదకు వచ్చింది. కొన్నియిళ్లు దాటినతరువాత గుల్‌షిషాఁ కనబడింది. గుల్‌షిషాఁలో అతడు వున్నాడు. తనచేతిని పట్టుకోవలసినవాడు ఆ యింటిలోనివాడేగదా! అతనివెంటనే తానుగూడా నడుస్తుంది. జీవితంలో ప్రేమ, సుఖం, శాంతికి తావు వుంటుందా వుండదా? మానవుడు ఎప్పటివరకు నీడలను వెంబడిస్తూవుంటాడు. నేను యిక్కడ వున్నాను అని స్పష్టంగా చెప్పివేస్తాను. హంగామా అంతా సర్దుమణుగుతుంది. వాళ్లగొడవ వాళ్ళది. ఇక నాకు అనవసరం. అలసిపోయి జీవితంలో నీళ్ళు ఎవరిశరణ్యానికో రాకతప్పదు. నేను కూడా వచ్చేస్తున్నాను. నీవైపుకే వస్తున్నాను.

గుల్‌షిషాఁ గేటుదగ్గర రామావతార్ మాలీ కనబడ్డాడు.

'సయ్యద్‌గా రున్నారా?' అని అడిగింది. ఆమెకంఠం ఎందుకో వణుకుతున్నది.

'ఆయన యిప్పుడిప్పుడే వెళ్ళిపోయారు.'

'ఎక్కడికి?' యింతలో గంగాదీన్‌కూడా దగ్గరకు వచ్చాడు,

'ఎక్కడికి వెళ్ళిపోయారు?' అని తిరిగి ప్రశ్నించింది చంప.

'అక్కడికే. మహమ్మదీయుల పాకిస్తానుకు. మీరుకూడా వెళ్ళిపోండి. అంతా వెళ్ళిపోతారు కాబోలు. ఇక మేము ఒంటరిగా వుండిపోతామన్నమాట.'

'ఆయన బొంబాయి వెళ్ళారు. అక్కడ ఓడలు వంపుతారట. ముస్లిముల ఓడలు తీసికొని కరాచీ వెళ్ళిపోతారట. కదీర్ చెప్పాడు.' అని చెప్పాడు రామావతార్.

గంగాదీన్, రామావతార్‌లను వదిలి చంప వచ్చిత్రోవన వెళ్ళిపోయింది. సయ్యద్ వెళ్ళిపోయాడు. గుర్రాలు, కార్లు, అందగత్తెలే గాక ఆయనజీవితంలో మరో ఆకర్షణకూడా బయలుదేరిందన్నమాట. క్రొత్తదేశం, క్రొత్తపదవి, క్రొత్త ప్రగతి, క్రొత్తసమస్యలు. మొగవాళ్ళజీవితాలు నిజంగా ఏమిటోగా వుంటాయి. వాళ్ళకు ఏమీ పట్టవు.

'అతనికోసం జీవితంలో ఎంతోకాలాన్ని పాడుచేసుకొన్నాను. నిజంగా మూర్ఖురాల్ని. అసలు సయ్యద్ అందగాడు. అతనితో గడిపినంతవరకు మంచిగానే కాలం గడిచింది. స్మృతులపట్టికలో అటువంటిసమయాలకు మహత్తరమైన స్థానం వుంటుంది. కాని అతనంటే నాకు ప్రేమలేదు. నిజంగా ప్రేమలేదు' అనుకొంటూ ముందుకుసాగింది. ఎదురూగా గుల్‌ఫిషాఁ నిలబడివుంది. చెట్లు. గేటు. రామావతార్. గంగాదీన్. కమాల్. తహమీనా అంతా కళ్ళకు కనబడసాగారు. పాపం, తహమీనా గదిలో కూర్చొనివుంటుంది. సయ్యద్ అంటే ఆమెకు అమిత ప్రేమ. అతను అందగాడు. గర్విష్ఠి. అంతగర్వం ఎక్కడినుంచి వచ్చిందో ఏమో! ఇలా అనుకొంటూవుంటే ఆమెకు నవ్వు వచ్చింది. బిగ్గరగా పకపకనవ్వాలని అనిపించింది. మనుష్యులకు యింతగర్వం ఎందుకు వస్తుంది? తనవ్యక్తిత్వాన్ని చూచుకొనా? ఎక్కడిదీ వ్యక్తిత్వం? గౌతం నీలాంబరుడికి తాను గొప్ప తెలివిగలవాణ్ణని గర్వం. కమాల్‌కు తను నమ్మినసిద్ధాంతాలమీద గట్టిగా నిలబడివుంటానని గర్వం. తహమీనా తన మెత్తనిస్వభావాన్ని చూసుకొని మురిసిపోతుంది. మనుష్యులకు యింత అభిమానం ఎందుకు కలుగుతుంది? చంప ముందుకువెళుతూ ఆకాశంవంక చూపింది. వర్షం రాబోతున్నది. గాలి స్వతంత్రంగా వీస్తున్నది. ఆకుల సవ్వడిలో ఒకవిధమైన సంతోషం వెల్లడిఅవుతున్నది. ఈ స్వాతంత్ర్యాన్ని ఊహిస్తున్నది నేనేనా! ప్రజలుకూడా ఊహిస్తున్నారా' హ హ హ హ అంటూ గట్టిగా నవ్వుకున్నది.

త్వరత్వరగా ముందుకుసాగింది. తడిసినభూమి నాలుగువైపుల పరిచివున్నది. మామిడిచెట్లమీద మేఘాలు క్రమ్మివున్నాయి. గుల్‌ఫిషాఁ మేడవెనుకనున్న రోడ్డుమీదకు చేరుకొన్నది. అక్కడ సింఘాదేవాలీ భవనం వున్నది. ఇంతలో కమరున్ చీరెచెంగు కనబడింది.

'ఏమిటమ్మా!' అని అడిగింది కమరున్.

'ఏమీలేదు.... ....'

కమరున్ ఏమీ మాట్లాడకుండ ఆమెనుచూస్తూ నిలబడింది.

'ఇక్కడ కాస్సేపు కూర్చుందామా?'

'అలాగే కూర్చోండి. రండి. వర్షం పడుతూంది. లోపలికి వసారాలోకి రండమ్మా!

ఆమె పనివాళ్ళ ఇళ్ళ వరాండాలోకి వచ్చింది. వరాండాలో నేల తడిసివున్నది. ప్రక్కనే పరిచివున్నగుడ్డమీద అప్పడాలు పరిచివున్నాయి.

'అప్పడాలు ఎండపెడదామంటే ఎండే రావడంలేదు.' అని అన్నది మాటలు ప్రారంభిస్తూ కమరున్. మేడ లోపలకూడా నిశ్శబ్దంగావున్నది. కమరున్ ప్రారంభించింది-'అమ్మా. మీ పెద్దవాళ్ళసంగతే వేరు. ఉన్నంతలో సుఖంగావుండటం మాకు తెలుసు. నచ్చినవాళ్ళకోసం జీవితం అర్పించడమే మాకుతెలుసు. కాని వీళ్ళను చూడండి. వీళ్ళకు సంతోషమే కలుగదు. తహమీనాను చూడండి. నయ్యద్‌గారితో ఎందుకుచెప్పండి తగాదా. ఆయనంటేనే కోపం. దూరందూరంగా వుంటూవచ్చింది. ఆయనతో కలిసిమెలసివుంటే ఎలావుండేది? ఒక్కమాటైనా చెప్పకుండా ఆయన పాకిస్తాన్ వెళ్ళిపోయాడు. ఇప్పుడు యింట్లోకూర్చొని ఏడుస్తున్నది.'

'ఆయన్నికాకపోతే యింకొకరి నెవరినైనా చేసుకోవచ్చుగదా!' అని అన్నది చంప కంగారుపడుతూ.

'అందరిమనస్సులు ఒకటిగా వుండవుకదమ్మా. పాన్ వేసుకొంటారా?' అని అడిగింది కమరున్.

'వద్దు. ఇక వెళతాను.' అంటూ లేచి గొడుగువేసుకొని కాలిబాటన వెళ్ళిపోయింది.

కమరున్ కాసేపు ఆమె వెళ్ళినవైపుచూస్తూ నిలబడింది. ఆ తరువాత రామావతార్ భార్యనుచూసి, 'మన అమ్మాయి తహమీనా యీమాత్రం తెలుసుకోలేదేమమ్మా!' అని అన్నది.

'అమ్మాయికి ధైర్యంలేదు. భయపడుతున్నది. కొంచెం ఇంగ్లీషు నేర్చుకొనేసరికి ప్రపంచమంతా తెలిసినట్లు భావిస్తున్నది. అమ్మాయికి గుండెలేదు. ధైర్యం లేదు' అంటూ రామదయ్యా సమాధానం చెప్పింది.

తలత్ పాట పాడాలని ప్రయత్నించింది. కాని కంఠం పెగలలేదు. తహమీనా గది లోపలకూర్చొని జాకెట్టు కుడుతున్నది. వర్షం ఆగిపోయినందున బాగా ఉక్క పోస్తున్నది. తలత్ లేచి గదిలోపలికి వచ్చింది. తహమీనా తలపైకెత్తి తలత్ వంక శ్రద్ధగా చూసింది. బైట చెట్టుమీద కూర్చున్నకోయిల కుహూ కుహూ అని కమ్మగా కూస్తున్నది.

'అక్కా. అంతా మనోభావాలు. ఏమిటో అంతా బుద్ధికిసంబంధించిన విషయం.'

'నీవుకూడా మోసంవ్యవహారంలో పడ్డావన్నమాట!'

'అక్కా! మోసమా? ఏమిటి నీవనేది? విచిత్రమైన సమస్య. నీ సమస్య ఏమిటి? నీవు, సయ్యద్, చంపాబాజీ, తత్ఫలితం?....అంటే....'

'నీవు కేంబ్రిడ్జి వెళుతున్నావుకదా!' అని అన్నది తహమీనా వ్యంగ్యంగా.

తలత్‌కు కోపంవచ్చింది. అక్క నన్ను మూర్ఖురా లనుకుంటున్నది. అయితే ఏ దృష్టిలో నేను మూర్ఖురాల నన్నమాట?' అని అన్నది బాధపడుతూ.

'కాదు, చాలా తెలివిగలదానివి. దానితోపాటు అరదానివికూడా' అని అన్నది అక్క తహమీనా.

'అక్కా! నీవు 'బూర్జువా' అయిపోయావు. చదివినచదువంతా ఏమైపోయింది. యూనియన్‌లోచేరి ఏమేమి ఉపన్యాసాలు యిచ్చావో జ్ఞాపకం చేసికో. చంపాబాజీ వంటి ప్రగతి విరోధకురాలకి బోధచేసేందుకు ప్రయత్నించావు. అటువంటి నీవు 'అరది' అను పట్టా అంటించుకొని వుండిపోయావు. సయ్యద్ వెళ్ళిపోతే ఏం? పనిచేయి. ఘర్షణపడు. ముందుకు నడు. కోడిపుంజు లేకపోతే తెల్లవారదా? సయ్యద్‌ని పెళ్ళి చేసికోనని భీష్మించుకూర్చుంటివి. మరోవైపున ఏడుస్తూ వుంటివి! అన్నయ్య పోతేపోనీ! వివాహానికి ఆయనబుర్రను పాడుచేసింది నీవే. మొగవాళ్లను యింతగా నెత్తి కెక్కించుకోకూడదని నిర్మల అంటూవుండేది. ఆరు సంవత్సరాలపాటు నీ కళ్లఎదుట చంపాబాజీతో ప్రేమకలాపం అంటూ తిరిగాడు. వెళ్ళిపోయాడు. ఇంతచేసినా వెళ్ళిపోయాడని వెక్కివెక్కి ఏడుస్తున్నావు.

చెప్పుతీసికొని నాలుగుదెబ్బలు కొట్టు. దెబ్బకు దయ్యం పారిపోతుంది నయ్యద్ గారికి' అని అన్నది కోపంగా తలత్.

'తలత్....అతడు నీకు పెద్దన్న. తప్పు. అలా మాట్లాడకు.'

'ఆయనపక్షంవహించి మాట్లాడుతున్నావన్నమాట!' అంటూ కోపంతో తలత్ ఏడుపుముఖం పెట్టింది. 'వయస్సులో పెద్దదానివికాకపోతే ఒక్కదెబ్బకు వదిలించే దాన్ని నీ జటం' అంటూ లేచి బైటకు వెళ్ళిపోయింది. సైకిలెక్కి నిర్మలయింటికి బయలుదేరింది. అక్కడకువెళ్లి నీళ్లు త్రాగింది. టిఫిన్ తిన్నది. నిర్మల, మాలతి, హరిశంకర్‌లతో కలిసి పేకాడింది. అప్పటికిగాని ఆమెకోపం శాంతించలేదు.

తలత్ వెళ్ళినతరువాత తహమీనా తను వ్రాయవలసిన నాటకంగురించి యోచించసాగింది. నాటకంలో తన పాత్రనుగురించి యోచించసాగింది.

'నవాబ్ జాదీ తహమీనా బేగం. వయస్సు ఇరవైఅయిదు సంవత్సరాలు. ఫస్ట్ క్లాస్ ఎం. ఏ. చామనచాయ. భావుకురాలు. మనషి సన్నన. అందరితో కలిసి మెలిసివుండే స్వభావం. అభిమానం ఎక్కువ.' ఇంతకంటెమించి స్పష్టీకరణ అవవసరం అనుకొంటూ వరండాలోకి వచ్చింది. అక్కడ బంధువులపిల్లలు ఆడుకొంటున్నారు.

కమాల్ అరుగుమీదినుండి తొంగిచూశాడు. తహమీనాకూడా అతణ్ణి చూసింది. వీళ్లంతా నాటకంలోని పాత్రలు. స్వప్నంలోమాదిరిగా తిరుగుతున్నారు. రంగ స్థలంమీద చీకటి అలుముకొన్నది. ఆమెకూడా బైటకు వచ్చివేసింది.

'అక్కా, చంపాబాజీ వెళ్ళిపోతున్నది' అని అన్నాడు పిల్లలతోబాటు తాను కూడా ఆడుకొంటూ కమాల్.

'ఎక్కడికి' అని అడిగింది తహమీనా.

'ఫ్రాన్సు.'

'ఫ్రాన్సా?'

'అవును. యూనివర్సిటీ స్కాలర్‌షిప్ దొరికింది' అంటూ కమాల్ వెళ్ళి పోయాడు.

రోడ్డుమీదకువచ్చి కమాల్ గుల్‌ఫిషాంను ఒక్కపర్యాయం పరిశీలించిచూశాడు. జేబుల్లో చేతులుమార్చుకొని సింహాదేవాలీ భవనానికి బయలుదేరాడు.

ఈసారి ఆగస్టుమాసంలో, భూమ్యాకాశాలు మునిగిపోయేట్లు వర్షం కురిసింది. సింఘాదీ భవనం వసారాలోకూర్చొని వారంతా మబ్బులవొంక చూస్తూ కూర్చు న్నారు. ఆ చక్కని వాతావరణంచూసి, తలత్ మళ్లీ తాన్‌పురామీటి 'మల్హార్' రాగం వాయించ మనసు పడింది. కానీ నలువైపుల శబ్దం హోరుమంటోంది.

స్వచ్ఛమైన వర్షపుజల్లు; శ్రావణమాసపు అలౌకికమంచు - వాటిలో రక్తం కలిసిపోయింది. రక్తపుఋతువు. రక్తపుఋరద. రక్తం వర్షించే మేఘాలు. ఆ అధికరక్తంతో తలత్ విసుగుచెందింది. గోమతి రక్తపునది. పువ్వులమీద రక్తం పడింది. మానవులకళ్లల్లో రక్తం చిమ్మింది. నిర్మల, హరిశంకర్‌ల వొంక. భయపడుతూ చూసింది తలత్.

# 35

సోదరులు రెండుపక్షాలుగా విడిపోయారు. గృహయుద్ధం ప్రారంభమైంది. అర్జు నుడు విల్లు చేతబట్టి 'ఓ జనార్దనా ! నా రథాన్ని రెండుసైన్యాలమధ్య నిలబెట్టు. ఏ పక్షాన్ని నేను వహించాలో నిర్ణయించుకొంటాను' అని అన్నాడు.

శ్రీ కృష్ణుడు రథాన్ని అక్కడికి తీసికొనివెళ్లి నిలబెట్టాడు. ఇరువైపులగల సైనికులను అర్జునుడు పరిశీలించిచూశాడు. తాతలు, తండ్రులు, పినతండ్రులు, సోదరులు, అన్నకుమారులు, కొడుకులు, మిత్రులు, గురువులు, అనుచరులు, ఒకరికొకరు శత్రువులై నిలబడివుండటం అర్జునుడు గ్రహించాడు.

కుంతీకుమారుడు చింతాక్రాంతుడై 'ఓ కృష్ణా ! ఈ దృశ్యం యిక చూడలేను. కాళ్లు చేతులు వణికిపోతున్నాయి. కంఠం ఎండిపోతున్నది. ముచ్చెమటలు పోస్తు న్నది. విల్లు పడిపోతున్నది. ధైర్యం చాలడంలేదు. ఓ కేశవా ! తిన్నగా నిలబడ లేక పోతున్నాను. నా బుర్ర తిరిగిపోతున్నది. చెడ్డశకునాలు కనబడుతున్నాయి. ఓ మాధవా ! నా కుటుంబీకుల్ని, నా మిత్రుల్ని, నా గురువుల్ని, నా బంధువుల్ని చంపలేను. కుటుంబాలు నాశనమై [illegible] నాలే నశించిపోతాయి. స్త్రీల [illegible] మారిపోతుంది. పూర్వీకుల వంశప్రతిష్ఠ [illegible] ఆదరించేవాడు. అనుసరించే [illegible] లేకుండా పోతాడు.

ఓ మధుసూదనా! మా యిరువురిలో ఎవరు శ్రేష్ఠులో తెలియదు. మా పక్షం మంచిదో, అవలిపక్షం మంచిదో చెప్పడం కష్టంగా వున్నది. ఓ గోవిందా!' అంటూ వాపోయాడు.

## 36

భారతదేశం - 1947.

## 37

ప్రిల్ డెరిక్ ఎడ్విన్ హోవర్డు ఐష్లే తిరిగి గడియారం చూశాడు. పికెడ్లీయందలి ట్యూబ్ స్టేషనులోవున్న ప్రపంచానికంతటికీ కాలం చూపించే గడియారంక్రింద పచార్లుచేయడం ప్రారంభించాడు. అతనిమనస్సు సరిగాలేదు. ఇటువంటి కలయికలంటే అతనికి యిష్టం వుండదు. కాని చంపాటాజీకి మాటయిచ్చాడు. ఆమెను థియేటరుకు తీసుకొనివెళ్ళాలి. విసుగుబుట్టి పత్రిక తీసికొని తిరిగి చదవడం ప్రారంభించాడు. ఆ పత్రికపేరు 'న్యూ స్టేట్స్‌మెన్ అండ్ నేషన్'. అందులో గౌతం పీలాంబరు అనువ్యక్తి భారతదేశవిభజన, యుద్ధం, శాంతినిగురించి వ్రాసి పంపిన జాబు ప్రకటించబడివున్నది. సురేఖ ఆహూజా యింటికివెళ్ళి యీ విషయాన్నిగురించి మిత్రులతో చర్చించాలని ప్రిల్‌కు తొందరగావున్నది.

ప్రిల్ ద్వితీయ లార్డ్ వార్న్‌ఫీల్డు చిన్నకుమారుడు. అతనితాత ప్రథమ లార్డ్ ప్రిల్ డెరిక్ ఎడ్విన్ ఐష్లే. ప్రిల్ ముత్తాత సర్ ప్రిల్ హోవర్డ్ ఐష్లే ఒక బీదపాదరీ (మతగురువు) కుమారుడు. పద్దెనిమిదవ శతాబ్దం చివరిభాగంలో క్లర్కుగా బెంగాలు వెళ్లాడు. అక్కడ ఈస్ట్ ఇండియా కంపెనీలో ఉద్యోగంచేస్తూ నీలిమందు వ్యాపారంలో లక్షలాదిరూపాయలు ఆర్జించాడు. అయోధ్య పాదుషా దర్బారులో

కూడా అతడు బాగా సంపాదించాడని ప్రతీతి. అతనికొడుకు ఇంగ్లండులో వుండి రబ్బరువ్యాపారం ప్రారంభించాడు. మేదలు గ్రామాలు చాలా కొన్నారు. లార్డ్ బిరుదుకూడా పొందాడు. శాసనసభ్యుడిగాకూడా పనిచేశాడు. అతడు ప్రథమ లార్డ్ బార్న్ ఫీల్డ్. అతని కుమారుడు ద్వితీయ బార్న్‌ఫీల్డ్ సామ్రాజ్యానికి గౌరవనీయు డగు పుత్రుడుగా వెలుగులోకి వచ్చాడు. ఇంగ్లండుప్రభుత్వ విదేశాంగశాఖలో పెద్దఉద్యోగాలు చేశాడు. టర్కీవాళ్ళను, ఆఫ్ఘనిస్తాన్‌వాళ్ళను చాలామందిని హత మార్చాడు. హిందూదేశ స్వాతంత్ర్యసమరానికి వ్యతిరేకంగా చాలా చట్టాలు అమలు పెట్టించాడు. అతనికి హిందూదేశస్థులంటే అసహ్యం.

ద్వితీయ లార్డ్ బార్న్‌ఫీల్డ్ ద్వితీయ ప్రపంచయుద్ధంలో జర్మనీవాళ్ళు వేసిన బాంబులకు ఎర అయిపోయాడు. అతనికి యిద్దరు కొడుకులు. పెద్దకొడుకు తృతీయ బార్న్‌ఫీల్డ్ వ్యాపారం చూసుకొంటున్నాడు. ప్రిల్ చిన్నవాడు. బార్న్ ఫీల్డ్ కుటుంబం చిక్కుల్లో పడిపోసాగింది. మలయాలోగల అతని రబ్బరుతోటల్లో కమ్యూనిస్టులబెడద ఎక్కువై పోయింది. కీన్యాలో మావో మావోలు రగడ లేవ దీశారు. హిందూదేశం స్వతంత్రమైపోయింది. ఆదివారంరోజు తన వంశమర్యా దకు చిహ్నంగావున్న మేడమీదగల వస్తువులను టిక్కెట్లుఅమ్మి ప్రజలకు చూపి స్తున్నారు. నాలుగువైపుల వందలాదిఎకరాల పార్కు వున్నది. లార్డ్ బార్న్‌ఫీల్డ్‌ను వ్యాపారచిక్కులు, జమీందారీసమస్యలు అన్నీకలిసి ముందుగానే ముసలివాణ్ణి చేసి వేశాయి.

కాని ప్రిల్ యీ విషయాలేమీ పట్టించుకోకుండా కేంబ్రిడ్జిలో దర్శనశాస్త్రం చదువుతున్నాడు. తన జీవితానికి తానే సంపాదించుకోవాలి. అదీగాక అతడు రోజ్ మారీని పెండ్లి చేసికొన్నాడు. అప్పటినుంచి పెద్దఅన్న బార్న్‌ఫీల్డ్ అతనితో సంబం ధాలు పెట్టుకోవడం మానుకొన్నాడు. లేడీ సింథ్యానిచ్చి ప్రిల్ వివాహం చేయాలని పెద్దఅన్న అనుకొన్నాడు. అప్పుడు రాజకుటుంబంతో సంబంధం ఏర్పడుతుందని భావించాడు. కాని ప్రిల్ రోజ్‌మారీని పెండ్లిచేసికొని పథకమంతా భగ్నం చేసి వేశాడు. తమ్ముడు కమ్యూనిస్టు అయిపోయాడని మొదట అనుకొన్నాడు. కాని అది తప్పని తరువాత తేలింది. ఇతడికి రాజకీయాలంటే యిష్టంలేదు. భగవంతుని దయవలన అతడు దార్శనికుడు. అతనిభార్య రోజ్‌మారీ మధ్యతరగతికి చెందిన మహిళ. కళాకారులపార్టీలో ప్రిల్‌కు ఆమెకు పరిచయం కలిగింది. అక్కడ కళా

కారులు జాగరణ చేస్తుండేవారు. ఈ అమ్మాయి అంత అందగత్తెకాదు. విగ్రహాలు తయారుచేస్తూవుండేది. పాపం ఆమె విగ్రహాలు తయారుచేయడంలో పూర్తిగా నేర్పు సంపాదించలేదు. అందువల్లనే క్రిల్‌కు ఆమె నచ్చింది. ఆమెకు పూర్ణత్వం కలిగించాలని క్రిల్ భావించాడు. వెంటనే పెండ్లిచేసికొని లండనునుండి ఫోను మీద అన్నగారికి వదినగారికి తెలియజేశాడు. అసలు రోజ్‌మారీ పేరు ఊరూలేని దరిద్రురాలు. పైగా రోమన్ కాథలిక్. లార్డ్ బార్న్‌ఫీల్డు మంచెక్కిపోయాడు. కాని క్రిల్ లక్ష్యం చేయలేదు. అతడు హెగెల్, కాంట్‌లను చదవడంలో లీన మైనాడు.

క్రిల్ కేంబ్రిడ్జిలో చదువుతూవున్నాడు. అతనిభార్య స్టేఫర్డ్ షాయర్‌లోనున్న ఒక పింగాణీ ఫ్యాక్టరీలో ఉద్యోగం చేస్తున్నది. క్రిల్ అప్పుడప్పుడు తన వ్రేలికి గల ఉంగరం చూసుకొని పెండ్లి అయిందని గుర్తుచేసుకొనేవాడు. నెలకు ఒకటి రెండుపర్యాయాలు రోజ్‌మారీని కలుసుకొంటూవుండేవాడు.

ఒకరోజున తన మిత్రులతోబాటు ఒక షిల్లింగ్ చెల్లించి టిక్కట్టుకొని తన పూర్వీకులమేడ 'స్టేట్లీ హోమ్' చూసేందుకు వెళ్ళాడు. అన్న, వదినగారలు దక్షిణ ఫ్రాంసు వెళ్ళారు. నౌకర్లు మేడంతా చూపిస్తున్నారు. వాళ్ళంతా క్రొత్తవాళ్ళు. ఎవ్వరూ క్రిల్‌ను గుర్తుపట్టలేదు. మేడంతా తిరిగిచూశాడు తాను యిక్కడే పుట్టిన విషయం జ్ఞాపకంవచ్చినప్పుడు అతనికే అమితఆశ్చర్యం కలిగింది. ఆ మేడ ఊరికి దూరంగా వున్నది. అది నాలుగైదువందల ఏండ్లకుపూర్వం నిర్మించబడిన మేడ. పార్కునిండా చాలా యిళ్లు వున్నాయి. ఇటలీదేశాన్నుండి తెప్పించబడిన చలువ రాతివిగ్రహాలు పూలచెట్లమధ్య అక్కడక్కడ నిలబెట్టబడివున్నాయి. ఇది చిన్నప్పుడు అతడు బాగా తిరిగినచోటు. ఒకవైపున పన్నెండవశతాబ్దంలో కట్ట బడిన యిద్దరు సన్యాసినుల సమాధులు వుండేవి. ఆ ... సమాధులు త్రవ్వి వేయబడ్డాయి. అక్కడ ... గుంటల్లో వర్షాకాలంలో ... వుం... కూర్చొని ... గురించి ఆలోచిస్తూ వుం...

... నుండి వచ్చేజనం ... ఆశ్చర్యపడుతూ వుంటారు. క్రిల్‌కు మాత్రం ఏమీ ఆశ్చర్యం కలుగలేదు. ధనికవర్గం తయారుచేసి పెట్టిన యీ తతంగంచూసి విసుగుపోయేవాడు. తన ముత్తాతవ్యక్తిత్వంలోకూడా

అతనికి విశేషం కనబడలేదు. ఎంతమంది హిందూదేశప్రజల రక్తంపీల్చి యింత డబ్బు సంపాదించివుంటారోనని ఫ్రిల్ బాధపడేవాడు. ఈరకమైనభావాలు కమ్యూనిజం ప్రభావంవల్లకాక సూఫీమత ప్రభావంవల్ల అతనికి కలుగుతూవుండేవి. అందువల్లనే అతడు తనయింటిలోనే పరాయివాడిలా ప్రేక్షకుడుగా తిరుగుతూ వున్నప్పుడు సంతోషించాడు. తృప్తికూడా అతనికి కలిగింది. ఏదో సిద్ధాంతాన్ని అనుసరించక స్వతంత్రంగావుండాలని అతనికాంక్ష.

ఫ్రిల్ ఐష్లే సరిగా చెప్పాలంటే యీకాలపు మానవుడు. ఈయుగంలో కలిగే మానసిక చిక్కులకు, ఆధ్యాత్మికసంబంధమైన అతృప్తులకు, భావాత్మకమైన అసంతృప్తికి, సందేహాలకు ప్రతినిధియని చెప్పవచ్చును.

1930 నుండి 1939 నాటివరకు అతని జీవితంలో, బాల్యకాలం. లండన్‌లో కలవాళ్ళయింటియందు కళాకారులంతా కలుసుకొంటూవుండేవారు. ముఖ్యంగా అతని సవతితల్లి లేడీ ఎలెన్‌ను కలుసుకొనేందుకు వస్తూవుండేవారు. సంప్రదాయబద్ధమైనకుటుంబంలో పెండ్లిచేసికొనివచ్చినప్పటికి ఆమె అత్యాధునికభావాలను సమర్థిస్తూవుండేది. కళ, సాహిత్యం, నాటకం, సంగీతం, 'బాలే', 'ఇంటీరియర్ డెకరేషన్' మొదలుగాగల ప్రతివిషయమందు క్రొత్తదనం అవసరమను ఉద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. ఫ్రిల్ మెంచెస్టర్‌నుండి కేంబ్రిడ్జికి పంపబడ్డాడు. అక్కడ సిడ్నీ-ససెక్స్-కాలేజీలో అతణ్ణి చేర్చారు. ఇంతలో యుద్ధం ప్రారంభమైంది. మిలిటరీలోచేరి బాంబులువేసే పైలట్‌గా పనిచేసి అనేక అందమైన జర్మన్ దేశపు నగరాలను సర్వనాశనం చేసివేశాడు. అక్కడే అతనికి యిష్టులైన దార్శనికులు, కవులు, సంగీతజ్ఞులు జన్మించారు.

ఆతరువాత అతడు మళ్ళీ కాలేజీలో చేరాడు. యుద్ధానంతరప్రపంచం అతని కళ్లముందు సాక్షాత్కరించింది. నిన్నటిశత్రువులు యిప్పుడు మిత్రులు. నిన్నటి మిత్రులు యిప్పుడు భయంకరమైన శత్రువులు. ఆసియాఖండ స్వరూపం త్వర త్వరగా మారిపోసాగింది. శాంతినినాదాలు వల్లించబడుతున్నాయి, కాని వాటితో బాటు తృతీయ ప్రపంచయుద్ధానికి ఏర్పాట్లు ప్రారంభమైనాయి. నిన్నటి అభ్యుదయవాదులు యిప్పుడు కరుడుగట్టిన ప్రగతి విరోధకులుగా పరిగణింపబడుతున్నారు. మానవవిలువలు అస్థిరమైపోయాయి. అవాస్తవికమైనకాలం ప్రారంభమైంది. యుద్ధాల భయంకరరూపం కళ్ళారా చూచాడు. మానవుల రాక్షసత్వాన్ని కళ్ళారా

చూచాడు. అందువల్ల ప్రిల్‌స్వభావంలో కటుత్వం పెరిగిపోయింది. మైకేల్, దేవిస్ అతని స్నేహితులు, అనుచరులు. మైకేల్ యూదుజాతివాడు. దేవిస్‌కూడా మైకేల్ వలెనే మధ్యతరగతికి చెందినవాడు. దేవిస్‌కు కవిత్వపుపిచ్చి వున్నది.

వీళ్లేగాక చాలామంది యువకులు అతని మిత్రబృందంలో వున్నారు. నల్లవాళ్లు, యూరోపియన్లు, ఆడపిల్లలు చాలామందితో అతనికి పరిచయం ఏర్పడింది.

కాని అతనిదేశపు ఆడపిల్లలు ప్రిల్‌ను ఎక్కువగా ఆకర్షించలేదు. వారంతా ఒకేవిధంగా వుండటమే అందుకు కారణం. రెండవ ప్రపంచయుద్ధానంతరం ప్రపంచదేశాల్లో గొప్పమార్పువచ్చింది. అంతర్జాతీయసంబంధాలు పెరిగిపోయాయి. అనేకదేశాలనుండి రకరకాల ఆడపిల్లలు చదువుకొనేనిమిత్తం ఇంగ్లండుకు వస్తున్నారు. నల్లవాళ్లు, ఎర్రవాళ్లు, తెల్లవాళ్లు. తనదేశం ఆడపిల్లల్లో రోజ్‌మారీ అను అమ్మాయి అతనికి నచ్చింది. ప్రిల్ ఆమెను పెండ్లిచేసికొన్నాడు.

వివిన్న దేశాల సాంస్కృతిక సమావేశాలు ప్రారంభమైనాయి. ఆ సమావేశాల్లో తమదేశసంస్కృతి గొప్పదని ఇంగ్లీషువాళ్లకు నమ్మకం కలిగించేందుకు ప్రయత్నాలు చేయడం పరిపాటైపోయింది. ఓరియంటల్ నృత్యాలు జరుగుతూవుండేవి. కవితాగోష్టులు జరిగేవి. రకరకాల వాయిద్యాలు వాయిస్తూవుండేవారు. అమెరికాలో యీ నీగ్రోయన్‌లు అమితంగావున్నారని వినికిడి. ఇంగ్లండులో జరుగుతున్న యీ తతంగమంతే అతనికి తలనొప్పి ప్రారంభమైంది. తనగదికి వచ్చినప్పుడు ఎవరైనావచ్చి థాయిలాండువాళ్ళు, ఇండోనీషియావాళ్ళు సాంస్కృతికసమావేశాలు జరుపుతున్నారు అని చెబితే కిటికీలోనుండిదూకి తప్పించుకు పారిపోవాలని అతనికి అనిపించేది.

'ప్రిల్ ఆసియానుండి తన రక్షణకోసం పథకం వేస్తున్నాడు' అని అన్నాడు భయంకరంగా దేవిస్.

ఒకరోజు క్రొత్తబృందం కేంబ్రిడ్జికి వచ్చింది. వీళ్లంతా హిందుస్థాన్‌నుంచి. ముఖ్యంగా లక్నోనుండి వచ్చారు. చాలారోజులవరకు ఎవ్వరినీ అతడు కలుసుకోలేదు. వాళ్ళు విప్లవకారులకక్కేరకం అని తెలిసికూడా ప్రిల్ ఏమీ పట్టించుకోలేదు.

వారాంతమందు అతడు లండన్ వెళ్ళాడు. మిత్రులతోకలిసి ఇండియావాళ్ల సాంస్కృతిక కార్యక్రమానికి అతడు వెళ్లాడు. అంతా చెప్పులు, బూట్లు విప్పి రంగస్థలంమీద కూర్చున్నారు. బహుశ టాగూరు జయంతి జరుపుకొంటున్నారు.

డేవిస్ ధ్యానమగ్నులై నారు. అందరిపై ఆధ్యాత్మికతత్వం ఆవహించింది. కాని ప్రిల్‌మాత్రం వంట్లాము నలిగిపోతుందేమోనని బాధపడుతున్నారు. పద్మాసనం వేసికొని కూర్చోవడం అతనివల్ల కావడంలేదు. ఎంతోజాగ్రత్తగా రంగస్థలం మీద ధ్యానమగ్నులై కూర్చొనివున్న ఇంగ్లీషువాళ్ళను శ్రద్ధగా పరిశీలించిచూశాడు. వీళ్ళంతా ఎవరు? ఏమో ఎవరో? ఎవరైతే మనకెందుకు అనుకొన్నాడు నిర్ల క్ష్యంగా ప్రిల్.

ఇంతలో ఒక నాజూకైనఅమ్మాయి రంగస్థలంమీదకువచ్చి ఏమో ప్రకటన చేసింది. ప్రిల్‌కు ఏమీ అర్థం కాలేదు. బిగ్గరగా చప్పట్లు కొట్టారు జనం. ఆ గొడవలో ఏమీ వినపడలేదు. హాలంతా ఆడపిల్లలతో నిండివున్నది. రకరకాల యువకులుకూడా వచ్చివున్నారు.

ఇప్పుడు ఆ ఆడపిల్లల ఆకర్షణకూడా ప్రిల్‌కు కలగడంలేదు. వీళ్ళ రోంలాంటి దేశాలకువెళితే మంచిది. ఇటలీ, ప్రాచ్యదేశాల్లో వీళ్ళ అవసరం ఎక్కువ అని అనుకొన్నాడు. ఏమీతోచక యిలాంటివిషయాలు యోచిస్తున్నాడు. టాగూరును గురించి ఆలోచించడంకూడా అతనికి యిష్టంలేదు. అందానికి పూజారి, మధ్య వర్గానికి చెందినవాడు, భావుకుడగు యోగి టాగూరు అని అభిప్రాయపడ్డాడు. (ఈమధ్య అతడు పాశ్చాత్యనభ్యతంటే అమితంగా పక్షపాతంవహించ సాగాడు.)

ఇంతలో నల్లనిచీరె కట్టుకొని ఒక లావుపాటి మహిళ రంగస్థలంమీదకు వచ్చింది.

ఆమె హృదయాలకు హత్తుకొనేలా రవీంద్రనాథ్ టాగూరుగీతం పాడటం ప్రారంభించింది.

ఈమె ఎవరో తెలుసా? గొప్పగా ప్రశ్నించాడు డేవిస్.

తెలుసుకోలేకపోయినా వచ్చేనష్టం ఏమీ లేదులే. ఈవిడ హిందూప్రాచీనసంస్కృ తికి ప్రతినిధి అయివుంటుంది. 'ఆటమిక్ థీరీనిగురించి మొట్టమొదట చెప్పింది మా శంకరాచార్య అని అంటుంది' అని అన్నాడు విసుగ్గా ప్రిల్.

'ఈమె శ్రీమతి సుజాతా ముఖర్జీ' అని అన్నాడు రహస్యం చెబుతున్నట్లు డేవిస్.

'ఇక్కడి పత్రికలవాళ్ళమీద యీమెప్రభావం ఎక్కువ. నీవు అబ్జర్వర్ పత్రికా ప్రతినిధిగా ఇండియాకు వెళ్ళాలనిఅనుకుంటే యీమెను సేవించు' అని అన్నాడు డేవిస్.

ప్రిల్ ఎదుర్కోవలసినసమస్యలు చాలా వున్నాయి. వాటిలో జీవనోపాధి సమస్యకూడా ఒకటి. చదువు పూర్తి అయినతరువాత తాను ఏమిచేయాలి? బి. బి. సి. లో పనిచేస్తారా? తనకంటె మించినవాళ్ళతో బి. బి. సి. కిటకిటలాడుతూ వున్నది. ఏ ఫిల్ముకంపెనీలోనైనా 'రచయిత'గా చేరదామంటే సాధ్యపడేలా లేదు. ఇంగ్లండులో నిర్మాతలు అమెరికాసహాయంతో సినిమాలు తీస్తున్నారు. ఆంగ్లేయు లందరివలెనే ప్రిల్‌కుకూడా అమెరికన్లంటే అసహ్యం. విద్యాశాఖలోనా? ఛీ ఛీ. కాలేజీల్లో తాను కొరగానివాళ్లకు ఎన్నటికీ పాఠం చెప్పరు. ఉపనివేశరాజ్యాల్లో ఉద్యోగమా? చేయదు. ఇక వార్తాపత్రికల్లోమాత్రమే శరణ్యం దొరకాలి. కాని అక్కడకూడా పోటీ విపరీతంగా వున్నది.

కార్యక్రమం అయిపోయినతరువాత దేవిస్ లేచి శ్రీమతి సుజాతా ముఖర్జీ దగ్గరకు వెళ్ళారు. అప్పుడు ఆమె 'అబ్జర్వర్' విలేఖరి బిల్ క్రేగ్‌తో మాట్లాడు తున్నది. 'హలో దేవిస్' అంటూ చిరునవ్వు నవ్వింది ముఖర్జీ.

'శ్రీమతి ముఖర్జీ! మీయింటికి తీసికొనివెళ్ళి కాఫీ యివ్వరూ' అని అన్నారు దేవిస్.

'తప్పక. అంతా రండి.'

పెద్దగుంపుగా జనం ఆమెయింటికి కాఫీకోసం వెళ్లడానికి సిద్ధమైనారు. వాళ్లంతా కాజీనజరుల్ ఇస్లాం జయంతి జరపాలని మాట్లాడుకొంటున్నారు. ప్రిల్‌కు యీ సమావేశం హాయినిచ్చింది. వీళ్ళప్రపంచమే వేరుగా వున్నది. వీళ్లలో వీళ్లు పెళ్ళిళ్లుకూడా చేసికొంటూవుంటారు. అంటే లండనులో మరో హిందూస్తాన్ లండన్ ఏర్పాటైందన్నమాట. 'పదండి పదండి' అంటూ అంతా బయలుదేరారు.

శ్రీమతి ముఖర్జీగారియిల్లు చెల్సీకిచెందిన దర్జాగావుండే పెద్దమేడలో వున్నది. అంతా యింట్లోకి ప్రవేశించారు.

ఆడపిల్లలు ప్రిల్‌తో స్వతంత్రంగా మాట్లాడటం ప్రారంభించారు. అందులో ఒకమ్మాయిపేరు తలత్, మరో అమ్మాయిపేరు నిర్మల. మొగపిల్లలపేర్లు అతనికి జ్ఞాపకం లేవు. ఈ సంవత్సరమే యీ యిరువురు ఆడపిల్లలు కేంబ్రిడ్జిలో చదువు కొనేందుకై చేరారని అతనికి తెలిసింది.

శ్రీమతి ముఖర్జీ తూర్పుబెంగాలుకుచెందిన ఫరీద్‌పూర్ నివాసి. సంస్కృతి వారింటిదగ్గర తాండవం చేస్తూవుంటుంది. పెళ్ళి అయినతరువాత ఆమెకు, ఆమెభర్తకు

పడలేదు. శ్రీమతి ముఖర్జీ చాలాఏళ్లనుండి యూరపులో ముఖ్యంగా లండనులో వుంటూవున్నది. ఆమెకుమారుడు పారిస్‌లో వుంటున్నాడు. అతడు మంచి చిత్రకారుడు.

ప్రిల్ లండను వెళ్లినప్పుడు శ్రీమతి ముఖర్జీగారియింటికి వెళ్ళాడు. నౌకరు ఆమె లండనులో లేరని జనీవా వెళ్ళారని చెప్పాడు. అతడు బైటకు వస్తూవుంటే మెట్లు ఎక్కుతూ ఒకమ్మాయి కనబడింది. అతణ్ణి గుర్తించి చిరునవ్వు నవ్వుతూ 'నమస్కారం' అని అన్నది.

ప్రిల్‌కు జ్ఞాపకం వచ్చింది. ఆరోజున టాగూరు జయంతినాడు రంగస్థలంమీద ప్రకటనచేసిన ఆవిడ యీమేనని గుర్తించాడు.

ఎవరో ధనవంతుడి కుమారుడని దేనిని చెప్పినయువకుడు యితడేనని చంప జ్ఞాపకం చేసికొన్నది. 'నేనుకూడా శ్రీమతి ముఖర్జీని కలుద్దామని వచ్చాను. ఆమె జనీవా వెళ్ళిందిట' అని అన్నది.

'మీరు యిక్కడే చదువుతున్నారా?'

'లేదండి. నేను పారిస్‌లో వుంటాను. మీరు నిర్మలా శ్రీవాత్సవను ఎరుగుదురా?'

ఆమె గర్టన్ కాలేజిలో వున్నది.

'నేను కుమారి శ్రీవాత్సవను యిక్కడే కలుసుకొన్నాను.'

'కమాల్ రజానో!'

'సురేఖాదేవిద్వారా ఆయన్నుగురించి విన్నాను. కలుసుకొనే అవకాశం లభించలేదు.'

ప్రారంభంలో పది యిరవై నిమిషాలు యిలాంటిమాటల్లోనే గడిచిపోయాయి. 'మీరు నర్గిస్ కావస్జీని ఎరుగుదురా?' బిగ్గరగా అడిగింది చంప.

'నేను ఎవ్వరినీ ఎరుగను. నా స్నేహితులసంఖ్య బహు తక్కువండి.'

చంప పకపక నవ్వింది. 'మీరు అరుణ్‌ఘోష్‌ను కలిసివుంటారని అనుకొన్నాను' అని అన్నది.

వైట్సీకిచెందిన క్రింది అంతస్తు (అండర్‌గ్రౌండ్) వచ్చింది.

'మీరు ఎప్పుడైనా అక్కడికివస్తే కేంబ్రిడ్జిలో కలుసుకొందాం.'

'శలవు' అంటూ త్వరత్వరగా 'ఎస్కలేటరు'మీద దిగిపోయింది.

ప్రిల్ అరగంటసేపటినుండి పికేడిలీకిచెందిన అండర్‌గ్రౌండులో చంపకోసం ఎదురుచూస్తూ వున్నాడు. గత రెండుసంవత్సరాలలో చాలాసార్లు అతడు చంపను కలుసుకొన్నాడు. తాను పారిస్‌నుండి లండను వచ్చినట్టు యివాళ తెలియజేసింది. సురేఖ యింటిదగ్గర అంతాకలిసి భోజనం చేద్దామనికూడా అన్నది. సురేఖగా రింటికివెళ్ళి ఆమెభర్త గుల్షన్‌తో మాట్లాడాలని ప్రిల్ ఆతురతగా వున్నాడు. ఉత్తరం వ్రాసిన గౌతం నీలాంబర్ హిందూదేశ విభజనచేసినదోషమంతా ఇంగ్లీషు వాళ్ళమీదకు నెట్టాడు. గౌతం నీలాంబర్ నిప్పులు కురిపించేవాడని సురేఖ చెప్పింది. ఈమధ్యనే మాస్కోనుండి బదిలీఅయి లండను వచ్చాడనికూడా చెప్పింది.

'ప్రిల్ ఇంటర్నేషనల్ చైం' క్రింద వచార్లు చేస్తున్నాడు.

# 38

కేంబ్రిడ్జి దుకాణాన్నుండి బయటికివచ్చి నిర్మల ఫిట్జ్ విలియం లైబ్రరీకి వెళ్ళ బోతూవుండగా గౌతం నీలాంబర్ కనిపించాడు. 'నిర్మలా! నిన్నే వెతుకు తున్నాను' అంటూ దగ్గరకు వచ్చాడు. నిర్మల కళ్లు మూసుకొన్నది. తన ఎదురుగా నిలబడి మాట్లాడుతున్నది గౌతం నీలాంబర్.

'మీరు యిక్కడకు ఎలావచ్చారు?'

'మిమ్మల్ని కలుసుకొందామని లండనునుంచి వచ్చాను.'

'ఫారెన్ సర్వీసులో ఉద్యోగంలో చేరారటకదూ!'

'అవును. చేరాను.'

'కులాసాగా వున్నారా?'

'ఆఁ, వున్నాను.'

'మాటలు పూర్తి అయిపోయాయి. నిర్మల పొడుగు ఎదిగింది. గాంభీర్యంకూడా ఆమెలో ఎక్కువైంది.

'గ్రంథాలయం లేదు. ఏమీలేదు. కోహినూర్ వెళదాం పద' అని అన్నారు వెంటవున్న కమాల్, తంత్ లిద్దరూ.

నిర్మల ఏమీ మాట్లాడకుండా వారివెంట బయలుదేరింది. వల్లగొమ్ల కొందుక్కొన్న విద్యార్థులు వెళుతున్నారు. వారిలో ఒకవ్యక్తిని చూపించి 'అతనిపేరు ప్రిల్ బిస్లే. ఇతడు గట్టివాడే. చంపాబాయికి శిష్యుడైనాడు' అని అన్నది నిర్మల గౌతం పీలాంబర్ కో.

'ఓహో ! అయితే చంపాబాయిని మీర కలుసుకొంటున్నారన్నమాట !'

'అప్పుడప్పుడు.'

'సంతోషంగా వున్నదా ?'

'ఏమో. ఎవరికి తెలుసు ?'

గౌతం ఏమీ మాట్లాడలేదు. వాళ్ల కింగ్స్ కాలేజిఎదురుగా వెళుతున్నారు. వర్షపు చినుకులు పడసాగాయి.

'కొద్దిరోజులకు చంపాబాయి శ్రీమతి సుజాతా ముఖర్జీ అయిపోయేలా వున్నది. దుఃఖకరమైన విషయం. శ్రీమతి ముఖర్జీని ఎరుగుదురా ?' అని అడిగింది నిర్మల.

'ఆఁ, ఎరుగుదును.'

'సమయం దెబ్బకొట్టి ముందుకు వెళ్ళిపోతుంది. దుఃఖకరమైన విషయం.'

నిర్మల ఏమీ మాట్లాడలేదు.

'సుజాతాదేవి పదిహేను యిరవై సంవత్సరాలకుపూర్వం ఎలావుండేదో మరి ! జనం ఆమెతో రెండుమాటలు మాట్లాడితేచాలు ధన్యులైనట్లు భావించేవారట. ఇప్పుడు ఏమిచేస్తున్నదో తెలుసా ? తనకొడుకుతో సమానంగా వయస్సుగల మొగ పిల్లల్ని తనయింటికి కాఫీయిస్తానని రమ్మని పిలుచుకుపోతుంది. పుస్తకాలు వ్రాస్తూ వుంటుంది. ఫ్లీట్‌స్ట్రీట్‌లో వుంటున్నది. చాలా ప్రసిద్ధికెక్కింది. ఆమె వ్రాసేపుస్తకాలు, ఆమెకుగల పెద్దపేరు నిజానికి ఆమెకు జీవితంలో లభించిన సంతోషానికి చిహ్నాలా ? చంపాబాయికి కూడా అదేస్థితి లభించేలావున్నది. ఆమెదోషం ఏమీలేక పోయినా ఆమెగతి అంతే. సమయం ఆమెను దెబ్బకొట్టింది. ఆమెకూడా యితరుల్ని దెబ్బకొట్టేందుకు ప్రయత్నించింది.'

గౌతం నివ్వెరబోయి నిర్మలవంక శ్రద్ధగాచూశాడు.

నిర్మల మొఖంమీద వర్షపుచినుకు వచ్చిపడింది. రుమాలుతో తుడుచుకొని 'ఇప్పుడు ప్రిల్‌తో సాగుతున్నది వ్యవహారం. అతడు లార్డ్ బెప్లే కొడుకుగదూ! మీరు సర్ దీపనారాయణ్ కుమారుడుకదా! అన్నయ్య సర్ జకీరజాబహాదుర్ కుమారుడుకదా! ఇదీ వరుస.'

'నిర్మలా! నీవు అన్యాయంగా మాట్లాడుతున్నావు. చంపవిషయంలో అన్యాయంగా మాట్లాడుతున్నావు' అని అన్నాడు గౌతం మెల్లగా.

'నేనేమీ అన్యాయం చేయడంలేదు. నిజం మాట్లాడుతున్నాను. తాను దెబ్బ తిన్నది. మమ్మల్ని దెబ్బకొట్టింది. ఏమిటిది? చంపాబాజీ ఆకర్షణ రోజురోజుకు తగ్గిపోతున్నదే అని విన్న కమాల్‌కూడా అన్నాడు. కాని తలత్ సరియైన సమాధానం చెప్పింది. చంపాబాజీలో మార్పు ఏమీ రాలేదుకాని మనం పెద్దవాళ్ల మైనాము' అని అన్నది.

గౌతం బాధపడుతూనే ఆమెవంక చూస్తూవున్నాడు. నిర్మల ఆగలేదు -

'పారిస్‌లో వుండేది. మధ్యలోనే పని వదలివేసి ఇంగ్లండు వెళ్ళిపోయింది. లండన్‌లో ఎక్కడో ఉద్యోగం దొరికిందని విన్నాను. ఇక లండనులో ఏం చేస్తుందో చూడాలి. తనవిషయంలో ఏమీ నిర్ణయంచేసికోలేదు. అతి అయిపోయింది. ఎప్పుడు ఏదో భావోద్రేక ఆధారంకోసం వెతికేరకంమనిషి చంప.'

జీనస్‌లైనులో కరుణార్ద్రమైన రాగం వినబడుతున్నది. గౌతం ఆగిపోయాడు. 'ఎవరో తెలియదు. అప్పుడప్పుడు హృదయాల్ని కరిగించేలా రాగాలాపన చేస్తూవుంటాడు.'

'సయ్యద్‌కూడా లండనులోనే వున్నాడు. పాకిస్థాన్‌హౌస్‌లో రాజపీతిజ్ఞుడు. అందువల్ల మమ్మల్ని కలుసుకోరు.'

అంతా 'కోహినూర్' చేరుకొన్నారు.

'గౌతం! మనుష్యులు యిలా ఎందుకు అయిపోతారు?'

గౌతం ఏమీ మాట్లాడలేదు.

'నిర్మలా!'

'చెప్పండి!'

'నన్ను పెళ్ళి చేసుకొంటావా?'

చేసుకోను.'

'ఎందుకని?' మాట సరిగా వెలువడలేదు.

'నీవుకూడా కటికదరిద్రుడివే. అందుకని. లోపలికివద' వానలో తడి స్తే మంచిదికాదు.

నిర్మల నిజంగా పెద్దదై పోయింది.

అంతా భోజనశాలలోకి ప్రవేశించారు.

# 39

ఉదయం ఆరుగంటలకు చంప లేచికూర్చున్నది. రాత్రి రెండుగంటలదాకా సురేఖ దగ్గర గప్పాలుకొడుతూ కూర్చున్నది. మమతలు యింతగా మాట్లాడతా రెందుకో. స్నానాలగదిలోనుండి జాన్ కార్టర్ తొంగిచూసి 'ఇవాళ నీ ఉద్యోగపు మొదటి రోజు. త్వరగా తయారుకావాలి' అని అన్నాడు.

ఫలహారం తీసికొనివెళ్ళి బస్సులో కూర్చున్నది. సెంట్ జోన్సు వుడ్ చేరు కొన్నది. బిల్ క్రెగ్ యింటికివెళ్ళి గంట మ్రోగించింది. 'రండి' అనుమాట లోపలి నుండి వినబడింది. సాహసంచేసి లోపలికి అడుగుపెట్టింది. లోపల చలి కుంపటి దగ్గర ఒక అల్సేషియన్‌కుక్క నిప్పుకుదగ్గరగా కూర్చొనివున్నది. బిల్ సోఫాలో పడుకొని ఏమో చదువుకొంటున్నాడు. 'ఓహో మైడియర్। ఏం త్రాగుతావు?' అని అడిగాడు. 'ఏమీ త్రాగను' అని అన్నది చంప.

'ప్రూపు చదవడం వచ్చునా?' అంటూ నిర్లక్ష్యంగా ఒక కాగితాలకట్ట ఆమె ముందు విసరివేసి వంటగదిలోకి వెళ్ళిపోయాడు.

శాంతాక్రెగ్ కాశ్మీరీ పట్టుచీరె కట్టుకొని, నల్లని వున్నికోటు తొడుక్కొని మెట్ల మీదనుండి దిగివచ్చింది. శాంత ఎంతో అందంగా వుండటం చంప గమనించింది. త్వర్వరగావెళ్ళి టైప్‌రైటరుముందు కూర్చున్నది. తనభర్తతో సరిపడక విడాకులు తీసుకొన్నతరువాత గౌతంను పెండ్లిచేసికొనక బిల్‌ను ఎందుకు పెండ్లిచేసుకొన్నదో

ఎవ్వరికీ తెలియదు. నిజంగా జీవితం బహు విచిత్రమైనది' అని అనుకొంటూ నమస్కారం మిసెస్ క్రెగ్' అని అన్నది చంప.

'నేను నిన్నుగురించి గౌతంవల్ల చాలాచాలా విన్నాను. ఈ ప్రపంచం చాలా చిన్నది....' అని అన్నది కైపుచేస్తూనే శాంత.

బిల్ కాఫీ ట్రే పట్టుకొనివచ్చారు. శాంత మంచి గర్విష్ఠికూడానని చంపకు అర్థమైంది. పాపం బిల్ చాలా వినమ్రుడు. 'ఫ్రాంక్‌రాస్‌కుకూడా నీవంటే యిష్టం' అని అన్నది చంపతో.

'ఫ్రాంక్‌రాస్ ఎవరు?' ఆశ్చర్యంగా అడిగింది చంప.

బిల్ అతి జాగ్రత్తగా అల్సేషియన్‌కుక్కవైపు వైగచేశాడు. ఆ తరువాత అతడు కాగితాలకట్ట పుచ్చుకొని ముద్రణాలయానికి బయలుదేరాడు. బిల్‌రాగ అచ్చువేసేకార్యాలయంలో ప్రూఫులుచదివే ఉద్యోగంలో చంప చేరిన మొదటిరోజు యీవిధంగా గడిచింది.

'జీవితంలో కార్యక్రమం ఏమిటి?' భోజనంవేళలో బిల్ ఆమెను ప్రశ్నించాడు. అతడు మనుష్యుల ప్రూఫులుకూడా చదువుతూ వుంటాడు.

'ఇది చాలా పెద్దప్రశ్న.'

'ఏం? ఏమైన చిక్కులో పడ్డావా?'

'అవును.'

/ 'ఏదైనా వలలో చిక్కుకున్నావా?'

'అవును.'/

బిల్ మొఖం చిన్నదిచేసికొని మౌనం వహించాడు. అంతా వలలో చిక్కుకున్నవాళ్ళే. తాను, తనభార్య శాంత. ఆమె మొదటిపేరు శాంతా నీలాంబర్. ఇంగ్లీషులోను, మరాఠీలోను నవలలు వ్రాస్తూవుంటుంది. ఫిల్ బన్లే, రచయితలు, సాహిత్యకారులు, బుద్ధిజీవులు, పాశ్చాత్యులు యూరోపియన్ నాగరికత 'నూతన ఆసియా' అంతా విభిన్న నరకాలలోపడి త్రిశంకుస్వర్గంలో వ్రేలాడుతున్నారు.

క్రొత్త హిందూదేశం ఆధ్యాత్మికంగాను, సాంస్కృతికంగాను తన గొప్పతనాన్ని చాటుకొంటున్నది. ఇది ప్రచారయుగం. పత్రికల్లోను, సాంస్కృతిక ప్రచారానికి సంబంధించిన కరపత్రాల్లోను, పుస్తకాల్లో అచ్చుపడే వేలాదిశబ్దాల్లోను తిరుగుతున్న దీ ప్రపంచం. బిల్ శబ్దాలవ్యాపారం చేస్తున్నాడు. శబ్దశక్తి అతనికి

తెలుసు. శబ్దాలలోవలగల అర్థహీనత అతనికి తెలుసు. శాంతకూడా వలలో చిక్కు కొనివున్నది. వీళ్లందరి పైత్రివేటునరకాలు. పైత్రివేటుకూపాలు. వ్యక్తిగత ప్రపంచాలు చాలా కష్టాలు కలిగిస్తూవుంటాయి. వాటినుండి తప్పించుకొని బయటపడటం అమితకష్టం.

ఒక్కమార్గం వున్నది. కాని అది భయంకరమైనది. బిల్ చంపవంకచూసి, 'నీవు కమ్యూనిస్టువి కాలేదా?' అని అడిగాడు.

చంప ఏమీ మాట్లాడక ఉర్లగడ్డలు తింటూ కూర్చుంది.

'నువ్వు కథలు వ్రాయి. నిన్ను వృద్ధిలోకి తెస్తాను. హిందూదేశాన్నిగురించి వ్రాసే నవలలకు మంచి అవకాశం వున్నది. ఆర్. కె. నారాయణ్‌ను చూడు. నువ్వుకూడా వ్రాయి. తెలిసిందా?' అని అన్నాడు గట్టిగా.

'నాకు పుస్తకాలు వ్రాయడం చేతకాదు.'

'నిజంగానా? మీ బృందంలో ఒకరినిమించిన మరొకరు వ్రాయగలరచయితలు వున్నారే.'

'నన్ను నా బృందంలోని యితరులవలె భావించవద్దు.'

'అయితే నీకు వ్యక్తిత్వమున్నదన్నమాట. ఇదికూడా మంచిదే' అని అన్నాడు బిల్.

వాళ్ళు ఫలహారంతింటున్న రెస్టారెంటుపేరు చూజేనరాయ్. అక్కడికి మధ్యాహ్న భోజనంనిమిత్తం చాలామంది వస్తూవుంటారు. దగ్గరలోనే బి. బి. సి. స్టూడియోలు వున్నాయి. కొంతమంది హిందూదేశపు యువతులు చంపను చూడకుండానే కొంటరువైపు వెళ్ళిపోయారు.

'అదుగో అవిడపేరు చంపాఅహమద్. ఇతరులపెళ్ళిళ్ళు నిర్ణయమైతే ఆ పెళ్లికొడుకుల్ని వలలోవేసుకోవడమే యీమె ఉద్యోగం. నేను అబద్ధం చెబుతున్నాననుకొంటే టి. బి. వచ్చింటే ఆ నిర్మల శ్రీవాత్సవను అడగండి తెలుస్తుంది. ఈమె నాటకం ఏమిటో' అంటూ ఒక అమ్మాయి మరో అమ్మాయితో ఉర్దూలో చెప్పింది. ఆమెమాటలు చంప చెవిన పడ్డాయి.

'నిర్మలకు టి. బి. వచ్చిందా?' అని అడిగింది మరో అమ్మాయి. 'అవును. 'శానిటోరియంలో చేరబోతున్నది' అని రెండోఅమ్మాయి చెప్పింది. ఇద్దరూ వెళ్లిపోయారు.

నిర్మలకు టి. బి. వచ్చిందా? చంప చాలా బాధపడింది. వెళ్ళి అడుగుదామను
కొన్నది. కాని వాళ్ళ మాటలకుభయపడి వూరుకొన్నది. ఇంతలో తెలిసిన ఆకారాలు
చాలా కనబడసాగాయి. జరీనా హుస్సేన్, సురేఖ, అహూజా అమల్ రాయ్,
ఫిరోజ్ జబీన్. ఇంతలో అమీర్ రజా లోనికివచ్చాడు. ఎన్నో ఏండ్లతరువాత
చంప అమీర్ రజాను యివాళ చూసింది. ఆయనలో పెద్దమార్పు ఏమీ కనబడలేదు.
ఖరీదైన సూటు ధరించివున్నాడు. అతడు చంపాను చూశాడు. వినమ్రంగా వంగి
సలాం చేశాడు. దూరంగావెళ్ళి బల్లదగ్గర కూర్చున్నాడు.

చంప గడియారం చూసుకొన్నది. చేతిసంచీ తీసికొని బిల్ క్రేగ్ వెంట ఆఫీసుకు
బయలుదేరి వెళ్ళిపోయింది.

## 40

తలత్ కేంబ్రిడ్జిలో చదువు పూర్తిచేసికొని ఫ్లీట్‌స్ట్రీట్‌లోగల ఒక పత్రికాకార్యా
లయంలో పనిచేస్తున్నది. ఆరోజుసాయంత్రం కాపీ క్రిందికిపంపించి తలత్
విక్టోరియావైపుకు వెళ్లిపోయింది. అక్కడ ఆమె ఒక పాత కళానికేతనంలో
విగ్రహాలుచేయడం నేర్చుకొంటున్నది. చీకటిగదుల్లో తిరుగసాగింది. 'లైఫ్'
తరగతిలో విద్యార్థులు ఉదాసీనంగా వుండే ఒక నీగ్రో అమ్మాయిని విసుగ్గా చూసి
చూసి నిర్లక్ష్యంగా గీతలుగీస్తూ వుండేవారు. పైన 'పోర్ట్రెయిట్' తరగతిలో ఒక
ఎర్రనిముక్కుగల ముసలిబిచ్చగాడు బీర్‌సీసా పుచ్చుకొని స్టూలుమీదకూర్చొని
వున్నాడు. ఎవ్వరిదీ నవ్వుమొఖంగా లేదు. దక్షిణఆఫ్రికాకుచెందిన ఎర్రనిగడ్డం
వాడు అక్కడవుండి మేండలీన్‌తీగలు వాయిస్తున్నాడు. అతడూ కళాకారుడే.
అతనికి తలత్ అంటే పరమ అసహ్యం. కోపంతో నమస్కారంచేశాడు. ఒక
చిరునగవు అతనిమీదకు విసరి రివ్వున తలత్ ముందుకు సాగిపోయింది.

ఇదొకరకం ప్రపంచం. ఇది విక్టోరియాలోగల పాత ఆర్ట్ స్కూలు. ఆమె
వెస్టెండ్ చేరుకొన్నది. హే మార్కెట్‌లో మెట్లుఎక్కి రచయితలు, కళాకారుల

క్లబ్బులోకి తొంగిచూసింది. అక్కడ ఆమెకు బిల్ క్రెగ్ కనిపించాడు. అక్కడ అతడు తన కష్టసుఖాలను బీరు గ్లాసులో ముంచుతూవున్నాడు. అక్కడేవున్న ఒక ఫ్రెంచి నవలారచయిత్రితో మాట్లాడుతున్నాడు. బిందెలకొద్ది సానుభూతి, మాన సికబంధుత్వం ఆ మహిళముఖం అతనిమీద కురిపిస్తున్నదా అన్నట్లున్నది. ఇది హే మార్కెట్‌లోగల రైటర్స్ అండ్ ఆర్టిస్ట్స్ క్లబ్బు. ఇదొక ప్రపంచం. గబ గబ క్రిందికిదిగి తలత్ రోడ్డుమీదకు చేరుకొన్నది.

తలత్, కమాల్ యిద్దరూ సెంట్ జాన్స్ వుడ్‌లో వుంటున్నారు. కమాల్ ఒక ప్రయోగశాలలో పనిచేస్తున్నాడు. ఆ పేటలో కళాకారులు, నటులు, రకరకాల బుద్ధిజీవులు వుంటున్నారు. వీధుల విరజిమ్మే చెట్లమాటున అక్కడక్కడ చర్చి గృహాలు వున్నాయి. రోడ్డుకొసన ఇటలీవాళ్ళ రెస్టారెంటు వున్నది. దానిముందు ఒక పోలీష్‌దేశపు కళాకారుడు భోజనానికికూర్చొని వెళ్ళేవాళ్ళ బొమ్మలుగీస్తూ ఎవరైనా వాటిని కొంటారేమోనని ఎదురుచూస్తూవుంటాడు. కాని ఎవ్వరూ అతను గీసే బొమ్మలు కొనరు. ఇక్కడివాళ్ళ జీవితాల్లో తుఫాను లెక్కువ. ప్రేమలు, విడా కులు, మానసికచిక్కులు, బ్లాక్ కాఫీ యివీ యిక్కడివారి జీవితాలవిశేషాలు. ఆడ పిల్లలు జుట్టు కత్తిరించుకొని, చెవులకు జిప్సీరింగులు పెట్టుకొని, బిగువైన నల్లని లాగులు తొడుక్కొని, తల్లిదండ్రులతో ఘర్షణపడి యిక్కడ తిరుగుతూవుంటారు. పదిహేను పద్దెనిమిది సంవత్సరాలవయస్సులోగల యువతీయువకులు కొందరు పెక్కుకు సంబంధించిన నవలలు వ్రాయడంలో లీనమైయుంటారు. వేదాంతులు, తర్కవితర్కాలు చేసుకొంటూవుంటారు. కొందరు మౌనంగా కూర్చొని ఏమేమో యోచిస్తూ వుంటారు.

సురేఖ రోడ్డు దాటుతూవున్నది. ఆమెభర్త గుల్షన్ ఆహూజా లండన్ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్‌లో చదువుతున్నాడు. సురేఖ భరతనాట్యంచేయడంలో చాలా కీర్తి నార్జించింది. ఆమె రాయల్ అకాడమీ ఆఫ్ డ్రెమెటిక్ ఆర్ట్‌లో 'కోరియో గ్రఫీ' (నాట్యాల నమూనాల చిత్రణ) నేర్చుకొంటున్నది. చోప్‌డా దంపతులు, సురేఖ గుల్షన్ పొరుగున వుంటున్నారు. ఆశా చోపడా విగ్రహాలు తయారుచేస్తూ వుంటుంది. సతీష్ బి. బి. సి. హిందీవిభాగంలో పనిచేస్తున్నాడు. శాంత, విలియం క్రెగ్‌కూడా యిక్కడే దగ్గరలో వుంటున్నారు.

అమలారాయ్, నర్గీస్ కొస్టి ధనవంతులపేటలో వుంటున్నారు. అమలారాయ్ తలత్, విర్మల యిరువురికి చిన్ననాటి స్నేహితురాలు. ఆమె యిల్లుకూడా లక్నోలో సింహాదేవాలీ భవంతికి, గుల్‌ఫిషాన్‌కు దగ్గరలోనే వున్నది. ఆమె యిప్పుడు ఇండియా ఫారెన్ సర్వీసులో వున్నది. ఫిరోజ్ స్విస్ కాలేజీలో వుంటున్నది. ఉర్దూలో పిఎచ్. డి. చేస్తున్నది. జరీనా యూనివర్సిటీలో రష్యన్, పార్సీ, ఉర్దూలో బి. ఏ.. ఆనర్సు చదువుతున్నది. వీళ్ళందరికీజీవితాలు నిండుగా తీరిక లేకుండగా వున్నవి. ఎప్పుడుచూచినా సమావేశాలు, నాటకాలు, రాజకీయజల్సాలు, గోష్ఠులు, ఇదొక ప్రపంచం. ఇది ఇండో పాకిస్థానీనగరం. ఒకరినొకరి నెరుగని ప్రపంచం; అవాస్తవిక ప్రపంచం.

# 41

చంప నర్గిస్ గదిలోప్రవేశించి వలువైపుల చూసింది. 'ఒకచీరె తీసియిమ్మని స్నానాలగదిలోనుండి నర్గిస్ ఆదేశించింది. మరోగదిలో శాంత ఒకేరికార్డును మాటిమాటికీ పెడుతున్నది. ఆరోజునే ఆమె వ్రాసిన క్రొత్తపుస్తకం అచ్చు అయి వచ్చింది. టిల్ క్రింద కోర్ట్‌యార్డులో గుల్షన్‌తోబాటు పచార్లు చేస్తున్నాడు. చంప అలమర తెరిచింది. సాయంత్రం తొడుక్కునే గౌను, చెప్పులు, చేతిసంచీ, ఒక వైపున దంతంతో తయారుచేయబడిన ఒక చిన్నమందిరం వున్నది. అందులో ఒక చిన్నవిగ్రహం వున్నది. పార్శీవాళ్లు ఎవర్ని పూజిస్తారో। చంప కాస్సేపు ఆలోచించింది. బహుశ జొరతుష్ట్రను పూజిస్తారేమో....ఏమో.

శాంత లోపలికివచ్చి నర్గిస్‌నిమిత్తం ఒక ఎర్రరంగుచీరె తీసింది. అలమరా మూసివేయమని చంప బిగ్గరగా అన్నది.

'ఆఁ, ఎవరికి చెబుతున్నావు!' అని అడిగింది శాంత.

'ఏమీలేదు. రోజూ ఎన్నిసార్లు నర్గిస్ యీ అలమరా తెరుస్తూవుంటుందా ఎన్ని రంగురంగులచీరెలు తీస్తుందా అని ఆలోచిస్తున్నాను.'

శాంతకు ఏమీ అర్థం కాలేదు.

'అత్తరుసీసాలు. పారిస్ లోపీలు. విగ్రహం ఒకటి మందిరంలో వున్నది.

'నీ అలమరాలోకూడా ఏమైనా విగ్రహం వున్నదా?' అని అడిగింది చంప.

'నా అలమరాలో గిపిన బొమ్మలు వున్నవి. నీకేమైనా పిచ్చివున్నదా!' అని అడిగింది శాంత.

'అవును. నీకు లేదా?'

'నీమాటలు పరిశుద్ధజ్ఞానపు అంచుల్ని స్పృశిస్తున్నాయి. అటు పోబోకు. దుఃఖ పడతావు.' అని అన్నది శాంత.

సురేఖ తెల్లవిచీరె కట్టుకొని జుట్టు చుట్టు తువాలుజుట్టి బైటికివచ్చింది. కిటికీ ముందునిలబడి డాబామీద తోటవైపు చూడసాగింది. 'జీవితం, జీవితం' అంటూ సంతోషంతో రెండుచేతులు గాలిలోకి చాచింది సురేఖ.

'జీవితం నాముందు భయపడి నిలబడింది. తెల్లని చీరెకట్టుకొని, నవ్వుతూ, గునగునలాడుతూ, భయపడుతూ, నడయాడుతూ, కదలాడుతూ, ప్రతిమాటకు రెండర్థాలు వచ్చేలా పలుకుతూ జీవితం నా ఎదుట వున్నది' అంటూ శాంతవైపుకు తిరిగిచూపింది. నేను నీవు ఎప్పుడూ భిన్నంగానే వుంటాము అని ఒకపర్యాయం గౌతం నీలాంబరునికి చెప్పాను.

'గౌతం యిప్పటివరకు చలామణిలో వున్నాడా?' అని బిగ్గరగా అడిగింది శాంత.

'ఏమిటి!' అని అన్నది కంగారుపడుతూ.

'ఏమీలేదు' అంటూ సిగరెట్టుముట్టించి వయ్యారంగా పొగ వదలడం ప్రారంభించింది. చంప ఎదురుగాకూర్చొని ఒకపుస్తకం చివరిపుటలు తిరగవేస్తున్నది. 'అది యింకా చలామణిలో వున్నదా లేక పుస్తకాలఅరలో పెట్టివేయబడిందా?'

'తెలియదు.'

'నీ సభ్యత్వపుగడువు దాటిపోయిందా?'

శాంతాక్రెగ్ గర్విష్ఠియేగాక అల్పురాలుకూడా.

'ఈ ప్రశ్న నిన్నే అడిగితే?' అని అన్నది చంప.

శాంత ఉదాసీనంగా చిరునవ్వు నవ్వింది. 'అతడికాంక్షల్ని త్రొక్కివేయడం నాకు యిష్టంలేదు. పైగా అతడు కవికూడాను' అని అన్నది.

'ఓహో అదా విషయం. నాకు తెలియదులే' అని అన్నది చంప వ్యంగ్యంగా.

'నీకు ఎలా తెలుస్తుంది? నీవు నీ ఊహాలోకంలో విహరిస్తూ వుంటావుకదూ। మనుష్యులు బలికోరుతూ వుంటారు. నిన్ను నీవు బలిచేయందే అతణ్ణి పొంద లేవు. నీవు పారిస్‌నుంచి యిక్కడికి నీ విద్యా సంవత్సరం సగంలో వదులుకొని ఎందుకు వచ్చినట్లు? అతగాడు యిక్కడ వున్నాడనికదా?' అని అన్నది శాంత సూటిగా.

'ఏమిటీ వాగుడు? నీ కెవరు చెప్పారు అబద్ధాలు' అని కోపంతో అన్నది చంప యిక ఎక్కువ అవమానం చేయించుకోవడం యిష్టంలేక.

'అతడు అడవిబాతు వంటివాడు. అతనివెంట బడటం అడవిబాతువెంట పడ టంతో సమానమే' అని అన్నది కోమలకంఠంతో శాంత.

'కథలు వ్రాస్తూవుంటావుకదూ। అందువలన నన్నుగురించికూడా పగ్గాలు లేకుండా కల్పనల్ని పరుగెత్తిస్తున్నావు' అని అన్నది చంప.

'బిల్ నిన్ను వృద్ధిలోకి తీసుకురావాలని చూస్తున్నాడు' అని అంటూ వెళ్లి చలికుంపటిమీద పెట్టివున్న బొమ్మల్ని చూడసాగింది.

తహమీనా రజా, నిర్మలా శ్రీవాత్సవ, శాంతాక్రెగ్.

'ఓహో యిదా సంగతి।' అంటూ చంప కోటు, చేతితొడుగులు తీసికొని లేచి నిలబడింది. 'నిజంగా నన్ను అసహ్యించుకోవల్సిందే. యిక వెళతాను. వర్గిస్, సురేఖ, శాంత.... సెలవు. నేను రేపు ఆఫీసుకురాను. అంటూ ద్వారందగ్గరకు వెళ్ళి వెనక్కుతిరిగి 'రేపే కాదు యిక ఎప్పటికీ మీ ఆఫీసుకు రాను. శలవు' అంటూ చంప బైటకు వెళ్ళిపోయింది.

బయట చినుకులు పడుతున్నాయి. త్వరత్వరగా నడచి చంప యిల్లు చేరు కొన్నది. తలుపులు తెరిచేసరికి ఎదురూగా ఫ్రిల్ వ్రాసినజాబు పడివున్నది. 'న్యూ హమ్‌లో నీకు సీటు దొరికింది. సెప్టెంబరులో నీవు యిక్కడకు రావాలి. వేసవి కాలపుమాసాలు కొద్దిగా మిగిలివున్నాయి. ఏ రొమాంటిక్ ఇటాలియన్ పట్టణం లోనో, స్పెనిష్ పట్టణంలోనో యీ మాసాలు గడిపిరా. నేను ఉత్తరాదికి వెళు తున్నాను. రోజ్‌మారీకి జబ్బుగావున్నది' అని ఆ జాబులో వ్రాశాడు ఫ్రిల్.

....రోజ్‌మారీ??

# 42

'కోహినూర్' కిటికీదగ్గరగావున్న బల్లమీద గౌతం నిర్మలకు ఎదురుగా కూర్చొని బయట కురుస్తున్నవర్షాన్ని చూస్తూవున్నారు. 'క్షమించండి' అంటూ కమాల్ లేచి ఎవరో మిత్రునితో మాట్లాడేందుకు మరో బెంచీదగ్గరకు వెళ్ళిపోయాడు.

'నీవు చంపనుగురించి అన్నమాటలు విని దుఃఖం కలిగింది' అని అన్నాడు గౌతం. ఇంకా అతడు చంపనుగురించి ఆలోచిస్తున్నాడు: నిర్మల దుఃఖం దిగ మ్రింగుకున్నది. ఆమె ఏమీ మాట్లాడలేదు.

'మీరంతా. ఆమెను తప్పుగా అర్థం చేసికొన్నారు. ఆమె ఎన్నడూ సయ్యద్‌ను తహమీనాకు దక్కకుండాచేయాలని భావించలేదు' అని అన్నాడు ఆవేశంతో.

'నా అభిప్రాయం నాది. ఇక మనం చంపాబాజీనిగురించి చర్చ ఆపివేద్దాం' అంటూ నిర్మల బాగ్‌లో ఏదో వస్తువుకోసం వెతకడం ప్రారంభించింది. 'మీ దృష్టిలో ఆమె ఉత్తమురాలు అయితే కావచ్చును. కాని చిన్నప్పటినుండి ఆమె ఏమిటో మాకు తెలుసు' అని అన్నది నిర్మల.

'నీవు ఎప్పుడూ చిన్నతనం చిన్నతనం అని అంటూవుంటావు. మంచి ఉపాయమే నేర్చావు. విన్ను. చంపా అహమద్‌ను చిన్నప్పటినుండి ఎరగనివాళ్లంతా గాడిదలతో సమానమన్నమాట.'

గౌతంమీద నాలుగువైపులనుండి వెలుగు వచ్చిపడింది. నిర్మలకూడా గౌతం ఎదురుగా దీపాలకాంతిలో వున్నది. ఏమనుకొన్నాడో ఏమో వెంటనే గౌతం స్విచ్చి నొక్కాడు వెలుగు తగ్గింది.

'మనిషి నడవడినిగురించి కఠినంగా విమర్శించే గౌతం చంపవంటిమనిషిని గురించి గొప్పగా భావిస్తున్నాడేమా అని నిర్మల విస్తుబోయింది.

'నిర్మలా! నీకు కలిగిన అపోహను పోగొట్టదలుస్తున్నాను. చంప అంటే నాకు ఏమీ యిష్టంలేదు. నిన్ను నేను పెళ్లిచేసికొందా మనుకొంటున్నాను. నిజం' అని అన్నాడు గౌతం.

'వద్దు గౌతం. వద్దు క్షమించు.'

'నిర్మలా! నన్ను అర్థంచేసికో' అని అన్నాడు. అతనిస్థితి బడిపిల్లవానిలా వున్నది. మొగవాళ్ళు తెలివిగలవాళ్లని ఎవరంటారు? వాళ్ళకంటె మించిన మూర్ఖులు ఎవ్వరూ వుండరు. నిర్మలకు ఆశ్చర్యం కలిగింది. తనలో జ్ఞానం పెరిగిన ట్లనిపించింది. గౌతం నీలాంబర్, నీకు ధన్యవాదాలు. నిన్ను పెండ్లి చేసికోగలిగితే ఎంతో సంతోషించేదాన్ని. కాని నాకు జ్ఞానోదయం కలిగింది. చంపా అహమ్మదును పూజించు. నీకుకూడా ముక్తిమార్గం ఆమెదయవల్ల కలిగితే కలుగవచ్చును.

ఆరోజురాత్రి నిర్మలకు తీయబడిన ఎక్స్‌రే సమాచారం వచ్చింది. ఆమెకు ఊపిరితిత్తుల క్షయ వున్నదని ఆ సమాచారంవలన బయటపడింది.

# 43

చంప కేంబ్రిడ్జి చేరుకొన్న సంవత్సరంలోనే తలత్, నిర్మలలు అక్కడినుండి వెళ్ళిపోయారు. ఇప్పుడు ఆమె పెద్దకుటుంబాలకుచెందిన ఆంగ్లబాలికల్లా ఇంగ్లీషు మాట్లాడుతున్నది. వాళ్ల ఉచ్చారణ బాగా అలవాటుచేసికొన్నది. కేంబ్రిడ్జిలోని బుద్ధి వక్రతనుకూడా అలవర్చుకొన్నది. అద్దంముందునిలబడి ఆలోచిస్తున్నది—చంపా అహమద్ ఎక్కడ వున్నది? ఆమె ఒక హితోపదేశానికి, జపమాలకు సంబంధించిన కథమాత్రమే. వసంత కాలేజీలో చదివే ఆ అమ్మాయి ఎక్కడకుపోయింది? అమిర్‌రజా గుల్‌ఫిషాఁలో కూరలు తరగుతూంటే చూసిన ఆ అమ్మాయి ఏమైపోయింది? అని అనుకొంటూవుంటుంది. చలనచిత్రతారల్లా ముస్తాబుకావడం, సాయంత్రం అయ్యేసరికి వేషం మార్చడం, ఏదో ఒక అమ్మాయిని వెంటబెట్టుకొని సినిమాలకు వెళ్ళడం యిదీ ఆమె నిత్యకృత్యం.

ఒక సెలవురోజున చంప యితర యువతీయువకులతోబాటు ఒక పల్లెటూరి టీ తోటలో కూర్చొనివున్నది. ఇటలీవిద్యార్థి ఎంజెలో గిటార్ వాయిస్తున్నాడు. దగ్గరలోనే పడకకుర్చీలోకూర్చొని మైకేల్ యాపిల్‌మొగ్గలను వాసన చూస్తున్నాడు. తాను ఇంగ్లండువదలి ఇజ్రాయిల్ వెళ్లిపోతానని అతడు వెల్లడించాడు. జాతీయసమస్యల్నిగురించి గంటకుపైగా తీవ్రమైన చర్చలుజరిపి అంతా అలసి

బోయి టీ కోసం ఎదురుచూస్తున్నారు. 'ఈ మంచి ఇంగ్లండుదేశాన్నివదలి ఇజ్రాయిల్ ఎడారుల్లో రాళ్ళుకొట్టి రోడ్లువేస్తాను' అని అన్నారు. 'మైకేల్, నీవు ఆపని చేస్తావని నాకు బాగాతెలుసు'నని అన్నారు ఫ్రిల్. విశ్వవిద్యాలయానికిచెందిన చాలా మంది ప్రొఫెసర్లు, వైజ్ఞానికులు, గాయకులు యిప్పుడు ఇజ్రాయిల్‌లో రోడ్లు నిర్మిస్తున్నారు' అనికూడా అన్నారు.

'భావంలోనే గొప్ప శక్తివున్నది. కవుల కవిత్వాలు అందుకు నిదర్శనం' అని అన్నాడు దేవిస్.

'శక్తివల్ల నష్టం కలుగుతుంది' ఫ్రిల్ ఖిన్నవదనంతో అన్నాడు. ఎదురూగా ఒక కారువచ్చి ఆగింది. గౌతం నీలాంబర్, కమాల్, తలత్ యింకా కొంతమంది కారుదిగి టీ కొట్లోకి వచ్చారు. వాళ్లు పళ్లతోటలో కూర్చున్నందువ యితరుల్ని చూడలేదు.

'గౌతం నీలాంబర్‌కూడా నష్టం కలిగించేశక్తి. అతడి భావనాబలం చాలా గొప్పది. నెహ్రూగారి భారతదేశం—' అని అన్నాడు రోషన్.

'కొత్త భావనసరళిలోగల 'దేశాభిమానమువలన కలిగిన యుద్ధప్రీతి' (షోవనిజం) అన్నిటికంటె భయంకరం' అని అన్నాడు ఫ్రిల్. 'మీ దేశపు హైనిజం, పాకిస్తాన్‌వాళ్ల ఇస్లాం. ప్రాచీన భారతీయసంస్కృతి పునర్నిర్మాణం అన్నీ ఒకటే రకం.'

'ఆర్థికాభివృద్ధికి మతానికి సంబంధం లేదనువిషయం పాకిస్తానువాళ్ళకు బోధపడదు' అని అన్నాడు గుల్షన్.

'ఈనాటిప్రపంచం ద్వేషం, అసహ్యం అనే పడుగుపేకలమీద బ్రతికివున్నది. అంతా అసహ్యమనే మనస్తత్వమే. ప్రపంచానికి ఆధారం ప్రేమఅని జీసస్ తప్పు చెప్పాడు. మనమంతా అడవిమృగాల్లా ఒకరినొకరం తింటున్నాం. అసలు సత్యం యిది' అని అన్నాడు దేవిస్.

'నేను అడవిమృగాన్నా? హైఫావెళ్లి రోడ్లనిర్మాణం చేద్దామని అనుకొంటున్నాను' అని అన్నాడు మైకేల్.

'ఈ ప్రపంచంలో జరుగుతున్న 'ప్రచారం' అంతా ఒక్కరోజువైనా పూర్తిగా ఆగిపోతే ఎంతో శాంతి లభించును' అని అన్నది చంప.

'ఇది పార్థ్యమా! ఉదయం సాయంత్రం మేము గోబెల్సుపటానికి పూజ చేయాలి. నీవు గాంధీనిగురించి చెబుతావు. మా యుగంలో గొప్పవ్యక్తి దేవదూత గోబెల్సు. డాక్టర్ గోబెల్స్ జిందాబాద్' అని అన్నారు గుల్షన్.

'నిజానికి మనమంతా అచేతనమనస్సు రీత్యా నియంత్రృపరిపాలనావాదులము. మనం అందరినాశనం కోరుతున్నాం. ప్రేమజీవుల 'మృత్యుకాంక్ష'నుగురించి నాకు బాగా తెలుసు' అని అన్నారు దేవిస్.

'ఈ అందమైన పూతోటలు నష్టంకావడం నాకు యిష్టంలేదు' అని అన్నది చంప.

'మనమంతా ముసుగులోనున్న నియంత్రృపరిపాలనావాదులం. మనందరిచేతుల్లో కంటికి కనబడని తుపాకులు వున్నాయి. ఒకరినొకరం హతమార్చుకొనేందుకు సద్ధంగా వున్నాం. అభిప్రాయాలనేవే ఆ తుపాకులు. ముసలమ్మలుమాత్రమే శాంతిని కోరుతారు. ప్రపంచానికి ముసలమ్మలు అక్కరలేదు' అంటూ దేవిస్ చంపవైపు చూదాదు. దేవిస్‌కళ్ళకు చంప ఒక ముసలమ్మలా, దుఃఖపడుతున్న అమ్మలా కనబడింది.

'మమ్మల్ని నాశనంచేస్తూవచ్చారు. అయినా నా బంధువుల శవాలగుట్టలపై కూర్చొని మీకోసం సంగీతం పాదాను. భావనాదీపాలు వెలిగించాను. నేను అడవి మృగాన్నా!' అని అన్నాదు మైకేల్.

'రోడ్లు నిర్మించాలని అనుకొంటున్నావు. అనుమతిస్తున్నాం. మైకేల్ నీ యిష్ట ప్రకారం నదుచుకో' అని అన్నారు దేవిస్.

'ఇతరుల భావనాసరళికి అడ్డంకి కల్పించడం గొప్ప దోషం. అందువలన నేను అనుమతిస్తున్నాను' అని అన్నాదు ప్రిల్.

ఎంజెలో గిటార్ ప్రక్కనబెట్టి 'మైకేల్, నీవు యూదుజాతీయుడివి. దానితో బాటు ఇంగ్లీషువాడివికూడా. నీవు బాంబులకురిపించే విమానాలద్వారా నా దేశం మీద బాంబులువేసి నాశనం చేశావు. అయినా నిన్ను క్షమిస్తున్నాను' అని అన్నాదు.

'మైకేల్! నీవు యూదుజాతీయుడివి. కాని నిజానికి నీవు ఇంగ్లీషువాడివి. కనుకనే నిన్ను నీవు మాకంటె గొప్పవాడినని అనుకొంటున్నావు. ఇప్పుడు నీ యిష్టప్రకారం ఆసియావాసివి కావాలని అనుకొంటున్నావు. పాలస్తీనులో నీ

వ్రేళ్ల పాతుకొనివున్నాయని అనుకొంటున్నావు. నిజానికి నీ వ్రేళ్ళు పాతుకొని వున్నది గోల్డర్స్ గ్రీనులో. అయినా నిన్ను క్షమిస్తున్నాం' అని అన్నది మరేణు.

వాలుగునైపుం విచిత్రమైన మౌనం వ్యాప్తమైంది. చెట్లమీద పిట్టకోకచిలుకలు ఎగురుతున్నాయి. ఎదురుగానున్న నదిలో ఒక పడవ వెళ్లిపోయింది. ఎంజెలో మళ్ళీ గిటార్ వాయిచడం ప్రారంభించాడు.

గౌతం పీలాంబర్, అతని అనుచరులు టీ కొట్లో ప్రవేశించారు. కొన్నిజాబులు తపాలాపెట్టెలో వేయమని గౌతం బంట్రోతుకి యిచ్చాడు. అతను లండనుమంచి వస్తున్నాడు. లిడ్‌హర్టు వెళుతున్నాడు. బిల్‌కూడా వాళ్ళవెంట వున్నాడు. కాంత, తలత్, నర్గిస్‌కూడా వెంటవున్నారు. వాళ్లకూడా ఏదో విశ్వవ్యాప్తమైయున్న సమస్యను పరిష్కరించడంలో మునిగివున్నారు. కమాల్ కిటికీలోనుంచి బైటకు తొంగి చూశాడు. బైట నది కనిపిస్తూంది. ఇంతలో తలత్ కిటికీదగ్గరకువచ్చి 'బయట చంపాబాజీ, ప్రిల్ వగ్గైరాలు కూర్చొనివున్నారు' అని అన్నది పెద్దగా.

వాళ్ళంతా నిర్మలను చూసేందుకు శానిటోరియం వెళుతున్నారు. శానిటోరియంలో నిర్మలచేరి మూడుసంవత్సరాలైంది. ఆమె ఊపిరితిత్తి కొకదానికి ఆపరేషన్ జరిగింది. ఆమెకు వైద్యం చేస్తున్న డాక్టర్ సర్ రొనాల్డ్ గ్రే మాటప్రకారం నిర్మల పూర్తిగా కోలుకొంటుంది. శనివారంనాడు స్నేహితులు ఆమెను చూసేందుకు లండనునుండి వస్తూవుంటారు. అవకాశం దొరికినప్పుడల్లా గౌతం పీలాంబర్ కమాల్, తలత్‌లతోబాటు నిర్మలను చూసేందుకు వెళుతూవుంటాడు. ఆమెకు ఆపరేషన్ జరిగేటప్పుడు హరిశంకర్‌కూడా వాషింగ్టనునుండి వచ్చాడు. గౌతం నిర్మలవిషయంలో అతిశ్రద్ధగా వున్నాడు. గౌతం నిర్మలలు ఆ తరువాత ఎన్నడూ చంపమగురించి చర్చ జరుపలేదు. జీవితాలు క్షణం తీరికలేకుండా వున్నాయి. పరిచయాలనుకూడా మరిచిపోయేస్థితిలో వున్నాయి జీవితాలు. ఎవ్వరికీ తీరిక లేకుండాపోయింది.

గౌతం యిప్పుడు చాలా ప్రసిద్ధికెక్కాడు. అతడు హిందూదేశపు విదేశాంగ విధానాన్నిగురించి, ఆర్థికసమస్యలనుగురించి రెండుపుస్తకాలు వ్రాశాడు. ఆ పుస్తకాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. అతనిపేరు బాగా ప్రఖ్యాతి గాంచింది.

నిర్మలకు వచ్చినజబ్బు, గౌతం పీలాంబర్‌జీవితంలో చాలామార్పు తీసికొని వచ్చింది. మానవుడి నిజమైన నరకం అతని ఆత్మ. అందు ఏ యే ప్రపంచాలు

వుంటాయో, అందు ఎవరెవరు నివసిస్తూవుంటారో ఎవ్వరికీ తెలియదు. గౌతం పీతాంబర్ఆత్మలో ఏ యే తుఫాన్లు వీస్తున్నాయో ఎవ్వరికీ తెలియదు. అతని హృదయంలో ఏ అమ్మాయి నివాసం ఏర్పాటుచేసికొన్నదో ఎవ్వరికీ తెలియదు. బహుశ అతనికికూడా తెలియకపోవచ్చు.

ఇంతటి నాజూకైన జీవితమనే వంతెనమీద నిర్మల నిలబడివున్నది. గోపికా హృదయంకూడా మహత్తరమైనదే. అదే ప్రపంచానికంతటికీ కేంద్రం.

'చంపాబాజీ బయట పార్కులో కూర్చొనివున్నది. పదండి పోదాం. ఆమెను చూసి చాలారోజులైంది' అని అన్నది మళ్ళీ తలత్.

గౌతం గడియారంచూసి 'వద్దు. మనం తిన్నగా లిద్‌హర్ట్స్ వెళదాం. వెంటనే బయలుదేరకపోతే తిరిగి రావడం ఆలస్యమైపోతుంది' అని అన్నారు.

అంతాలేచి బయటికి వచ్చారు. కారెక్కి లిద్‌హర్ట్స్‌కు బయలుదేరారు.

• • •

కారు వెళ్ళిపోవడం చంప గమనించింది. ఎంజెలో గిటార్ వాయిస్తున్నాడు. మైకేల్, దేవిస్, సురేఖ, గుల్షన్ నదివైపు షికారుకు వెళ్లిపోయారు. పడకకుర్చీ మీదనుండి వంగి చంప గడ్డిపరక తీసి తుంచింది. 'ఏమిటి ఆలోచిస్తున్నావు?' ఎదురుగా పడకకుర్చీమీద కూర్చొని ఫ్రిల్ అడిగాడు. అతడు ఎండ తగలకుండా వార్తాపత్రికను మొహంమీద కప్పుకొనివున్నాడు.

'ఏమీ లేదు.'

'నీ స్నేహితులంతా కారులో వెళుతున్నారు కదూ!'

'అవును.'

'నిన్ను నీవు 'గుంపు'లో కలుపుకోవు. కాని 'గుంపు'లంటే నీకు యిష్టం. గత కాలంలో మీరంతా కలిసివుండటమే అందుకు కారణం అని అనుకొంటాను. పరస్పరవిరుద్ధమైన విషయాలకు నీవు నిలయానివి. నిన్నుచూస్తుంటే నాకు బాధగా వున్నది' అని అన్నాడు ఫ్రిల్.

'ఇటాలియన్లవలె మాటాడకు' అని అన్నది చంప.

'నీతోటి యిదొకబాధ. ఎవరైనా స్వయంగావస్తే గట్టిగా తలుపు మూసివేస్తావు. వినికిదానా! నీ బలహీనతలేమిటో తెలుసుకో. తరుచు నీవు అబద్ధాలాడుతావు. ఈర్ష్యపడతావు. ఇతరులు సంతోషంగావుంటే మండిపడతావు. ప్రతిక్షణం యాత

రులమీద నీ ప్రభావం పడవేయాలని చూస్తుంటావు. ఇతరులు నీకంటె గొప్పగా బాగావుంటే చూసి సహించలేవు. చంపా! కాలచక్రం బలవత్తరమైనది. మనం ఏంచేయాలో తెలుసుకోలేము. తరువాత మన కాలం గడచిపోతుందని బాధపడ తాము. నీవుకూడా సుజాతా ముఖర్జీలా కాబోకు. నీవు ఒక సంస్థగామారడం నాకు యిష్టంలేదు. పదిసంవత్సరాలతరువాత కళాకారులకు, బుద్ధిజీవులకు పోషకురాలుగా. గురువుగా మారిపోయేలా వున్నావు. భగవంతుడా! ఇలా నిన్నుగురించి తలచు కుంటేనే నాకు భయం వేస్తుంది' అని గబగబ అన్నాడు ప్రిల్.

'నేను యింతదయకు పాత్రురాలినా?

'కాదు మనమంతా దయకుపాత్రులమే. ఇన్నివిషయాలువున్నా నీవు చాలా మంచిదానివి అందంగా వుంటావు. నీది మంచిహృదయం. ఇది గొప్పవిశేషం. ఇతరుల్ని క్షమించే గొప్పతనంకూడా వున్నట్లున్నది. వున్నదికదూ!'

'ఉండొచ్చు.'

అతడు ఏమీ మాట్లాడలేదు. చిన్నచిన్న చినుకులు పడసాగాయి. ఇద్దరూలేచి టీ హౌసులోపలికి వెళ్లారు. మైకేల్, అతనితోబాటు వున్నవారు ఒక లాంచిమీద కూర్చొని కనబడుతున్నారు. గౌతం నీలాంబర్ మరిచివెళ్ళిన కొన్నికాగితాలు, పత్రి కలు ప్రక్కనే సోఫాలో పడివున్నాయి.

'నీవు స్నేహం చేయగలవు. లేకపోతే ముక్కలుముక్కలై పోయి వుండేదానివి యీ కాగితం ముక్కల్లాగా' అంటూ ప్రిల్ అక్కడ పడియున్న ఒక కవరుతీసి చూపించాడు. ఆ కవరుమీద గౌతం నీలాంబర్ అడ్రసు వ్రాసివున్నది. ప్రిల్ ఆ కవరును మడిచి విస్కీలకుంపట్లో పడవేశాడు.

'ప్రిల్! నేను పెద్దవెలుగులో వున్నానుకదూ!'

'ఇతడంటే నీకు చాలా యిష్టంకదూ!'

అమీర్‌రజానుగురించి ఆనాడు గౌతం నీలాంబర్ యిలాంటిప్రశ్నలే వేశాడు.

'ఇతడు నిన్ను కలవనైనా కలవడేం?' అని అడిగాడు ప్రిల్.

'తెలియదు. అతణ్ణి కలుసుకొనేందుకు నాకు వ్యవధిలేదు' అని అన్నది చంప.

'అదుగో, మళ్ళీ అబద్ధాలాడుతున్నావు.'

చంప ఎత్తైన పర్వతశిఖరంమీద నిలబడివున్నది. ప్రపంచానికంతటికి స్పష్టంగా పూర్తిగా ఆమె కనబడుతున్నది. ఇలా అయిపోయినానేమిటి అని బాధపడింది

లోలోన. కాని సమయం యిప్పటికే చాలా మించిపోయింది. ఇప్పుడు యిక ఏమిటి చేయడం? ఇప్పటికే సమయం మించిపోయింది....మించిపోయింది.

బయట వర్షంలో కార్లువచ్చి ఆగాయి. కొంతమంది ప్రసిద్ధికెక్కిన షేక్స్పియర్ నాటక అభినేతలు లోపలికి వచ్చారు. వాళ్ళలో ఒకనటుడు ప్రిల్‌కు బాగా తెలుసు. అంతా చలికుంపటి దగ్గరకువెళ్ళి కూర్చున్నారు. మరోరకమైన మాటలు ప్రారంభమైనాయి.

*      *      *

లిడ్‌హర్ట్స్ శానిటోరియం వందలాది ఎకరాలచోటులో వున్నది. రకరకాల సువాసనలు విరజిమ్మే పూల మొక్కలు వేలాదిగా వున్నాయి. వర్షంలో శానిటోరియం ప్రశాంతంగా తడుస్తూ నిలబడివున్నది. హృదయాల్ని ఆకర్షించే యీ స్వర్గంలో రోగులు విశ్రాంతిగాకూర్చొని టెలివిజన్‌చూస్తూ మృత్యువుకోసం ఎదురుచూడటమో, లేక జబ్బు నయమైపోగానే బయటిప్రపంచంలో ప్రవేశించేందుకు ఎదురుచూడటమో చేస్తూవుంటారు. నిర్మలగది ఆ భవనాలలో ఒకప్రక్కన వున్నది. తలగడలసాయంతో సగం పడుకొని సంతోషంతో అందరినీ చూస్తున్నది.

కమాల్, టిల్‌తోబాటు నిర్మల మంచానికి రెండోవైపున శాంత కూర్చొని వున్నది. గౌతం పెద్ద పూలకుండీదగ్గర కూర్చొనివున్నాడు.

'గౌతం! క్రొత్తవిషయాలు మాట్లాడుదాం' అని అన్నది. గౌతం లేచి నిర్మల దగ్గరకువచ్చి కిటికీలో కూర్చున్నాడు.

'సభలు సమావేశాలు జరుగుతున్నాయా?' అని అడిగింది నిర్మల.

'బ్రహ్మాండంగా జరుగుతున్నాయి' అని అన్నది తలత్. కొద్దిసేపు ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. మూడుసంవత్సరాలబట్టి నిర్మల సభల్లో పాల్గొనడంలేదు. 'వచ్చే సంవత్సరం దేవుడు మేలుచేస్తే నీ నాయకత్వాన సభలు జరుగవచ్చు' అని అన్నాడు కమాల్.

'ఇం షా అల్లాహ్' అని చిరునవ్వు నవ్వింది నిర్మల.

'నిన్న సయ్యద్ కలిశారు. ఇవాళ నీదగ్గరకు వెళతానని అన్నారు' అని అన్నాడు గౌతం.

'పాపం, సయ్యద్ చాలాపర్యాయాలు వచ్చారు. ఆడపిల్లలతో ఆయన వ్యవహారం ఎలా సాగుతోంది?' అని అడిగింది నిర్మల.

'బ్రహ్మాండంగా సాగుతోంది' అని సమాధానం చెప్పింది తలత్.

'అదుగో మళ్ళీ 'అపనింద' ప్రారంభమైంది' అని అన్నాడు కమాల్.

'లేదు. ప్రొఫెసర్ టోయిన్బీనిగురించి చర్చించబోతున్నాను' అని అన్నది భయపడుతూ తలత్.

'వారిని సభకు ఆహ్వానించావా?' అని అడిగాడు గౌతం.

'అవును. స్టీఫెన్ స్పెండరునుకూడా పిలిచాను' అని అన్నది తలత్ నెమ్మదిగా.

'ఇది అమ్ముడుబోయిన, కొనబడిన బుద్ధిజీవుల యుగం. ఈ యుగంలో కళాకారులవిలువ బాగా పెరిగిపోయింది. ప్రపంచంలో కళాకారులకు విలువలేదని ఎవరనగలరు? ఆసియాఖండపు ఎంతమంది కళాకారులు రకరకాల ఉచిత విద్యార్థి వేతనాలమీద అమెరికా వెళుతున్నారో చూడండి.' అని అన్నాడు గౌతం.

'ఆసియాఖండపు కళాకారులు గడగడ సోవియట్ యూనియన్, చైనాదేశాలకు కూడా వెళుతున్నారుకదా!' అని అన్నాడు బిల్. అతను నిష్పక్షపాతంగా మాట్లాడే వ్యక్తి.

బయట దేవదారుచెట్లమీద ఎరుపుదనం వ్యాప్తమైంది.

'ఇక బయలుదేరుదాం లండను చేరుకొనేసరికి బాగా ప్రొద్దుపోతుంది' అని అన్నాడు గౌతం.

'మీరంతా వెళ్ళిపోతారా! నేను ఒంటరిగా మిగిలిపోతాను' అని అన్నది నిర్మల.

'నీవు ఒంటరిగా లేవు. మేమంతా ప్రతిక్షణం నీవెంట వున్నాం' అని అన్నాడు కమాల్.

'నిర్మలా! వచ్చేవారం నేను బహుశ రాలేను. పండిట్ నెహ్రూజీ ఏదో సమావేశంకోసం ఢిల్లీనుండి వస్తున్నారు.' అని అన్నాడు నెమ్మదిగా గౌతం.

'అవును. నాకోసం మీపని చెడగొట్టుకోవద్దు' అని అన్నది నిర్మల.

అంతా బయటకువచ్చారు. కిటికీదగ్గరనిలబడి వెళ్ళిపోతున్న వాళ్లనందరినీ చూస్తూవున్నది నిర్మల. అంతా దేవదారువృక్షాలలో కలిసిపోయి కనబడనంతవరకు అలాగే నిలబడివున్నది.

వర్షం ఆగిపోయినతరువాత చంప, ఫ్రిల్ యిద్దరూ టీ హౌసునుండి బయటికి వచ్చారు. లాంచి ఎక్కి అంతా కేంబ్రిడ్జి చేరుకొన్నారు. త్రోవలో నది పచ్చపచ్చని తోటలమధ్యగా ముందుకు ప్రవహిస్తున్నది. చెట్లకొమ్మలు నదిమీద చల్లనినీడ కల్పిస్తున్నాయి. 'ఏన్నాటినుండి పిలవలు కదూ!' అంటూ చంప ఫ్రిల్‌వైపు చూచింది. ఇక మాట్లాడేందుకు విషయం ఏమీ మిగులలేదు. చంపను ఫ్రిల్ బాగా అర్థం చేసుకొన్నాడు. చంపకూడా అతణ్ణి బాగా అర్థం చేసుకొన్నది. నిజంగా దుఃఖకరమైనవిషయం. ఇక ఏ అడవుల్లోకి వెళ్ళి దాగాలి!' 'బృందావనవాటికలో, నా మనమందిరమున నల్లనివాడు విహరించునులే' అంటూ కటకటాలమీద వంగి ఆమె ఒక పాతపాట నెమ్మదిగా పాడసాగింది.

రెండోరోజున 'బోటు హౌసు' క్రిందకువచ్చి కూర్చున్నారు. ఫ్రిల్ గోధుమ రంగుజుట్టు గాలిలో రెపరెపలాడుతున్నది. ఆ జుట్టుతో ఆమెకు అమిత దగ్గర పరిచయం వున్నట్లనిపించింది. సామాన్యంగా భర్త జుట్టుతో భార్యకు అటువంటి పరిచయం వుండవచ్చు. ఆమెకు ఒళ్లంతా కలవరం వచ్చినట్లనిపించింది. అతడు తన భర్తకాదు, మరోఅమ్మాయి, మరో ఆడదాని భర్త. ఆ అమ్మాయిని చంప యీనాటివరకు చూడలేదు. ఆమె మనస్సుమీద మళ్ళీ నీడలు క్రమ్ముకొన్నాయి. ఒడ్డున పడవలు నిలచివున్నాయి.

'చంపా! నీ గతాన్నిగురించి చెప్పు' అంటూ తిరగబడివున్న డింగీమీద కూర్చొని ఫ్రిల్ ప్రశ్నించాడు. దూరదేశాన్నుండి వచ్చిన ఒక పరాయి ఆడమనిషి ఒంటరిగా తన ఆధారంమీద అక్కడ కూర్చొనివున్నదని అతడు గ్రహించాడు. నిజానికి ఆమెకు రక్షణలేదు. గతకాలంలోనే ఆమె సురక్షితంగావుందని చెప్ప వచ్చు. ఆమెకు ప్రపంచమంటూ ఏమీ వున్నట్లేలేదు. ప్రపంచం త్వరత్వరగా మారిపోతుంది. ఈ అమ్మాయి తనకు చాలా దగ్గరకు వచ్చినట్లనిపించింది. రోజ్ మారీ తనకు దూరమవుతున్నట్లుకూడా అనిపించింది. దానితో అతడు కంగారు పడ్డాడు. చంప అహమద్‌తో తనకు అదృశ్యసంబంధం ఏర్పడుతున్నట్లు తోచింది.

'నీవుకూడా నామీద నవల వ్రాస్తావా?' అని అడిగింది చంప.

'లేదు. మరెవ్వరైనా వ్రాస్తానన్నారా?'

'అవును బిల్ - విలియమ్ క్రేగ్ వ్రాస్తానన్నాడు.'

'నేను నీకు విచిత్రంగా కనబడుతున్నానా?'

'నీవు అంత అద్భుతమైనదానివి కావు. నీలాంటి యువతులు చాలామంది వున్నారు. తెలివిగలవాళ్లు, మెత్తనిస్వభావంగలవాళ్లు, హృదయాలను ఆకర్షించే వాళ్ళు చాలామంది వున్నారు.'

'పై మూడుగుణాలలో నే నా పరిచయం యిమిడివున్నది' అని చంప లోలోన అనుకొన్నది. కళ్లమూసుకొని తన గతచరిత్రను జ్ఞాపకం చేసికొన్నది. వారణాసికోగల తమ యిల్లు, కోర్టు కాగితాలు పరిశీలిస్తూ కూర్చున్నతండ్రి, యింటి ముందువున్న మంచాలు అన్నీ జ్ఞాపకం వచ్చాయి. ఈ వివరమంతా ఫ్రిల్‌కు చెప్పడానికి ఆమెకు మనస్కరించలేదు. వాటినివాటి ముందుకు పొగింది. లక్నో, ఐ.టి. కాలేజి, కైలాస్ హాస్టలు, గుల్‌ఫిషాఁ జ్ఞాపకం వచ్చాయి. గుల్‌ఫిషాఁ తనని కాదు. (ఆమె పరేనంటే అది తనదే అయివుండేది.)

'నీ గతచరిత్రలోనుండి ఎవరో వస్తున్నారు అటుచూడు' అని అన్నాడు ఫ్రిల్.

చంప తల పైకెత్తిచూసింది. ఒడ్డున షికారుకోసంవచ్చిన వేలాదిజనంలో నుండి కమాల్ బయటకువచ్చి తామువున్న బోటుహౌస్‌పైపువస్తూ కనబడ్డాడు.

'హలో చంపాబాజీ! హలో ఫ్రిల్' అంటూ కమాల్ దగ్గరకు వచ్చాడు.

'హలో.'

'నిన్నఉదయం మిమ్మల్నిద్దరినీ రోడ్డుహౌసులో చూచాను.'

'అవును.'

'తొందరలో వున్నందువ పలకరించలేకపోయాను.'

'పోనీలే ఫరవాలేదు, కూర్చో.'

అతడుకూడా పడవమీద కూర్చున్నాడు. 'నేను ఫ్రిల్‌కు లక్నోగురించి చెబుతున్నాను' అని అన్నది చంప.

ఓహో మంచిపని చేస్తున్నావు. కాని ప్రపంచం లక్నోనుదాటి చాలా ముందుకు వెళ్ళిపోయింది కదా!'

కమాల్ మాటల్లోగల వ్యంగ్యం చంప అర్థం చేసుకొన్నది.

'కమాల్ నీవు నన్ను అర్థం చేసుకోలేవు. నీవు ఎప్పుడూ వస్తువుల్ని పూజిస్తూ వుంటానని నన్ను విమర్శిస్తూవచ్చావు. కాని నా పరిస్థితి వేరు. పల్లెటూరి గడ్డి వాముల సువాసనలు, మట్టిరోడ్డుమీద మెల్లమెల్లగా నడిచే ఎద్దులబండ్లు అన్నింటినీ నా జీవితస్మృతుల్లో భద్రంగా దాచివుంచాలనే తలంపుగావున్నా. ఇంకా ఎక్కువ తెలివితేటలు నాకు వుండివుంటే ఏ 'తత్వా'న్ని చదివేవాణ్ని. ఫ్రిట్! లక్నోలోగల ప్రకృతిదృశ్యాలు చూడవలసినవేగాని చెప్పవలసినవికావు. ఆ తోటలు, ఆ ప్రకృతి దృశ్యాలు, ఆ పల్లెటూరిదృశ్యాలు, ఫ్రిట్ నా గతాన్నిగురించి నీకు చెప్పలేను. చెప్పినా నీవు అర్థం చేసుకోలేవు.'

'నేను చెబుతాను' అంటూ కమాల్ ఆవేశంతో లక్నోవైభవాన్నిగురించి వర్ణన ప్రారంభించాడు. అది తనదేశం, ప్రియతమమైన హిందూదేశం. ఆ దేశవైభవం, ప్రకృతిదృశ్యాలు, పల్లెసీమలు, పెళ్ళిళ్లు, నౌటంకిప్రదర్శనలు, లైలామజ్నూ నాటక ప్రదర్శనలు, కవ్వాలీలు, ముషాయిరాలు (కవిసమ్మేళనాలు), గోమతీనది, పడవలు, పతంగులు, కబీర్, కమరున్, రామఅవతార్, రామదయ్యా, రైతులు, హోలీలు, మామిడితోటలు, సరయూ, శారదా, మందాకిని, యమునానదులు మొదలుగాగల వాటినన్నింటినిగురించి కమాల్, చంపా యిరువురూకలిసి వివరించిచెప్పారు. చంప మరీ ఎక్కువగా చెబుతూంటే కమాల్కు విసుగుపుట్టింది. 'యువక ఉత్సవంలో పాల్గొనేందుకై రేపు జర్మనీ వెళుతున్నాను. రాత్రికి లండన్ చేరాలి. తలత్ నా ప్రయాణానికి సామాను సర్దివుంచాలి' అంటూ కమాల్ లేచి నిలబడ్డాడు.

'పద, మేము నీతోబాటు వస్తాము' అంటూ ఫ్రిట్ లేచి నిలబడ్డాడు.

ముగ్గురూ పట్టణానికి బయలుదేరారు.

కేంబ్రిడ్జి చేరినతరువాత తన హాస్టలుగదిలోకివచ్చి చంప కిటికీ తెరిచింది. రాత్రి పదకొండుగంటలైంది. దూరాన ఎవరో పాడుకున్న విషాదగీతం స్పష్టంగా వినబడసాగింది.

'సమయంలేదు, త్వరపడు. అదుగో జనం చూడు. వాళ్ళ ముఖాలు ఎంత వికారంగా వున్నాయో! వాళ్ల బారినుండి తప్పించుకో! నేను ఎటువెళ్ళను? అంతటా శత్రువులు, స్నేహితులు, వాళ్లను ఏ బాటచివర వదిలిపెట్టానో! వాళ్లు ఏచోట వుండిపోయారో! నదుల ఆవలిఒడ్డున ఏమిటి వున్నదో! నేనున్నాను. నీ వున్నావు. ఎదురుగా దూరాన మందిరం కనబడుతూంది. అక్కడ చిరుగంటలు

మ్రోగుతున్నాయి. అకవిలో 'కాలిబాటన వెళుతూ ఎన్‌టిలిప్ గీతం విన్నాను. ఆ కంఠం మంచుబిల్లల్లోనుండి నా వైపుకు వస్తూవుంది. చల్లని పిటకెరటాలలో తేలుతూ నిన్ను జ్ఞాపకం చేసుకొన్నాను. ఎదురుగా దూరాన ఎర్రటి పై కప్పుతో చిన్నమందిరం కనబడుతూంది. చల్లనిగాలులు వీస్తున్నాయి. కాలిబాటలు నక్షత్రాలనే పూలతో నిండిపోయాయి. వాళ్లిద్దరూ యింకా రాలేదు. వాళ్లిద్దరూ యింకా రాలేదు. వాళ్లిద్దరికీ పెండ్లి జరుగుతుంది. పెంయేటిమీద వర్షం పడుతూంది. నేను ఎప్పుడూ ఎప్పుడూ నీతోనే వుంటాను.'

'I loved my love with a platform ticket,
A jazz song.
A handbag, a pair of stockings of Paris Sand...
I loved her long.
I loved her between the lines and against the clock.
Not until death
But life did us part.
I loved her with peacock's eyes.
And the wares of Carthage,
With blasphemy, Camaraderie,
and bravado and lots of other stuff.
I loved her with my office hours, with flowers and Sirens
With my budget, my latchkey
and my daily bread,
And so to London and down the
ever-moving Stairs."*

# 45

దంత కిటికీ మూసివేసింది. హాస్టలునుండి బైటకువచ్చింది. రేపు కాలేజి మూసివేస్తారు. తరువాత తాను ఎక్కడికి వెళ్లడం? ఏం చేయడం? ఎదురుగానున్న

* Louis McNeice.

పాలాలవంక చూపించి. ముందుకు సాగింది. ఫిట్జ్ విలియమ్ గ్రంథాలయానికి పోయే వంతెనమీదకు వచ్చింది. అక్కడొక యూమజాతి యువకుడు బొమ్మలు గీస్తున్నాడు. చంపనుచూసి ఆనందపడ్డాడు. 'ఇక్కడ ఒక్కపర్యాయం కూర్చోండి. బొమ్మ గీస్తాను' అంటూ ఆమెను ప్రార్థించాడు. అతనిమనస్సును నొప్పించడం యిష్టంలేక ఒంతెనమీద కూర్చున్నది. 'ఇవాళ చివరిరోజు. రేపు ఎక్కడికి వెళ్ళిపోతారో ఎవరికి తెలుసు! మీ చిత్రం నాదగ్గర దాచుకొంటాను' అంటూ గబగబ ఆ యువవిద్యార్థి బొమ్మవేయడం ప్రారంభించాడు.

చంప తొంగిచూసింది. చిత్రం అసహ్యంగా వున్నది. అయినా ఓర్పుతో కూర్చున్నది. ఇదే నా అసలురూపమేమోనని, యీ దేశకానిచిత్రకారుడు నా బొమ్మ గీయడంలో సఫలుడైనాడేమోనని లోలోన అనుకొన్నది.

'ఈ బొమ్మ మీకు నచ్చిందా! మీరు సంతోషంగావుండటం నాకు కావాలి. మిమ్మ ఏవిధంగా సంతోషపెట్టగలనో చెప్పండి' అని అడిగాడు ఆ అమాయకుడు.

'నీవు నన్ను సంతోషపెట్టలేవు' అని అన్నది కటువుగా.

'మిమ్ము సంతోషపెట్టగలవా దెవరో చెప్పండి' అని అన్నాడు ఆ యువకుడు.

'నీ వడిగినప్రశ్న పరమ అసహ్యంగా వున్నది' అని అన్నది.

'క్షమించండి.'

'మంచిది. షలాం అలేకుం. ఖుదా హాఫిజ్' అంటూ చిరునవ్వు నవ్వింది చంప.

'షాలోం అలేఖుం' అంటూ వెళ్ళిపోయాడు. అటునుండి మైకేల్, డేవిస్ వస్తున్నారు.

'ప్రిల్ యింకా కలవలేదా?' అని కంగారుగా అడిగాడు డేవిస్.

'లేదు.'

'ఎక్కడ మాయమైపోయాడో తెలియదు' అంటూ యిద్దరూ కోపంగా చంప వంక చూశారు.

'నేను ప్రిల్‌కు సంరక్షకురాలను కాను' అని అన్నది చంప.

'క్షమించు చంపా! ఏమైనా పరుషంగా మాట్లాడానా? క్షమించు. ఇవాళ ఆఖరి రోజు. కోహిమూర్‌లో కలిసి భోజనం చేద్దాం. దయచేసి!' అని అన్నాడు మైకేల్.

'అవును. ఇవాళ ఆఖరిరోజు. కేంబ్రిడ్జి మూసివేస్తున్నారు. అందువలన చంప కాదనలేకపోయింది.

హోటలులో కూర్చొని వాళ్లు ఫ్రిల్‌నుగురించి ఏమీ మాట్లాడలేదు. వెనకటి రోజుల్లో ఒకవాడు రోజ్‌మారీ యోగక్షేమాలనుగురించి చంప ఫ్రిల్‌ను ప్రశ్నించింది.

'బాగానేవున్నది. పాపం జబ్బుగావున్నది. అయినా నా చదువుకోసం కష్టపడి పనిచేసి నాకు డబ్బు పంపుతూవుంటుంది ప్రతినెల' అని అన్నాడు ఫ్రిల్.

'అంతేగాక యితర అమ్మాయిల్ని ప్రేమిస్తూ తిరగమనికూడా డబ్బు పంపిస్తున్నదనుకొంటా'నని అన్నది చంప పరద్యానంగా. ఫ్రిల్‌కు చాలా కోపంవచ్చింది. ముఖం ఎర్రబడిపోయింది. ఒక్క ఉదుటనలేచి బయటకు వెళ్ళిపోయాడు. ఆనాటి నుండి ఫ్రిల్ మాయమైపోయాడు. ఎవ్వరికీ కనబడలేదు.

బయట వర్షం పడుతున్నది. బయట ఫ్రిల్ నిలబడి వర్షంలో తడుస్తున్నాడు. దేనిస్ లేచి గబగబ అతనిదగ్గరకు వెళ్ళాడు. కాని ఫ్రిల్ కదలలేదు.

'లోపలికిపద. ఇదేమిటి, పసిపిల్లవాడిలా' అని అన్నది చంప బయటికివచ్చి.

'నాదగ్గర డబ్బులు లేవు. లోపలికి ఎలా రాగలను.' అని అన్నాడు ఫ్రిల్ దేనిస్‌తో.

చంపకు ఒకవారం రోజులక్రితం రోజ్‌మారీ పంపే డబ్బునుగురించి ఫ్రిల్‌ను తానన్నమాట జ్ఞాపకం వచ్చింది.

'రోజ్‌మారీ యీ వారం నాకు చెక్కు పంపలేదు. ఆమెను వదిలివేయడానికి నిర్ణయించుకొన్నాను. డబ్బు పంపవద్దని జాబు వ్రాశాను. నీకు సంతోషం కలుగుతుందనుకుంటాను.' అని ఫ్రిల్ చంపవంకచూసి అన్నాడు.

'నీకు పూర్తిగా మతిపోయింది' అని అన్నది చంప. దేనిస్, మైకేల్ కళ్లల్లో, చంపమీద పరమ అసహ్యభావం వెల్లడైంది. ఇంతటి ఏహ్యకమ తలత్, నిర్మల, కాంతా క్రేగ్ కళ్లల్లో లోగడ చంప చూపింది తనవిషయంలో.

'అవును. మతిపోయింది' అంటూ ఫ్రిల్ సిగరెట్‌కోసం జేబులో చేయివుంచి వెతుకసాగాడు.

దేనిస్, మైకేల్ యిద్దరూ హోటలులోకి వెళ్ళిపోయారు. ఫ్రిల్, చంప యిద్దరిమీద వర్షం పడుతున్నది.

'పద పోదాం. వర్షంలోతడిస్తే ఏం ప్రయోజనం?' అని అన్నది చంప.

'దేనివల్ల ప్రయోజనం ఏమున్నది గనుక?' అని అన్నాడు ఫ్రిల్.

'నాకు పూర్తిగా మతిపోయింది ప్రిల్.'

'ప్రతిపుట్టం విడివిడిగా జరుగుతూ వుంటుంది. ప్రతిదానికి ప్రత్యేకత వుంటుంది. గడిచిపోయిన క్షణాలు తిరిగిరావు. జరిగినఘట్టాలు తిరిగి జరుగుతాయని అనుకో వద్దు. నీ జీవితం....నేను....యీ వస్తున్నరు....అన్నిటివిషయము యింతే.'

'పద. నీతోబాటు వస్తాను' అని అన్నది చంప.

స్మశానంవైపు వెళుతున్నట్లుగా యిద్దరూ పుట్‌పాత్‌మీద నడుస్తున్నారు. పరిచితులైన యువతీయువకులు త్రోవలో ఎదురైనప్పుడు ప్రిల్ హలో హలో అంటూ ముందుకు సాగుతున్నారు.

'అయితే నీవు నావల్లనే యింత పెద్దపని చేశావా?' అని అడిగింది చంప సాహసించి.

'అవును. అప్పుడప్పుడు నన్ను పిచ్చిపుక్క కరుస్తూవుంటుంది. అప్పుడప్పుడు బుర్ర తిరిగిపోతూవుంటుంది. బుర్ర తిరిగినప్పుడు యిలాంటిపనులు చేస్తుంటాను.'

చంప తన హాస్టలుకు వెళ్ళిపోవాలని ప్రక్కకు తిరిగింది.

'నీ మంచిసలహాలతో నన్ను సంతోషపెట్టడానికి నాతోబాటు హాస్టలుకు బయలు దేరి మళ్ళీ మధ్యలో యిదేమిటి వెళ్ళిపోతున్నావు?' అని అన్నాడు ప్రిల్.

'నీతో మాట్లాడటం నాకు యిష్టం లేదు. నేను నీకు ఏమీ సాయం చేయలేను ప్రిల్.'

'ఇది నీ చివరి సమాధానమా?'

'అవును. చివరి సమాధానం. ఇందులో సందేహించవలసిన అవసరంలేదు.'

'గౌతం నీవెంబడి వెంట ఎంతకాలం పడతావు?'

'నన్ను అవమానించకు ప్రిల్' అంటూ గట్టిగా అరిచింది చంప. ప్రిల్ మాటకు మండిపోయింది చంప.

'సరే సరే. రోడ్డుమీద అరవవద్దు. క్షమించు. తప్పునాదే. తప్పునాదే. గుడ్ నైట్' అంటూ ప్రిల్ వెళ్ళిపోయాడు.

సాయంత్రం కొన్నికాగితాలు తెచ్చుకొనేందుకై చంప ప్రిల్ చదువుతున్న కాలేజీకి వెళ్ళింది. రాత్రి రైళ్ళకు చాలామంది వెళ్ళిపోతున్నారు. వర్షం కురుస్తున్నది. చాలామంది విద్యార్థులు సింహద్వారంలోపల నిలబడివున్నారు. రేపటి నుండి పదిహేనవశతాబ్దంలో తయారుకాబడిన కాలేజీ సింహద్వారం మూసు

కొంటుంది. ఆ తరువాత వాళ్లు ఎప్పుడైనా యిక్కడికివస్తే మరో రూపం యిక్కడ కనబడుతుంది.

వర్షం యింకా ఎక్కువగా కురుస్తున్నది. అక్కడి మనుష్యుల్ని చంప కలుసుకొన్నది. అందరికీ 'కలపు' చెప్పింది. ప్రపంచం అంతమైపోతున్నదా అన్నట్లున్నది అక్కడి వ్యవహారం. గ్రిల్ బిష్షే ముందుగదిలో కిటికీదగ్గర చర్మపు సోఫామీదకూర్చొని 'పజిల్' పూర్తిచేస్తున్నాడు. చంప గదిలోకివచ్చింది. అయినా గ్రిల్ ఏమీ పలుకలేదు. చంపవెళ్ళి ప్రక్కనే కుర్చీలో కూర్చున్నది. గ్రిల్ తల ఎత్తి చూశాడు. 'పజిల్' విషయమై సహాయం అడిగాడు. ఆమె తనకు తోచినవిధంగా సమాధానం చెప్పింది.

'కావచ్చు. నీవు సరియైనమార్గంలోనే వుండొచ్చు' అని అన్నాడు గ్రిల్.

ఆమె ఉలిక్కిపడింది. తనకు ఎదురుగా బంగారురంగుజుట్టుతో ఒక బ్రిటిష్ లార్డుకొడుకు కూర్చొనివున్నాడు. అతనితో తాను కొద్దిసంవత్సరాలు ఈ విశ్వవిద్యాలయంలో గడిపింది. సహపాఠిగనుక సెలవు తీసుకొందామని వచ్చింది. కాని యీ గ్రిల్ తనతోపాటు షికార్లుతిరిగిన గ్రిల్ కనబడలేదు. తనకోసం సర్వస్వం త్యాగంచేసేందుకై సిద్ధపడ్డాడు. పెండ్లి చేసుకోమని ప్రార్థించాడు. కాని యిప్పుడు అతడు లార్డుకొడుకుగా వ్యవహరిస్తున్నాడు. 'నీవు యింకా వెళ్ళలేదా? ఏరైలుకు వెళుతున్నావు?' అని అడిగాడు గ్రిల్.

'ఆరున్నరగంటలబండికి వెళుతున్నాను. నీవు లండను ఎప్పుడు వస్తున్నావు?' అని అడిగింది చంప.

'ఎప్పుడైనా రావచ్చును. కాని ఒక్కమాట. ఇక నీవు నేను కలుసుకోవడం మాత్రం జరుగదు. బ్రతికివున్నంతవరకు నిన్ను కలుసుకోను.'

ఆమె ఏమీ బదులుచెప్పలేదు. తరువాత తన భవిష్యత్కార్యక్రమాన్నిగురించి చెబుతూ, 'లా చదువుతాను' అని అన్నది.

'మంచిది. ఆతరువాత ఏం చేస్తావు?'

'1962 తరువాత ఏం చేస్తానో ఎలా చెప్పను? జ్యోతిషం నాకు తెలియదు.'

'అదీ నిజమే.'

'నీవు డాక్టరేటు పుచ్చుకొని విమర్శనాగ్రంథాలు వ్రాస్తావనుకొంటాను.'

'కావచ్చు.'

'గ్రంథాలువ్రాయడం మానుకొని బ్యాంకులో ఉద్యోగం చేస్తావా?'

'చేయొచ్చు.'

'ఇక వెళతాను' అంటూ చంప లేచి నిలబడింది.

'నేనే వీచోట వుండివుంటే యింతసేపు ఆగేవాణ్ణికాదు. రైలుకు వేళ అయిపోయింది' అంటూ లేచి నిలబడ్డారు ప్రిల్.

సింహద్వారం క్రిందివైపున వున్నది. ఎన్నో సంవత్సరాలనుండి దట్టమైన తీగలు అందంగా ఆ ద్వారాన్ని అలుముకొనివున్నాయి. వందలాదిసంవత్సరాలనుండి వేలాదివిద్యార్థులు యీ ద్వారందగ్గర సెలవుతీసుకొని, ప్రపంచంలో అడుగు పెడుతూవున్నారు.

ప్రిల్ ఒక్కపర్యాయంవంగి ఆమెకు త్రోవ చూపించారు. చేయిజాచి గంభీరంగా 'ఇన్నాళ్ల నీతోబాటుతిరిగి నిన్ను తెలుసుకొని నీ పరిచయం పొందినందుకు ఎంతో సంతోషిస్తున్నాను. ఖుదా హాఫిజ్' అని అన్నారు ప్రిల్.

చంప సింహద్వారం వెలుపలికి వచ్చింది. 'బయటి గుమ్మందాకావచ్చి నన్ను వదిలిపెట్టవూ?' అని అడిగింది తన ఒంటరితనాన్ని లోలోన తలుచుకొంటూ.

'రాను....నాకు వేరే పనివున్నది' అంటూ వెళ్ళిపోయారు.

అవును. ప్రిల్ చెప్పింది నిజమే.

అంతే. ఆనాటినుండి తిరిగి ఎన్నడూ వాళ్లిద్దరు కలుసుకోలేదు.

## 46

చీకట్లో దీపస్తంభంలా ఎత్తుమీద శానిటోరియంలో దీపాలు వెలుగుతున్నాయి. జీవితంలో వెలుగువెలిగి చీకటి క్రమ్మినట్లుగానే ఆ చీకట్లో శానిటోరియం దీపాలు కూడా వెలుగుతూ, ఆరుతూ కనబడుతున్నాయి.

గౌతం పీతాంబర్ బస్సుదిగి మిలమిల మెరుస్తున్నభవనంలో ప్రవేశించాడు. విశ్రాంతిగదిలోకి అడుగుపెట్టాడు. నిర్మల అతణ్ణిచూసి సంతోషంతో కళకళ

లాడింది. అతను రాకపూర్వం ఏమో ఆలోచిస్తూ దిగాలుగా గోడవైపు తిరిగి పడుకొనివున్నది.

'ఓయీ!' అంటూ పిలిచారు గౌతం. నిర్మల ఆనందంతో వెంటనే లేచికూర్చున్నది. త్వరత్వరగా చేతివ్రేళ్లతో జుట్టు సవరించుకొన్నది. దగ్గరలో అద్దం లేనందుకు లోలోన బాధపడింది. ముఖం అద్దంలో చూసుకోవాలని తహతహలాడింది.

'ఓహో! బాగా ఆరోగ్యంగా కనబడుతున్నావే! ఎర్రగా బుర్రగా జామపండులా వున్నావు.'

'గప్పాలు ఆపండి. కాస్త నా టెంపరేచర్ చార్టుచూస్తే స్వాములవారికి బోధపడుతుంది నా పరిస్థితి ఏమిటో. ఇవాళకూడా నూటొక్కడిగ్రీ వున్నది. ఈ జ్వరం నెలాఖర్యంతం వస్తూనేవున్నది.'

గౌతం మనస్సు దిగాలుగావున్నది. వెళ్ళి నిర్మలదగ్గరగా కూర్చున్నాడు. నిర్మల మాత్రం సంతోషంగావున్నట్లు కనబడాలని ప్రయత్నిస్తున్నది.

'నిర్మలా! నిన్నుగురించి యింతగా నేను యోచించలేదు. నిజం చెబుతున్నాను. నా ఆత్మలో ఎప్పుడూ నీవే కనబడుతున్నావు,

ఈమాట అన్నాడేకాని అతనిహృదయంలో మథన బయలుదేరింది. ఇద్దరు అమ్మాయిలను ఒకేపర్యాయం ఎలా ప్రేమించగలడు? అటు చంప, యిటు నిర్మల. చంపలోవున్న ప్రమాదకరమైన ఆకర్షణ యీ అమ్మాయిలో లేదు. అమాయకంగా, ప్రసన్నంగా శీలవంతంగావుండే నిష్కళంకురాలు నిర్మల.

చంప యిప్పుడు 'ప్రపంచస్త్రీ' అయిపోయింది. ఆమె మొదటినుంచి ప్రమాదకరమైన ఆకర్షణాశక్తితో మొగవాళ్ళను మురిపిస్తూవున్నది. అనుభవం బాగా గడించింది. కాలచక్రపు హెచ్చులొచ్చులు చవిచూచిన రకం. అయినా ఏమీ చేయలేని నిస్సహాయురాలు. తన కృపను, దయను కాంక్షిస్తున్నది. నిర్మల మృత్యుశయ్యమీద పడివున్నది. ఇంటియిల్లాలు రకం. అనుభవం తక్కువ. తనకోసం నిరీక్షణలో వున్నది. తాను చంపను మరిచిపోగలడు. ఎంతో ప్రయత్నం చేసిన మీదటగాని గత అయిదుసంవత్సరాలలో అతి కష్టంమీద చంపను తన మనసునుండి తొలగించుకోలేకపోయాడు. ఒకేదేశంలో, మిత్రులతోబాటు వుంటూకూడ చంపను కలుసుకోకుండ వుండగలిగాడు. కాని చంప పిలుపుమాత్రం ఎదుర్కొనగలిగిన

శక్తి అతనికి లేదు. మాడ్రిడ్, రోమ్, వియన్నాలలోగల ఆర్కెస్ట్రానాదంలో అతనికి చంప పిలుపు వినబడింది. వర్షపుజల్లుల్లో, ఎడార్లలో, శీతపవనాలల్లో, అట్లాంటిక్ కెరటాలల్లో, న్యూయార్కు కోలాహలంలో ప్రతిచోట ఆమెపిలుపు అతణ్ణి వెంటాడుతూనే వున్నది. కంఠానికొరతతో విసిగిపోయాడు. విశ్రాంతి అతని జీవితంలో లేనేలేదేమో ననిపిస్తుంది. నాదంవంటిది చంప. నిర్మల విశ్రాంతి వంటిది. చంప అనేకమాటలు అతనితో మాట్లాడింది. అన్నీ అతనికి జ్ఞాపకం వున్నవి. పాట పూర్తి అయినప్పటికీ స్వరం వాయుమండలంలో సంచరిస్తూనే వుంటుంది. నిర్మల మౌనంగా వున్నది. గోమతి మౌనంగా వున్నది. నిర్మల ఎప్పుడూ అతనితో వ్యక్తిగతమైన విషయాలు చర్చించలేదు. కాని చంప మాట్లాడే ప్రతి మాట, ప్రతిచర్య ఎదుటివ్యక్తితో పరోక్షసంబంధం తప్పక ఏర్పాటు చేసు కొంటుంది.

నిర్మలమీద కొద్దిగా వంగి ఆమె శిరస్సుమీద చేయి ఆనించి నాకు కొంచెం శాంతి ప్రదానం చేయమని లోలోన అర్థించాడు.

'గౌతం!'

'ఆఁ!'

'సురేఖ వుంటున్న క్రొత్తగృహం ఎలా వున్నది?'

సురేఖ ఇంటి వివరమంతా గౌతం వర్ణించి చెప్పాడు. 'ఆరోగ్యం కుదుటబడ గానే స్వయంగా చూద్దువుగాని' అని అన్నాడు గౌతం.

'అలాగే' నని అన్నది ఉత్సాహంగా నిర్మల.

'తగియా భాగల్పూరీ అను ఆయనవచ్చాడు క్రొత్తగా.'

'పేరు తమాషాగా వున్నది. చంద్ర వున్నదా?'

'ఆఁ, వున్నది.'

'ప్రొద్దుపోయింది గౌతం మాష్టారూ!' అని కమాల్, హరిశంకర్‌మాదిరి కంఠంతో అన్నది నిర్మల.

'అవును' అంటూ కుర్చీమీదినుండి లేచాడు.

'అరేరే, ఒక్కమాట. ముఖ్యమైనవిషయం అడగడం మరిచాను. చంపాబాతి ఆల్ పరీక్షనిచ్చి కేంబ్రిడ్జినుండి లండను వచ్చిందని తలత్ చెప్పింది. మీకు తెలుసా?' అని అడిగింది నిర్మల.

'లేదు.'

'శరత్ చెప్పిందేమోనని అనుకొన్నాను. మీరు ఆమెను తప్పక కలుసుకోండి. పాపం ఒంటరిమనిషి' అని అంటూ దిండుమీద తలపెట్టుకొన్నది.

'ఇలాంటివాళ్ళనందరినీ కలుసుకొంటూ తిరగడానికి నాకు తీరిక ఎక్కడిది నిర్మలా! సరే యిక వెళ్ళివస్తా. ఖుదాహాఫిజ్' అంటూ బైటకు వెళ్ళిపోయాడు.

గౌతం అబద్ధంచెప్పాడని నిర్మల అర్థం చేసికొన్నది. చంపాబాజీ లండను వచ్చిందనేవిషయం గౌతం పిలాండరునికి తెలుసునని, తప్పక ఆమెను కలుసు కొంటాడని నిర్మలకు తెలుసు. మెల్లగా పరుపుదగ్గిర స్విచ్ నొక్కి దీపం ఆర్పి గోడవైపుకుతిరిగి పడుకొన్నది.

* * *

గౌతం నిర్మలకు అబద్ధం చెప్పాడు. ఆరోజున లిట్ హర్ట్స్ వచ్చేముందు అతని ఫోను మ్రోగింది. అతడు రిసీవరు ఎత్తాడు. గౌతం, హలో అంటూ మాటలు విన బడుతున్నాయి. గౌతం మాట్లాడలేదు.

'గౌతం పిలాండర్! ఏమిటి మాట్లాడవు? నా మాటలు వినబడుతున్నాయా?' అని అన్నది చంప.

'వింటున్నాను.'

'ఏం పెద్దమనిషీ! ఇన్నాళ్లనుండి నేను యిక్కడవున్నాను. ఒక్కరోజుకూడా వచ్చి కలిసినపాపాన పోలేదు. నిన్ను కొరుక్కుతింటానా ఏం?' అంటూ పకపక నవ్వింది.

అతడు ఏమీ మాట్లాడలేదు. ఇంతపెద్ద రాజనీతిజ్ఞుడు ఏమీ సమాధానం చెప్ప లేకపోయాడు.

'నేను కేంబ్రిడ్జినుంచి వచ్చేశాను. జాన్ కార్టర్‌యింట్లో వున్నాను. ఒక్క పర్యాయం రాకూడదూ! చదువులరోజులు గడిచిపోయాయి. ఇక నాకు అంతా తీరికే తీరిక. తప్పక రావాలి మరి!'

'సరే. తప్పక వస్తాను' అని అన్నాడు గౌతం.

ప్రపంచంలోవున్న సంపదంతా లభిస్తే ఎంత ఆనందం కలుగుతుందో అంతగా చంప అక్కడకూర్చొని గౌతం సమాధానం విని సంతోషించిందని అతని కేం తెలుసు!

లిద్‌హర్స్టునుండి తిరిగి వచ్చేసరికి రాత్రి 12 గంటలైంది. తనయింటికివచ్చి భయపడుతూ భయపడుతూ ఫోను ఎత్తాడు. జాన్ కార్టర్ నెంబరుకు ఫోనుచేశాడు.

'హలో! ఎవరు?' అంటూ నిద్రపోతున్నకంఠం వినబడింది.

'మిస్ అహమద్ వున్నారా?'

'మీ రెవరు?'

'గౌతం పీలాంబర్.'

'ఓహో మీరా గౌతం పీలాంబర్! మిస్ అహమద్ యిప్పుడు యింట్లోలేదు. ఎక్కడికో వెళ్ళింది.'

'అయ్యో!'

'ఏం? అవసరమైన విషయమేమైనా వున్నదా? అయితే ఒకపని చేయండి. ఫిరోజ్, సురేఖ, జరీనా, అమల, తలత్ వీళ్ళందరికి ఫోనుచేయండి. ఎక్కడైనా దొరకవచ్చు.'

'శ్రమ కలిగించాను. నమస్కారం. అంత అవసరమైనవిషయ మేమీలేదు. గుడ్‌నైట్' అంటూ రిసీవర్ పెట్టివేశాడు. తెలివితక్కువపని చేశావే అని అని పించింది. సిగరెట్ ముట్టించి కిటికీదగ్గరకువెళ్ళి నిలబడ్డాడు.

## 47

'పోర్ట్రెయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్ యాజ్ ఎ డాన్ జువాన్' అని పేరుపెట్టి నేను ఒక పుస్తకం వ్రాయబోతున్నాను' అని అన్నాడు కమాల్.

సురేఖ యింటిముందు హాలులో అంతా కూర్చునివున్నారు. సురేఖ తలుపు దగ్గరగా కూర్చుని లంగాఅంచుకు కుడుతున్నది. తలత్, ఫిరోజ్ లిద్దరూ వంట గదిలో వంటచేస్తున్నారు. హరిశంకర్ కూడా అప్పుడే వాషింగ్టనునుండి వచ్చారు. కైరో వెళ్ళబోతున్నారు. 'హరిశంకర్, గౌతం పీలాంబర్ లిద్దరిపనీ బ్రహ్మాండంగా వున్నది. దేశదిమ్మరులై పోయారు. ఇద్దరితోనూ వ్యవహారంగా వున్నది.

ప్రొద్దున గౌతం ఫోనుచేసి తాను మాస్కో వెళుతున్నానని చెప్పాడు.' అని అన్నారు గుల్షన్.

'గౌతం హుయాన్‌త్సాంగ్‌కూడా.' అని అన్నాడు కమాల్.

బయట తోటలో చంద్రామాదుర్ మహోపాట పాడసాగింది. చంద్ర వాళ్లందరికీ పాతస్నేహితురాలు. న్యూయార్కునుండి ఢిల్లీ వెళుతూ లండనులోదిగి జరీనా యింట్లో ఆగింది. హాలుకి రెండవకొసన 'తుగియాన్' సురేఖభర్త గుల్షన్ అహూజాతో మాట్లాడుతున్నాడు.

ఆరోజు ఆదివారం. అది మనోహరంగా ప్రశాంతంగా వుంటున్నరోజు. ఆనాడు ఉదయమే చంప జాన్ కార్టర్ యింటినుండి సురేఖగారియింటికి రావాలని బయలుదేరి బస్సు ఎక్కింది. బస్సు కండెక్టరు ముసలివాడు. చంపనుచూసి అతడు చిరునవ్వు నవ్వి. 'మై డియర్! నీవు ఎంత అందంగావున్నావో చెప్పలేను. నీ స్నేహితుడు నిన్నుచూచి ఎంతో మురిసిపోతాడు' అని అన్నాడు. చంప పరమా నందభరితురా లైంది. నిన్న చంప ఫోనులో గౌతంతో మాట్లాడింది. ఎన్నో సంవత్సరాలతరువాత అతనికంఠం విన్నది.

చంప సురేఖగారింటికి వచ్చింది. ఇక్కడ అంతా వున్నారు. ఎంతో సంతో షంతో అందరినీ కలిసి మాట్లాడసాగింది.

'ఓ హరిశంకర్! ఓ హరిశంకర్!' అంటూ వంటగదిలోనుండి కేక బెట్టింది తలత్.

హరిశంకర్ గబగబ వంటగదిలోకి వచ్చాడు. 'ఇదిగో వేడివేడి పూరీలు. చంపా బాజీ ఎక్కడవున్నదో చూసి యీ పూరీలపళ్లెం యిచ్చిరా.' లక్నోలో గుల్‌షిషాంలో గల యింటివాతావరణం యిక్కడ అలుముకొనివుండటంచూసి చంపకు ఎంతో సంతోషం కలిగింది.

హరిశంకర్ పళ్ళెం పుచ్చుకొని గదంతా పరిశీలించిచూశాడు. చంప రెండో కొసన కిటికీలో కూర్చొనివున్నది. చంపాబాజీ! ఏమిటిది? యీ కొసకువచ్చి కూర్చున్నావు? అందరిముందు నవ్వుతున్నావో లేదో? బాలన్స్ కాపాడుకొంటు న్నావో లేదో! సురేఖ. తలత్. ఫిరోజ్ మొదలుగాగల యీ అమ్మాయిల్ని చూడు. ఎంత తెలివిగలవాళ్ళో! ఆడపిల్లల వ్యవహారం అనలు విచిత్రంగా వుంటుంది. ఒక్క ఊపులో పడవ అవలితీరానికి చేరిందా సరేసరి. లేకపోతే అంతా తలక్రిందుల

వ్యవహారమే. అనుకొంటూ హరిశంకర్ 'చంపాబాయీ! ఇదిగో పూరీలు. తీసుకోండి' అని అంటూ చంపాబాయీదగ్గరకువెళ్ళి మోకాళ్ళమీదకూర్చొని పూరీలపళ్ళెం అందించాడు.

'వీళ్ళంతా మౌనంగా వున్నారు. ఏమైందేమిటి?' అని అడిగాడు తుహాయాన్ గుల్షన్ అహంజాను. 'వీళ్ళందరూ ఏమిటేమిటో ఆలోచిస్తూవుంటారు.' అని అన్నాడు నిర్లక్ష్యంగా గుల్షన్.

'చాలా చక్కని సమయం. సురేఖాదేవికి బట్టలుకట్టడంకూడా తెలుసునని నేను ఎరుగను. కమాల్ పూరీలు తింటున్నాడు. చంద్రాదేవి పూదోటలో కోళ్ళకు మేత పెడుతున్నది. తలత్ రొట్టెలు తయారుచేస్తున్నది. గురుదేవ్ టాగూర్ నవల్లో వర్ణించబడిన గృహవాతావరణం యిక్కడ నాకు కనబడుతున్నది. ప్రశాంతంగా, మధురంగా, కవితామయంగా వున్నదీ వాతావరణం' అని అన్నాడు తుహాయాన్.

'మీకు గురుదేవ్ టాగురునవలలు చదివారన్నమాట. అరే తలత్, పూరీలు మారిపోతున్నాయి చూడు, టీ పంపించు.' అని అన్నాడు గుల్షన్.

తుహాయాన్ ఏమీ మాట్లాడలేదు.

'హలో శంకర్! ఏమిటీ విశేషం' అని అడిగింది పేపరుచదువుతూ చంప.

'విశేషం ఏమిటని యిప్పుడు అడుగుతున్నారా! పోనీయండి. విశేషా లేమీ లేవుగాని టీ పుచ్చుకొంటారా?' అని అడిగాడు హరిశంకర్.

'తప్పకుండా' అని అన్నది చంప.

కప్పు పుచ్చుకొనేసరికి చంచా క్రింద పడిపోయింది.

'మనమంతా ఒకరికీవిధాల్లో మరొకరం తారసపడుతున్నాం. ఒకరినొకరం వేధిస్తున్నాం. బాధిస్తున్నాం. సంతోషిస్తున్నాం. చంపాబాయీ! మా అందరిలోకి నీవు గొప్పదానివి. నీ హృదయంలో ప్రేమకు బ్రహ్మాండమైన చోటువుండటమే అందుకు కారణం. సరేగాని విను. యూ. ఎన్. లో ఒకపోస్టు ఖాళీగా వున్నదట. మంచిపోస్టు. ఇండియాకోటలో వున్నది. నీకోసం ప్రయత్నం చేయనా!' అని అన్నాడు మెల్లగా హరిశంకర్.

'అంటే నీ ఉద్దేశ్యం ఏమిటి? జీవితమంతా యిలాగే తిరిగితిరిగి బాధపడమనా నీ అభిప్రాయం?' అని అన్నది చంప.

'అంతకంటె యిక నీవు చేసేదీ చేయగలిగిందీ మరేమున్నది?' అని అన్నారు హరిశంకర్. ఆతరువాత తను అన్నమాటలలోగల పొరపాటు గ్రహించారు. దాన్ని సరిపెట్టుకోవాలని తిరిగి మాటలు ప్రారంభించారు. 'నా ఉద్దేశ్యంలో నీవు వంటగదుల్లో కూర్చొని పనులుచేయడంగాక యింకా గొప్పపనులు చేయడంకోసం పుట్టావు. నిజంగా అవకాశందొరికితే గబగబ ఎవరెస్ట్ ఎక్కిపోగలవు.' అని అన్నారు శంకర్ చంప ఏమీ మాట్లాడలేదు. పూదోటవైపుచూస్తూ వుండి పోయింది.

ఇంతలో ఆమెకు తల తిరిగిపోతున్నట్లనిపించింది. గదంతా గిర్రున తిరిగి పోతున్నట్లనిపించింది. పూదోటలో వ్రేలాడుతున్న చంద్రదీపంలా కదిలిపో తున్నది. గదిలో కూర్చున్నవాళ్ళంతా తోలుబొమ్మల్లా ఊగిపోతున్నారు. తుహి యాన్ ఒక పెద్దభూతంలా కనబడ్డాడు. 'నాకు పిచ్చిఎక్కేలా వున్నది' అని అంటూ చంప గజగజలాడిపోయింది. ఆమె కళ్లవెంట కన్నీరు బొటబొట కారసాగింది.

చంప కళ్ళవెంట కన్నీరుకారడం హరిశంకర్ యింతవరకు ఎన్నడూ చూడ లేదు.

'చంపాబాజీ! ఏమిటిది? ప్రేమను భావుకత్వంలోకి మార్చకు. బాలెన్సు, సంయమం, ధైర్యం....అంటే....'

'ఏమిటిది? పసిపిల్లవాడిలా మాట్లాడుతున్నావు? నేను ప్రేమిస్తున్నానా లేక ఏదో భవననిర్మాణానికి 'చిత్రపటం' తయారుచేస్తున్నానా?' అంటూ చంప పకపక నవ్వింది.

'చంపాబాజీ! నీ భావాలు వేరుగావుంటాయి. నీ భావాలు బరువుగావుంటాయి. ఆ బరువు యింకా ఎక్కువైనట్లున్నది. అసలు నీవు నీ ఆత్మను అణచివేస్తున్నావు. పవిత్రతను నష్టపరుచుకొంటున్నావు. పది సంవత్సరాలైనా నీలో ఏమీ మార్పు రాలేదు.'

'హరిశంకర్, నామీద దయచూపకు. ఓడిపోయాననేతలంపు యీనాటికి నాకు కలుగలేదు. ఓటమి అంటే ఏమిటో తెలుసుకొందామని యిప్పటికీ ప్రయత్నిస్తు న్నాను.'

భోజనాలగదిలో దగ్గర తుహియాన్ కూర్చొని 'మనమంతా పీడితులం, పీడితులం' అని అన్నారు బిగ్గరగా.

'అవును, నిజం' అంటూ విసుగెత్తిపోయి గుప్తా సిగరెట్టు ముట్టించి ఒక్క పర్యాయం చంపాలాలీవంక చూశారు.

'కమ్యూనిస్టులు మార్క్సిజాన్ని నాశనంచేశారు.' అంటూ తుహియాన్ జాన్ కార్డరువంకచూసి అన్నారు విషయాన్ని మారుస్తూ.

తుహియాన్ గొప్ప సమాజవాది. సూఫీజం స్పెషలైజేషన్. ఆయన హిందీలో చాలా నవలలు వ్రాశారు. ఇప్పుడు ఇంగ్లీషులో వ్రాయాలని ప్రయత్నం. రాయ్ కూరబంష్రాయ్ తుహియాన్ భాగల్పూరీవారి పూర్తిపేరు. ఆయన బీహార్ నివాసి.

'మా పెద్ద నాకు చెప్పారు' అంటూ ప్రారంభించారు.

'వీరికి ఒక ముస్లింగురువు వున్నారట. ఆయన శ్రీనగర్‌లో వుంటారట.'

హరిశంకర్ మెల్లగా చంపాలాలీకి చెప్పారు.

'నాయనా! నీవు రష్యావెళ్ళు అని మా పెద్దా నాకు చెప్పారు' అని అన్నారు తుహియాన్.

వెంటనే తలత్ వంటయింటిలోనుండే అందుకొని 'ఈ వార్తికులకు నిజమైన సమాజవాదపు దాగతా చూపించి సరియైనత్రోవకు తీసుకురా అని చెప్పారుకదూ!' అని అన్నది.

'ఈయన తన పెద్దకుకూడా బాగా సరిచేశారు' అని తలుపులదగ్గరకువచ్చి చంద్ర అన్నది.

'తుహియాన్ ఉలిక్కిపడి ఆమెవంక చూశారు.

'ఈమె ఎవరు?' అని సురేఖను అడిగారు.

'ఈమెకూడా పురోగమభావాలు కలది. కాని డాలర్లు సంపాదించాలనే ఉద్దేశ్యంతో న్యూయార్కు ఆకాశవాణిలోచేరి హిందీలో వార్తలుచెబుతూ వుంటుంది. వీరి వివాహం యిప్పుడే యిక్కడకు వచ్చింది' అని అన్నారు కమాల్.

'సరే మంచిది. మనమంతా పీడలం. నేను, నీవు, గౌతం పీలాండర్, అంతా పీడలమే. మా పెద్ద చెప్పారు-' అని ఏమో చెప్పబోతున్నారు తుహియాన్.

'క్రొత్తసమాచారం చెబుతాను వినండి. కాంతకు, బిల్‌కు పడటంలేదట. బిల్ ఆమెను వదలివేస్తాడట' అని అన్నది తలత్.

చాలామంది మేధావులు పెళ్ళాలను వదలివేస్తారు తప్పదు. 'పెళ్ళాలుకూడా మేధావులేకదామరి అని విర్లక్ష్యంగా అన్నాడు కమాల్.

'ఏమిటీ గొడవ' అని అన్నది సురేఖ.

'ప్రిల్ బిల్లే సుజాతా ముఖర్జీదగ్గర మకాం పెట్టాడు. విన్న నేను చూశాను. అతడుకూడా ఆత్మశాంతి కోరుకున్నాడు కాబోలు.' అని అన్నది తలత్.

'ఈ ఆడవాళ్ళకి అంతా తలక్రిందుల వ్యవహారం. వీళ్ళనుచూడు. ఒకామె క్రొత్తరవికచూసుకొని మురుస్తూవుంది. మరొకావిడ ఊరికే గప్పాలుకొడుతూంది. దీనికి వీళ్లు చాలాకష్టాలు పడతారు. ఒకపిల్లవాడిని కనడంతోబాటు ప్రపంచ బాధ్యత వీళ్ళనెత్తిన పడుతుంది. పాపం వీళ్ళు తమను మరోవ్యక్తికి అప్పగించి వేస్తారు. వీళ్లను సంతోషపెట్టడం చాలా తేలిక. వీళ్లు కుటుంబాన్ని పోషిస్తేనే పండగ అని అనుకొంటారు. వీళ్లను దేవతగా భావించి వుండాలి. వీళ్లమనస్సును నొప్పించడం గొప్ప పాపం' అని అన్నాడు హరిశంకర్.

తలత్ హరిశంకర్ దగ్గరికి వచ్చింది. హరిశంకర్ అంతా అతిశయోక్తులు మాట్లాడుతున్నాడని ఆమె అభిప్రాయం. ఈ రకమైన అతిశయోక్తి తలత్‌కు ఎక్కడచూసినా కనబడుతున్నది. గౌతం పీలాంబర్ నడతలోను, చంపలోను, అప్పీలోనుకూడా ఆమెకు అతిశయోక్తి కనబడుతున్నది.

'ఏం గురూ! ఇష్టంవచ్చినట్లు మాటలు వదిలేస్తున్నారు? ఈ సొరకాయలు మనముందు కోయకు. దేవత ఎవరు, దేవుడెవరు? అంతా కవిత్వం, శుద్ధ అబద్ధం. అసలు ముఖ్యవిషయం ఆర్థిక స్వాతంత్ర్యం' అని అన్నది తలత్.

'ఇదే మీకు అర్థంకాని విషయం. ఆర్థికస్వాతంత్ర్యమే అసలు ముఖ్యవిషయమైతే చంపాబాబీ యిప్పుడు తోటల్లో తిరుగుతూవుండేదా?' అని అన్నాడు హరిశంకర్.

'ఊఁ, ఆవిడగారి బుర్ర చెడిపోయింది' అని అన్నది తలత్.

'అరెరే, ఎంతమాట! ఇంత సమర్థురాలు, కేంబ్రిడ్జిలో అందరి హృదయాల మీద తన అధికారం చలాయించి వస్తున్నది. ఆమెను కలుసుకొన్న ప్రతివాడు 'ఖావ' అయిపోతున్నాడు. అటువంటి మనిషిని పట్టుకొని ఆమె బుర్ర పాడైపోయిందని అంటావా?'

'ఏం తమ్ముడూ! కమ్యూనిస్టులు ప్రేమించరా!' తుహియాన్ గుర్షన్‌ను ప్రశ్నించాడు.

'భగవంతుడే రక్షించాలి' అంటూ మండిపడుతూ తలత్ వెళ్ళిపోయింది.

'బీబీ!' అంటూ హరిశంకర్ ఆమెదగ్గరకువచ్చి ప్రేమతో 'తలత్! ఇంకా నీవు బాగా చదువు. పిహెచ్.డి. చేసివేయి. ఆర్థికస్వాతంత్ర్యం అక్కరలేదని ఎవరు అనగలరు చెప్పు. మనస్సును కించపరచుకొనవద్దు' అని అన్నాడు. ఇప్పుడు ముద్దుగా తలత్‌ను 'బీబీ!' అంటూ వున్నారు. ఆమె నిర్మలస్థానంలో వుంది.

పిహెచ్.డి. చేస్తే పెద్ద ఉద్యోగాలు దొరుకుతాయి. మూడువందలరూపాయల ఉద్యోగం. మూడువందలరూపాయల ఉద్యోగం' అంటూ హరిశంకర్ ముక్కు దగ్గరగా మూడువ్రేళ్లు చూపించింది.

'అరే, దబ్బుతప్ప యీ ప్రపంచంలో ఏమీ లేదా! క్రొత్త హిందూదేశం కోసం మనమంతా మనదేశంకోసం పని చేయాలి.'

బయట పదార్థులు చేస్తున్న చంప ఒక్కపర్యాయం గదిలోకి తొంగిచూసింది. అంతా ఎవరికివారు మాటల్లో మునిగివుంటటంచూసి తోటలోగుండా బయటికివచ్చి రోడ్డుమీదకు చేరుకొన్నది.

## 48

మంచు దట్టంగా పడుతున్నది. సుజాతాదేవి కిటికీ మూసివేసింది. స్వామీ దేవికా నందన్ భగవద్గీతపుటలు తిరగవేసి ప్రజాసమూహాన్ని చూశాడు. ఇతడు కమాల్, హరిశంకర్‌కు పాఠం చెప్పిన ఇంగ్లీషు ప్రొఫెసర్. లక్నోలోగల లా మార్టినేయర్ కాలేజీనుంచి హఠాత్తుగా మాయమైపోయాడు. ఈయనకోసం కమాల్, హరిశంకర్ హరిద్వారంలో నానాఅవస్థలుపడి తెగ తిరిగారు. ఆ ప్రొఫెసరే యిప్పుడు కాషాయరంగు బట్టలు కట్టుకొని, గడ్డం పెంచుకొని యూరప్, అమెరికాలో ఉప

వ్యాసాలుయిస్తూ తిరుగుతున్నారు. గౌతం సుజాతా ముఖర్జీగారి ఇంటిలోకివచ్చి కిటికీలోనుండి తొంగిచూశాడు. స్వామీజీ ఇంగ్లీషు యువతులమధ్య కూర్చొని కన బడ్డాడు. భజన ఒకవైపున సాగుతూంటే మరోవైపున సుజాతా ముఖర్జీ అందరికీ కాఫీ అందజేస్తున్నది.

గౌతం ఆనాడు ఉదయమే చాలా మాసాలతరువాత మాస్కోనుండి వచ్చాడు. కమాల్ గౌతంద్వారా భారతదేశంలో వివిధచోట్లకు ఉద్యోగంకోసం అప్లికేషన్లు పంపించాడు. వాటికి సమాధానంగా ఇండియా హౌస్‌కు గౌతంపేరట చాలాకవర్లు వచ్చివున్నాయి. వాటిని తెరచిచూడకుండానే కమాల్‌ను వెతుకుతూ తిరగసాగాడు. కమాల్ హరిశంకర్ లిద్దరూ తమ ప్రొఫెసరును కలుసుకొనేందుకై సుజాతా ముఖర్జీగారింటికి వెళ్ళారని సురేఖ యింటిదగ్గర అతనికి తెలిసింది. గౌతం యిక్క డికివచ్చిచూస్తే వాళ్లు యిక్కడకూడా లేరు. గౌతం లోపలికివచ్చి మైకేల్‌ప్రక్కన కూర్చున్నాడు.

'మిత్రమా! మీ యీ స్వామీ ఒక్క దొంగలా వున్నాడే!' అని అన్నాడు మైకేల్. 'ఈయనకు మతప్రచారంచేయమని అమెరికా డబ్బు యిస్తున్నదని, కాంగ్రెస్ ఆఫ్ కల్చరల్ ఫ్రీడమ్‌పక్షాన పర్యటన చేస్తున్నారని తెలిసింది.'

'నీవు యిప్పటివరకు ఇజ్రాయిల్ వెళ్ళలేదా?'

'ఇక వెళ్ళబోతున్నాను.'

'అంతా వెళ్ళిపోతున్నారు' అంటూ సుజాత గౌతందగ్గరకువచ్చి 'నమస్కారం మిస్టర్ సీలాంబర్' అని అన్నది.

'నమస్కారం సుజాతా దీదీ!'

అప్పుడే చాలా పూవులుపట్టుకొని నర్గిస్ గదిలో ప్రవేశించింది. 'వెలుగులోకి వచ్చిచూస్తే యివన్నీ ఎర్రగా వున్నాయి. అవలు పసుపువచ్చగా వుంటాయని అను కొన్నాను' అంటూ ఆమె స్వామీజీ ఎదుట పూవులు వుంచింది.

'నర్గిస్! ఏమిటీ నాటకం?' అని బాధపడుతూ గౌతం మెల్లగా అన్నాడు.

'గౌతం ఇదంతా వంస్కృతికోసం, సంస్కృతికోసం' అని అన్నది హాయిగా.

'కమాల్ ఎక్కడ?'

'బహుశ వాళ్లు లిడ్‌హర్ట్స్‌నుండి తిరిగి రాలేదేమో.'

'లెఫ్ హర్ట్స్! ఇవాళ ఆదివారం కాదుగదా!' అని అన్నాడు గౌతం.

'విమల రెండవ ఊపిరితిత్తికూడా యివాళ ఆపరేషన్ జరిగింది. నీకు తెలియదా! ఓహో, ఇవాళ ఉదయమేకదా నీవు వచ్చింది!'

'అంతా వెళ్ళిపోతున్నారు. అంతా తమతమ ఇజ్రాయిల్ దేశాలకు వెళ్ళిపోతున్నారు' అంటూ సుజాత నగం తెరిచినకళ్ళతో గౌతంవంకచూసి 'మీ పార్టీ నభ్యులంతా హిందూదేశం వెళ్ళిపోతున్నారు' అని అన్నది.

'సుజాతాదేవీ! ఇది ప్రపంచపద్ధతి. జనం వస్తుంటారు. వెళుతుంటారు' అని అన్నాడు గౌతం.

'జనం వస్తూవుంటారు. వెళుతూవుంటారు. నిజమే. నాకూ తెలుసు. కాని యిప్పటిపరిస్థితి అదిగాదు. వెళ్ళడమేగాని యిక రావడంఅనేది వుండదు' అని అన్నది సుజాత.

గౌతం వెంటనే నర్గిస్‌వంక చూసి, 'నేను కమాల్‌ను కలుసుకోవాలి. అతని పేరట కొన్ని అత్యవసరమైన ఉత్తరాలు వచ్చాయి' అని అన్నాడు.

'బి. బి. పి. ఫలహారశాలలోగాని, లేక చూజేసత్రంలోగాని వుంటాడు. వెళ్లేముందు స్వామీజీని ఒక్కపర్యాయం కలుసుకొని వెళ్లు' గౌతం ఒకపర్యాయం వంగి అందరకూ నమస్కారంచేసి బయటికి వచ్చివేశాడు.

చూజేసత్రం ఖాళీగా వున్నది. కేవలం ఒక్కఅమ్మాయిమాత్రం ద్వారంవైపు వీపువుంచి ఎత్తైన బెంచీమీదకూర్చొని కాఫీ త్రాగుతున్నది. బి. బి. పి. వాళ్లు ఎవరైనా యిటు వచ్చారా అని అడుగుదామని గౌతం కౌంటరువైపుకు వెళ్ళాడు. బెంచీమీద కూర్చొనివున్న అమ్మాయి వెనక్కు తిరిగిచూసింది. ఆమె ఎవరోకాదు చంపా అహమద్.

'హలో నీవు యిక్కడ వున్నావా!' అని అన్నాడు గౌతం,

తను కూర్చున్నచోటునుండి లేచి సమీపానికివచ్చి, 'ప్రపంచం బహు చిన్నదని, రెండోపర్యాయం మనం ఎక్కడో ఒకచోట తప్పక కలుస్తామని నీవేగదా చెప్పావు' అని అన్నది చంప.

'ఇప్పుడు అంత చిన్నది కాకపోవచ్చు. ప్రతిమాటను సాహిత్యస్వరూపం యివ్వడం మంచిపనికాదు' అని అన్నాడు గౌతం చిరాకుగా.

'మాటలకు సాహిత్యరూపం యిచ్చేది నేనుకాదు నీవే.'

'నేనా!'

'అవును, నీవే. నీవు నాకు బాగుంటావు అని నేనొకపర్యాయం అన్నాను. 'అది నీ తప్పు' అని ఆనాడు నీవు అన్నావు.'

'నేను సుజాతాదేవిగారి యింటిదగ్గర స్వామీ దేవికానంద్‌ని కలుసుకొని వస్తున్నాను. కమాల్‌ను చూశావా!'

'లేదు' అని అన్నది చంప. ఈ మనిషి నిమిషనిమిషానికి మారిపోతుంటాడేమో అని లోలోన నివ్వెరబోయింది. 'యూ.ఎస్ వెళ్ళేముందు నీవు నాకోసం ఆ రోజున ఫోను చేశావుకదా!' అని అన్నది.

'అవును, చేశాను. కేంబ్రిడ్జినుంచి రాగానే నీవు నాకు ఫోను చేయలేదూ!' అని అన్నాడు కఠినంగా.

'గౌతం! ఏమిటిది! మాటిమాటికి కరవడానికి దూకుతున్నావేమిటి? మొరటయాలా లేవు. ఏడు సంవత్సరాలతరువాత నిన్ను కలుసుకొన్నాను. సభ్యతగా వ్యవహరించు.'

'చంపా! ఇప్పుడు చాలా కంగారుగావున్నాను. కమాల్‌కు అందజేయునలసిన అర్జంటుకాబులు వున్నాయి. రెండుమూడు రోజుల్లో అతడు ఇంటర్వ్యూకోసం ఢిల్లీవెళ్ళవలసి రావచ్చు. నిర్మలకు రెండో ఆపరేషను జరిగింది. నీవు యిరవై నాలుగుగంటలు కలలుకంటూవుంటావు. మిగతాప్రపంచం ఎప్పుడూ నీ కలలతో బాటు నడవమంటే నడువగలదా!'

'అరే! ఇంతపనిజరిగిందా! నాకేమీతెలియదు. పోదాంపద. కమాల్ ఎక్కడ వున్నాడో వెతుకుదాం' అంటూ చంప వెంటనే బయలుదేరింది. గౌతం ఆశ్చర్యపడ్డాడు. చంపాబాటి నిజంగా విచిత్రమైన మోహినీస్వరూపిణి, అని అనుకున్నాడు గౌతం.

గౌతం సురేఖగారింటికి ఫోనుచేశాడు. గుల్షన్ ఫోను అందుకొని, 'కమాల్ ఎక్కడ వున్నాడో తెలియదు. రోజర్‌దగ్గరకు నిర్మలనుగురించి తెలుసుకొనేందుకు వెళ్ళాడో ఏమో! సురేఖ యింకా రాడా (రాయల్ అకాడమీ ఆఫ్ డ్రెమెటిక్ ఆర్ట్) నుండి యింటికి తిరిగిరాలేదు. రోజర్‌దగ్గరనుండి తిన్నగా మాయింటికి తిరిగివస్తానని కమాల్ చెప్పాడు. నీవు మాయింటికి రా. నేను కాలేజీ వెళుతున్నాను. తాళం చెవి ప్రక్కయింట్లో యిచ్చివెళుతున్నాను.' అని చెప్పాడు.

'ఎవరైనా లిట్ హర్ట్స్ వెళుతున్నారా?'

'లలిత్. హరిశంకర్ వెళ్ళారు. నీవు కూడా వెళుతూంటే మా యింట్లో విమలకు అందజేయవలసిన పొట్లం బల్లమీద పెట్టివున్నది. తీసికొనివెళ్లు. లలిత్ తీసికెళ్లడం మరిచిపోయింది.'

'సరే, ఇప్పుడే వస్తున్నాను.'

వాళ్ళిద్దరూ సెంట్ జార్జి టీక్కు బయలుదేరారు. ఆ గారింట్లో తాళంవేసుకొని సురేశ్‌గారి ముందుగదిలోకి వెళ్ళారు. తోటవైపునగల అద్దాలకిటికీ తెరిచారు. బయట ఎండలో మంచు తళతళ మెరుస్తున్నది.

'సురేశ్ గుప్తన్‌గారలయిల్లు ఎంత హాయిగా వున్నదో!' అని అన్నారు గౌతం సోఫామీద పడుకొంటూ. తోటబయటినుండి సంగీతం వినబడుతున్నది.

గదిలో ఒకవైపున పుస్తకాల అలమారాలు వున్నాయి. గది ఎంతో చక్కగా ఆధునికపద్ధతిలో అలంకరించబడివున్నది. ఇది నర్తకివుండే గది అని చూడంగానే స్పష్టంగా అనిపిస్తుంది. ఒకమూల కుట్టుమిషన్. మృదంగం. కూరగాయలబుట్ట వున్నాయి. గౌతం చిరునవ్వు నవ్వారు. ఇది కళాకారుడి ఆర్టిస్టు గది. అయినా సుఖంగా హాయిగా వుండేందుకు అవసరమైన ఏర్పాట్లన్నీ వున్నాయి.

'ఇక్కడ చాలా మంచిక్షణాలు గడిపాను. వీళ్లంతా మంచివాళ్లు. గదుల్నిబట్టి యిందులో వుండేవాళ్ళ వ్యక్తిత్వాన్ని మనం తెలుసుకోవచ్చు.' అంటూ లేచికూర్చున్నారు. అసర్లీలో జరీనా యిల్లుకూడా కళాకారుడి యిల్లులా వుంటుంది. సెంట్ జాన్ వుడ్‌లో లలిత్, కమాల్ వుండేయిల్లు గుల్‌ఫిషాంలోని ఒకభాగంగా కనబడుతుంది. సుజాతాదేవి గది వున్నది. అక్కడి ప్రతివస్తువులోను వేషం కనబడుతుంది.'

'వేషానికి, వాస్తవికతకు తేడా ఎలా తెలుసుకొంటావు?' అని అడిగింది చంప.

'మనల్ని మనం అసలు గతాన్ని దూరంగా వుంచుకోలేము. నేను యిప్పటి వరకు ఏ గతాన్నిగురించి చూడనేలేదు. ఆశ్చర్యం! చూసే సత్రంలో బెంచీమీద కూర్చున్న నిన్నుచూస్తే వారణాసినుండి వచ్చినమనిషిగా లేనేలేవు' అని అన్నారు గౌతం. కొంచెంసేపు ఆగి 'మనం మనగతాన్ని ఏమాదిరిగా ఎప్పుడూ మరిచిపోకూడదు.'

'నీ వన్నమాట శుద్ధ తప్పు. మీరంతా దూరంగా వెళ్ళిపోయారు. నేను ఒక్క-తెనే ఒంటరిగా వుండిపోయాను. ఇంతజరిగినా నేను విశ్వాసపాత్రంగా వుండ లేదని అంటున్నావు' అంటూ కోపంతో అన్నది.

'గతసంవత్సరం అమెరికానుండి నీకు జాబువ్రాశాను. అక్కడి ఒక దేవదారు చెట్లమధ్యనకూర్చొని సంతోషంగావున్నసమయంలో వ్రాశాను ఆ జాబు. అంత సంతోషం అప్పుడప్పుడు ఎందుకు కలుగుతూవుంటుందో, చెప్పలేను. ఏది ఏమైనా నేను నీకు జాబువ్రాశాను. అది నీకు అందలేదనుకొంటాను.'

'నాకు యీనాటివరకు నీ జాబు ఒక్కటీ అందలేదు.'

ఇంతలో ప్రక్కయింట్లో ఎవ్వరో బిగ్గరగా పాడటం ప్రారంభించారు.

'గౌతం। నన్నుగురించి తేలికగా అల్పంగా మాట్లాడకు' అంటూవుంటే చంపావతీకళ్లు కన్నీటితో నిండిపోయాయి.

'ఏడుస్తున్నావా? జీవితంలో కన్నీటికి కొదువవుండదు. ఎందుకు ఏడ్వడం? నవ్వు. ఉదాహరణకు వయ్యాద్ ను చూడు. ఇవాళ నర్సరీకెట్ నుండి బయటికి వస్తుంటే ఆయనను చూచాను. తనభార్యతోబాటు సంతోషంగా వెళుతున్నారు. మానసికంగా ఆరోగ్యంగా వున్నవాళ్ళు వయ్యాద్ లా హాయిగా వుంటారు.'

'అనవసరమైన మాటలు కట్టిపెట్టు' అంటూ కుంపటిలో బొగ్గులు సరిచేయ సాగింది.

పాట యింకా దగ్గరగా వినబడసాగింది.

'అల్పం. కిటికీ మూసివేయి' అని అన్నాడు విసుగ్గా గౌతం.

'వీళ్లు రాత్రి ప్రొద్దుపోయేదాకా గొడవచేస్తూనే వుంటారు. ఎండమలో వీళ్లకు మరోపనే వుండదు.'

'అక్కడ కమాల్ కూడా వున్నాడేమో? వీళ్ళంతా యీరాత్రి జాగరణ ఎందుకు చేస్తున్నారో।'

'రేపు ఉదయం వీళ్ళంతా బుడాపెస్ట్ వెళుతున్నారని తెలిసింది.'

'బరువు ఎత్తుకో హయ్యా, హయ్యా' అంటూ పాట పాడుతున్నారు. గౌతం లేచి బయటకువెళ్లి కొంచెంసేపు అయినతరువాత తిరిగి లోనికివచ్చి 'అక్కడ కమాల్ లేడు' అని అన్నారు.

'గౌతం మాష్టర్ ।'

'ఆఁ.'

'నేను చాలా మూర్ఖురాలినా?'

'కాదనుకుంటా. అయితే అంత తెలివిగలదానివికూడా కాదనుకుంటా.'

'ఈ విషయమే అడగాలని అనుకొన్నాను. సమాధానం చెప్పావు. నాకు యిక హాయిగా వుంటుంది.'

'మిత్రమా! టీ తయారు చేద్దామా?' అని అన్నారు గౌతం కాసేపు ఆగి. చంపలేచి వంటగదిలోకి వెళ్ళింది.

గౌతం వంటగది తలుపుదగ్గరకువచ్చి నిలబడ్డాడు. చంపవైపు తదేకంగా చూస్తూ. 'చంపా రాణీ! ఓమాదిరిగా వున్నావు. కారణం?' అని అడిగాడు.

'ఎలా వుండమంటావు? నాట్యం చేయమంటావా?'

'ఇదా సమాధానం? వెనుకటిరోజుల్లో ఒకమాటకు పదిమాటలు సమాధానం చెప్పేదానివి. అరెరే! అటుదూడు రొట్టె మాడిపోయింది.'

'నీకు నచ్చినవంటకాలు వండి నీకు అందజేసేందుకు తలబ్ యిక్కడలేదు.'

'చంపా! ఎందుకు యిటువంటి అనవసరంమాటలు మాట్లాడుతావు?'

'గౌతం! వెళ్ళిపొమ్మంటే యిక్కడినుండి యిప్పుడే వెళ్లిపోతాను. భవిష్యత్తులో నిన్ను కలుసుకొనేందుకు ప్రయత్నించను. ఇన్నిసంవత్సరాలనుండి మళ్ళీ నిన్ను కలుసుకోవాలనే ఆశతో, ఆకాంక్షతో వుండటం నా పొరపాటే' అని అన్నది చంప.

గౌతం వంటగదిలోకివచ్చి ఒక బెంచీమీద కూర్చున్నాడు. తన శిరస్సును చేతులమీద ఆనించుకొన్నాడు. 'చంపారాణీ! అసలువిషయం చెబుతున్నాను. విను. ఎందుకో నిన్నుచూచి నేనే భయపడుతున్నాను. నీతో ఏం మాట్లాడాలో నాకే బోధపడటంలేదు. నీవు ఏమంటున్నావో, నీకు ఏమి చెప్పాలని నా మనస్సులో వున్నదోకూడా తెలియడంలేదు. చాలాకాలం గడిచిపోయింది. మాట్లాడుకోడానికి చెప్పుకోడానికి మనిద్దరిమధ్య ఏమీ మిగిలినట్లు కనబడటంలేదు' అని అన్నాడు.

ఆమె టీ తయారుచేసి ముందుగదిలోకి తీసుకొనివచ్చింది.

'ఇక్కడికిరా!' అంటూ కఠోరంగా అన్నది. గౌతం లేచివచ్చి చటకుంపటి దగ్గరగా కూర్చున్నాడు.

ఏదో చెప్పాలనే ఉద్దేశ్యంతో అక్కడే బల్లమీదవున్న సంచినిచూపి, 'అబ్బ ఎంత అందంగా వున్నదో! ఇందులో యీ నా కాగితాలు వుంచనా?' అని అన్నారు గౌతం.

'వుంచు.'

ఎంతో జాగ్రత్తగా వాటిల్ని సంచిలో పెట్టారు గౌతం.

మాటలు ఆగిపోయాయి.

'ఈ సంచిలో నీ వస్తువులు వున్నాయికదూ! వెళ్ళేటప్పుడు యీ కాగితాలుతీసి నా కిచ్చివేయి లేకపోతే అంతా తారుమారవుతుంది.'

'ఈ సంచి నాదికాదు. నురేండి. దీనిలో నీ వస్తువులు పెట్టుకో. ఇంటికి తీసుకుపో. నా వస్తువులకు నీ వస్తువులకు పొంతన ఏమీలేదు. ఈ సంచికి, కాగితాలకు, యింటికి, వస్తువులకు, స్మృతులకు, ఏమీ పొంతనలేదు. ఉండనక్కరలేదు. కేవలం దుఃఖంలోమాత్రమే మనిద్దరికి మిత్రత్వం వుంది. దాన్నికూడా వేరుచేద్దామనుకొంటున్నావు.'

గౌతం ఏమీ మాట్లాడలేదు.

'గౌతం! గత ఏడుసంవత్సరాలనుండి నేను నిన్ను చూడలేదు. కాని నాకు బాగా తెలుసు. ప్రతినిమిషంలోను, నిద్రిస్తూ, మేల్కొంటూ, లేస్తూ, కూర్చుంటూ నీకు వ్యతిరేకంగా నీవే సాక్ష్యం చెప్పుకొంటూవున్నావు. ఈవిషయంగా అర్థం చేసుకొన్నావా?'

'అవును. ఎవరితో మాట్లాడినా ఏమిటో సరిగా వుండదు. ఏమిటో చిక్కు చిక్కుగా వుంటుంది. నేను చాలాహత్యలు చేశాను. నిన్ను చంపాను. నన్ను నేను చంపుకొన్నాను. నేనుచేసిన అపరాధం నీవుచేసిన అపరాధంకంటే పెద్దది. నీలో అమాయకత్వపుదోషం దాగివున్నది. ఒక్కమాట చెప్పు. నీ దృష్టిలో పాపం అంటే ఏమిటి?'

'ఒకళ్ళమనస్సును నొప్పించడమే పాపం' అని అన్నది చంప కొంచెం ఆలోచించి.

'ఇంకా.'

'కరుడుగట్టిన పెంకెతనం.'

'ఇంకా.'

'అల్పావు మన సత్యం.'

'నేను నీ మనస్సును దుఃఖపెట్టాను. నీదృష్టిలో అది పెద్దపాపం.'

'చాలా పెద్దపాపం.'

'ఒక్కొక్కప్పుడు యితరుల మనస్సులను బాధించవలసివస్తుంది. మరోమార్గం వుండదు. ఎందుకు అలా చేయవలసివచ్చిందో త్వరలోనే నీకు తెలుస్తుంది.'

'హంతకుడుకూడా హత్య చేసేముందు ఈ హత్యచేయడం తప్పనిసరి అనే భావిస్తాడు. మరోమార్గంలేదని భావించకపోతే హత్య చేయనేలేడు కదా!'

గౌతం ఏమీ మాట్లాడలేదు.

కొంతసేపు గడిచినతరువాత గౌతం అందుకొన్నాడు. 'ఈ చెప్పులు చూడు. జీవితం వీటిలా నలిపోదు.' అంటూ రొయ్యముక్క తీసి కిటికీలోకూర్చొని వున్న పిల్లిముందు విసిరివేశాడు. పిల్లి దాన్ని వాసనచూచి వదిలివేసింది. 'ఇది చిత్రమైన పిల్లి. రొట్టె తినదు. దీనికోసం 'లాబ్‌స్టర్', 'షాంపైన్' తీసుకురావాలి కాబోలు. చంపా! నీవు యిన్నిరోజులు నాకోసం అనవసరంగా ఎదురుచూస్తూవున్నావు. నేను ఒట్టి దొంగను' అని అన్నాడు. అతనికి చంప మూర్ఖురాలుగా కనిపించింది.

'చంపా! ఎక్కడికీ వెళ్ళడంలేదు కదూ!'

'అప్పుడే వెళ్లడంలేదు. మనం ఒకేద్వారంగుండా లోపలికివచ్చాం. కాని బైటకు వెళ్ళేద్వారాలన్నీ మూసుకుపోయాయి.'

'ఇంత అమాయకత్వంకూడా తప్పు. ఇంకా నీకు చాలా కష్టాలువస్తాయి.'

గౌతం కిటికీదగ్గరకువచ్చి నిలబడ్డాడు గదంతా అటుయిటు తిరిగాడు. మందు తుపాను వెలిసింది. చంప మౌనంగా కుంపటిదగ్గర కూర్చున్నది. గదిలో పిల్లి కూడా వున్నది.

'ఈ అస్తిత్వాలన్నీ గ్రంథంలాంటివి. దాన్ని నేను చదివాను. చివరివరకు చదువుతాను.' చంప తనలో తాను అనుకొన్నది.

'రెండు ప్రపంచాలు ఎప్పుడూ నాతోబాటు వుంటాయి. ఒక ప్రపంచంలో యీ జనమంతా వున్నారు. రెండో ప్రపంచంలో కేవలం నీవు నేను యిద్దరంమాత్రమే వున్నాం. మన యిద్దరిమధ్య వంతెన వున్నది. ఈ వంతెన కూలిపోయినప్పుడు ఏమి జరుగుతుందో!'

'వంతెనను నీవే స్వయంగా కూలుస్తావా!'

'లేదు, కూర్చను. కాని జనం నాలుగువైపులా తుపాకులు గురిపెట్టివుంచారు. పొదల్లో ఫిరంగులు దాగివున్నాయి. పైన మేఘాలు గర్జిస్తున్నాయి. అసలు యీ మనుష్యప్రపంచం తప్పక నశించిపోతుంది. నేను బాధపడుతూ మిగిలిపోతానని తలుచుకొన్నప్పుడు మనస్సు క్రుంగిపోతుంది.'

'నీవు నీ 'దీపం' పుచ్చుకొని పైకప్పు కర్రలమీదకు ఎక్కి కూర్చున్నావు. రంగస్థలంమీదకువచ్చిన దురదృష్టవంతులమీద అల్పబుద్ధితో హీనస్వభావంతో హఠాత్తుగా దీపం వెలుగు ప్రసారం చేస్తున్నావు.'

'నేనుకూడా ఆ వెలుగులోనే వున్నాను గదా!'

'లేదు. నీవు తెరవెనుక దాగివున్నావు. ఏనాడైనా ఒక టార్చిలైటు నామీద పడితే ఏమవుతుంది? అప్పుడు పైకప్పుమీదినుండి ఒక్కదూకుదూకి పారిపోతావు. కిటికీలలో జనం నాకు కనబడతారు. స్టౌవుచుట్టూ తిరుగుతూ, చప్పుడుచేస్తూ వంట చేసుకొని తింటూ అల్లరిచిల్లరమనిషిగా మెల్లమెల్లగా అడుగులు వేస్తూవస్తావు. నీ ముఖం కిటికీఅద్దంలోగుండా మాకు కనబడుతుంది' అని అన్నది చంప.

'అప్పుడు నేను నీతోబాటే వుంటాను. నేను వంటచేసితింటూంటే నన్ను నీవు కిటికీవెనుకనుండి తొంగిచూస్తావు.

ఇద్దరూ మౌనం వహించారు.

గౌతం గోడమీది బొమ్మల్ని చూసి కిటికీవైపుకు వెళ్ళాడు. 'ఇవాళ చాలా మంచుపడింది' అని అన్నాడు.

'ఇంకా పడుతుంది. తరువాత చలిపోయేదాకా పడుతూనేవుంటుంది' అన్నది లోలోన చంపావతి.

'సురేఖ ఫోటో ఎంతో అందంగా వున్నది' అని అన్నాడు.

'నాకు అట్టి అదృష్టం లేదు. జనానికి అదృష్టాలంటూ వుంటాయని విన్నాను' అని అన్నది లోలోన.

ఇంతలో గౌతం ఉలిక్కిపడ్డాడు. వెనక్కి తిరిగిచూశాడు. అతనిముఖం వెలవెల బోయింది. 'రోజంతా గడిచిపోయింది. ఇంకా నేను యిక్కడే వున్నాను. ఇక్కడ నేను ఏమి చేస్తున్నాను! ఎంతోసమయం వృధాచేశాను' అంటూ గబ గబా భోజనాలగదిదగ్గరకుపోయి అక్కడ పెట్టియున్న పొట్లాన్ని పుచ్చుకొని వెనక్కుతిరిగి చంపను చూడనైనాచూడకుండానే కొంగలా బయటకు గబగబా

వెళ్లిపోయి కారెక్కి లిబ్‌హర్ట్సుకు బయలుదేరి వెళ్ళిపోయారు. అతడు వెళ్ళిన తరువాత గౌతం మరిచిపోయివెళ్ళిన కమాల్ పేరటవున్న కవర్లు బయటకుతీసి తెరిచిచూపింది చంప.

అన్నీ కమాల్‌కువచ్చిన టైపుచేసివున్న ఉత్తరాలే. ప్రతిఉత్తరంలోను ఉద్యోగం యివ్వడానికి వీల్లేదని వ్రాసివున్నది.

# 49

'తలత్! టీ!' చంద్ర బల్లమీదకూర్చుంటూ అన్నది.

తలత్ టీ కప్పు ఆమెకు అందించింది. సురేఖ శ్రద్ధగా రేడియో వింటున్నది. జరీనా తోటవైపుగల తలుపుదగ్గరగా పొడిఎండలో పిల్లది బొమ్మలు గీస్తున్నది. ప్రపంచవ్యవహారాలు ప్రశాంతంగా జరిగిపోతున్నాయి. నిర్మల చనిపోయినప్పటినుండి ఇంకా ఎక్కువప్రశాంతంగా జరిగిపోతున్నాయి. ఎవరిపనుల్లో వాళ్ళు లీనమై వున్నారు. తలత్ పత్రికలకు సమాచారం వ్రాస్తూవుంటుంది. ఫిరోజ్ పుస్తకాలు తీసికొని రోజూ కాలేజీకి వెళుతున్నది. కమాల్ సురేఖగారి అతిథుల గదిలో చలి కుంపటి ఎదురుగాకూర్చొని ఆర్టీలు వ్రాస్తూవుంటారు. హరిశంకర్ పక్షి ఈకలను ప్రోగుచేసే క్రొత్తకార్యక్రమం ప్రారంభించారు.

నిర్మల చనిపోయి ఇవాళటికి పదవరోజు. కాని నిర్మల చనిపోయి సంవత్సరాలైనట్లుగా వున్నది.

'ఇక మనం నిర్మల పదమూడవరోజు కార్యక్రమానికి పూనుకోవద్దూ' అని అన్నారు హరిశంకర్. 'అవును' అని అన్నారు కమాల్.

'ఇక్కడ పురోహితుడు ఎవ్వరూ లేరు. ఉండివుంటే యివాళ మనం ఏమి చేయాలో అడిగి తెలుసుకొనేవాళ్లం' అని అన్నది తలత్.

ఫోనుగంట మ్రోగింది.

'మీరు పదమూడవరోజుకోసం ఏమీ ఏర్పాట్లు చేయకపోతే ఏమీ పరవాలేదు. స్వామీ దేవికానంద తమ కేంద్రంలో ఏర్పాట్లుచేస్తానని అంగీకరించారు' అని చెప్పింది సుజాత ఫోనులో.

'మంచిది, మంచిది' అని కమాల్ రిసీవర్ పెట్టివేశాడు. తిరిగి అంతా ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నులైనారు. తలత్ ఒక వ్యాసం తయారుచేయసాగింది. సురేఖ నాట్యశాలకివెళ్లి నాట్యం అభ్యసించసాగింది. హరిశంకర్ పక్షి ఈకల ఆల్బం తీసుకొన్నారు.

గడియారం మూడుగంటలు కొట్టింది. 'నర్ రోజర్దగ్గర డెత్ సర్టిఫికెట్ పుచ్చుకోవాలి' అని అన్నాడు కమాల్.

'తీసుకురా' అని అన్నాడు నెమ్మదిగా హరిశంకర్.

'లిట్‌హర్ట్స్‌నుంచి విర్మల సామానుకూడా తీసుకురావాలి' అని అన్నది తలత్.

'కాని మనం లిట్‌హర్ట్స్ ఎలా వెళ్లగలం?'

'మనం రీగలం. వెళ్లగలం, వెళ్ళాలి' అని అన్నాడు హరిశంకర్.

తరువాత అంతా బయలుదేరారు. కారులో కానికోరియాం చేసుకొన్నారు. పనులన్నీ ముగించుకొని చివరిపర్యాయం లిట్‌హర్ట్స్‌నుండి బయలుదేరారు.

సెంట్ జాక్‌వుడ్‌లోగల తమయింటికి చేరుకొని హరిశంకర్ వుంటున్నగదిలో సామానంతా పెట్టించాడు కమాల్. అంతా ఎవరిపనిమీద వాళ్లు వెళ్ళిపోయినతరువాత తలత్ నెమ్మదిగా హరిశంకర్‌గదిలో ప్రవేశించింది. హరిశంకర్ పక్షి రెక్కల ఆల్బం అక్కడే పెట్టి కమాల్‌తో కలిసి బయటకు వెళ్ళాడు. గదిలో ప్రతి వస్తువు దీపంవెలుగులో స్పష్టంగా కనబడుతున్నది. గదిలోగల సామానంతా కలియ చూచింది. ఇంతలో విర్మల సామాను ఆమెకంట బడింది. విర్మలసామాను చూసే సరికి ఆమె ఒళ్లు కంపించిపోయింది. ఏమిటీ జీవితం? అంతా మూన్నాళ్ళముచ్చట. ఈ సామాను యిక్కడెందుకు. అమ్మివేయడం మంచిది. దీనివిలువ మృత్యువు. మృత్యువు అని అనుకొన్నది. మృత్యువు అనుమాట పిడుగులా ఆమెచెవికి వినబడింది.

ఎదురుగావున్న బల్లమీద విర్మల చితాభస్మంవున్న చిన్నభరిణ పెట్టివున్నది. హరిశంకర్ ఆ భస్మాన్ని గంగలో కలపడంకోసం హిందూదేశం తీసుకొని వెళతాడు. అందుకై చివరిఏర్పాట్లు చేసుకొనేనిమిత్తం కమాల్‌తోబాటు హరిశంకర్ బయటకు వెళ్ళాడు.

అసలీ మృత్యువు ఏమిటి? అంతా ఒకనాడు చావవలసిందేగదా! ఇతరులు చని పోతే ఏడుస్తాం. మనంకూడా చనిపోతాం కదా? ఏమిటిది? ఎందుకు ఏడవాలి? అనవసరం. ఒకమ్మాయి పుట్టింది. పెరిగింది. చనిపోయింది. అంతే.

ఆమె వయస్సంతా కలిపితే చాలా తక్కువ. పరిశ్రమలోను, కార్యక్రమం తయారుచేసుకోవడంలోను కొంతకాలం గడిచింది. మొదటితరగతిలో ఉత్తీర్ణు లయేందుకు రాత్రింబగలు కష్టపడి చదివింది. ఆ తరువాత దేశసేవలో కొంతకాలం గడిచింది. ఎక్కడ ఏ గొడవజరిగినా మిత్రబృందంతోకలిసి అక్కడికి వెళ్ళిపోవ డమే. మొదటితరగతి వచ్చేసరికి కేంబ్రిడ్జి వెళ్ళాలని ఒకటే గొడవ. విమలతండ్రి నానాఅవస్థపడి డబ్బు ప్రోగుచేసితెచ్చి ఇంగ్లండుకు పంపించాడు. విమలకు కలిగిన సంతోషం అపారం. కేంబ్రిడ్జి చేరుకొన్నతరువాత మూడుపూవులు ఆరుకాయలుగా కాలం గడుససాగింది. ఇక్కడ చదువు పూర్తి అయినతరువాత మంచి ఉద్యోగం సంపాదించాలనే ఆలోచన ప్రారంభమైంది. తండ్రిచేసిన అప్పుతీర్చాలి. అన్న య్యకు అమ్మాయినిచూసి పెండ్లిచేయాలి. డబ్బు నిల్వఅయితే తీసికొని ఔటర్ మంగోలియా, మెక్సికోవెళ్ళి చూసిరావాలి. (ఔటర్ మంగోలియా వెళ్ళాలనే ఆకాంక్ష ఎందుకు కలిగిందో తెలియదు). ఆతరువాత ఒక చక్కని సొంతయిల్లు ఏర్పాటుచేసికోవాలి. ఆ యింట్లో పచ్చనితోట ఏర్పాటుచేసుకోవాలి. ఇంతేగాక, పిల్లిపిల్లల్ని, కుక్కపిల్లల్ని, పావురాళ్లను, ఆవులను, గేదెలను పెంచాలి. వీరంటే ప్రాణాలివ్వడమే....ఇలా రోజులు గడుస్తున్నసమయంలో విమలకు జ్వరం రా సాగింది. ఆసుపత్రికి చేర్చారు. అక్కడ కొద్దిసంవత్సరాలు గడిచాయి. జబ్బు నయంకాలేదు. ఒకరోజున ప్రాణాలువిడిచి ఆ జీవి ఆత్మ పరమాత్మలో కలిసి పోయింది. ఇదీ జరిగినకథ. ఇట్టిస్థితిలో చావునుచూసి ఏడ్వడం సరియైన పనేనా? కాదు. నిజానికి మృత్యువునుగురించి నవ్వాలిగాని ఏడ్వకూడదు అనేవిషయం తలత్ కు బోధపడింది.

గదిలో అటుయిటు పచార్లుచేసింది. మళ్ళీ హరిశంకర్ గదిలోకివెళ్ళింది. విమల సామానంతా చూసింది. పుస్తకాలు తిరగేస్తుంటే భగవద్గీత కనబడింది. దాన్ని తీసి కొని ముందుగదిలోకి వచ్చింది. దీపం వెలిగించి శ్రద్ధగా గీత చదవడం ప్రారం భించింది. 'శరీరం అశాశ్వతం. కాని యీ శరీరంలోవుండే ఆత్మ శాశ్వతం. అందువలన యుద్ధంచేయి. ఓ భారతపుత్రుడా! ఆత్మ యితరులను వధించదు.

వధించలేరు. ఆయుధాలు దాన్ని గాయపరచలేవు. అగ్ని దాన్ని కాల్చలేదు. నీరు దాన్ని తడపలేదు. గాలి దాన్ని ఆరబెట్టలేదు. పుట్టినవాడు గిట్టడం తథ్యం. గిట్టిన వాడు పుట్టడం తథ్యం. ఇందు దుఃఖపడవలసిన విషయం ఏమీలేదు.

సుఖదుఃఖాలు, లాభనష్టాలు, గెలుపు ఓటములు అన్నీ సమానమని భావించి నీవు యుద్ధంచేయి.'

ఓ అర్జునుడా! ఛీ ఛీ ...బుద్ధిహీనుడు—అంటూ పుస్తకం టపీమని మూసి లేచింది మరోపర్యాయం హరిశంకర్‌గదిలోకి వెళ్లింది. మళ్లీ విశ్వం సామా నంతటిని స్పర్శించడం ప్రారంభించింది. చీరెలు, గాజులు, అలంకరణసామాగ్రి చేతి సంచీ, బస్సు టిక్కెట్లు, చాకలి బిల్లులు, ఖాళీటప్పీకెలు, చెవులపోగులు, చిల్లర డబ్బులు ఇంకా ఏమేమో వున్నాయి. అన్నింటిమీద నాలుగుసంవత్సరాలనాటి తారీఖు వేసివున్నది. తరువాత విశ్వం పుస్తకాలనన్నింటిని వర్ధించాలని అను కొన్నది. ఒక పుస్తకంలోనుండి ఒక జాబు క్రిందపడింది. తలత్ వంగి జాబుతీసి చూసింది. అది జాబుకాదు. గౌతం పీలాంబర్ ఫొటో. పదిసంవత్సరాలక్రితం పెండ్లికొడుకురూపంలో ఆ ఫొటో బహావుచ్‌నుంచి సింఘాదేవాలీ భవనానికి పంపించబడింది. శూన్యనేత్రాలతో ఆ ఫొటోవంక చూసి దాన్ని తిరిగి పుస్తకంలో పెట్టివేసింది. గదిలో చప్పుడు వినబడింది. అంతా తిరిగివచ్చారు. ఆరాత్రి తలత్ చప్పుడుకాకుండా నడచి హరిశంకర్‌గదిలోకివెళ్లి గౌతం పీలాంబర్ ఫొటో తీసుకొని తనగదిలోకివచ్చి ఆ ఫొటోను చెప్పుతో ఆయాసం వచ్చిందాకా కొట్టింది. అప్పటికి ఆమె ఆత్మ కొంచెం శాంతించింది. ఆ తరువాత సోఫామీద కూర్చొని వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

## 50

ప్రపంచమంతా తెల్లనిమంచుగుడ్డ ధరించింది. విపరీతంగా చలివేస్తున్నది. ఒక వైపున చిన్న 'కాటేజ్' (యిల్లు) వున్నది. ఆ 'కాటేజీ'కి ముందు వరండా

వున్నది. ఎర్రని యిటుకలగోడమీద రాగిలాంతరు వెలుగుతున్నది. లోపల దరి కుంపటి కణకణలాడుతూ వెలుగుతూవున్నది.

జరీనా హుసేన్ ఆ యింటిలో తనతల్లి, తమ్ముళ్లతోబాటు వుంటున్నది. ఆమె 'కళ'లో యోగ్యతాపత్రం పుచ్చుకొన్నది. ఆమెతల్లి మంచివయస్సులోనే వున్నది. ఆమె ఆంగ్ల స్త్రీ. కాని లక్నో ఉచ్చారణతో ఉర్దూలో మాట్లాడుతుంది. ఆమెది ప్రేమమయమైన హృదయం. జరీనా స్నేహితులకు ఆ యింట్లో ఎప్పుడూ శరణ్యం దొరుకుతూవుంటుంది. ఇంటికివచ్చినవాళ్లందరితో ఆమె పెద్ద అక్కగారిలా వ్యవహరిస్తూవుంటుంది. జరీనాతండ్రి లక్నోలో బారిష్టరు. ఆయన ఆంగ్లభార్య తన పిల్లల చదువుకోసమని కొద్ది సంవత్సరాలనుండి లండనులో వుంటూవున్నది.

జరీనా కూర్చొని ఒక రష్యన్‌పత్రిక చదువుతున్నది.

ఇంతలో గాలరీలో గంట మ్రోగింది. జరీనా లేచి కిటికీలోనుండి తొంగి చూసింది. మంచుతో కప్పబడిన చెప్పులతో, పై కోటుకాలరుతో ముఖం కప్పుకొని గౌతం నిలబడివున్నాడు. అతణ్ణిచూస్తూ జరీనా అలాగే నిలబడి వుండిపోయింది.

అతడు చేతిలో చిన్నపెట్టెపుచ్చుకొని మెట్లెక్కి వరాండాలోకి వచ్చాడు.

'ఇది బకవపట్టణం. ఇక్కడకూడా దీపాలు వెలుగుతున్నాయి. ఈచోటు యితరచోట్లవలె వుండదని అనుకొన్నాను.'

'నీ అభిప్రాయం తప్పని తేలింది. ఏం చేస్తాం మరి? లోపలికి దయచేయి' అని అన్నది జరీనా.

'నాతోబాటు యింకా చాలామంది బయట నిలబడివున్నారు.'

'అందరినీ లోపలికి పిలు.'

'ఎలా పిలవను? యీ వెలుగులో వాళ్ళందరిముఖాలు నీవు చూడలేవు.'

'ఎవరు వాళ్ళంతా?'

'దయ్యాలు, శవాలు, మృతాత్మలు. అవన్నీ నా మిత్రకోటిలోనివి. బయట చీకట్లో పండ్లు యికిలించుకొంటూ నిలబడివున్నాయి. అవన్నీ నావెంట ఊరేగింపుగా వస్తున్నాయి.'

'నాకు వాటినిచూస్తే భయం కలుగదు.'

'నీకు భయం కలుగకూడదు. మనమంతాకూడా ఆదయ్యాలరూపం దాలుస్తూ వుంటాం. కాని....ఈ యిల్లు యితర యిళ్ళమాదిరిగావుండదని, చీకటిమయంగా

వుంటుందని అనుకొన్నాను. కాని నీవు యిక్కడ దీపాలువెలిగించి పెట్టావు. వెలుగులో ఏం చూడాలని ప్రయత్నిస్తున్నావు?' అంటూ చేతిలోని పెట్టె క్రింద పెట్టి దానిమీద కూర్చున్నాడు. జరీనా గాలరీతలుపులు తెరిచింది.

'స్వాగతం గౌతం. నీవు ఎక్కడ వెళ్ళావో తెలియక కంగారుపడుతున్నాం. ఎక్కడికివెళితే ఏం చివరకు తిరిగివచ్చావు. సంతోషం.'

'అందరికీ కృతజ్ఞత.'

'వెల్‌కం హోమ్. అంటే ఎవరు ఎక్కడవున్నా చివరకు యాత్రానంతరం ఒక గూడు అంటే 'యిల్లు' అవసరమని నా అభిప్రాయం.'

'మంచిది. నీ స్వాగతాన్ని స్వీకరించాను. ఈ యిల్లు నీ వుండిన ఆ యింటిలా లేదు. అంటే కళాకారుల యింటిలాలేదు' అని అన్నాడు గౌతం తీవిగా.

'ఇది ఆ యిల్లే.'

'మంచిది. నీవు చెబుతూవుంటే కాదని ఎట్లా అనగలను? నరేగాని జరీనా నేను పిచ్చివాడిలా అయిపోయినానా?'

'లేదే. అలసిపోయినట్లు కనబడుతున్నావు....' అని అన్నది జరీనా భయపడుతూ.

'ఎక్కడా ఆగకుండా పరుగెత్తుతూవుంటే మనిషి అలసిపోక ఏమవుతాడు? ఇప్పటికి ఎన్నిలక్షలమైళ్లు నడిచానో నాకే తెలియదు.'

'ఇన్నాళ్లు నీవు ఎక్కడవున్నావు?'

'ఏం చెప్పను? చాలారాత్రిళ్లు పొలాల్లో గడిపాను. గడ్డివాములమీద నిద్రించాను. నదులమీద పడవల్లో పడివున్నాను. స్టేషన్లలోగల వెయిటింగ్‌రూముల్లో దాగిదాగి తిరిగాను. పోలీసులకు దొరక్కుండా తప్పించుకుతిరిగాను. పెద్దమనిషిలా స్వయంగా బయటపడి చేసినతప్పును అంగీకరిద్దామని నిర్ణయించుకొన్నాను.'

'పోలీసులా?'

'అవును. నీకు తెలియదా?'

'తెలియదు. ఏం జరిగింది?'

'జరీనాబేగం? నేను. నేను రెండుహత్యలు చేశాను. అప్పటినుండి తప్పించుకు తిరుగుతున్నాను. స్నేహితులందరియిళ్ళకు వెళ్ళివచ్చాను. వాళ్లంతా తలుపులు

A—19

మూసుకొన్నారు. నన్ను దరికి రానీయలేదు. వాళ్ళందరియిండ్లలో దీపాలు వెలుగు తున్నాయి. ఇటునుండి వెళుతూంటే నీ యిల్లు కనబడింది. ఇక్కడకూడా పరీక్షించి వెళదామని వచ్చాను.' అని అన్నాడు ఠీవిగా కాలుమీద కాలువేసుకొని.

'లోపలికిరా గౌతం. చలిగాలి తీవ్రంగా వీస్తున్నది.'

'నీవు పోలీసులకు చెప్పవుకదా ?' అంటూ అడిగాడు భయపడుతూ.

'ఛీ ఛీ. చెప్పను.'

'లేదు. ఇక్కడే కూర్చుంటాను. ఇంటిలోపలి భాగాలమీద నాకు నమ్మకం లేదు.'

మంచుజల్లులు విపరీతంగా వీస్తున్నాయి. ఆ తాకిడికి తట్టుకోలేక జరీనా చేతి రుమాలు చుట్టుకొన్నది.

'జరీనాబేగం ? విను. నేను రెండుహత్యలు చేశాను. అంగీకరిస్తున్నాను. నేను మోసగాణ్ణి. హంతకుణ్ణి. రెండుహత్యలు చేశాను. కాని హత్యచేయబడ్డవాళ్ళకు యీ విషయమే తెలియదు. సురేఖదగ్గరనుండి పరుగెత్తుకొంటూ ఆరోజున పార్సిలు తీసికొని నిర్మలదగ్గరకు ఆసుపత్రికి వెళ్ళాను. కాని నిర్మల గుర్తించనేలేదు. అప్పటికే ఆమె చచ్చిపోయివున్నది. అక్కడ నిలబడలేక నగరానికి పరుగెత్తు కొంటూవచ్చాను. తెగతిరుగుతూవున్నాను. చెల్సీలో అకస్మాత్తుగా చంప కన బడింది. చిత్తుగా త్రాగి పడివున్నది. చూశావా ? ఎంత త్రాగానో ? ఈ విద్యలో ఆరితేరినదాన్ని అంటూ నన్నుచూసి అన్నది.'

మంచుతుపాను తీవ్రమైపోతున్నది. ఇంతలో మంచుగడ్డలు రేపుతూ ఒక కారు వచ్చి యింటిముందు ఆగింది.

కమాల్, హరిశంకర్ లిద్దరూ కారు దిగారు.

'జరీనా ! గౌతం వచ్చాడా ?' అని కంగారుగా అడిగారు.

గబగబ మంచుగడ్డమీద నడుస్తూ మెట్లు ఎక్కారు.

'స్వామీజీ కేంద్రంలో గౌతం యిటువచ్చాడని చెప్పారు' అని అన్నాడు కమాల్.

ఎదురూగా స్పృహతప్పిపోయి పడివున్న గౌతం కనిపించాడు. అతణ్ణి కారులో వేసుకొని తమయింటికి తీసుకొనివెళ్ళారు.

'ఎవ్వరూ రాలేదు' అని అన్నది సుజాత. 'ముగ్గురూ నా స్నేహితులే. నిర్మలకు అయినవాళ్లు ముగ్గురూ నా స్నేహితులే' అని అన్నది. స్వామీజీ ఏర్పాట్లన్నీ చేశాడు. పుష్పాలు తెప్పించాడు. భజనమండలికూడా స్విస్ కాటేజీనుండి వచ్చింది.'

వాళ్లు తమయింట్లో ఏం చేస్తున్నారో తెలుసా ? ఆ భారతీయనాట్యకత్తె యింట్లో మకాంచేసి రోజంతా పేక ఆడుతున్నారు. ఛీ ఛీ' అని అన్నది ఒక ముసలి ఆంగ్ల వనిత.

చంప మెట్లమీదనుండి క్రిందికి దిగివచ్చింది.

'నీవు ఎవరికోసమో నిరీక్షిస్తున్నట్లున్నావు. అడుగో, అక్కడేవున్నాడు. మనల నందరినీ పిలుస్తున్నాడు' అంటూ కృష్ణభక్తురాలగు అమెరికన్ వృద్ధమహిళ పటంలోనున్న కృష్ణునిబొమ్మను చూపించి, 'అతణ్ణి అర్థం చేసుకోవాలంటే మూడో నేత్రం కావాలి. హిందూదేశవాసులగు మీరు ఆ మూడో నేత్రాన్ని పోగొట్టు కొన్నారు' అని అన్నది.

చంప అక్కడ నిలబడలేక క్రిందికి గబగబ దిగివచ్చింది. రోడ్డుమీదకువచ్చి వ్రేలితో తడిమి చూసుకొన్నది. శ్రోవన వెళ్లేవాళ్లందరికీ మూడో నేత్రం వున్న దని, అంతా ఆ మూడో నేత్రంతో తనను తీవ్రంగా చూస్తున్నారని ఆమెకు అని పించింది.

పరుగెత్తుకొంటూవెళ్ళి 79 వ నెంబరు బస్సు ఎక్కింది.

కేంద్రంలో స్వామీ దేవికానంద ఉపన్యాసం నివిపిస్తున్నాడు. యోగంమీద ఆయన ఉపన్యాసం విని ప్రేక్షకులు, వృద్ధమహిళలు తమతమ గృహాలకువెళ్ళి పాత్రలు తోముకోవాలి, గ్యాసు బిల్లులనుగురించి చింతించాలి. అప్పుడు కృష్ణపర మాత్మ వాళ్లకు ఎంతవరకు సాయపడతాడో చూడాలి.

చంప బస్సుదిగి హిందూదేశ విద్యార్థులువుండే కేంద్రం చేరుకొన్నది. గదిలో క్రొత్తగావచ్చిన విద్యార్థులుకూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుకొంటున్నారు.

'తలుపుదగ్గరకువెళ్ళి నేను చంపా అహమద్‌ను' అని పరిచయం చేసుకొన్నది.

'యస్' అంటూ ఒక దక్షిణ భారతదేశపు విద్యార్థి లేచివచ్చాడు.

'ఆమెగుండె చెరువై పోయింది. తనపేరు ఎవ్వరికీ తెలియదు. ఎవ్వరికీ తను అక్కరలేదు.'

'మీకు ఏం కావాలి?' ఒక బెంగాలీఅమ్మాయి అడిగింది.

'ఏమీ అక్కరలేదు. మీ కేంద్రం చూద్దామని వచ్చాను.'

కొంతమంది యువకులు ఆమెను అనుమానంగా చూశారు.

ఆమె అక్కడినుండి రోడ్డుమీదకు వచ్చివేసింది.

ఇండియాహౌసులో ప్రవేశించింది. ఫలహారశాలలో ఎప్పటివలెనే హడావుడిగా వున్నది. 'చూకేసత్రం' చేరుకొన్నది. అక్కడ కమాల్ కనబడ్డాడు. కొంటరుదగ్గర నిలబడి అతడు ఎవరికో ఫోను చేస్తున్నాడు. అక్కడినుండి త్వరత్వరగా వెళ్ళిపోయాడు. అద్దంతలుపులదగ్గర వెళుతూవున్న అతణ్ణిచూస్తూ నిలబడింది. ఆ తరువాత బయటకువచ్చి బి.బి.సి. కాంటీనులోకి తొంగిచూసింది. 'నేను చంపా అహమద్'నని అక్కడ వున్నవాళ్ళందరికీ బిగ్గరగా చెప్పాలని అనిపించింది. కాని తమాయించుకొని తిరిగి వచ్చివేసింది.

ఎదురూగా క్రింది అంతస్తు వున్నది. మెట్లుదిగి అనుకోకుండానే మెడావెల్ టిక్కెట్టు తీసికొన్నది. కొద్దినిమిషాలలో మెడావెల్ చేరుకొన్నది. వెడల్పాటి రోడ్డు మీదకు వచ్చింది. సమీపంలో సురేఖ, ఆశల యిండ్లు కనిపించాయి. స్టేషనుకు సమీపంలోనివరుసలో శాంత విలియమ్ క్రెగ్ వుంటున్నారు.

ఇంతలో సురేఖ కూరలసంచిపుచ్చుకొని ఎదురూగా వచ్చింది.

'హలో చంపా! ఇక్కడ ?. నీవున్నావేం? రా, వెడదాం' అని అన్నది.

చంప ఆమెవెనుక బయలుదేరింది. ఇద్దరూ యిల్లు చేరుకొన్నారు.

'ఈ సోఫామీద కూర్చో, ఇప్పుడే వస్తా'నని అన్నది.

'సోఫామీద కూర్చున్నంతమాత్రాన గది ఆనాటిగదిగా మారదుకదా!' అని అనుకొన్నది.

'ఆరోజా? ఏరోజా? ఏమిటి?' అని ప్రశ్నించింది సురేఖ.

చంప ఏమీ మాట్లాడలేదు——

'రేపు చాలామంది వెళ్ళిపోతున్నారు' అని అన్నది సురేఖ.

'ఎక్కడికి!'

'హిందూదేశానికి.'

'ఎవరెవరు వెళుతున్నారు?'

వాళ్ళంతా వెళుతున్నారు. కమాల్ ఓడమీద రేపు బయలుదేరుతున్నారు. గౌతం నీలాంబరు ఇవాళఉదయం విమానంలో న్యూయార్కు వెళ్ళిపోయాడు.

బయట సూర్యుడు అస్తమించాడు. చీకటి వ్యాప్తమైంది. చలికాలం. చీకటి ప్రపంచాన్నంతటినీ ఆవరించింది. చంప సాయంచేయడానికి వంటగదిలోకివెళ్ళింది. కొద్దిసేపు అక్కడవుండి బయటకు వచ్చింది. కమాల్‌యింట్లో దీపాలు వెలుగుతూ కనబడ్డాయి. 'నన్ను వదిలివెళ్ళవద్దు. నన్ను వదలివెళ్ళవద్దు' అని బిగ్గరగా చెప్పాలని అనిపించింది. కాని ధైర్యం తెచ్చుకొని స్టేషనువైపుకు నడిచివెళ్ళింది.

ఆమె జాన్ కార్టర్ వీధిలోకి ప్రవేశించింది. ఇంటికిచేరి లైటు వెలిగిద్దామని చేయి చాచింది. ఇంతలో చీకటి ఆమెకు స్వాగతం చెప్పింది. ఇప్పటివరకు చీకటికి నాకు పడేదికాదు. కాని యిక చీకటికి నాకు స్నేహం తప్పేలా లేదు. అంతా వెళ్లిపోతున్నారు. ఇక నేను పూర్తిగా స్వతంత్రురాలిని. పకపక నవ్వుకున్నది. క్రింది నేల గట్టిగావున్నది. ఈ నేలమీద చనిపోయేంతవరకు అడుగులువేస్తూ ముందుకు సాగవలసియుంటుంది. (ఇప్పటివరకు చూసిఎరగనట్లు తన కాళ్ల శ్రద్ధగా చూసుకొన్నది). ఇక రాత్రిని వదలను. ఈరాత్రి సాయంతో రేపటి పగటికై పయనిస్తాను. రాత్రీ! చెలీ చెప్పు. ఎలా వున్నావు! చాలాకాలాన్నుండి నిన్ను ఎరుగుదును. వర్షాల్లో, ఎండల్లో, చలికాలంలో, రైళ్ళలో పరీక్షరోజుల్లో ఫాల్గుణమాసంలో, నీ ప్రతిరంగు చూశాను. మనమిద్దరంకలిసి కాలం గడిపాము. ఒకరోజున నీవే గెలుస్తావు.

గౌతం నీలాంబర్! నిన్ను నీ కలలలో వదులుతున్నాను. నేను యాధార్థాన్ని, నీవు కలల్లో విహరించేవాడివి.

చీకటి పెరిగిపోసాగింది. చలికూడా తీవ్రమైంది. 'నన్ను గుర్తించు. నేను నిన్ను వదలను. నేను స్థిరంగావుంటానని అనుకొన్నావు. నీ అభిప్రాయం తప్పు. క్షణక్షణం ముందుకు వెళుతున్నాను. నన్నుగుర్తించు. అర్థం చేసుకో, నేను చివరిహద్దును. నన్నుదాటి వెళ్ళలేవు. ఇకనైనా తిరిగివెళ్ళిపో. చివరిహద్దువరకు వచ్చేశావు. ఇక ఎదురూగా అదుగో ద్వారం. అక్కడినుండి మరోదేశం ప్రారంభమవుతుంది. నేను చాలామందిని అలుముకున్న మాయాజాలాన్ని త్రెంచివేశాను.

నీవాక లెక్క కాదు. నన్ను గు ర్తించు. నేను ఎల్లప్పుడూ నీవెంట వడుస్తూనే వుంటాను. నన్ను వెళ్ళగొట్టలేవు. నిన్నువదిలి జనం వెళ్ళిపోతారు. నేనుమాత్రం నిన్ను ఎన్నటికీ వదలను. సరిహద్దుదగ్గరకు ఎంతత్వరగా చేరుకొన్నావో చూసుకో. నిర్ణయం చేసుకోలేకుండా వున్నావు. చాలాయిబ్బందులు కలుగుతున్నాయి. అన్నింటినీ తొలగించివేస్తాను. నిర్ణయాలన్నీ నామూలాన తామంతట అవే నెరవేర తాయి.

ఇంకా నీకు చాలాకష్టాలు కలుగుతాయి. వాటిని ఎదుర్కోవడం ఎలాగో నీకు నేర్పుతాను. నాతో రాజీపడు. నేను యెప్పటికీ నీ వెంటనే వున్నాను'. అంటూ కాలం ఆమెను గట్టిగా హెచ్చరించింది.

ఒక పెద్ద గాలికెరటానికి గదిలోని గుడ్డతెరలన్నీ రెపరెప కొట్టుకొన్నాయి. గదంతా మంచుజల్లుతో నిండిపోయింది. చలి ఎక్కువై ఆమె గజగజ వణికిపో సాగింది. త్వరత్వరగా లేచి కిటికీ మూసివేసి చంప లోపలిగదిలోకి వెళ్ళిపోయింది.

## 52

'అప్పి పెండ్లిలో కట్టుకొనేందుకు మంచిచీరె తయారుచేస్తాను' అని అన్నది నిర్మల.

నేను ఏమీ మాట్లాడలేదు.

'క్రొ త్తరకం అంచులచీరెలు నాకు నచ్చవు' అని అన్నది మాలతి ముసలమ్మలా. మాలతిరాయ్ కూడా వయస్సు పదహారు సంవత్సరాలు. ఆమె నిర్మలకంటె ఒక సంవత్సరం చిన్నది.

'నేను నిర్మలకంటె ఒక సంవత్సరం చిన్నదాన్ని. వాళ్లిద్దరు చీరెల్నిగురించి తమ గొప్పంతా వెల్లడించి నన్ను ప్రభావితంచేయాలని ప్రయత్నించారు' అంటూ తలత్ కొంచెంసేపు మౌనం వహించింది. 'గడిచిపోయినకాలం నా ఒక్కదాని కోసమే. దానివల్ల ఎవ్వరికీ ఏమీ ప్రయోజనం వుండదు' అని కమాల్‌తో అన్నది.

'నా వెనుకటిరోజులు నాకు సంబంధించినవే'నంటూ కమాల్ అన్నాడు.

'ప్రపంచం ఎప్పుడూ ఈనాటినే చూస్తుంది' అని అన్నాడు హరిశంకర్.

'కాని గడచినరేపే యీనాడు అను విషయం మరిచిపోకూడదు. ఈనాడు అనేది గడచినకాలంలోను చేరివుంటూంది. రాబోయేకాలంలోను చేరివుంటూంది. సమయపు యీ మాయచక్రం నన్ను గందరగోళం చేస్తున్నది. మీలో ఎవరైనా నాకు సాయం ఎందుకు చేయరు!' అని బాధపడుతూ అడిగింది తలత్.

'నీకు సాయం చేయడమా! ఐన్‌స్టీన్ తాత తరంకూడా కాదు' అని అన్నాడు హరిశంకర్.

వీళ్ళు లండన్‌లోని సెంట్ జాక్‌వుడ్‌లో కూర్చొని 1954 డిశంబరు 15 వ తేదీన యీవిధంగా మాట్లాడుకొంటున్నారు. వాళ్ల నీడలు కిటికీ అద్దాలమీద పడుతున్నాయి. బయట చలిగాలి తీవ్రంగా వీస్తున్నది. రోడ్డుమీద కార్లు తిరుగుతూ వున్నాయి.

1940 లో సింఘాదేవాలీ భవనవసారాలో నిర్మల, మాలతి యిద్దరూ కూర్చున్నారు. తలత్‌లో అప్పటికీ యిప్పటికీ పెద్దతేడా ఏమీ రాలేదు. కాని గౌతమబుద్ధుడు, శాక్యముని 'మనిషి ప్రతిక్షణం మారిపోతూవుంటాడు. బాల్యంలో ఒకరకంగా వుంటాడు. యౌవ్వనంలో మరోరకంగా వుంటాడు. వృద్ధాప్యంలో యింకా మార్పుగా వుంటాడు. క్షణంపూర్వం వున్నట్లు క్షణంతరువాత వుండడు. కాని కాలంమాత్రం శాశ్వతంగా వుంటుంది' అని అన్నాడు.

'మనం మనకథల్ని తిరగవేసుకొంటూ సంతోషిస్తున్నాం. మనం నిజంగా భయస్తులం' అని అన్నాడు హరిశంకర్.

'మనం కాలాన్నిచూసి మరీ భయపడుతున్నాం. అది మనల్ని ఒకానొకరోజున చంపివేస్తుంది. చివరికి మనకు శరణ్యం యీ చీకటే' అని అన్నది తలత్.

'గౌతం నీలాంబర్‌కూడా ఒట్టి పిరికివాడు' అని అన్నాడు కమాల్.

'అతనిమాట ఎత్తకు. అసలువిషయాన్ని వదిలి దూరం వెళ్ళిపోతావు. జీవితంలో గల అసలువిషయం ఏమిటో తేల్చుకోవాలి. పద్నాలుగుసంవత్సరాలకుపూర్వం నేను వున్నాను. బ్రతికితే పద్నాలుగుసంవత్సరాల తరువాతకూడా వుంటాను. అప్పటికీ హరిశంకర్‌గానే గుర్తింపబడతాను. ఈమధ్యలో మనమీదజరిగే ప్రయోగాలన్నింటినిగురించి ఆలోచిస్తూ కూర్చుంటే యిక మనం మిగలం' అని అన్నాడు హరిశంకర్.

మానవుడు ముందుకు పోవలసిందేకాని వెనకకుపోవడం సాధ్యంకాదు. కమాల్ మధ్యలోవున్న బల్లమీద కూర్చున్నాడు. అందరినీ పరిశీలించిచూశాడు. మైకేల్, బిల్ గ్రేగ్, జరీనా అంతా గౌతం నీలాంబరుణ్ణి సాగనంపడానికి విమానా శ్రయంవెళ్ళి తిరిగివచ్చారు. కమాల్, హరిశంకర్ ప్రయాణానికి సిద్ధంగావున్నారు. అంతా వాళ్ళ మూట ముల్లెలమీద కూర్చున్నారు.

జరీనా యింటిమండివచ్చాక గౌతం పదిహేనురోజులవరకు జబ్బుపడి కమాల్ యింట్లో వుండిపోయాడు. పూర్తిగా కోలుకోకముందే కాశ్మీరు కేసువిషయంలో న్యూయార్కు వెళ్లమని అతనికి ఆదేశం వచ్చింది. అది లండనులో కమాల్, హరిశంకర్‌లు వుండే చివరిరోజు. హరి రాత్రికి ఎయిర్ ఇండియాలో వెళతాడు. కమాల్ రేపు ఉదయం బోట్ ట్రైన్‌లో వెళతాడు. మైకేల్‌కూడా వెళ్ళిపోతున్నాడు.

తలత్ రెండోపర్యాయం కేలండర్‌వంక చూచింది. 1954 డిసెంబరు 15 వ తేదీ. ఆమెకు ఒళ్లు పులకరించినట్లయింది. 'మైకేల్ ! తలుపులు మూసివేయి' అని అన్నది బిగ్గరగా.

మైకేల్ లేచివెళ్ళి తలుపులు మూసివేశాడు. అక్కడిజనం తలత్‌కండ్లకు ఆట బొమ్మల్లా కనబడసాగారు. తుపాకిపట్టుకొని నిలబడిన సిపాయి (మైకేల్). తల ఆడిస్తూ తెల్లనిగౌను తొడుగుకొని పొడుగుపాటి తెల్లనిగెడ్డంతోనున్న చైనా తత్వ వేత్త (హరిశంకర్) చంద్రగుప్తమహారాజా దర్బారునర్తకి (సురేఖ). వెక్కి వెక్కి ఏడుస్తూ, తల బాదుకొంటూ, జీవితంలో సర్దాగావుంటూ పాదరక్షలు తొడుగు కోకుండా నడుస్తూ వంగిన నడుంతో ముందుకు సాగుతున్న నవాబ్ కమ్మన్‌సాబ్ (కమాల్) అందరూ దీపావళిబొమ్మల్లా ఎదురుగ కనబడసాగారు. ఆ బొమ్మల్ని లక్నో కుమ్మర్లు తయారుచేశారు. వాటిలో ఒక బొమ్మ క్రిందపడి పగిలిపోయింది. ఇక చాకలి వస్తాడు, నీళ్లు చిల్లుతాడు, పీటవేస్తాడు. రాజాగారు దానిమీద కూర్చుం టారు. లూనా మాదిగస్త్రీ గారడీచేస్తుంది. తిరిగి అంతా వెళ్ళి ఎవరిమూలన వాళ్లు నక్కుతారు.

'నేను బాగానే వున్నాను. కాని వస్తువులన్నీ నన్ను భయపెట్టుతున్నాయి' అని అన్నది తలత్.

'ప్రపంచంలో అంతా గడబిడగవున్నదని తెలుస్తున్నది' అని అన్నాడు కమాల్.

'అదేమిటో బోధపడకముందు నేను శబ్దాలనే సముద్రంలో ముందుకుపోగుతూ యోచన అనే భయంకరమైన త్రోవమీదకువచ్చి నిలబడ్డాను.'

'శబ్దాలేమిటి? యధార్థం ఏమిటి? శబ్దాలు తప్పని పుస్తకాలు చెప్పాయి. యధార్థం అంటూ ఏమీలేదు. సంబంధంఅనునది అంతా అబద్ధం. బృహస్పతి రాక్షసులకు పాఠం చెబుతుంటే చూశాను. ఒక్కొక్కప్పుడు నేను మహారాక్షసినని అని పించేది. జ్ఞానమనే చీపిరి పుచ్చుకొని చీకటిలో ఊడుస్తూ తిరుగుతున్న అప్సరస ఆ కథల్లో కనబడే రాకాసినని అనిపించేది.

ఈ చీకటిప్రాంతాల్లో చాలా చెట్లు చేమలు దగ్గరగా సాగిపోతున్నట్లు, వాటిమీద తహమీనా, నిర్మల, జోన్ కార్టర్, చంప, జరీనా, మొదలుగాగల చాలామంది ఆడపిల్లలు కూర్చొనివున్నట్లు అనిపించేది. ఆ చెట్లు చేమలన్నీ పైకిఎగిరిపోయాయి. క్రిందికిదిగి రాలేనంతగా పైకి లేచిపోయాయి. నిజానికి ప్రపంచపు ఆకాశమంతా యీ చెట్లతోను, చేమలతోను నిండిపోయినట్లనిపించింది.

'వీళ్ళందరిలో చంపనుగురించి ప్రత్యేకంగా వివరించాలి. ఆమె కలలుకనడం ప్రారంభించింది. ఇది ఆమె చేసిన గొప్ప తప్పని.'

'ఇప్పుడు మీరుకూడా ఒక చెట్టుమీదఎక్కి నిద్రపోతే తప్పక త్రోవ తప్పు తారు. మీచెట్టు దేనికో కొట్టుకొని క్రింద పడిపోతుంది.'

స్వప్నలోకంలో ఆమె మధ్యయుగపుభక్తుల్లా పాడుతూ తిరిగింది. చర్చి గృహా లకు వెళ్ళింది. ఎంత సుఖంగా వున్నారోనని సన్యాసినుల్ని చూసింది. తన సొంత దేవుణ్ణి, తన జీవితపుచిహ్నంగానున్న దేవుడికల్పనను కలిపి చూసుకొన్నది. ఏదో సుఖం కలిగినట్లనిపించింది. ఆ సుఖాన్ని నీవు కొలిచిచూడలేవు. అల్లా ఉన్నాడనే సమస్య పరిష్కారమైపోయింది. గౌతం నీలాంబరునివలె ఆమెకు ప్రతివిషయం లోను, ప్రతివస్తువులోను ఏదో రహస్యం దాగివున్నట్లు కనబడింది.

అంతా గదిలోనుంచి బైటికివచ్చి చేరుకున్నారు. కమాల్ దీర్ఘంగా ఊపిరి పీల్చసాగారు.

'ప్రతివస్తువుకు వెనుక ఏదో ఒక రహస్యం వుంటుంది. అది నాకూ తెలుసు. అందువలన నేను చాలా దుఃఖం పొందవలసివచ్చింది' అని అన్నాడు మైకేల్.

'అవును' అని అన్నది తలత్. అంతా తలవంచుకొని నేలవైపుచూస్తూ ముందుకుపోయారు.

సాయంత్రపు గులాబీరంగు వెలుగులో హీత్‌వైపుకు సాగారు. ఇండ్లముం దున్న కిటికీలలోనుంచి తొంగిచూస్తున్న జనం, యిరుకుగానున్న సందులు, ఆఫీసులనుండి యిళ్లకు తరలివెళుతున్న యువతులు కనబడ్డారు.

పర్వతంమీదకువెళ్ళి అక్కడ అమర్చబడియున్న చిత్రకారుల చిత్తరువులు చూడటం ప్రారంభించారు. చూసిచూసి బోరెత్తిపోయింది.

క్రింద సంత జరుగుతున్నది. జిప్సీ ఆడవాళ్లు చేతులుచూసి అదృష్టాల్నిగురించి చెబుతున్నారు. పిల్లలు వేరుసెనగకాయలు, ఐస్‌క్రీం తింటున్నారు.

'మనం యితరుల్ని మన స్వప్నాల్లోకి తీసుకువచ్చేందుకు ప్రయత్నిస్తున్నాం. అదీ విశేషం' అని అన్నాడు మైకేల్.

'అవును' అంటూ అందుకొన్నది తలత్. 'నా గడచినజీవితం, నా సమయం, నా స్వప్నాలు అన్నీ నావే, ఇంకెవ్వరివీ కావు, కాజాలవు. అయితే ఒక్కడి విష యంలోమాత్రం అలా చెప్పడం కష్టం. మనందరి భవిష్యత్తుమాత్రం ఒక్కటే' అని అన్నది తలత్ కొంటెగా.

మైకేల్ చిన్న కంకరరాయితీసి కోపంతో తలత్‌మీదకు విసిరాడు. ఈ పాయిం టుకు చేరినతరువాత పార్టీలైను గీయకు. రాబోయే యుగం మనందరిదీ ఒకటి కాదు. ఈ పర్వతానికి ఆవల నోరుతెరుచుకొని భవిష్యత్తు మనందరికోసం వేచిఉండి వున్నది.'

'ఓ మైకేల్! నాకు అవంటే చాలాభయం' అని అన్నది పసిపిల్లలా తలత్.

'అవును.'

నన్ను భయపెట్టేవస్తువులు తక్కువగా లేవు. అందమైనదృశ్యాలు, విశ్రాంతి నిచ్చే యిల్లు, సంచీతెరిస్తే రకరకాల కాగితాలు బైటకు వస్తాయి. బ్యాంకుల జాబులు, షేర్సుకు సంబంధించినకాగితాలు, జాయింట్ స్టాక్ కంపెనీ సమాచారాలు, వాటి మీద లార్డ్‌సిన్హా, సర్ బీరెన్‌ముఖర్జీ, శ్రీ థాపర్ అంటూ పేర్లు. ఆ పేర్లవెనుక మరో ప్రపంచం. పెద్దపెద్ద భవనాలు, రూపాయలు, ఆర్థికసమస్యలు, సమ్మెలు, ఆకలి, నిరుద్యోగం, కార్మికవాదలు, లండన్ సిటీ, క్లైవురోడ్డు కలకత్తా, బిషప్ గేటు, తాతానగర్, అంద్రూస్ యూల్, కలకత్తా.

నేను భయపడుతూ భయపడుతూ ఆ కాగితాలమీద సంతకం పెడతాను. నా జీవి తానికి జామీనుల్లానో, సమాజంలో ధనికకుటుంబానికి చెందిన దాననైనందుకు

పాత్ర్యల్లావో అవి అనిపించేవి. ఇదంతా ఏమిటి? వీటివల్ల నాకు కలిగే లాభం ఏమిటి? రజావంశంలో జన్మించినందుకు యిట్టి వ్యవహారాలకు వారసురాలను కావాలని నేనెన్నడూ కోరలేదే! కాగితం ముక్కలు - రూపాయలు - రూపాయలు - రూపాయలు. అసలు రూపాయలంటే నా దృష్టిలో విలువపోయింది. వెనుకటి జమీందారులుకూడా అలాగే వుండేవారని ఏమేమో అన్నారు. ఆ మాటలు వింటుంటే నాకు నవ్వువచ్చింది.'

అంతా బండరాళ్ళమీద కూర్చున్నారు. క్రింద ఏటిసీటిలో అస్తమిస్తున్న సూర్యునికిరణాలు నాట్యం చేస్తున్నాయి. ముక్తి సైన్యంపటాలం ఒకటి బ్యాండు వాయిస్తూ అటుగా వెళ్ళింది.

కమాల్ ఏటిఒడ్డుకువెళ్ళి నిలబడ్డాడు. పైనుండి చూస్తే ఎంతో చిన్నగా కనబడుతున్నాడు.

ఉన్నట్లుండి తలత్ పకపక నవ్వింది.

'రాణిగారూ! నీకు ఎందుకు భయం' అని నిర్మలను అడిగాను.

'నా స్వప్నాలను అతనికి తెలియకుండా వుంచాలని అనుకొంటున్నాను. అతనికి నా స్వప్నాలు తెలుసు' అని నిర్మల అన్నది. అంతాచిత్రం. నిర్మల స్వప్నాలు ఆమెదగ్గరే సురక్షితంగా వున్నాయి. గౌతం ఏమీ తెలియనివాడిలాగే వున్నాడు.

'మనం అజ్ఞానంలోపుట్టి అజ్ఞానంలోనే బ్రతుకుతూ అజ్ఞానంలోనే చచ్చిపోతాం. ఇదీ అసలుసిద్ధాంతం.'

కమాల్ పైకి వాళ్ళదగ్గరకు రాసాగాడు. మైకేల్ ఒంగి ఒక బ్లూకు త్రుంచాడు. సంతలో మ్రోగుతున్న సంగీతం ఆగిపోయింది. చలి ఎక్కువైపోయింది.

ఒక జెట్‌విమానం వాళ్ళ నెత్తిమీదుగా ఎగురుతూ వెళ్ళిపోయింది. తలలెత్తి దాన్నిచూస్తు నిలబడ్డారు.

'మనం నిర్మించుకొన్న అజ్ఞాననగరపు గోడల్ని తత్వశాస్త్రం అనే ఇటుకలతో మనం కట్టుకొన్నాం. ఒకరోజున కన్నంవేసి మృత్యువు మననగరంలోకి జొరబడింది' అని అన్నది తలత్.

'ఒకపర్యాయం ఫారెన్‌బరాలో జరిగిన ఎర్‌ఫెస్టివల్ సందర్భంలో పాపం జాన్‌డేరీ మరీపైకి పోయిపోయి ప్రాణాలు పోగొట్టుకొన్నాడు. అతని విమానం ఆకాశంలో ముక్కలుముక్కలై జనంమీద పడిపోయింది. చాలామంది జనం

చచ్చిపోయారు. విమానం నిప్పు అంటుకొని తగులబడిపోతూ అగ్నిగోళంలా ధ్వనికంటె మించిన వేగంతో ముందుకు సాగుతున్నప్పుడు అది మృత్యువని, నిమిషంలో నేను అందులోపడి కాలిపోతానని అనిపించింది. ఆ సమయంలో నేల మీద బోర్లపడుకోవాలని తెలిసియుండికూడా అలాచేయక ఆ విమానం ముక్కలు విపరీతంగా క్రిందపడుతూవుంటే వాటిమధ్య చంద్ర, జరీనాలను పిలుస్తూ తిరిగాను. వాళ్లు చచ్చిపోయారేమో ననేభయంతో అలా చేశాను. అప్పుడు నా ప్రాణంకంటె వాళ్లిద్దరి ప్రాణాలనుగురించి బాధపడ్డాను. నా రక్షణను గురించిన యోచనే అప్పుడు నాకు కలుగలేదు.'

'అందువల్లనే నిర్మల మృత్యువును ఎదుర్కొన్నప్పుడు ఆమెకుకూడా భయం వేసి వుండదని అనిపించింది. అది ఒక చిత్రమైన అనుభూతి. ఆ అనుభూతిలో మరొకరిని చేర్చుకొనేందుకు వీలువుండదు. ఇట్టి అనుభూతి అదొక్కటే. అందు వలన మనం ఆమెను ఒంటరిగ వదలివేశాం. పాపం కాళ్లుచేతులు కొట్టుకొంటూ చీకట్లో కలిసిపోయింది.

వేదాంతంలో శరీర ఉనికికి నాలుగు స్థితులున్నట్లు పేర్కొన్నారు. మేల్కొం టున్న మానవుడు, స్వప్నం, స్వప్నంలేని నిద్ర, మృత్యువు.

క్రింద చీకట్లో కమాల్ పాటలుపాడుతూ తిరుగుతున్నాడు. అతని కంఠధ్వని గాలిలో తేలుతూ వాళ్ళకు వినబడుతున్నది. చంద్రుడు చెట్లచాటునుంచి తొంగి చూడసాగాడు.

'భావాలవైపుకు ఆత్మలప్రయాణం ఒకటి' అని అన్నాడు శంకర్.

'మృత్యువు నన్ను సమాప్తం చేసివేస్తుంది. మృత్యువును ఎవరు సమాప్తం చేస్తారు? గాలులు నా శ్వాసను లేపుకుపోతాయి. సూర్యుడు నా కళ్ళవెలుగును కప్పివేస్తాడు. చంద్రుడు నా మస్తిష్కాన్ని నిద్రపుచ్చుతాడు. ఆత్మ గాలిలో కలిసి పోతుంది. నా ఒంటిమీది రోమాలు తుఫానుగా మారిపోతున్నాయి. నెత్తిమీది వెంట్రుకలలో చెట్లు మొలుస్తున్నాయి' అంటూ రాతిమీద నిలబడింది తలత్.

'గాఢ నిద్ర, గాఢమైన నీరు, గాఢమైన స్వప్నాలు, ప్రపంచపు తత్వాలు ఆలో చిస్తున్నాయి. ఇంద్రియాలు నిద్రించాయి. ఇక మృత్యువుమాత్రమే మిగిలి వున్నది' అని అన్నాడు శంకర్.

శరీరం ఆలోచిస్తుంది. అది అంతమైపోతే అంతా అంతమైనట్లే. మందు తున్న అగ్ని. చల్లనినీరు, చల్లనిగాలి. అన్నీ తమంతట తాము ఆవిర్భవించాయి. అందుకనే గౌతం చంపతో 'నీశరీరం నీబుద్ధికి దూరంగా వేరుగా వున్నదనుకొంటే దాన్ని వేరుగావుంచు. నీవుమాత్రం నాదగ్గరకు వచ్చివేయి. కాని నీవు అలా చేయలేవు' అని అన్నాడు. అంటూ ముగించాడు గుల్షన్.

'ఇంకా చాలామంది చావాలి. నేను వాళ్ళకంటె ముందు వెళుతున్నాను. చాలామంది చస్తున్నారు. నేను వాళ్లతోబాటు వెళుతున్నాను. చచ్చిపోయిన వాళ్ళకు ఏంజరిగిందోనని వెనక్కు తిరిగిచూస్తున్నాను. నాతరువాత చచ్చిపోయే వాళ్ళకు ఏమవుతుందోనని ముందుకు తిరిగిచూస్తున్నాను' అని అన్నాడు హరి శంకర్.

ఎంతచిత్రము! ఎంతవిచిత్రము!!
గిరిశిఖరముపై చీమ ఎక్కినది
చెవులకు గజములు వ్రేలాడుచున్నవి
ఎంతచిత్రము! ఎంతవిచిత్రము!!
నావలోపల నదులు మునిగినవి
ఎంతచిత్రము! ఎంతవిచిత్రము!!

అంటూ క్రిందినుండి పాటపాడుతున్నాడు కమాల్.

'ఇప్పటివరకు నేను చేసిందేమిటి? నా విలువ ఏమిటి?' అని అన్నది సురేఖ.

'నేనుచేసే ప్రతిపనికి యీ సృష్టిచక్రంతో సంబంధం వున్నదని అనిపిస్తుంది. ఆ విషయాన్ని మరిచిపోయేందుకు నవ్వుతూ వుంటాను. నిజం చెబుతున్నాను. మనం చాలా చెడ్డగ ముగిసిపోతాం' అని అన్నాడు మైకేల్.

'ఏం చేద్దాం? మరి ఏం చేద్దాం?' అంటూన్నవాళ్ళమాటలు పర్వతంమీద ప్రతి ధ్వనించాయి.

'ఎదురుగ రాబోతున్నసమయమనే గోడవున్నది. నేను మైకేల్మాదిరిగ దానికి ఎదురుగనిలబడి అరచి అరచి ఏడుస్తున్నాను. కష్టాలను సహించుకుపోవడంకూడా అపరాధమేనా?' అని అన్నది తలత్.

గుల్షన్ అందుకొన్నాడు—'అమెరికాలోని నీగ్రోవాణ్ణి పిలు. జర్మనీలోని యూదుణ్ణి పిలు. అరబ్ శరణార్థిని పిలు. పాకిస్తాన్ శరణార్థినిగాని, భారతదేశ

శరణార్థివిగాని పిలు. మీరుచేసిన అపరాధం ఏమిటి ? ఎందుకు మీకు యీ శిక్ష ? అని ప్రశ్నించు ।'

'నేను నీ ఎదురుగావున్నాను. నాకు శిక్ష ఏమిటో చెప్పు' అని అన్నాడు మైకేల్.

'ఇజ్రాయెల్ దేశపు క్రొత్తనాయకుడా ! డిబోరాగీతాలు నీ ముఖతః విందామని అనుకొన్నాం. కాని నీవు చేతిలోకి తుపాకీ తీసికొన్నావు' అని అన్నది తలత్.

'మేము వేలాదిసంవత్సరాలు ఏడుస్తూవున్నాం. ఎడారుల్లో ఆకలి దప్పికల ననుభవించాం. బిగ్గరగా అరచిఅరచి యహూవాకు మొరపెట్టుకొన్నాం. దావూద్ గీతకారులబాధలకు, స్వప్నాలకు అంతులేదు. ఏమిటిదంతా ! అందుకే తలత్ కంఠంతో కంఠంకలిపి అడుగుతున్నా' కష్టాలు సహిస్తుపోవడమే అపరాధమా !'

'ఆత్మయొక్క ఒంటరితనాన్ని వాళ్లు తమకంఠంలో నింపుకొన్నారు. లోతున ఒంటరితనం, ఎత్తున ఒంటరితనం, దుఃఖాలు, సందేహాలు, ఆశలు, పాపాలు వీటి యందంతట ఒంటరితనం, ఏ ఆకర్షణలో పడితేనేం మానవుడు ఒంటరితనాన్ని అనుభవిస్తున్నాడు' అని అన్నాడు మైకేల్.

'అడవుల్లో ఒక వేయిమంది యోగులు కూర్చొని భజనచేసికొంటున్నారు. నేను వాళ్లమాటలు విన్నాను' అని అన్నాడు హరిశంకర్.

'పాలస్తైన్‌నందలి పచ్చపచ్చని మైదానాల్లో నేను పాడుతూ తిరుగుతూ వున్నాను' అని అన్నాడు మైకేల్.

'నీ గొంతుకూడా విన్నాను' అని అన్నది తలత్.

'చరిత్రయొక్క సజీవమైన అనుభూతి నా నెత్తిమీద కత్తిలా వ్రేలాడుతున్నది. దాన్ని తప్పించుకోలేను' అని అన్నాడు మైకేల్.

'ఏం చేయాలి ? ఏం చేయాలి ? ఏం చేయాలి ?' ఇప్పటివరకు వేలాదిమంది చదివిన అవే పుస్తకాలు క్రొత్తగ అచ్చవుతున్నాయి. వ్యాసాలు వ్రాయబడు తున్నాయి. క్రొత్తకథలు తయారవుతున్నాయి. రోజూ ఉదయం పర్వతాలమీద వెలుగు ప్రసరిస్తున్నది. కలీసాలల్లో దావూద్ గీతాలు గానం చేయబడుతున్నాయి. మానవుడు సబత్* నాటిరాత్రి మంచినీళ్లు త్రాగకూడదని ఆత్మ చెప్పింది. త్రాగితే రక్తం త్రాగినట్లే. కాని మానవుడు పిపాసి. అందుకు చికిత్స ఏమిటి ? అతనికి

* వారానికి ఒకరోజున యూదులు వ్రతం పడతారు. శుక్రవారం శనివారానికి మధ్యన వచ్చేరాత్రి వాళ్ళకు వ్రతం. దానిని వాళ్లు సబత్ అని అంటారు.

అంటే మానవుడికి - దాఉద్‌తోబాటు రోదనధ్వనుల్ని తిరిగి పలకమని చెప్పు ! భగవంతునిధ్వని నాటికంటె గొప్పది. ఈ ధ్వనివల్ల లెబనాన్ దేశపు దేవదారుచెట్లు విరిగి పడిపోతాయి. ఈ ధ్వనివల్ల అగ్నిజ్వాలలు బయలుదేరుతాయి. ఈ ధ్వనివల్ల అడవులు కంపించిపోతాయి. దాని విరాట్‌స్వరూపాన్నిచూచి 'పవిత్రుడవు, పవిత్రుడవు' అని పూజారులు అరుస్తారు. అయినా దాహం దాహం అని అంటూవున్నావు' అని అన్నాడు మైకేల్.

'ఆకలితో మానవుడు జన్మిస్తున్నాడు. బ్రతికివున్నంతవరకు ఆకలి అతణ్ణి బాధిస్తుంది. ప్రేమకై ఆకలి, తిండికై ఆకలి, శాంతికై ఆకలి. విజానికి ఆకలి దప్పులు మనపాలిటి పెద్దభూతాలు. నేను మొట్టమొదట యీ భూతాలనుండి విముక్తి కోరుతున్నాను. రెండోవిముక్తి నాకు దానంతట అదే లభిస్తుంది' అని అన్నాడు గుల్షన్.

కమాల్ పాటపాడుతూ పైకి చేరుకొన్నాడు.

'పాపం చేస్తున్నామనేతలంపు జనాన్ని దగ్గరకు చేరుస్తుంది. మనదగ్గర పతితవంతప్ప మరేమీ లేదు. మనంకూడా రెండుమూడు పాపాలు చేసియున్నట్లయితే మంచిగా వుండేది. పతితనపు బంధనాలచే మనమంతా కట్టుబడివున్నాము. మనలో ఎవరైనా ఆ బంధనం త్రెంపితే అందరం చిందరవందర అయిపోతాం' అని అన్నాడు హరిశంకర్.

తలత్ వెంటనే అందుకొన్నది—'మన సంస్కృతి, గత మన నైతికచింతన ఎప్పుడూ మనల్ని ఆదుకొంటుంది.'

'తలత్ బేగం ! నీ అభిప్రాయం సరికాదు. మన సంస్కృతి ఎప్పుడో దెబ్బ తినిపోయింది. మన సంస్కృతి అనేతాడుకు ఒకకొనన నీవు, మరోకొనన నేను వ్రేలాడుతున్నాం' అని అన్నాడు హరిశంకర్.

'ముందు మీ మీ భూతాల్ని మరిచిపోండి' అని అన్నాడు గుల్షన్.

ఇంతలో పెద్ద అద్దంతలుపులు తెరుచుకొన్నాయి. లోపలికి వస్తున్నవారిలో చంపకూడా వున్నది. 'హలో' అంటూ ఆమె నావైపుకు వచ్చింది. ఇది చూజావరాయి. నేను ఓడల కార్యాలయంలో ఫోను చేస్తున్నాను. ప్రస్తుతం నేను సురక్షితంగావున్నాను. నా నాలుగువైపుల పట్టణపు రాతికట్టడాలు నిలబడివున్నాయి. నా కాళ్ళక్రింద భూమివున్నది. కాని నాకు మహాభయంగా వున్నది. చంపాబాజీ

నా ఎదురుగ వున్నది. కాలమనే కుంపటి వెలుగుతున్నది. ఆమె అందులో ప్రగ్గి మరింత తేజస్సు తెచ్చుకొన్నట్లున్నది. ఆమెను చూసినప్పుడు నాకు సంతోషంగాని, దుఃఖంగాని, విసుగుకాని ఏమీ కలుగలేదు. త్వరగా యిక్కడనుండి ఒక్కసారి బిగ్గరగ అరిచి వెళ్ళిపోదామని అనిపించింది. నీవు చంపవని ఎలా అనగలను ?

ఆమె ఏదో ముఖ్యమైనవిషయం నాకు చెబుదామని ముందుకొచ్చింది. కాని ఆగిపోయింది. సినిమాచూసి వస్తున్నజనం ముఖాలు సంతోషంగా లేవు. అక్కడి వెలుగుకూడా దుఃఖంగా వున్నట్లున్నది. సంగీతం ఏడుస్తున్నది. సమయం బల వంతాన జరుగుతూవున్నది. ఆమె అద్దంతో తయారైయున్న గోడకు ముక్కు ఆన్చి నిలబడి బైటజనాన్ని చూడసాగింది. నేను త్వరగా ఆమెకు 'ఖుదాహాఫిజ్' చెప్పి బయటికి వచ్చేశాను.

ఇప్పుడు నేను ఆమెను చాలా వెనుక వదలివేశాను.

'నేను ఇంటివైపుకు బయలుదేరాను. నేనెందుకు యింతగా అలసిపోయాను ? నన్ను అరవకుండ కూర్చోనీయండి' అంటూ కమాల్ అక్కడే పడివున్న ఒక బండమీద కూర్చున్నాడు.

'మేముకూడా మా మా దేవతల్ని మేల్కొలుపుకొన్నాం. కాని ఏమైందో చూశారా ? మా దేవతలు పూర్తిగా దెబ్బకొట్టి వెళ్ళిపోయారు' అని అన్నది తలత్.

'పచ్చని చీకటితెర ప్రకృతిని కప్పివేసింది. అంతా అందులో కొట్టుకుపోతున్నాం. నేను చీకట్లోకూర్చొని వెలుగుభయాల కూడలిదగ్గర కాళ్ళుపెట్టి బంగారువన్నెగల ప్రజాపతి అను భగవంతునిలా తిరిగి వస్తువులకు పేర్లు పెడుతున్నాను' అని అన్నది తలత్.

బండమీద నిలబడి దిఙ్మండలంవైపు ప్రైగచేసి 'చూడు మైకేల్ ! అటున్నది మీ యరూశలం. మనందరి శ్యెరూశలం' అని అన్నది.

'శ్యెరూశలంకూడా రెండుగా విభజన అయిపోయింది' అని అన్నాడు హరి శంకర్.

'పర్వతాలమీద కొందరు హజరత్ దాఊద్ గీతాలు మూల్గుతున్నారు. స్వరాలు ఆగిపోయాయి. ఏసుక్రీస్తులా మమ్మల్నికూడా సిలువ నెక్కించారు. ఏసుకుబదులు మేము సిలువ నెక్కుతాం. మేము అందరికంటె పెద్ద దొంగలం. మేము పర

మాత్మని ధనాగారామ్నుండి సంతోషమనే ధనం దొంగిలించాలని ప్రయత్నించాం' అని అన్నది తలత్.

'నాకు ఏమీ జ్ఞాపకం లేదు. గడచిపోతున్న సంవత్సరాలు కొంగల్లా నా నాలుగు వైపుల ఎగురుతూ తిరుగుతున్నాయి. నిద్రపోతున్న యిండ్ల పైకప్పులమీద చంద్రుడు దొర్లి దొర్లి సముద్రంవైపుకు వెళ్ళిపోతున్నారు. ఈస్ట్ ఏంగ్లియా అడవుల్లో గాలి తీవ్రంగా వీస్తున్నది. నిర్మానుష్యంగావున్న ఓడరేవుల్లో వల్లటి పీటమీద రాత్రిళ్ల ఎగిరేపక్షులు తిరుగుతున్నాయి.

'నా ఎదురుగా జనం ముందుకు సాగుతున్నారు. ఏటిలో డింగీలు వదుస్తున్నాయి. నేను ఒడ్డున వున్నాను. ఇక నా ఓడ ఎక్కడవున్నదో తాత తెలుసుకోవాలి. ఈ ఓడకు దీపాలు ఆరిపోయాయన్నమాట. ఇది ఆగకుండా సముద్రపు గాఢాంధకారంలో చేరిపోవాలన్నమాట. స్వాగతంచెప్పే మనుష్యులెవ్వరూ లేని వైపుకు యీ ఓడ సాగిపోవాలన్నమాట' అని అన్నాడు కమాల్.

చీకటి యింకా పెరిగిపోయింది.

'రూపం - పేరు' అని అన్నాడు హరిశంకర్.

'విద్య - అవిద్య' అని అన్నది తలత్.

'ఇక మాకు అంతా అర్థమైంది' అని అందరూ ఒక్కసారిగ అన్నారు.

'భావాల, యోచనల ఎత్తైన శిఖరంమీద ఎప్పుడూ వ్యక్తి ఒంటరిగా నిలబడి వుంటాడు. నిన్న, నేడు, రేపుకూడా ఒంటరిగానే వుంటాడు. ఆ వ్యక్తిపేరేమిటో తెలుసా ? అతడే గౌతం, మైకేల్, హరి, సిరిల్, కమాల్ రజా....వీళ్ల ఒంటరితనం శాశ్వతమైనది.'

చల్లని చీకటి గాలుల్లో వాళ్లకంఠధ్వని మునిగిపోయింది. వచ్చినచీకటి వాళ్లందరిని తనలో యిముడ్చుకొన్నది.

ఓడ బయలుదేరింది. కమాల్‌గుండె బరువెక్కింది. కళ్లు నీటితో నిండిపోయాయి. దగ్గరే యిద్దరు ముసలివాళ్ళు నిలబడివున్నారు. వారిలో ఒకరు కమాల్ భుజంమీద చేయివుంచారు. కమాల్ కృతజ్ఞత వెల్లడించారు.

కమాల్ రెండోరోజున ఓడంతా తిరిగిచూశారు. హిందూదేశస్థులు, పాకిస్తాన్ వాళ్ళు, ఫారెన్ సర్వీసుకుచెందిన పెద్దవుద్యోగస్థులు, వాళ్ళకుటుంబాలవాళ్ళు, విద్యార్థులు, ఇంగ్లీషువాళ్లు, అమెరికన్‌వాళ్లు, పర్యటన ప్రయాణీకులు, ఫ్రాన్స్‌కుచెందిన భిక్షువు, ఓరియంటల్‌స్కూలులో ఉద్యోగంచేస్తున్న ఇండియానువెళుతున్న పండిత్‌జీ అంతా కనబడ్డారు. మంచి హిందీ మాట్లాడుతున్నారు మీరట్‌వాసి. పెద్దపెద్ద ఉంగరాలజుట్టు, ఆడపిల్లలవంటి అందమైన ముఖం, మహాత్మగాంధీ శిష్యుడు, వినమ్రత ఎక్కువ. చలికాలంలోకూడా లండన్‌లో ధోవతి, లాల్చి, చెప్పులు తొడిగి తిరగవలసిందే. ప్రేమల్లెకు సంబంధించిన జానపదగేయాలమీద పరిశోధన జరుపుతున్నారు. మైకేల్‌కూడా టూరిస్టుతరగతిలో వున్నారు. అతడు జిబ్రాల్టరు వరకు వెళుతున్నాడు.

ఒకరోజున మైకేల్ పడకకుర్చీలోకూర్చొని సముద్రతరంగాలు చూస్తున్నారు. 'నేను యిక్కడ కూర్చోవచ్చునా?' అంటూ వెనకనుండి మాట వినబడింది.

'తప్పక కూర్చోండి' అంటూ వెనక్కు తిరిగిచూశారు. నిన్న తన భుజంమీద చేయివుంచిన ఆ వృద్ధుడు నిలబడివున్నారు. కమాల్ వెంటనేలేచి మరోకుర్చీ దగ్గరగా లాగారు.

'ఫ్రెండ్ పాల్! మీరుకూడా యిక్కడికి రండి.'

కొద్దిసేపటికి యిద్దరు యూరోపియన్లు అక్కడికివచ్చి కూర్చున్నారు.

'నాపేరు డాక్టర్ హెన్స్ క్రేమర్. నేను ఆస్ట్రియన్‌ను. నేను, నా యీ యిద్దరు పురుమిత్రులు ఇండియా వెళుతున్నాం. నీవు ఇండియన్‌వా?'

'అవును.'

'అందుకనే ముందుగానే అడిగితెలుసుకొన్నాము. నిన్న ఆ ఎదురుగా వున్నదే ఆ అమ్మాయిని నువ్వు ఇండియన్‌వా అని అడిగితే మండిపడింది. ఆమె పాకిస్తానీట' అంటూ ముగ్గురూ లోపిగా నవ్వారు.

కమాల్ ఏమీ మాట్లాడలేదు.

'నువ్వు ఇండియాలో వుంటున్నావా?'

'అవును.'

'నేను 'బుద్ధ జయంతి'కోసం వెళుతున్నాము' డాక్టర్ క్రేమర్ అన్నాడు.

'ఓహో! ఓహో! బుద్ధజయంతా!'

'బుద్ధ చరిత్రప్రసిద్ధికెక్కిన పెద్దవాడు' అని అన్నాడు.

పాల్, 'నీవు హిందువా?'

'కాదు.'

'ఓ! క్షమించు. తిరిగి పొరబడ్డాను. అయితే నువ్వు మహమ్మదీయుడివా?'

'అవును.'

'ఇండియాలో ఎందుకు వుంటున్నావు?'

'హైడాక్' అంటూ ఒక అమెరికన్ దగ్గరకువచ్చి కమాల్‌ను పలుకరించాడు.

'హై' అంటూ ప్రత్యుత్తరం చెప్పాడు కమాల్.

'నా పేరు టామస్ జెరెల్ ఎట్‌కిన్స్. కాని నన్ను టామ్ అని పిలు.

'మిగతా ప్రాణికేయులు ఏరీ? ఎక్కడున్నారు?' స్నేహితుడు అడిగాడు.

ఇంతలో వాళ్లకు-డా వచ్చారు. వారిలో ఒకరు ఫ్రాన్సుదేశస్థుడు. మారిస్. అతడు ఇండోచైనా వెళుతున్నాడు. రెండోవాడు ప్రసిద్ధకవి. బి.బి.సి. ప్రతినిధిగా ఆయిదువందల సంవత్సరాల బుద్ధజయంతి ఉత్సవాల్లో పాల్గొనేనిమిత్తం ఇండియాకు వస్తున్నాడు. కొంతమంది దబ్బుగల మహిళలు బుద్ధజయంతిని పురస్కరించుకొని అమెరికానుండి యాత్రకు బయలుదేరారు. ఫ్రాంసుదేశపు భిక్షువొకడు నారింజరంగు గుడ్డలుధరించి ఒకమూల కూర్చొనివుంటున్నాడు. అతడు గయ వారణాసిలకు వెళ్లుతున్నాడు. అతడు టూరిస్టుక్లాసు యాత్రికుడు.

సాయంత్రం కమాల్ మైకేల్‌ను వెంటబెట్టుకొని అందరికీ పరిచయం చేశాడు. వండిత్‌జీకూడా యీ బృందంలో చేరిపోయాడు. అంతా కలిసిమెలిసి వుంటున్నారు. వండిత్‌జీ కీర్తనలు గానం చేసేవాడు. లీలాథాక్కర్ పాడుతూవుండేది. రాత్రిపూట

బాల్‌రూములో నాట్యం జరుగుతూవుండేది. అంతాకలిసి సినిమా చూసేవారు
యాత్ర త్వరత్వరగా ముగుస్తున్నది.

రేపుఉదయం ఓడ జిబ్రాల్టర్ చేరబోతున్నది. కమాల్ పత్రికలవాళ్ళూ,
అందరినీ కలుస్తూ చివరికి విసిగిపోయాడు. అందరితోబాటువెళ్ళి అన్నిటికన్న పై
భాగంలోవున్న డెక్‌మీదకువెళ్లి నిలబడ్డాడు.

ఇంతలో దగ్గరలోనే మాటలు వినబడ్డాయి. కమాల్ వెనక్కు తిరిగిచూశాడు.
మైకేల్, డాక్టర్ క్రేమర్, అతనిస్నేహితులు, అమెరికన్ మహిళ అంతా వున్నారు.

'వ్రాయి' అని అన్నాడు మైకేల్.

'ఏం వ్రాయమంటావు' అని అడిగాడు టామ్.

'నేను చెప్పినవిషయాన్ని తప్పుగావ్రాసి పత్రికలకు పంపించు. అబద్ధాలువ్రాసి
తిండి సంపాదించడమే మీపనికదా!' అని అన్నాడు మైకేల్.

మైకేల్‌కు టామ్‌కు తగాదా ప్రారంభమైంది.

'అదిగో కమాల్‌రజా వస్తున్నారు. అతనిమాటలు శ్రద్ధగా విను. తిరిగి
మీ దేశంవెళ్ళి పుస్తకం వ్రాయి. ఒక ఇండియన్ ముస్లిం ఓడలో కలిశాడని,
అతడు పాకిస్తానుకు పరమశత్రువని, 1955 నాటి హిందూదేశంలోకూడా అతని
మాటలను ఎవ్వరూ అర్థం చేసుకోవడంలేదని వ్రాయి.'

'రజా సాహెబ్! రండి. మైకేల్ మళ్ళీ ఉపన్యాసం ప్రారంభించాడు.'

'పండిట్‌జీ, మైకేల్ కటువైనమాటలకు చికిత్స చేసేందుకు గరళం నాదగ్గర
లేదండీ!' అని అన్నాడు కమాల్.

ఆంగ్లకవి శ్రద్ధగా వారిద్దరివంక చూశాడు.

'ఏ విదేశీయుడైనా మీ దేశాన్నిగురించి ఏమైనావ్రాస్తే ఏమేమో వ్రాశాడని
గొడవ చేస్తూవుంటారు. పెద్దకష్టం వచ్చిపడింది' అని అన్నాడు టామ్.

ఫార్స్టర్ అను రచయిత 1924లో ఒకనవల వ్రాశాడు. అందు అతడు డాక్టర్
అజీజ్‌ను భారతప్రతినిధిగా ప్రవేశపెట్టాడు. ఇప్పుడుగనుక ఫార్స్టర్ మరో
'పాసేజ్ టు ఇండియా' వ్రాసివుంటే అతడు తనపాత్రను మార్చవలసివచ్చేది.
డాక్టర్ అజీజ్ యిప్పుడు హిందూదేశానికి ప్రతినిధి కాలేడు. ప్రతి ముస్లిము, పాకి
స్తానీయుడుగా యిప్పుడు గుర్తించబడుతాడు. ఇప్పుడు హిందువు హిందూదేశపు
నిజమైన ప్రతినిధిగా గుర్తించబడుతాడు' అని అన్నాడు ఆంగ్లకవి.

'అవును' అని అన్నాడు కమాల్.

'కమాల్! నువ్వు చాలా కష్టాలు పడ్డావా?' అని అడిగాడు.

'అవును, అయినా కష్టాలుపడ్డవాడిలా కనబడటం నాకు యిష్టం లేదు. హిందూదేశం ఆత్మ ఎప్పుడూ దుఃఖాలు సహిస్తూవుంటుంది. ఎంతచెప్పినా యీ విషయం నీవు అర్థం చేసుకోలేవు.'

ఇంతలో డెక్‌మీదనిలబడి లీలాభాస్కర్ సూరదాసు రచించిన గీతం గానం చేయసాగింది. కమాల్ ఆ పాట వినసాగాడు. పండిట్‌జీ తాళం వేయసాగాడు. ఆ తరువాత వాళ్ళిద్దరు లీలాభాస్కర్‌దగ్గరకు వెళ్ళారు.

'ప్రతిసంస్కృతికి రహస్యభాష ఒకటి వుంటుంది. ఆ భాష ఆ సంస్కృతికే అర్థం అవుతుంది' అని అన్నాడు ఆంగ్లకవి.

'పండిట్‌జీ, కమాల్‌ల సంస్కృతి ఒకటికాదు గదా!' అని అన్నాడు టామ్.

'నీవు మైకేల్ రహస్యభాషనుకూడా అర్థం చేసుకోలేవు.' చిరునవ్వు నవ్వుతూ అన్నాడు ఆంగ్లకవి.

లీలాభాస్కర్ పాడుతూనేవున్నది. కమాల్ క్రింది డెక్‌మీదకు దిగివచ్చాడు.

మైకేల్ జిబ్రాల్టరులో రేపుఉదయం దిగిపోతానని జ్ఞాపకం వచ్చింది. అతడు, మైకేల్ కేబిన్‌బయట నిలబడ్డారు. ఆనాడు పూర్ణిమ. సముద్రం ప్రశాంతంగా వున్నది. ఓడ సముద్రాన్ని చీల్చుకుంటూ ముందుకు సాగిపోతున్నది అంతా ప్రశాంతంగా వున్నది. తన భవిష్యత్తునుగురించి ఆలోచించసాగాడు ఆంగ్లకవి. టామ్ మాటలు జ్ఞాపకంవచ్చాయి.

'నేను ఏదేశానికిచెందని మనిషినా?' అంటూ మొట్టమొదటిసారిగా ప్రశ్నించుకొన్నాడు. ఓడ ముందుకు సాగిపోతున్నది. ప్రపంచం శాంతిగా వున్నది. ఢిల్లీలో పండిట్ నెహ్రూప్రభుత్వం ఏర్పడి రాజ్యం చేస్తున్నది.

'ఆత్మశాంతి లభించినవారు అదృష్టవంతులు. నాకు శాంతి కావాలి, శాంతి కావాలి' అని అన్నాడు కమాల్.

అక్కడే సమీపంలో కూర్చున్న ఫ్రాంసుదేశపు భిక్షువు కళ్లు పైకెత్తిచూశాడు. అతనిముఖం ప్రసన్నంగాను, ప్రశాంతంగాను వున్నది. ఇలాంటి పూర్ణిమనాటి రాత్రి, రెండువేల అయిదువందల సంవత్సరాలక్రితం శాక్యముని జన్మించాడు.

'నాకు యీ ఆలోచనలనుంచి విముక్తి కావాలి' అని అన్నాడు కమాల్.

భిక్షువు మళ్ళీ శ్రద్ధగా చూశారు. 'ఆలోచనలు తమనుతాము తెలుసుకోలేవు. సృష్టికిలయట పరమేశ్వరుడు లేడు. ఈశ్వరునివిడిచి సృష్టింపలేదు. సత్యానికి అస త్యానికి తేడాలేదు. అన్నింటికన్నమించిన పరమసత్యం శూన్యమే' అని అన్నారు ఫ్రెంచిభాషలో.

'నాకు యీ శూన్యమంటే అమితభయం.'

'శూన్యం చివరిహద్దు.'

'ఈ శూన్యంలో ఎక్కడికి వెళ్ళను ! నేను ఏ దేశానికి చెందినవాడిని' అని అనుకొంటూ కమాల్ గబగబ నడచి తన డెక్ మీదకు తిరిగివచ్చాడు.

ఓడ ముందుకు పోగుతూనేవున్నది.

# 54

'అదుగో భారతావని సముద్రతీరం.'

'బొంబాయి ! జన్మభూమి !....నా ఇల్లు.'

కమాల్ లక్నో చేరుకొన్నాడు. గుల్‌ఫిషాంలో ప్రవేశించాడు. ప్రపంచమంతా మారిపోయినట్లు కనబడింది. తోటలోని చెట్లన్నీ తగులబడిపోయాయి. మొక్కలన్నీ ఎండిపోయాయి. పచ్చిగడ్డి మొలిచేచోట చెట్లు చేమలు, పిచ్చిమొక్కలు మొలిచి వున్నాయి. కారు పెట్టుకొనేశాల, గుర్రపుశాలలు రెండూ గిడ్డంగులుగా మారాయి. (పాకిస్తాన్‌వెళ్లే బంధువులంతా సామానుతెచ్చి యిక్కడదాచి వెళుతూవుంటారు అని చెప్పింది ఖాలాబేగం). 'నౌకర్లు వుండేయిల్లు' ఖాళీగా పడివున్నది. అతనికళ్లు గంగాదీన్‌కోసం వెతికాయి. కదీరును, కమరున్‌ను వెతికాయి. హుసేన్‌భార్యను, రామాపతార్‌ను దగ్గరగా పిలిచాడు.

చివరకు తనగదికివచ్చి మంచంమీదపడి ఏడ్చాడు. అదే ప్రపంచం. అదే లక్నో. ఆబంధువులే. కాని యిదేమిటి ? ఈ మార్పు ఏమిటి ? తాను మారాడా ? తన హీన తనాన్నిచూసుకొని బాధపడుతున్నాడా ? చిన్నప్పటినుండి జమీందారీవ్యవస్థకు వ్యతి రేకంగా ప్రచారంచేసిన అతడు యిప్పుడు తన హీనతనాన్నిచూసి బాధపడట

మేమిటి? పెద్దపెద్దసంస్థానాలే తలక్రిందులైతే తాము బాధపడటమేమిటి? అని అన్నది అప్పి. అమ్మ నగంసొమ్ములు అమ్మివేసింది.

'ఇక ఏం చేయాలనివున్నది? కర్నూలుకు వెళ్ళాలనివున్నదా లేక పాకిస్తానుకు వెళ్ళాలనివున్నదా' అని అడిగాడు తనతండ్రిని కమాల్.

'ఇక్కడే వుందాం. పిరికివాళ్ళమూ పారిపోయేందుకు?'

కమాల్ నివ్వెరబోయాడు. 'మీరు ముస్లింలీగులో చేరారుకదా నాన్నా?' అని అడిగాడు కమాల్.

'పాకిస్తాన్ ఏర్పడింది. మంచిపనే జరిగింది. అంతమాత్రాన మనంకూడా అక్కడికి పారిపోవాలా?'

'పాకిస్తాన్ ఏర్పడటం మంచిదని భావించికూడా వెళ్ళడానికి యిష్టపడటంలేదు. వృద్ధాప్యంలో ఎందుకులే తిరగడమనా లేక హిందూదేశం మాతృదేశం కనుక దానిమీదగల ప్రేమవల్లనా మీరు పాకిస్తాన్ వెళ్ళంది?'

'నీతో చర్చించడం కష్టం. తలక్రిందులుగా ఆలోచిస్తుంటావు.'

'కరాచీవెళ్ళి అమీర్ రజా భార్యదగ్గర వుందామని వున్నది. ఇక్కడవుండటం నాకు యిష్టంలేదు' అని అన్నది అమ్మాబేగం.

కొద్దిరోజులతరువాత కమాల్ ఉద్యోగంకోసం బయలుదేరాడు. అతనికి చాలా డిగ్రీలు వున్నవి. ఇంగ్లండులో ఒక లేబొరేటరీలో ఉద్యోగం చేశాడు. మాతృదేశాభిమానంవల్ల ఆ ఉద్యోగం మానుకొని ఇండియాకు బయలుదేరివచ్చాడు.

ఆరునెలలు గడిచాయి. ఉద్యోగంకోసం ఢిల్లీచుట్టూ తిరిగితిరిగి అతనికి పిచ్చెక్కిపోయింది.

'ఒరే అబ్బాయి! ఎవరైనా మంత్రిగారికితే పట్టుకో. సిఫారసు చేయించుకో' అని అన్నారు తండ్రి.

'సిఫారసుకోసం తిరగను. ఇన్నియోగ్యతలువుంటే యింక సిఫారసులెందుకు?'

రోజంతా గుల్‌షన్‌లో పడివుంటున్నాడు. తోచనప్పుడు తలత్‌కు జాబులు వ్రాస్తుంటాడు. 'హిందూదేశం రావద్దని, అక్కడే ఉద్యోగం చేసుకోమనీ, యిక్కడికివచ్చావో నాకుపట్టినదుర్గతే నీకూ పడుతుంది' అని జాబులో వ్రాశాడు.

'ధైర్యంగా పనిచేయి. కష్టాలు వచ్చినప్పుడే గట్టిగా పనిచేయాలి. కూలి చేయి. నాగలితో పొలందున్ను. ఎప్పటికైనా విప్లవం తీసుకురావాలి. కాని నీవు

మెలపడాలని కోరుకొంటున్నట్లున్నావు. (అలా అనుకొంటే పాకిస్తాన్ వెళ్ళిపో అని వ్రాసింది తలత్.

'ఆడవాళ్ళకు పట్టుదల ఎక్కువనుకొంటాను. అందుకే తలత్ యీవిధంగా జాబులు వ్రాస్తున్నది' అని అనుకొన్నాడు కమాల్.

గౌతం న్యూయార్కునుండి అతనికి జాబులు వ్రాశాడు. దేనికీ సమాధానం వ్రాయలేదు. అమెరికానుండివచ్చిన హరిశంకర్ బెంగుళూరులో పెద్ద ఉద్యోగం సంపాదించాడు. అతనికికూడా కమాల్ జాబు వ్రాయలేదు.

'కరాచీకి రా. ఇక్కడ చాలాఉద్యోగాలు వున్నాయి. అనవసరంగా పట్టుదలకు పోకు. వెంటనే బయలుదేరి రా' అని అన్నయ్య రెండు మూడు జాబులు వ్రాశాడు.

కమాల్ అన్నయ్యవ్రాసేజాబులు తెరిచి చదవడంకూడా మానేశాడు. కొద్ది రోజులతరువాత బారాబంకీ కాలేజీలో ఉద్యోగం దొరికింది. కాని ఆస్తిగురించి గొడవలు బయలుదేరాయి. అన్నయ్య పాకిస్తాన్ వెళ్ళిపోయాడు. గుల్‌షన్‌లోను పిత్రార్జితమైన ఆస్తిలోను అతనికి భాగం వున్నది. అందువల్ల సంరక్షకుడి నియామకాన్నిగురించి తగాదా ప్రారంభమైంది. సంరక్షకుణ్ణిగురించిన నిర్ణయానికి వ్యతిరేకంగా నవాబుకోర్టులో దావా వేశాడు. రోజంతా కమాల్ ఆ దావాగొడవల్లో తిరుగసాగాడు. ఇప్పుడు కమాల్‌మాటల్లో కరుకుతనం పెరిగిపోయింది. నవ్వడం మానుకొన్నాడు. అంత అల్లరిచేసే కమాల్ పూర్తిగా మారిపోయాడు.

'ఇతడు బూర్జువారకం. విప్లవాన్నిగురించి ఉపన్యాసాలు కొడ్తేవాడు. వాస్తవాన్ని ఎదుర్కొనవలసి వచ్చేసరికి హడలిపోతున్నాడు' అని అన్నారు కాఫీ హౌసులోకూర్చొని స్నేహితులు.

హసేన్, అతనిభార్య అన్నయ్యతోబాటు కరాచీ వెళ్ళిపోయారు. కదీర్ కమతున్ కారు అమ్మినతరువాత మీర్జాపూర్ వెళ్ళిపోయారు.

ఒకరోజున ఢిల్లీకివెళ్ళి అర్జీవ్రాసి 'మెయిడెన్స్' హోటలుదగ్గర ఉత్తరం టపాలో వేద్దామని కమాల్ వెళుతున్నాడు. త్రోవలో ఓడమీద తనతోబాటు ప్రయాణంచేసిన థామస్ ఎల్కెంట్ కలిశాడు.

'హలో - మీరు యిక్కడ వున్నారేం?' కమాల్ అడిగాడు.

'దేశమంతా తిరుగుతున్నాను. దక్షిణభారతాన్ని, బంగాల్, అస్సాం, ఒరిస్సా తిరిగివచ్చాను. రాజస్థాన్ వెళదామనుకొంటున్నాను.'

'ఢిల్లీ అంతా తిరిగి చూశారా?'

'ఇంకా చూడలేదు.'

'మీరు మా రాష్ట్రపతిభవనం చూశారా? క్రొత్త ఢిల్లీలో క్రొత్తకట్టడాలు. రాజఘాట్ చూశారా? అవన్నీ హిందూదేశపు ప్రతీకాలు' అంటూ వెనుకటి కమాల్‌లా హిందూదేశపు గొప్పతనాన్నిగురించి చెప్పడం ప్రారంభించాడు. ఉద్యోగంకోసం గడపగడపకు తిరుగుతున్న కమాల్ తన బాధనంతటినీ దిగమ్రింగి థామస్‌కు ఢిల్లీని చూపించుతూ తిరిగాడు.

'హల్వ్వలో కూర్చొని టీ త్రాగుతూ - ఏం చేస్తున్నావని కమాల్‌ను టామ్ అడిగాడు.

'ఏమీ చేయడంలేదు. ఉద్యోగంకోసం ప్రయత్నిస్తున్నాను' అని అన్నాడు కమాల్.

'ఉద్యోగం యీ దేశపు పెద్దసమస్య' అని అన్నాడు టామ్.

'ఆ సమస్య అందరికీ సంబంధించినది. వారిలో నేనూ ఒకణ్ణి. మంచి అభివృద్ధి కలిగినప్పుడు దేశమంతా అభివృద్ధి పొందుతుంది. ఇతడు మహమ్మదీయుడా, ఇతడు హిందువా అని అభివృద్ధి చూడదు. మునిగితే అంతా మునుగుతాం. తేలితే అంతా తేలుతాం.'

'కాని నీవు నవాబువి. కూలీనాలీ చేయలేవు' అని అన్నాడు గుల్షన్.

రేడియోకేంద్రందగ్గరకు వెళ్ళినప్పుడు గుల్షన్ కలిసి వాళ్లతోబాటు తానుకూడా వున్నాడు.

'నీవు చెప్పింది తప్పు.'

'అయితే నతోబాటు రా, ట్రాక్టరు నడుపు.'

నేను ట్రాక్టరునడిపే శిక్షణపొందివుంటే తప్పక నడిపేవాణ్ణి. కాని ఎనిమిది సంవత్సరాలు నేను అణుభౌతికవిజ్ఞానంకోసం వృథాచేసి వచ్చాను.'

'పాకిస్తానులో వైజ్ఞానికులకు మంచి అవకాశముందని విన్నాను. అక్కడికి వెళ్లు. ఇక్కడవుండి ఎందుకు అవస్థపడతావు?' అని అన్నాడు గుల్షన్.

'నీవూ యీమాటే అంటున్నావా?' అని ఆశ్చర్యంతో అన్నాడు కమాల్.

'అవును. పాకిస్తాన్ వెళ్ళమని చెబుతున్నాను.'

చివరికి ఆరోజు రానేవచ్చింది. కమాల్ ఢిల్లీ వెళ్ళి వీసాకోసం అర్జీ పెట్టుకొన్నాడు. ఈ నిర్ణయానికి రాకపూర్వం చాలారోజులపాటు ఆలోచించాడు. ఎవ్వరికీ

కనబడకుండా తిరిగారు. గుల్‌షెషాం శూన్యంగా కనబడింది. ముసలివాడు లోపలి గదిలోనుండి దగ్గుతున్న చప్పుడు వినబడుతున్నది. కొత్త గొడవల్లో పడటంవల్ల బారాబంకీలో దొరికిన కాలేజీ ఉద్యోగం కాస్తా ఊడిపోయింది. పాకిస్తాన్ వెళ్ళగూడదని గట్టిగా అనుకొన్నాడు.

కాని దానిలో చిక్కు వచ్చింది. గుల్‌షెషాం సర్ జకీరజా పేరట రిజిస్టరు అయి వున్నది. అమీర్‌రజా అతనికి వారసుడు పాకిస్తానీయుడు. గుల్‌షెషాం వదలిపెట్టబడిన ఆస్తిగా పరిగణింపబడింది. మరునాడు కమాల్ లక్నోలో వుంటూనే 'శరణార్థి' అయిపోయాడు. మూడోరోజున పోలీసు ఆఫీసర్లు భవనానికి తాళం పెట్టేందుకు వచ్చారు. నాల్గోరోజున కమాల్ వెళ్ళి వీసా తెచ్చుకొన్నాడు. తన ముసలి తల్లిదండ్రిని వెంటబెట్టుకొని రైలు ఎక్కాడు. అయిదవరోజున రైలు ఢిల్లీ చేరింది. ఆరవరోజున రైలు సరిహద్దును దాటింది. ఏడవరోజున కమాల్‌రజా కరాచీలో - పాకిస్తాన్‌లో వున్నాడు.

## 55

కరాచీ, 1956 లో ప్రపంచంలోని పెద్ద ఇస్లాంరాజ్యాల్లో ఒకటి. ప్రపంచంలో అయిదవ పెద్దదేశపు రాజధాని కరాచి. ఇక్కడ క్రొత్త మధ్యమవర్గంవాళ్ళ చేతుల్లో అధికారం వున్నది. కరాచీ పూర్తిగా ఆధునికనగరం. ఇక్కడ రోజూ రాత్రిళ్లు పెద్దపెద్ద హోటళ్ళలోను, క్లబ్బుల్లోను మిలమిలలాడే ప్రపంచం కనబడుతూ వుంటుంది. ఈ క్రొత్తరకం సమాజవ్యవస్థకు మూలాధారం డబ్బు. నల్లబజారు వాళ్లు యింకా వ్యాపారం చేయలేకపోతున్నామే అని ఏడుస్తుంటే, మేధావులు విప్లవం వచ్చేందుకు అవకాశంలేకుండా పోతున్నదేనని దుఃఖిస్తున్నారు. ముస్లిం వనితలు ఘోషా లేకుండా స్వేచ్ఛగా తిరుగుతున్నారని, బాల్‌రూముల్లో నాట్యం చేస్తున్నారని జమాతే ఇస్లాంవాళ్లు ఎలుగెత్తి గోలపెడుతున్నారు.

బెంగాలీ, పంజాబీ, శరణార్థుల తగాదాలు మరోవంక విపరీతంగా సాగుతున్నాయి.

అసలు యీ విభజన తప్పని, దేశమంతా నిజానికి ఒక్కటేనని రుజూ చేద్దామని ప్రయత్నిస్తున్నది హిందూదేశం. ఈ విభజన సరియైనదేనని, మా సంస్కృతి పూర్తిగా వేరని, రెండుదేశాలు కలయిక అసంభవమని గట్టిగా వాదిస్తున్నది పాకిస్తాన్.

రెండుదేశాలు పాశ్చాత్యదేశాల్లో విపరీతంగా ప్రచారం చేసుకొంటున్నాయి. ప్రపంచం మొత్తంమీద తామే ఇస్లాంమత అభివృద్ధికి పట్టాపుచ్చుకొన్నట్లు వ్యవహరిస్తున్నది పాకిస్తాన్. ఇస్లాంమతం గొప్పనదిలా ప్రవహిస్తూ గొప్ప జల ప్రపాతంగా మారిపోయిందని, అట్టి ఇస్లాంమతం యిప్పుడు ఒదిగిఒదిగి మట్టి కాలువల్లా ప్రవహిస్తున్నదని యీ స్వరూపం మార్చివేయాలని పాకిస్తాన్ ప్రచారం ప్రారంభించింది.

నిజానికి అంతా 'తమాషా'లా తయారైంది. ఇస్లాంమతాన్నిగురించి మాట్లాడేవాళ్ళెవరికీ ఇస్లాంమత ఆదర్శాలతో ఏమీ సంబంధంలేదు.

మహమ్మదీయులు ఎనిమిదివందల సంవత్సరాలపాటు క్రిస్టియన్ల స్పెయిన్‌ను పరిపాలించారని, వెయ్యిసంవత్సరాలపాటు హిందువుల భారతదేశాన్ని పరిపాలించారని, నాలుగువందల సంవత్సరాలపాటు తూర్పు యూరపును పరిపాలించారనిమాత్రం వాళ్లకు తెలుసు. అంతేగాని ఇస్లాంమత మానవప్రేమకు సంబంధించిన ఆదర్శాలు, వాళ్ళకు పట్టవు ఇస్లాంమతప్రవక్త పేరును వుపయోగించడమేగాని ఆయనబోధలు ఎవ్వరికీ పట్టవు. ఇస్లాంమతంపేరునుమాత్రం బాగా వుపయోగించుకొంటున్నారు పాకిస్తాన్ పరిపాలకులు.

సంతోషించవలసినవిషయాలు అనేకం వున్నాయి. దేశం త్వరత్వరగా పారిశ్రామికంగా అభివృద్ధికి వస్తున్నది. చాలామంది మహిళలు ఉద్యోగాలు చేస్తున్నారు. వైద్యులు, నర్సులు, ఉపాధ్యాయినులుగా చాలామందిస్త్రీలు పనిచేస్తున్నారు. పాకిస్తాన్‌మహిళలు నిజంగా గొప్పఅభివృద్ధిని సాధించారు. ఇది మంచిశకునం.

అంటూ రాత్రంతాకూర్చొని జాబు పూర్తిచేశాడు. నీతో చాలావిషయాలు చెప్పాలి. నా కళ్లతో దేశాన్ని చూసేందుకు ప్రయత్నించు. ఈ దేశానికి నాశక్త్యాను సారం సేవచేయాలని వుంది. నన్ను ప్రోత్సహించు' అంటూ కమాల్ వ్రాశాడు తలత్‌కు.

'అమ్మాయీ! భారతదేశంలో మధ్యతరగతి మహమ్మదీయులు దెబ్బతిని పోయారు. సాంస్కృతిక, ఆర్థిక రక్షణకోసం హిందూదేశపు మహమ్మదీయులు

పాకిస్తాన్ వస్తున్నారు. భారతదేశంలోని ముస్లిం యువకులు తాము కాలేజీలనుండి బయటకు రాగానే సైన్యంలో చేరదామంటే ఎవ్వరూ చేర్చుకోవడంలేదని. తమ విధేయత శంకించబడుతున్నదని అంటున్నారు. కుటుంబాలు కుటుంబాలే కదిలి పోతున్నాయి.

ఒక సోదరుడు పాకిస్తాన్ సైన్యంలో చేరితే మరోసోదరుడు పాకిస్తాన్ నావిక దళంలో చేరుతున్నాడు. మూడోసోదరుడు ఆజాద్ కాశ్మీరు రేడియోలో పని చేస్తున్నాడు. పాట్నాలో బి.ఎస్‌సి చదువుతున్న నాల్గవసోదరుడు భారతీయ విమాన దళంలో చేరదామనికూడా యోచించడంలేదు. అతడు పాకిస్తాన్‌వచ్చి జెట్ పైలెట్ అయిపోతున్నాడు. పాట్నాలోవుంటే అతడికి గుమాస్తాఉద్యోగంకూడా దొరికేది కాదు. ఉద్యోగాలకోసం జరిపే పోటీపరీక్షలో నెగ్గినా మహమ్మదీయుడు కావడం వలన ఏవస్థాయిలో ఎన్నుకోబడటం కష్టమనేభావం మహమ్మదీయుల్లో గాఢంగా నాటుకొన్నది. పంధొమ్మిదవశతాబ్దంలో ఆర్థిక సంక్షోభంవల్ల యీ రకమైన విభేదాలు దేశంలో పెరిగిపోయాయి. అధికసంఖ్యాకులైన హిందువుల చేతుల్లో దెబ్బతింపోతామనే మనస్తత్వం దేశంలో పనిచేస్తున్నదని పండిత్ నెహ్రూ, సర్దార్ పణిక్కార్ వంటివారే పేర్కొన్నారు. ఈవిధమైన భయం కలుగకుండా చేయగలిగివుంటే యీనాడు పరిస్థితులు మరోరూపంలో వుండివుండేవి. ఈపని కాంగ్రెసు చేయగలస్థితిలో వున్నది.

భాషాసమస్యకూడా తీవ్రరూపం దాల్చింది. హిందూదేశాన్నుండి మహమ్మదీయులు వెళ్ళిపోవడానికి యిదికూడా పెద్ద కారణం అయిపోయింది. హిందూదేశంలో ఉర్దూ మహమ్మదీయులభాషగా పరిగణింపబడుతున్నది. నిజానికి హిందూ ముస్లిములు యిద్దరూకలిసి పెంచి పోషించినభాష ఉర్దూ.

తలత్ । యివాళ జరిగిన గొప్పపట్టాన్నిగురించి వ్రాస్తున్నాను. లక్నోలో విప్లవాన్నిగురించి వాదించిన నేను, కాంగ్రెసులోచేరి ఉత్సాహంగా పనిచేసిన నేను, అఖండభారతావనినిగురించి పాటలు పాడిన నేను యివాళతరయాం నెలకు పన్నెండు వందలరూపాయల జీతంమీద పెద్దఉద్యోగంలో నియమించబడ్డాను. ఈ హోదా నాకు పాకిస్తాన్‌లో లభించింది. లేబొరేటరీని స్థాపించేపని నాకు అప్పగించారు. సామగ్రికోసం త్వరలోనే అమెరికా వెళ్ళవలసివుంటుంది. ఈ పనికోసం వచ్చే వారంలో తూర్పు పాకిస్తాన్ వెళుతున్నాను. తరువాత ఉత్తరం ఢాకానుండి వ్రాస్తాను.

ఇకనేను యిక్కడి పరిస్థితులను వివరిస్తాను. ఇవాళ శుక్రవారం. నేను ఒక మేధావుల నగరులో పాల్గొని వస్తున్నాను. అక్కడ పాశ్చాత్య సాహిత్యాలను, ప్రపంచ రాజకీయాలను విమర్శిస్తు యువతీయువకులు బృందాలుగాచేరి చేసిన ప్రసంగాలువిని నేను విస్తుపోయాను. నీవుకూడా వాళ్ళమాటలు వినియుంటే ఎంతో బాగుండునని అనిపించినది.

ఇవాళ అక్కడే ఒకచోట కేథలిక్ మతాన్నిగురించి చర్చ జరుగుతుంటే మరో చోట పాశ్చాత్య దేశాలలో ప్రతిక్రియావాదులగు సాహిత్యకుల్ని గురించి విమర్శ సాగుతున్నది. అల్జీరియాను గురించిన వ్యవహారంలో ఒక ఫ్రాన్సువాడిని తిడుతున్నారు. అమెరికా సహాయాన్ని గురించి కొందరు మేరీ రిచర్డ్సు ప్రాణం తీస్తున్నారు.

నేను మరోవైపుకు వెళ్ళాను. తివాచీకొసన కూర్చొని కొందరు ఫ్రాన్సుకు చెందిన మేధావితో తలపట్లు పడుతున్నారు.

'ఫ్రాన్సులో యిప్పటి రంగుపిరాయిస్తున్న స్థితికంటె పాశ్చాత్యదేశాల మేధావులస్థితి అధ్వానంగావున్నది. ఫ్రాన్సులో ప్రచలితమైన యిప్పటి సంస్కృతి పాశ్చాత్యదేశాల బుద్ధిజీవుల్ని తలక్రిందులుచేసింది. నిజంగా పాశ్చాత్యదేశాలు పతనమైపోయాయి ఇక తమరక్షణకు అక్కడ ఏమీ ఆస్కారంలేదు. రేపోమాపో సార్త్రి మళ్లీ ప్రాయశ్చిత్తం చేసికొంటే ఆశ్చర్యపడనక్కరలేదు. పాశ్చాత్య సభ్యతకు ప్రాతినిధ్యంవహించే పెద్దల కాళ్ళక్రిందగల మట్టి మాయమైపోయినట్లే' నని గర్జిస్తున్నాడు తన్వీర్.

'ఇంగ్లీషు మేధావులు అమెరికాదబ్బు తింటున్నారు' అనికూడా అన్నాడు. నేను మెల్లగా అమెరికన్ల దగ్గరకువెళ్ళి కూర్చున్నాను.

మరోబృందంలో ఒక ప్రసిద్ధ అమెరికన్ చరిత్రకారుడు కూర్చొని 'గృహ యుద్ధానంతరం అమెరికా రెండుభాగాలుగా చీలిపోయివుంటే మాగతి యీపాటికి ఏమైపోయి వుండేదో!' అని అంటూ నావైపుచూసి 'విభజనకు కారణం ఆర్థికస్థితే నను సిద్ధాంతం యిక్కడ చెల్లించకు' అంటూ చేయియెత్తి సౌంజ్ఞచేశాడు.

'అంతకంటె మరోకారణంవుంటే అదేమిటో చెప్పండి' అని అన్నాను.

'అసలు ప్రాక్‌దేశాల పతనానికి కారణం ఏమిటో చెప్పండి' అని అన్నది హమీదా. నేను టోయన్బీనికూడా అడిగాను. సమాధానం రాలేదు. పద్దెనిమిదవ శతాబ్దంలో భారతదేశం ఎందుకు పతనమైంది!'

'భారతదేశపు నీటిపారుదల ఏర్పాట్లు సరిగా లేకపోవడమే అందుకుకారణం. ఇది పూర్తిగా వ్యవసాయానికి సంబంధించిన సమస్య' అని అన్నాడు జాకబ్ మోరిసన్ అను ఒక అమెరికన్ మేధావి.

ఒకటిన్నర అయినతరువాత మేము అక్కడినుండి బయలుదేరాము. ఇంటికి చేరుకొనేసరికి నా ఒళ్ళంతా హూనంహూనం అయిపోయింది.

తలత్ ! ఇవాళ జరిగిన మహత్తరమైనఘట్టం ఏమిటో విను. లక్నోనివాసిని. విప్లవకారుణ్ణి. ఉత్సాహంతో పనిచేసిన కాంగ్రెస్ కార్యకర్తను. అఖండ భారతా వని గురించి పాటలుపాడినవాణ్ణి. అటువంటి నాకు యివాళ ఉదయం నెలకు 12 వందల రూపాయల జీతంమీద ఒక ఉద్యోగం దొరికింది. లేబొరేటరీని పూర్తిగా నేను ఏర్పాటుచేయాలి. అందుకు అవసరమైన సామగ్రి కొనుగోలు చేసేందుకు బహుశః నన్ను అమెరికా పంపుతారు. ఈ పని నిమిత్తమే వచ్చేవారం తూర్పుపాకిస్తాన్ వెళుతున్నాను. ఢాకానుండి తరువాత జాబు వ్రాస్తాను.

తెల్లవారుతున్నది. రాత్రంతా నీకు జాబువ్రాస్తు గడిపివేశాను. ఇప్పుడే కిటికీకి గల పర్దాలు ప్రక్కకునెట్టి బైటకు తొంగిచూశాను. కరాచీ మేల్కొన్నది. కరాచీ తనపనికి వెళుతున్నది. వందలాది వేలాదిజనం తమతమ మిల్లులకు, ఆఫీసులకు వెళుతున్నారు. వీళ్ళనే సామాన్యంగా అంతా 'ప్రజానీకం' అని అంటారు. తలత్ ! వీళ్లు చేసిననాసం ఏమీలేదు. వీళ్ళకు చదువులేకుండా చేశారు. వీళ్ళ కడుపు నిండ కుండా వుంచారు. ఏ కర్రతో మలిపినా వీళ్ళు మళ్ళుతారు. వీళ్లంతా శాంతిగా జీవించాలని, పొట్టనిండా తిండితినాలని, విశ్రాంతిగా నిద్రించాలని కోరే ప్రజలు. తలత్ ! ప్రొద్దున్నే వేలాది కార్మికులు గుంపులుగుంపులుగా ఏ.బి.డి.సి.కి చెందిన క్రొత్త ఓడరేవుదగ్గిరకి వెళుతున్నప్పుడు ఆదృశ్యం స్వయంగా చూడవలసినదే గాని చెప్పనలవిగాదు. పాకిస్తాన్ భవిష్యత్తును గురించి వీళ్ళను చూచినప్పుడు ఎన్నో ఆశలు నాకు కలుగుతూవుంటాయి.

తలత్ ! వీళ్ళు చాలా మంచివాళ్ళు. నీదేశాన్ని రెండు ముక్కలుచేశారని వీళ్ళను తిరస్కరించకు. వీళ్ళు చాలా అమాయకులు. నిన్నరాత్రి జరిగిన మేధావుల సమావేశాల్లో జరిగిన చర్చలతోగాని, వాక్యలతోగాని, వ్యవహారాలతోగాని, వీళ్లకు ఏమాత్రం సంబంధంలేదు. సింధుప్రాంతంలో పారిశ్రామిక అవసరాలందు కార్ఖానాలు చాలా వెలిసాయి. వాటి యంత్రాల్ని యీ మనుష్యులే నడుపు

ఉన్నారు. వీళ్లు నివసిస్తున్న దేశంపేరే పాకిస్తాన్. గడిచినదానికి వగచటం, గడిచిపోయిన పొరపాట్లనుగురించి పశ్చాత్తాపపడటం తప్పు. భవిష్యత్తు ఎంతో వుండటమే అందుకు కారణం. ఈ రెండుదేశాలు తిరిగి ఏకం అవుతాయని అనుకోవడం మూర్ఖత్వం. ప్రపంచంలో యుద్ధం ఒక్కొక్కటి జరుగుతూవుంటే దానితోబాటు ప్రపంచపటంకూడా మారిపోతూవుంటుంది. 1945 తరువాతకూడా మారిపోయింది. దేశవిభజనముగురించి తలచుకుంటే నాకు గుండెగోతాగావుంటుంది. కాని యిలా ఎంతకాలం కోతసాగుతుంది? జీవితం సగం గడిచిపోయింది. ఇంకా కొద్దిగా మిగిలివున్నది. ఇక యీ మిగిలిన సమయాన్ని సద్వినియోగం చేసికోవలసిన అవసరం ఎంతైనావున్నది.

ఈ దేశం నన్ను తనరక్షణలోకి తీసికొన్నది. ఆశ్రయం ఇచ్చింది. ఇక దీన్ని బాగుచేయడం లేక పాడుచేయడం నాచేతుల్లో వున్నది. విధ్వంసనంకంటె నిర్మాణం గొప్పదని జీవితమంతా తపించిన నేను యిక్కడ నా ధ్యేయాన్ని విస్మరించగలనని అనుకోవద్దు. నేను నా ధ్యేయాన్ని మరువను. తలత్! నేను నిర్మాణానికి పూను కొంటాను. నడుం బిగించి పనిచేస్తాను.'

పి. ఎస్.—

నిర్మాణాన్నిగురించి వ్రాస్తున్నప్పుడు జ్ఞాపకం వచ్చింది. నేను ఎక్కడున్నానో తెలుసా? అన్నయ్యభవనంలో నేను వున్నాను. చాలా దర్జాగావున్నది యీ భవనం. ఇది ఒక ఇటాలియన్‌వాడు నిర్మాణంచేసిన భవంతి.

అన్నయ్య పెళ్ళి చేసికొన్నఆమె కరాచీలోని ప్రసిద్ధికెక్కిన సమాజానికిచెందిన మహిళల్లో ఒకతెగా లెక్కింపబడుతున్నది. ఒదినగారు నావిషయమై శ్రద్ధగా వున్నది. నా వివాహాన్నిగురించికూడా శ్రద్ధవహించింది. నాకోసం వెయ్యిగజాల చోటుకూడా ఎక్కడో యిప్పించింది, నిన్న యీ మెళవంతి కట్టిన ఇటాలియన్ వాడు నాకోసం కట్టతలంచిన భవనం ప్లానుతీసికొనివచ్చి నాకు చూపించేసరికి నిజంగా నాకు ఏడుపువచ్చింది. బిగ్గరగా ఏడ్వాలనిపించింది.

నీ

'తమ్మన్'

మధ్యయుగంనాటి భారతదేశం. గోడలమీద గడ్డి గాదం మొలుస్తూ కనబడుతున్నది. పాత ఢిల్లీ, బెంగాల్, మాల్వా, అహమ్మదాబాద్, చంపానేర్, జౌన్‌పూర్, బహమనీ పాదుషాలభవనాలు, బీదర్, గుల్బర్గా, దక్షిణాది, ఉత్తరప్రదేశ్‌లోని లలిత్‌పూర్, కాల్పి, షికోహాబాద్, బదాయూం, జౌన్‌పూర్. ముఘలులకంటె పూర్వపు భారతదేశం.

ఒరిస్సా, మద్రాసు, కర్ణాటక, అజంతా, ఎల్లోరా. తిరిగితిరిగి ప్రిల్ మళ్లీ మధ్యయుగపుభవనాల్లోకి ప్రవేశించాడు. లెక్కలేనన్ని పేర్లు. లెక్కలేనన్ని కాలాలు. యూరపులో చర్చిగృహాలమధ్య తిరిగే ప్రిల్ యిప్పుడు ఇండియాకువచ్చి దేశమంతా తెగ తిరుగుతున్నాడు. ఇక్కడి భవనాలను, రాళ్ళను చేతులతో తాకిచూస్తున్నాడు. తామరపూవులు, ఏనుగులు, గంధర్వులు, అలంకేంద్రాలు, మెట్లు, బురుజులు చూశాడు. ఆ శిథిలాలలో మేకల్ని మేపుతూ ఎవరో ఒక అమ్మాయి కనబడేది. రాగిచెట్టుమీదినుంచి ఎవరో ఒకపిల్లవాడు నీటిబావిలోకి దూకుతూ కనబడేవాడు. ఎవరో గ్రుడ్డివాడు ఆ శిథిలాలదగ్గరకూర్చొని చుట్ట కాల్చుకొనేవాడు. పైన నీలిరంగు ఆకాశం-బంగాళాఖాతంమీద మేఘాలులేచి ముందుకుసాగేవి. మధ్యయుగంనాటి భారతదేశం ఉదాసీనంగా వర్షంలో స్నానంచేస్తూ వుండేది. గడ్డిగాదం గాలిలో రెపరెపలాడేవి.

ఈ రాళ్ళశిలలు భూతవర్తమానాలు రెండింటిలోను కనబడుతున్నాయి. భారతదేశమందంతటా తిరిగితిరిగి అతడు కలకత్తా చేరుకొనేవాడు. (అతడు దేనికోసం తిరుగుతున్నాడో అతనికే తెలియక విసుక్కొనేవాడు). అక్కడ ఏమీ తోచక విమానంఎక్కి తూర్పు బెంగాలుకువెళ్లి ఢాకాక్లబ్బులో హాయిగా కూర్చొని టీను త్రాగిత్రాగి, అక్కడినుంచి బయలుదేరి సిల్హెట్ వెళ్లే రైలెక్కి ప్రయాణంచేసేవాడు.

ఎక్కడికివెళ్ళాలో అతనికే తెలియదు.

ఒక చిన్న స్టేషనుదగ్గర రైలు తక్కువ ఆగింది. రకరకాల కేకలు నిద్రలో కొట్టుకొంటూ అతనివరకు చేరాయి. డిమ్ (గ్రుడ్డు), బాయిల్డ్ డిమ్,

వా-గరమ్ (వేరి టీ) వాగరమ్. వాగరమ్. టీమ్ బాయల్డ్ అను కేకలువిని కిటికీదగ్గ రకువచ్చి చెక్కఎత్తి చూశాడు. దూరాన కనబడుతున్న పచ్చపచ్చని పొలాలమీది నుండి వచ్చిన సువాసనలు అతణ్ణి ఆనందింపచేశాయి. ఒక ముసలి బెంగాలీ హిందువు సామాను. మూటలు మోసుకొంటూ వంగివంగి వెళుతున్నాడు. కంటికి కనబడకుండా వున్నంతవరకు ఆ ముసలివాణ్ణి గ్రిల్ చూస్తూనేవున్నాడు. అబ్బ ఎంత జనం ! ఎంత జనం ! ఆడవాళ్లు. లుంగీలుకట్టుకొన్న మహమ్మదీయులు. ఆంగ్లో ఇండియన్ గార్డు. అబ్బ ఎంత జనం ! రైలు బయలుదేరింది. బెంగాలీకేకలు ఆగిపోయాయి. చెరువులమధ్యగా రైలు పరుగెత్తుతూంది. చెరువుల్లో తామర పుష్పాలు వికసిస్తూవున్నాయి. త్రోవలో చాలామంది ఆడవాళ్లు కనబడుతున్నారు. వాళ్ళపేర్లు అమ్మా, సకీనా. రేవా. రాధా అయివుంటాయి. వాళ్ళ జీవితకథలు ఏమై వుంటాయో ! పుట్టినప్పటినుండి గిట్టేవరకుగల వారి జీవితకథలో కష్టాలు. బాధలు. దారిద్ర్యం. కరువు. కాటకం తప్ప యింక ఏముంటాయి ?

అతడు కళ్లు మూసుకొన్నాడు.

'అల్లా అన్నంపెట్టు - అల్లా అన్నంపెట్టు' అంటూ బెంగాలీ బీదవాళ్లు ఢాకాలో పాడుతూవుంటే గ్రిల్ విన్నాడు. ఆ చరణం యిప్పుడతనికి జ్ఞాపకంవచ్చింది. బెంగాలునుగురించి ఏమేమో ఊహాగానంచేస్తూ కలలు యిప్పటివరకు అతడు కన్నాడు. సుజాతాదేవి టాగూరు పాటల్నిగురించి. బెంగాలు గొప్పతనాన్నిగురించి ఏమేమో చెప్పింది. ఆ బెంగాల్లోనే తిరుగుతున్నాడు. ఆ బెంగాలునే చూస్తున్నాడు. జస్మద్దీన్, లీలారాయ్, జానపదగేయాల్ని సంగ్రహపరుస్తూ తిరుగుతున్న పరిశోధ కులు. సాహిత్యసభలు. కలకత్తాలోని థియేటర్లు. సాంస్కృతిక కార్యక్రమాలు కార్నవాలిస్ నివసించిన పాత బిల్వేడియర్ గవర్నమెంటు హౌను. నేతాజీ సుభాష్ చంద్రబోస్ రోడ్డుగా యిప్పుడు మారిపోయిన క్లైవురోడ్డు. అలీపుర్. ధర్మతల్లా. గార్డెన్ రీచ్. ఇంతలో రైలు ఒక స్టేషనుదగ్గర ఆగిపోయింది.

అతని కంపార్ట్‌మెంటుతలుపు తెరుచుకొన్నది. డైనింగ్‌కారుకు సంబంధించిన బేరర్ తెల్లనిదుస్తులు వేసుకొనివచ్చి నిలబడ్డాడు.

'భోజనం సాబ్.'

'అలాగే పట్టుకురా.'

కంబళీ మోకాళ్లవరకు కప్పుకొని గ్రిల్ పడుకొన్నాడు.

సిల్హాట్‌లో టీ తోటల్లో, వందలాది తూర్పువాళ్ల పనిచేస్తున్నారు. రామ్‌దేయా, రామావతార్, లక్ష్మన్, సీత, గౌంద, చంబేలియా వాళ్ళ పేర్లు. రాముడు, సీత యీ రెండుపేర్లు అక్కడ పనిచేసే తూర్పుపనివాళ్లలో ఎక్కువమందికి వున్నాయి. భారతదేశపు భూతకాలం, స్వర్ణయుగం, పాటలీపుత్రం, ఇంద్రప్రస్థం, అయోధ్య, లక్ష్మణవతి, శ్రావస్తి, దిగ్విజయంపొందిన రామచంద్రుడు, మిథిలాకుమారి జనక సుత సీత....ఓహోహో....ఏమి చరిత్రకారులయ్యా మీరు! 'భోజనం సాబ్! కాఫీ తీసుకురానా?' అంటూ పళ్లెంతెచ్చి బేరరే ఎదురూగా వుంచాడు. దేవతను వంటో ధించినట్లు అతనితో మాట్లాడుతున్నాడు బేరర్.

భూతకాలంలో విహరిస్తూన్న ప్రిల్ వర్తమానంలోకి వచ్చాడు. తాను శ్రీమంగళ్ వెళ్ళాలి. రంగామాటి, బందర్ బన్ వెళ్ళాలి. ఇంకా డబ్బు సంపా దించాలి.

రెండోరోజు రైలు సిల్హాట్ చేరుకొన్నది. స్టేషనుదగ్గర అతనిమేనేజరు పీటర్ ఎప్పటివలెనే కారుతెచ్చి నిలబడివున్నాడు. స్వాగతం చెప్పాడు. ఇద్దరూకలిసి కారులో శ్రీమంగళ్‌కు బయలుదేరారు.

సుర్మానదీతీరానికి చేరుకోగానే అతడు కారు ఆపివేశాడు. సాయంత్రంతరువాత చీకటిపడుతున్నది. లాంతర్లుపుచ్చుకొని ముసలివాళ్లు, మొగవాళ్లు, ఆడవాళ్లు పడవలు ఎక్కుతున్నారు, దిగుతున్నారు. మోటారు బోటు ధద్‌ధద్‌మంటూ అవలి ఒడ్డు మంచి తిరిగివచ్చింది. ఒక గ్రుడ్డిఫకీరు కురాన్‌చదువుతూ బిచ్చం ఎత్తుకొంటు న్నాడు.

మోటరుబోటుకు చెక్కలు అనించి కారును పైకి ఎక్కించారు. నావ పూర్తిగా జనంతో నిండిపోయింది.

'మురికిజనం. పడవలోపలికి వెళదాం' అని అన్నాడు పీటర్. అతడు వ్యతి రేకించలేదు.

వాళ్ళిద్దరూ ఒక్క దూకుదూకి పడవమీదకు ఎక్కారు. పడవ మోటరుబోటు వెనుక నడవసాగింది. ఒడ్డు దూరమైపోతుంది. కిరసనాయిలుదీపాలు వెలుగు తున్నాయి. అక్కడ గుడిసెలమీద తమలపాకులతీగలు అల్లుకొనివున్నాయి. టీ దుకాణందగ్గరగా దీపంవెలుగులో కూర్చొని జనం పత్రిక చదువుతున్నారు నదిలో పడవలు నడుస్తున్నాయి. అంతటా శాంతి కనబడుతున్నది. అంతా ప్రశాం తంగా వున్నది.

ఇంతలో గాలి తీవ్రంగా వీచింది. పడవలు ఊగిపోయాయి. ముసలి సరంగు తన శక్తినంతటినీ వినియోగించి పడవను నడుపసాగాడు. ఆ తరువాత పాటలు పాడటంలో లీనమైనాడు.

ముసలి సరంగు పడవను నడుపుతున్నాడు. పడవ కెరటాలమీద తేలిపోతూ సాగిపోతున్నది. గాఢాంధకారం అలముకొనివున్నది. గాలిలో తుఫానుచిహ్నాలు గోచరిస్తున్నాయి. కాని ఆకలితో శుష్కించిపోయిన ఆ ముసలి సరంగు పడవ మాత్రం కులాసాగా తాకిళ్లన్నింటిని ఎదుర్కొంటూ ముందుకు సాగుతున్నది. ఆ ముసలివాడికి, పంచతత్వాల నిర్మాతకు, మృత్యువుకు, ఆపదలకు మంచిస్నేహం ఏర్పడిపోవడమే అందుకు కారణం.

గాలి మరింత తీవ్రమైపోయింది. ప్రిల్ కంగారు పడ్డాడు. లాంతరుఎత్తి నాలుగువైపుల పరిశీలించిచూశాడు. పడవ ఊగినట్లనిపోతున్నది. 'పీటర్! తుఫానులో చిక్కుకొన్నామా?' అని కంగారుపడుతూ అడిగాడు ప్రిల్.

'లేదు. ఇది మామూలు గాలే. కంగారుపడ నవసరంలేదు' అని అన్నాడు పీటర్. 'కాని నల్లపంపికి (ముసలి సరంగు) దరిద్రపుపాటలు ఆపి. చుక్కానిమీద శ్రద్ధ వహించమని చెప్పాలి. లేకపోతే రేపు తెల్లవారినా అడంగుకు చేరుగోలేము.'

'పాపం ముసలివాడు' అంటూ ప్రిల్ చాపతో కప్పబడిన పడవ పైకప్పుమీద నుండి తొంగి క్రిందకుచూశాడు. సరంగు తల పైకెత్తి అతణ్ణి చూశాడు. తాపీగా చుక్కాని నడుపుతున్నాడు.

'వీళ్లు చాలా వీనులు. చురుకుతనం వీళ్ళలో లేనేలేదు' అని అన్నాడు పీటర్.

'ఏమయ్యా! నీపేరు ఏమిటి?' అని అడిగాడు ప్రిల్ సరంగును.

'అబుల్ మన్సూర్ సాబ్.'

'అబుల్ మన్సూర్!' అని తిరిగి అని, 'సాయం చేయనా?' అని అడిగాడు.

'అక్కర్లేదు సాబ్' అంటూ తిరిగి చుక్కానిమీదకు ఒరిగిపోయాడు. పడవ వేగంగా రెండోతీరానికి చేరుకోసాగింది.

ప్రిల్ పడవలోపలికి తొంగిచూశాడు. అక్కడ అబుల్ మన్సూర్ని మట్టిదీపం, చాప, రెండు కంచుపాత్రలు వున్నాయి. గోడమీద కొబ్బరికాయ వ్రేలాడుతున్నది. ఇదీ ఆ తెల్లగడ్డంవాడి సంపద. ప్రిల్ బుర్ర వేడెక్కిపోయింది. ఎక్కడి కేంబ్రిడ్జి,

ఎక్కడి యీ పరవ? అంతా నౌనటవ్రాసిన రేఖ. ఇది అందమైన చోటు. తూర్పు బెంగాల్. తూర్పు పాకిస్తాన్.

లాంతరు ఎత్తి రెండోసారి అంతా కలియచూశాడు. నీటిమీద వెలుగురేఖలు ప్రవరించసాగాయి.

# 57

గడిచిపోయిన సంవత్సరాలు బీరుగ్లాసులోని బుడగల్లా తేలిపోసాగాయి. అరగంట గడిచిపోయింది. ప్రిల్ మౌనంగాకూర్చొని నీలిపర్వతాలను చూస్తూవున్నాడు. పర్వతాలకు ఆవల బర్మావున్నది.

'సేం సోదరా! ఏమిటి ఆలోచిస్తున్నావు?' అని అడిగాడు కమాల్.

'ఏమీలేదు. ఇక్కడినుండి నడిచివెళితే బర్మా ఎంతదూరం వున్నదా' అని ఆలోచిస్తున్నాను.

'ఇంతేనా నీవు ఆలోచిస్తున్నది?'

ఒక కాట్లకుక్క ఆకలితో క్రిందకుదూకి వరాండాలోకి వచ్చింది.

'చూడు. ఇదికూడా బర్మానుండి వస్తున్నది.'

'బర్మా వెళ్ళాలనుకొంటుందా?' అని అన్నాడు కమాల్ నీచంగా.

కుక్క నిలబడి తోక ఆడించసాగింది.

'హలో హలో, బిస్కట్ తిను' అని అన్నాడు ప్రిల్ కుక్కను.

'ఇది ఎర్ర చైనానుండి పారిపోయి వచ్చినట్లుంది. ఇది 'కమ్యూనిస్టు వ్యతిరే కుక్క. స్వాతంత్ర్యంకోసం యిక్కడికి వచ్చినట్లుంది.'

ప్రిల్ కమాల్వంకచూసి 'నీవు యింకా కాలేజీ కుర్రాడిలానే మాట్లాడుతున్నా' అని అన్నాడు.

కమాల్ బిస్కట్ కుక్కముందుకు విసిరి, 'లేదు ప్రిల్, నాలో చాలా మా వచ్చింది. ఇస్లాం ప్రభుత్వంమీద విశ్వాసం నాలో హెచ్చింది. ఇదిగో పాస్పో

అంటూ జేబులోనుంచి నీలిరంగు క్రొత్తరకం పాస్‌పోర్టు బయటకుతీసి చూపించాడు.

'రైఫిల్స్ రెజిమెంటు లో యింతకంటె మంచి ఉద్యోగం యిప్పించేవాణ్ణి కదా!'

కర్ణాఫులీ మిల్లు ప్లానింగుకోసం వచ్చావా? ఇక్కడికి ఆ పనిమీదనే చాలామంది వస్తుంటారు' అని అన్నాడు ఫ్రిల్.

'నేను ఏం పనిమీదవస్తే నీకెందుకు? నీవు బెంగాలీ కార్మికులరక్తం పీల్చేందుకు రాలేదా? చేట మాట్లాడితే ఫలవాలేదుగాని. జెల్లెడకెందు రంధ్రాలుపెట్టుకొని అల్లెడకూడా గొప్పలుచెబితే ఎలా? నేను అసలే అభివృద్ధి విరోధకుణ్ణి' అని అన్నాడు కమాల్.

ఫ్రిల్ హోవర్డ్ ఐస్లే నదుల్ని, పర్వతాల్ని, అడవుల్ని దాటుకుంటూ విన్న ఉదయమే యిక్కడకు వచ్చాడు. శ్రీమంగళ్‌నుండి తన వ్యాపారంవిషయమై చటగామ్ వచ్చాడు. చటగామ్‌నుంచి అతని టీ ఎగుమతిచేయబడుతుంది. పీటర్‌కి పనిబాధ్యత అప్పగించి ఫ్రిల్ పర్వతాలమీదకు వెళ్ళిపోయాడు. దోహజారీ, బందర్ బన్, చంద్రగోనా అడవుల్లో తిరిగితిరిగి రంగామాటీ పోస్టులో అన్నగారికి జాబు కూడా వ్రాసివేశాడు. సిలహట్, చటగామ్ ప్రకృతిసౌందర్యాన్నిగురించి వ్రాసి వచ్చే క్రిస్మస్ యిద్దరం కలసి సిలహట్‌లో జరుపుకొందామని తెలియజేశాడు.

ఫ్రిల్ రోజ్‌మారీకి విడాకులు యిచ్చాడనితెలిసి, (ఎందుకిచ్చాడోమాత్రం తెలియదు) అతనిఅన్న లార్డ్‌బార్న్లి పీడను గుండెమీదినుండి బరువుదించినంతపని అయింది. ఇక తన తమ్ముడు తప్పక యింటికి తిరిగివస్తాడని అతనికి విశ్వాసం ఏర్పడింది. లార్డ్‌సాబ్ యిప్పుడు తూర్పుబెంగాలులో పెట్టుబడి అమితంగా పెట్టాడు. అక్కడ టీ తోటలుకూడా విపరీతంగా పెంచాడు. కేంబ్రిడ్జినుండి వచ్చాక ఉద్యోగం కోసం ఫ్రిల్ తిరిగితిరిగి వేసారిపోయాడు. తమ్ముణ్ణి ఒకరోజున యింటికిపిలిపించి 'నిన్ను పాకిస్తాన్ పంపుతున్నాను' అని అన్న చెప్పాడు.

'మంచిది' అని జవాబిచ్చాడు ఫ్రిల్. జీవితంలో యింకా తగాదాలాడేందుకు ఓపిక లేదు, అవకాశమూ లేదు.

ఆ రూపంలో ఫ్రిల్ పాకిస్తాన్ వచ్చాడు. గత ఆరుమాసాలనుండి పాకిస్తాన్‌లో వున్నాడు. లండను వదలుతున్నాననే బాధ కలుగలేదు. గౌతం నీలాంబర్, హరి

శంకర్, కమాల్, మైకేల్, సురేఖ మొదలుగాగల వారంతా అదివరకే లండను వదలి భారతదేశం చేరుకొన్నారు.

ఇప్పుడతడు శ్రీమంగళ్‌లో మంచి అందమైన బంగళాలో వుంటున్నాడు. విశ్రాంతిదొరికితే కలకత్తా, ఢాకా, మేడలు, శిధిలాలు చూసివస్తుంటాడు. అవి అతనికి రకరకాల కథలు చెబుతూవుంటాయి.

నిన్నసాయంత్రం పగోడాతోటనుండి తిరిగి యింటికి వచ్చేసరికి యింటి వరాం డాలో ఒకయువకుడు వెనుతిరిగి నిలబడివుండటం చూశాడు. బూటుచప్పుడు విని ఆ యువకుడు వెనక్కు తిరిగిచూచాడు. కమాల్‌రజా.

కమాల్ తన కథంతా చెప్పాడు. లేబొరేటరీ నిమిత్తం ప్రదేశం వెతికేందుకు వచ్చానని, అందునిమిత్తం తిరుగుతున్నానని చెప్పాడు.

వాళ్ళిద్దరూ ప్రొద్దుటినుండి వరాండాలో కూర్చున్నారు. జీవితంలో కలిగిన దుఃఖాన్ని నెమరువేసుకొంటున్నారు.

సాయంకాలం చీకటిపడింది. నౌకర్లు సర్క్యూట్‌హౌసులో దీపాలు వెలి గించారు. కొద్దిరోజులక్రితమే ఏనుగులపట్టివేత జరిగింది. ఏనుగులకంట్రాక్టరు ఒక ఆంగ్లో ఇండియన్‌దగ్గరలోనేగల గదిలో వున్నాడు. మద్యం సేవించినతరు వాత అతడు బ్రహ్మాండంగా వేదాంతవిషయాలు చెబుతాడు.

రాత్రికి పశ్చిమ పాకిస్తాన్‌నుండివచ్చిన యువక పౌర వుద్యోగులు గొడవచేసు కొంటూ అక్కడికి వచ్చారు. కమాల్‌కు వాళ్ళకు పరిచయం కలిగింది. భోజనాల దగ్గర తూర్పుబెంగాల్‌నుగురించి చర్చ ప్రారంభమైంది.

'కలకత్తాలోగల కమ్యూనిస్టుపార్టీనుండి యిక్కడికి డబ్బు వస్తున్నది' అని ఒకడు అన్నాడు.

'బెంగాల్‌సమస్య చాలా క్లిష్టమైనది' అని మరొకడు అన్నాడు.

కమాల్ మౌనంగా వాళ్ళను శ్రద్ధగా చూస్తూ కూర్చున్నాడు.

భోజనాలైనతరువాత అంతా తమతమగదులకు వెళ్ళిపోయారు. ప్రిల్. కమాల్ మాత్రం వరాండాలో మిగిలిపోయారు. నాలుగువైపుల నిశ్శబ్దంగావున్నది. నది మలుపుతిరిగేచోట పర్వతంమీద పవర్‌హౌస్ వున్నది. రాత్రిపూట పవర్‌హౌస్ చప్పుడు స్పష్టంగా అక్కడికి వినబడుతున్నది. దగ్గరలోనే సినీమాహాలు వున్నది. అందులో 'బైజూ బావరా' అను సినిమా ప్రదర్శింపబడుతున్నది. అందు లతా

మంగేష్కర్ పాడినపాటలు వినపడుతున్నాయి. లత కంఠం వరీతరంగాలమీద తేలియాడుతూ సర్క్యూట్ హౌసువరకు కమ్మగా వినబడుతున్నది. రెండు శత్రు దేశాలనుసైతం కలిపి వుంచగలిగిన వంతెనవంటిది లత కంఠం అని అను కొన్నాడు కమాల్.

'నీవు లత కంఠం విన్నావా?' అని ప్రిల్ను అడిగాడు.

'ఎవరామె?' ప్రిల్ ప్రశ్నించాడు.

ఇంతలో వంటవాడు కాఫీ పుచ్చుకొనివచ్చి ఎదురూగా నిలబడ్డాడు.

ఈ వంటవానితో కమాల్కు బాగా పరిచయం ఏర్పడింది. చాలావర్యాయాలు వాళ్లిద్దరు అనేకవిషయాలనుగురించి చర్చించుకొన్నారు.

'ఏమిటి విశేషాలు' అని అడిగాడు కమాల్.

'అంతా తమదయ. మీరు దయచేయడంవల్ల మా బంగళాకు క్రొత్తశోభ వచ్చింది. లేకుంటే యీ అడవిలో ఏమున్నదండి?' అని వినమ్రంగా అని వంట వాడు వంగి కాఫీ అందించసాగాడు.

గవర్నరు జనరల్ ఇస్కందర్మీర్జా, వారి పార్టీమనుష్యులు ఏనుగుల పట్టివేత కార్యక్రమంలో పాల్గొని బందర్బన్నుంచి కరాచీ తిరిగివెళ్ళిపోయారు. వారికోసం వెదురుగడలతో తయారుచేయబడియున్న సర్క్యూట్హౌసు ప్రత్యేకించి అలంక రించబడింది. గవర్నరు జనరల్గారి దాబుదర్పంఅంతా చూసేసరికి వంటవాడికి బెంగాల్ గవర్నరు సర్ ఫ్రెడరిక్దొర నాటికాలం గుర్తుకొచ్చింది. ఆయనకూడా యిదేవిధంగా వేటనిమిత్తం అడివికి వచ్చినప్పుడు అడవిలో రూపాయలు ప్రవ హించేవి. అప్పుడు బాగా పారితోషికం లభించేది.

'గత కొద్దిరోజులు యిక్కడి వాతావరణం బ్రహ్మాండంగా వున్నదనుకొంటాను' అని అన్నాడు కమాల్.

'చిత్తం. మీరు ఆ రోజుల్లో వచ్చివుండవలసింది. దూరదూరాలనుండి దొరలు వచ్చారు. కాని గవర్నరు జనరల్ ఇంగ్లీషువాడుకాక, మహమ్మదీయుడు కావడం సంతోషించతగినవిషయం. అయితే దాబుదర్పం, తీవిలోమాత్రం ఇంగ్లీషువాళ్ళ కంటె ఏమీ తక్కువలేదు. ఇదిచూసి యితరులు మండిపోతున్నారు.'

'మండేది ఎవరు?' అని అడిగాడు కమాల్.

'మీకు తెలియదేమో! ఇక్కడ పెద్దపెద్ద ప్రమాదకారులున్నారు' అని అన్నాడు మెల్లగా.

ఈ అడవుల్లో సాహసోపేతులగు కమ్యూనిస్టుల స్థావరాలు వున్నాయేమోనని అనుకొన్నాడు కమాల్.

ప్రిల్ బట్టలు మార్చుకొనేందుకు తనగదికి వెళ్ళిపోయాడు. ఇంతలో 'హలో హౌ డు యు డు?' అంటూ ఒక అమెరికన్ గదినుండి అక్కడికి వచ్చాడు.

'నేను జాన్ క్రైటన్ ఫ్రేజర్ జూనియరును, నన్ను జానీ అని పిలు.'

'హలో జానీ! యిక్కడికి ఎందుకువచ్చావు?' అని అన్నాడు కమాల్. కాని తను అడిగినప్రశ్న అర్థంలేనిదని వెంటనే అతనికి బోధపడింది.

'నేను యిక్కడి చక్మా తెగవారినిగురించి ఒక డాక్యుమెంటరీ ఫిల్మ్ తీస్తు న్నాను.'

'ఓహో!' అంటూ కమాల్ విశ్రాంతిగా కాళ్ళు చాపుకొని పడుకొన్నాడు పడక కుర్చీమీద.

'సిగరెట్'

'థాంక్స్'

మరుక్షణంలో జానీకూడా ఆ వాతావరణపుమాయలో పడిపోయాడు. అతడు బల్లమీద చేయిఆనించి నదినిచూస్తూ వుండిపోయాడు. నదిలో నావలు ముందుకు సాగిపోతున్నది. మధ్యమధ్యన వరంగు పాడుతున్న పల్లెపాట వినబడుతున్నది. కొద్దిసేపటికి మనక వ్యాప్తమైంది.

జానీ మిత్రభావంతో అమాయకంగా కమాల్‌తో మాటలు ప్రారంభించాడు. కమాల్ ఊఁ, ఆఁ అంటూ కూర్చున్నాడు. ప్రిల్ డ్రెస్సింగ్ గౌను తొడుగుకొని తనగది కిటికీలోనుండి తొంగిచూశాడు. కమాల్ అమెరికన్‌వాడితో మాట్లాడుతూ వుండటం గమనించి నిశ్శబ్దంగా వాక్‌రూముగుండా బైటకువచ్చి దగ్గరలోనేవున్న వసారామెట్లమీద కూర్చున్నాడు. అతని ఎదురుగా నది పయ్యారంగా ప్రవహిస్తు న్నది. చీకటి క్రమక్రమంగా నలుదెసల వ్యాపిస్తున్నది.

ఇంతలో మరోయిద్దరు అమెరికన్‌లు ముందుగదినుండి వరాండాలోకి వచ్చారు. వాళ్ళిద్దరు యు.ఎస్.ఐ.ఎస్. శాఖకు చెందినవాళ్లు. జానీతోబాటు రాంగామాటీ వచ్చారు. స్థలం చూసేందుకై పగలంతా చక్మావాళ్ళగ్రామాల్లో తెగతిరిగారు.

'రెడ్‌వైనా యిక్కడికి ఎంత దగ్గరలోవున్నదో మీకు తెలుసా? ఈ పర్వతాలు దాటాక బహు దగ్గరలోనే వున్నది' అంటూ రహస్యం చెప్పినట్లుగా చెప్పాడు.

స్నానంకోసం నీళ్లు తయారుగావున్నవని, సహ్యాద్రిహౌసు నౌకరువచ్చి చెప్పాడు. వాళ్ళంతా అలాగే మాట్లాడుకుంటూ లేచి లోపలికి వెళ్ళిపోయారు.

ప్రిల్ తలఎత్తి మళ్లీ కిటికీలోనుండి తొంగిచూశాడు.

'నీ స్నేహితులంతా వెళ్లిపోయారా?'

'అడ్డం ఏమీలేదు. మైదానమంతా ఖాళీ అయిపోయింది. రావచ్చు' అని అన్నాడు కమాల్.

ప్రిల్ బైటకువచ్చి వరకకుర్చీమీద కూర్చున్నాడు. వాళ్ళిద్దరు ఏమేమో ఆలోచనల్లో పడిపోయారు.

* * *

కమాల్ ప్రిల్ యిద్దరూ అయిదారురోజులు అక్కడవున్నారు. సహ్యాద్రిహౌసుకు ప్రవహిస్తున్న కర్నాఫలీనదిలో పెద్దపెద్ద కలపదుంగలు పడవేసివున్నాయి. అవి చంద్రగోనావైపు కొట్టుకుపోతున్నాయి. అక్కడికి కొద్దిదూరాన కమీషనరు గారి బంగళా వున్నది. వంకరటింకరగానున్న అక్కడిత్రోవల్లో మంగోలివాళ్లలా వుండే గిరిజనులు బరువులు వీపుమీదమోసుకుంటూ నడుస్తుంటారు. అదే వాళ్లకు జీవనాధారం. మధ్యమధ్య ప్రభుత్వంవారి జీపులు గస్తుతిరుగుతూ వచ్చిపోతుంటాయి. ఉదయం సాయంత్రం దేవాలయాల్లో గంటలు మ్రోగుతూవుంటాయి. దగ్గరలోనే సంత వున్నది. అక్కడ రకరకాల అంగళ్ళు వున్నాయి. పొడుగుపాటి హుక్కా పీలుస్తూ నవ్వుముఖంతో పర్వతప్రాంతపు ఆడవాళ్లు అంగళ్లలోకూర్చొని వస్తువులు అమ్ముతూవుంటారు. హిందువులు, ముస్లిములు, బౌద్ధులు అంతా ప్రశాంతంగా తమతమపనులు చేసికొంటూవుంటారు. అనన్నాసతోటల్లో కోత జరుగుతున్నది. వరిపైరు పచ్చపచ్చగా వున్నది. భయంకరమైన అడవుల్లో వెదురుగడలు నరికి తెస్తున్నారు జనం. నరసంచారంలేని భయంకరమైన అడవుల్లో కాలిబాటన ఒక వృద్ధుడు లుంగీకట్టుకొని, నెత్తిన వెదురుగడలమోపు ఎత్తుకొని నడుస్తువుండటం కమాల్ చూశాడు. ఆ మోపు అమ్ముకొని కొద్దిడబ్బులు అతడు సంపాదిస్తాడన్నమాట. ఏళ్లతరబడిగా అతనివృత్తి యిదే. ఇప్పటికీ అతనిస్థితిలో ఏమీ మార్పులేదు. అడవుల్లో చక్మా, మ్రూఘ్, మోంగ్‌తెగలకుచెందిన ఆదివాసీలు

వెదురుగడలతో కట్టుకొన్నగుడిసెల్లో నివసిస్తున్నారు. ఎంతో ప్రశాంతంగాను, అందంగానువున్న ఆప్రాంతం గిరిజనప్రాంతంగా పరిగణింపబడుతూవున్నది. గిరిజనబాలికలు, యువతులు వన్నెలి అంచులుగల గుడ్డలు మోలకుచుట్టుకొని, కుండలు నెత్తినపెట్టుకొని ఆ అడవుల్లో కనబడుతూవుంటారు. అక్కడక్కడ భిక్షువుల కాషాయవస్త్రాలరంగు కొట్టవచ్చినట్లు కనబడుతూవుంటుంది. బందర్‌వనం వెళ్ళి కమాల్, ప్రిల్ యిద్దరూ మోఘ్ రాజాను కలుసుకొన్నారు. అతడి మహలుచూశారు. ఏనుగులువుండే దట్టమైన అడవుల్నికూడా చూశారు.

'అస్సాంలో వరదలు వచ్చినందున చాలా ఏనుగులు తమ స్థావరాలు వదలు కొని యిక్కడికి వచ్చివేశాయి. అసలు యీ అడవులసరిహద్దుల్ని నిర్ణయించడం మహాకష్టం' అని చెప్పారు అక్కడి ఆఫీసరు.

'అంటే పట్టుకొన్న ఏనుగుల్లో శరణార్థులుగావచ్చిన ఏనుగులుకూడా వున్నా యన్నమాట' అని అన్నాడు కమాల్. వాళ్లు బందర్‌బన్ అంతా తిరిగిచూశారు.

ఒకరోజుసాయంత్రం రంగామాటీనుండి చక్మాజాతిరాజావుండే రాజబాడీ వెళ్ళారు. అక్కడ సంస్థానాధిపతుల అవసానదశ కమాల్‌కు కనబడింది. రాజాగారి మేడలో విశాలమైన హాలు, అందు రాజాపూర్వీకుల తైలవర్ణచిత్రాలు అమర్చబడి వున్నాయి. వీళ్లచరిత్రంతా ప్రిల్ చదివివున్నాడు. మతరీత్యా యీ రాజా హిందువు-బౌద్ధమతావలంబి. కులరీత్యా బ్రాహ్మణుడు. చాలా విచిత్రమైన స్థితి.

రాజా, అతనిచెల్లి యిద్దరు ప్రిల్ కమాల్‌కు స్వాగతం చెప్పారు. రాజా ఇంగ్లండులో చదువుకొన్న సుశిక్షితుడు.

అతిథులగదిలో పియానోప్రక్కన ఒక ప్రసిద్ధ భారతీయనర్తకి చలనచిత్రతార పటం వున్నది. ఈ నర్తకి రాజమాత సోదరి. కేశవచంద్రసేన్, మరో బ్రహ్మ సమాజనాయకుడు బాబూ జి. యస్. దత్‌గారల పటాలుకూడా ఆప్రక్కనే వున్నాయి. రాజమాత బాబూ జి. యస్. దత్‌గారి మునిమనుమరాలు. డా. మనోరంజన్‌దత్తకు మనుమరాలు.'

'మీరు పాకిస్తాన్‌నుంచి వచ్చారా?' అని అడిగింది రాజమాత.

కమాల్ ఒక్కక్షణంపేపు కంగారుపడ్డాడు. ఇదికూడా పాకిస్తానేగదా? ఇలా ఎందుకు అడిగింది? రాజబాడీ ఏదేశంలో వున్నది? కమాల్‌కు బోధపడలేదు.

రాజా అందగాడు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదివినవాడు.

'ప్రభుత్వం కర్నాఫులీదగ్గర ఆనకట్టకట్టి యీ ప్రాంతమందలి యంత్రశాలలన్నింటికి హైడ్రో ఎలక్ట్రిక్ స్టేషను కట్టబోతున్నది. నా జాతివాళ్ళభూములన్నీ నీటిలో మునిగిపోతాయి. ప్రభుత్వం వాళ్ళందరికి నష్టపరిహారంయిచ్చి మరోచోట నివాసానికి ఏర్పాటు చేస్తుంది. ఈ నాయిల్లు, రాంగామాటీ మొత్తం నీటిలో మునిగిపోతుంది' అని అన్నాడు రాజా.

'మార్పులు లేకపోతే అభివృద్ధి వుండదు' అని అన్నాడు మెల్లగా కమాల్.

'అవును' అని అన్నాడు రాజా.

కొద్దిసేపు అయినతరువాత కమాల్, ప్రిల్ సెలవుపుచ్చుకొని బయటకువచ్చారు. రెండోరోజున రంగామాటీనుండి క్రిందికివచ్చి చటగాంవ్‌లో రైలెక్కి సీతాకుండ్ బయలుదేరారు.

సీతాకుండ్ స్టేషనులో యిద్దరూ దిగారు. సాయంత్రం అవుతున్నది.

'సీతాదేవి దేవళం వెళదామనుకొంటున్నాం' అని కమాల్ ఒకరితో అన్నాడు.

'ఇప్పుడు వెళ్ళకండి. పర్వతశిఖరంమీద ఆ దేవళం వున్నది. అది చాలా ఎత్తుమీదవున్నది. ప్రమాదకరమైన శిఖరం. తిరిగివచ్చేసరికి బాగా ప్రొద్దుపోతుంది. చీకట్లో ప్రమాదం' అని చెప్పాడు స్టేషనుమాష్టరు మధ్యలో కల్పించుకొని.

ఇంతలో పది పదిహేనుమందిజనం ప్రోగైనారు. ఇదొక కుటుంబం. స్టేషను స్టాఫ్, పోలీసుకానిస్టేబిల్, టీదుకాణంవాడు, గ్రామప్రజలు, దేవాలయసాధువులు, వాళ్ళది ప్రశాంతమయమైన వాతావరణం. అందులోకి ఎవరో ముక్కూ మొహం తెలియని యిద్దరు క్రొత్తయాత్రీకులువచ్చి చేరారు. వారిలో ఒకడు ఇంగ్లీషువాడు. ఈవార్త కొద్దిసేపట్లోనే వూరంతా ప్రాకింది. ఒక పల్లకీవచ్చి స్టేషనుదగ్గర ఆగింది. పల్లకీ తెరతొలగించి అందులో కూర్చొనివున్న అమ్మాయికూడా వాళ్ళిదరినీ ఆశ్చర్యంతో తొంగిచూసింది.

ప్రిల్ పల్లకివంక చూశాడు.

'ఈమె మా పెద్ద మౌల్వీగారి అమ్మాయి. అత్తగారింటికి వెళ్లుతున్నది' అని అన్నాడు పల్లకీమోసేవారిలో ఒకడు.

కానిస్టేబులు ముందుకువచ్చి, 'రండి, మిమ్మల్ని గ్రామందాకా తీసుకువెళతాము' అని వాళ్లను వెంటబెట్టుకొని ముందుకు నడిచాడు. త్రోవలో రాజకీయాలు మొదలుపెట్టాడు. 'ధరల పెరుగుదల, ముస్లింలీగువిధానం, కృత్రిమమైన కరువు, అనామీ

లీగ్, ఏ. కె. ఫజలుల్ హక్‌ను గురించి చెప్పాడు. ఈ ప్రాంతంలో రాజకీయ చైతన్యం ఎక్కువ అనికూడా చెప్పాడు. ఇంతలో ఆ గ్రామయువకు డొకడు కానిస్టేబుల్‌దగ్గరకువచ్చి అతనికి ఏమేమో చెప్పాడు. 'ఇతడిపేరు ప్రఫుల్ల. ఇతడు మిమ్మల్ని కుండివరకు తీసుకొనివెళతా నంటున్నాడు' అని అన్నాడు కానిస్టేబుల్.

ప్రఫుల్లను వెంటబెట్టుకొని బయలుదేరారు. బజారులో దుకాణాలు వున్నాయి. ఆ దుకాణాల్లో జనం వున్నారు. అందరూ వాళ్ళవిద్దరినీ చూస్తున్నారు. తెల్లని దేవతలా ప్రిల్ ముందు నడుస్తున్నాడు. కమాల్ ఒక టీ దుకాణంముందు నిలబడ్డాడు. దుకాణంలోపల నలుగురైదుగురు జనం దుప్పట్లుకప్పుకొని కూర్చొని వార్తాపత్రిక చదువుతున్నారు. ఒకమూల గ్రామఫోను మ్రోగుతున్నది. కొట్టు గోడలకు సినిమానటులబొమ్మలు వ్రేలాడుతున్నవి.

జనం అరటిపండ్లు ఇతరపండ్లు తెచ్చి వాళ్ళకు యివ్వబోయారు.

'మీరు యాత్రికులు. చాలాదూరదేశాన్నుండి వచ్చారు. మిమ్మల్ని సత్కరించడం మా ధర్మం' అని అన్నాడు ఒక మహమ్మదీయుడు.

కమాల్‌కు ఆశ్చర్యం కలిగించె. నౌఖాలీలోను. బీహారులోను ఒకరినొకరు బలి తీసుకొన్నవాళ్ళు వీళ్లేనాఅని కమాల్ విస్తుబోయాడు.

ప్రఫుల్ల నాయకత్వాన వాళ్లిద్దరూ ముందుకుసాగారు. పర్వతంమీదకు వెళ్ళే త్రోవలో అందమైన కుటీరాలు, పచ్చపచ్చని ఉద్యానవనాలు వున్నాయి. గడ్డిమీద, యిండ్లముందు అందమైన సరస్వతీవిగ్రహాలు పెట్టివున్నాయి. కుమ్మరివాళ్ళు బొమ్మలు ఎండటంకోసం అలా పెట్టారు. ఒకవిగ్రహం ఎదుట కమాల్ కూర్చున్నాడు. ప్రిల్‌కూడా గడ్డిమీద కూర్చున్నాడు.

'మీ గ్రామాల్లోవుండే కుమ్మరివాళ్ళు మంచి కళాకారులు' అని అన్నాడు ప్రిల్.

'అవును' అని గర్వంగా తల ఊపాడు కమాల్.

వెదురుపొదలమధ్యగా వాళ్ళు ముందుకుసాగారు. ఎదురూగా ఎర్రని రాళ్ల చెరువు వున్నది. చెరువుకు నాలుగువైపుల ఎర్రనిదేవళాలు వున్నాయి వెడల్పాటి ఎర్రని రాళ్ళమెట్లమీద మర్రిచెట్లకొమ్మలు వంగివున్నాయి.

చెరువుచుట్టూ తిరిగి వాళ్ళు మరోతోటలోకి ప్రవేశించారు. అక్కడ ఆడపిల్లలు చిన్నచిన్ని సెలయేర్లఒడ్డున కూర్చొనివున్నారు. కుటీరాలమీద, యిండ్ల పైకప్పుంమీద సొరకాయలతీగలు బాగా అలుముకొనివున్నాయి.

'మిత్రమా ! ఇది మంచి అభ్యుదయకరమైన బెంగాలీచిత్రంకోసం ఏర్పాటు చేయబడిన సెట్టులా వున్నది' అని అన్నాడు కమాల్.

'తూర్పు బెంగాలు గ్రామాలకంటె అందమైనదృశ్యాలు మరెక్కడా కనబడవు. బెంగాలీరచయితల నవలలు యీ దృశ్యాలనే వర్ణిస్తూవుంటాయి' అని అన్నాడు ప్రిల్.

వాళ్ళిద్దరూ పర్వతశిఖరంమీదకు వెళ్లే మెట్లమీదకు చేరుకొన్నారు. అటూయిటూ దట్టమైన అడవులు ప్రారంభమైనాయి. గుహలు, లోయలు, వంరలాదిసంవత్స రాలక్రితం తయారైన మఠాలు అక్కడక్కడ త్రోవపొడుగునా వున్నాయి. వేలాది మెట్లు పాడైపోయి ప్రమాదకరంగా మలుపులుతిరిగి పర్వతశిఖరందాకా వున్నాయి.

'సీతాదేవిని లంకకు రాజగు రావణాసురుడు తెచ్చి యిక్కడ వుంచాడని ప్రతీతి' అంటూ ప్రపుల్ల చెప్పాడు.

బాగా చీకటిపడింది. విరిగినమెట్లక్రింద సెలయేర్లు ప్రవహిస్తున్నాయి. 'ఇక తిరిగిపోదాం. పదిగంటలబండికి మనం బయలుదేరాలి' అని అన్నాడు కమాల్.

వాళ్ళు పర్వతంమీదినుండి దిగడం ప్రారంభించారు.

గ్రామపు టీ దుకాణందగ్గర జనం వాళ్ళకోసం ఎదురుచూస్తున్నారు. అక్కడకు వచ్చి వాళ్ళిద్దరూ టీ దుకాణంలోకివెళ్ళి బెంచీలమీద కూర్చున్నారు. వాళ్ళముందు టీ, రెండు రెండుపైసల ఖరీదుగల బిస్కట్లు వుంచారు. ఆతిథ్యం యిస్తున్న జనం భయంభయంగా, వినమ్రతతో ప్రక్కన విలుచున్నారు. టీ తీసుకొని బయలుదేరారు. స్టేషనుదాకా జనం వచ్చారు. ప్రపుల్లకూడా పాతస్నేహితునిలా వాళ్లవెంట స్టేష నుకు వచ్చాడు. గ్రామంపిల్లలు వాళ్లను డబ్బులు అడగలేదు. ప్రపుల్లకుకూడా డబ్బు లివ్వబోతే తీసికోలేదు. డబ్బు యివ్వబోయి అతడిమనస్సును కించపరిచా నని కమాల్ బాధపడ్డాడు.

ఇంతలో రైలువచ్చింది. వాళ్లు చటగామ్ చేరుకొన్నారు. అక్కడ పీటర్ జాక్సన్ క్లబ్బులోగల బార్‌రూములో వాళ్లకోసం ఎదురుచూస్తున్నాడు.

'మీరు సీతాకుండ్ వెళ్లివస్తున్నారన్నమాట. అది పర్వతపు పాములు, తేళ్లు, మంత్రగత్తెలు, చిరుతపులులతో నిండివుండే ప్రదేశమని తెలుసా ? పగలుకూడా తుపాకీలేనిదే తెలివిగలవాళ్ళెవ్వరూ అడుగుబెట్టరు' అని అన్నాడు పీటర్.

'కాని అక్కడ అవేమీ మాకు కనబడలేదు. మనలాటి మనుష్యులు వుంటు న్నారు' అని అన్నాడు కమాల్.

'వాళ్లు రోజూ పాములుకరిచి, తేళ్ళుకుట్టి చచ్చిపోతూనేవుంటారు. అదీగాక అడివిజాతి మనుష్యులు.

మరునటిరోజున సిల్హెట్‌కు బయలుదేరారు. అక్కడ అడుగడుగునా దేవా లయాలు, మసీదులు, మఠాలు వున్నాయి. గ్రిల్ వాటినిగురించి సవివరంగా చెప్పడం ప్రారంభించాడు. గ్రిల్ పాండిత్యంచూసి కమాల్ ఆశ్చర్యపడ్డాడు.

సిల్హెట్‌ప్రాంతమంతా తిరుగుతూ సరిహద్దువరకు వెళ్లిపోయారు. అక్కడ పెద్ద కొయ్యగేటువున్నది. గేటు లోపలిభాగంలో పాకిస్తాన్‌సైనికుడు జాగ్రత్తగా కాపలాకాస్తూ నిలబడివున్నాడు. కొద్దిదూరంలో అస్సాంకొండలు కనబడు తున్నాయి. కమాల్ యింతత్వరలో హిందూదేశాన్ని దర్శిస్తానని అనుకోలేదు.

సిల్హెట్‌నుండి వాళ్లిద్దరూ మరునాడు శ్రీమంగళ్‌కు బయలుదేరారు. చాలా దూరప్రయాణం. నదులు, దట్టమైనఅడవులు, మౌల్వీబజారుదాటి చివరికి గ్రిల్ నివాసభవనం చేరుకొన్నారు. అప్పటివరకు తనతో తిరిగిన గ్రిల్ పెద్దదొరగా మారి పోవడం కమాల్ గుర్తించాడు. వాళ్ళకు స్వాగతం చెప్పేందుకై నౌకర్లపటాలం ముందుకు వచ్చింది. 'అబ్దుల్ రహమాన్, స్నానానికి నీళ్లుపెట్టు' అంటూ కమాల్‌ను వెంటబెట్టుకొని అతిథులగదికి వెళ్ళాడు గ్రిల్.

'ఇది నీగది' అని చెప్పాడు గ్రిల్.

బంగళా సింహంచర్మాలు, చిరుతపులులు, జింకల తలకాయలు మొదలగాగల అతి విలువైనవస్తువులతో అలంకరించబడివున్నది. 1928 నాటి హిందూదేశంలో అడుగుబెట్టినట్లుగ కమాల్‌కు అనుభూతి కలిగింది. గుల్‌షిషాం జ్ఞాపకం వచ్చింది. డెహరాడూనులోగల మరోమేడ - ఖయాంబా జ్ఞాపకం వచ్చింది. గ్రిల్ డ్రైవరును పిలిచాడు. మియాంకదీర్ డ్రైవరు వస్తున్నట్లనిపించింది.

బెంగాలీగుమాస్తా కార్మికుల లెక్కలవివరంపుచ్చుకొని వరాండాలో నిలబడ్డాడు. ట్రేడ్ యూనియన్ కార్యకర్త చాలాసేపటినుండి గ్రిల్‌కోసం ఎదురుచూస్తూ మెట్లు మీద కూర్చున్నాడు. యురేషియన్ గుమాస్తా రాల్ఫ్ జోసఫ్ వరాండాలో కాగి తాలుపుచ్చుకొని నిలబడివున్నాడు. గ్రిల్ ఒక్కడు. కాని అతని వుద్యోగులలో చాలామంది వున్నారు. నదిదగ్గర అతని సొంత మోటారులాంచి వున్నది.

శ్రీమంగళ్‌లో చాలాదూరంవరకు వ్యాప్తమైయున్న తన అన్నగారిఆస్తికి గ్రిల్ యజమాని. అతడు తలచుకొంటే వాళ్ళనందరినీ తలక్రిందులుగా వ్రేలాడగట్టి బాధించగలడు. కేంబ్రిడ్జిలో పుస్తకాలుపట్టుకొని తిరుగుతూవుండే ఆ గ్రిల్‌కు, కోహినూరులో మైకేల్‌తోబాటు కూర్చొని బంగాళాదుంపలు తింటూవుండే ఆ గ్రిల్‌కు, యీ గ్రిల్‌కు ఎంత తేడా!

ఉదయం ఏడుగంటలకు చౌకీదారు బంగళాహాలు తలుపులు తెరిచారు. ఎండ కొద్దికొద్దిగా లోనికి ప్రవేశించసాగింది. మెత్తని మంచంమీదినుండి గ్రిల్ లేచాడు. కమాల్ అప్పటికేలేచి డ్రస్సింగ్‌గౌను తొడుక్కొని వరాండాలో నిలబడి సిగరెట్ త్రాగుతున్నాడు. డ్రాయింగ్‌రూములోకివెళ్ళి ఫలహారంచేసి గ్రిల్‌వెంట బయటకు వచ్చారు. ఇద్దరూ కారులో బయలుదేరారు. పీటర్ జెక్సన్ రాల్ఫ్ జోసెఫ్ వాయ కత్వాన గుమాస్తాలు, నౌకర్లు జీపుల్లో కారువెనకనే బయలుదేరారు. కమాల్‌కు గ్రిల్ తన ఖార్ఖానా చూపించాడు. అక్కడ తేయాకు తయారుచేస్తున్నారు.

మధ్యాహ్నం భోజనంనిమిత్తం క్లబ్బుకు వెళ్ళారు. స్టేట్స్‌మన్, అమృత బజార్‌పత్రిక, డాకానుండివెలువడే ఉదయం వార్తాపత్రికలను త్వరత్వరగా తిరగ వేశారు. భోజనానికిముందు బీరు త్రాగడం ప్రారంభమైంది. ఇంతలో కమాల్ కనబడలేదు.

'మిస్టర్ రజా ఎక్కడికి వెళ్ళాడు' అని హాలుబైటకువచ్చి గ్రిల్ పీటరును అడిగాడు.

'ఇప్పుడే నూరుల్ ఇస్లాంచౌధరితో మాట్లాడుతూ తోటలవైపుకు వెళుతూంటే వానిని యిప్పుడే చూశాను.'

నూరుల్ ఇస్లాంచౌధురి! గ్రిల్ ఏమీ మాట్లాడలేదు. నూరుల్ ఇస్లాం కార్మికుల ప్రతినిధి. గతరాత్రి గ్రిల్‌ను కలుసుకొనేందుకు వచ్చారు. కాని గ్రిల్ అతణ్ణి కలుసుకోలేదు. రేపుఉదయం ఆఫీసుకు రమ్మని కబురుచేశాడు.

గ్రిల్ కారెక్కి కమాల్‌ను వెతుకుతూ బయలుదేరాడు. కాని కమాల్ ఎక్కడా కనబడలేదు. ఏనుగుబట్టి ఒకచోట ఆగి పొదలవైపుకు వెళ్ళాడు. ప్రకృతి మనో హరంగా వున్నది. ఇంతలో గాజులచప్పుడు విని అటు చూశాడు. ఒకయువతి నిలబడి ఆకులు త్రుంచుతూవున్నది. పెద్దదొరనుచూసి మేలిముసుగును ముందుకు

లాగుకొన్నది. గ్రిల్ చిరునవ్వు నవ్వాడు. ఏమేమో ఆలోచనల్లోపడి కొట్టుకుపోతూ 'నీపేరు ఏమిటి?' అని ప్రశ్నించాడు.

'నా పేరు—చంప.'

'చంపా?' ఈ పేరు మొదటిసారిగా విన్నట్లు తిరిగి ప్రశ్నించాడు. 'చంప, మంచిపేరే' అంటూ గబగబ కారుదగ్గరకు వెళ్ళిపోయాడు.

చంప ఆశ్చర్యంతో చెట్లచాటుగా అతణ్ణిచూస్తూ నిలబడింది. ఆమె, ఆతని కుటుంబంవాళ్లు తెల్లవాళ్లను చాలామందిని చూశారు. అంతా త్రాగుబోతులు, తిరుగుబోతులు, మంచిరకం కాదు.

క్లబ్బుకు తిరిగివచ్చి గ్రిల్ కుర్చీలో కూలబడ్డాడు. ఎదురూగా గోడమీద ఎలిజబెత్ రాణి పటం అమర్చబడివున్నది. ఒకపటంలో సింహాల్ని వేటాడుకున్న దృశ్యం చిత్రించబడివున్నది. ఆ ప్రక్కనే కూచ్‌బిహారు మహారాజా వున్నాడు. ఆ ప్రక్కన దొరసాని తెల్లనిటోపీపెట్టుకొని తుపాకిపుచ్చుకొని పొదలమధ్య కూర్చొనివున్నది. దొరసానిరూపంలో అతడికి వాళ్ల నాయనమ్మ లేడీ బార్న్‌ఫీల్డ్ కనబడసాగింది. వాళ్ళ నాయనమ్మ ఏభై సంవత్సరాలక్రితం హిందూదేశంవచ్చి యిక్కడి మహారాజులతో కలిసివెళ్ళి సింహాల్ని వేటాడుతూ వుండేది. గ్రిల్ కమాల్‌కోసం ఎదురుచూసిచూసి విసిగిపోయాడు.

ఆ సాయంత్రం కమాల్ గౌరవార్థం గ్రిల్ భోజనంఏర్పాటు చేశాడు. కమాల్ భోజనానికి హాజరుకాలేదు. గ్రిల్‌మాత్రం అతడు లేకుండానే భోజనం జరిపించాడు.

రాత్రి బాగా ప్రొద్దుపోయినతరువాత కమాల్ గ్రిల్‌బంగళా చేరుకొన్నాడు. గ్రిల్ ముందుగదిలోకూర్చొని పుస్తకం చదువుతున్నాడు.

'ఎక్కడి కెళ్ళారండిస్వామీ రోజారోజంతా?'

'ఎక్కడికీ వెళ్ళలేదు. అటూయిటూ తిరుగుతున్నాను.'

'కార్మికులవాడలకు వెళ్ళినట్లున్నది కదూ!'

'అవును.'

'అదే అనుకొన్నాను.'

'కోపం వచ్చిందా?'

'లేదు. ఈ వ్యవస్థలో నాలాగే నీవూ వున్నావు. నాకు ఎవ్వరిమీదా కోపం రాదు.'

'ఇక్కడ ఒక్క రూపాయిపావలామాత్రమే రోజుకూలీ యిస్తున్నారుకదూ?'

'అవును.'

'ట్రేడ్ యూనియన్ ఏమీ లేదా?'

'లేదు.'

'కమ్యూనిస్టుపద్ధతి లేదా?'

'తెలియదు.'

'అబద్ధం చెప్పకు. నీకు అంతా తెలుసు.'

'కమాల్! ఈ ప్రపంచబాధ్యతను చాలారోజులు స్వీకరించి వ్యవహరించాను. చివరకు దాన్ని తొలగించివేసుకొన్నాను. నీవూ తొలగించుకొన్నావు. ఏమీ తెలియనట్లు నటిస్తున్నావు. ఈవిషయాల్లో నీవు నాకంటెకూడా పెద్ద దోషివి.'

కమాల్ ఏమీ మాట్లాడలేదు. ప్రిల్ లేచి వెళ్ళి హ్విస్కీ సీసా, గ్లాసులు తీసుకొనివచ్చాడు.

'నేను నీవంటి పెద్దమనిషినే కలుసుకొన్నాను. ఆయనపేరు శ్రీ నీహార్‌రంజన్ దాస్ గుప్త.'

'దాస్‌గుప్తను ఎక్కడ కలుసుకొన్నావు? తిరిగి క్లబ్బుకు వెళ్ళావా?'

'లేదు. దారినవస్తుంటే నా సూటూబూటూచూపి త్రోవలో ఆయన కారుఆపి ఎక్కించుకొని యీ బంగళాదగ్గర నన్ను దించివెళ్ళాడు. అతడుకూడా నీవలెనే పెద్ద జమీందారీకుటుంబానికి చెందినవాడని తెలిసింది.'

ప్రిల్ విస్కీ రెండుగ్లాసుల్లో పోశాడు. 'మీరు యీదేశం వదిలిపెట్టి వెళ్ళిపోవాలని లేదా అని ప్రశ్నించాను. అతడు పకపకనవ్వాడు. భారతప్రభుత్వం ప్రతివస్తువును జాతీయకరణం చేద్దామని చూస్తున్నది. అతిత్వరలోనే అక్కడ నిజమైన సమాజవాదప్రభుత్వం ఏర్పడేలావున్నది. పాకిస్తాన్‌వదలి వెళ్ళడానికి నేనేం పిచ్చివాణ్ణికాను అని గుప్త స్పష్టంగా చెప్పాడు' అని అన్నాడు కమాల్.

ప్రిల్ నం వహించాడు. 'ప్రపంచంలోజరిగే ప్రతివిషయంలోను కల్పించుకోవడం విరమించుకోమని సలహాయిస్తున్నాను. లేకపోతే చాలాచిక్కుల్లో పడిపోతావు' అని అన్నాడు.

కమాల్ గ్లాసులో పైకి ఉబుకివస్తున్న విస్కీనురుగును శ్రద్ధగాచూస్తూ కూర్చున్నాడు.

మరునాడు ఉదయం యిద్దరూ రాజషాహీకి బయలుదేరారు. సంథాలీజాతివాళ్ల గ్రామం చేరుకొన్నారు. సంథాలీల బీదతనం చూచేసరికి కమాల్‌హృదయం క్రుంగి పోయింది.

'వీళ్ళనుగురించి ఏమేమో గొప్పగా అనుకొన్నాను. వీళ్ళపరిస్థితి కడుదీనంగా వున్నది' అని అన్నాడు కమాల్.

'వీళ్ళ దారిద్ర్యాన్నిగురించి వర్ణించడం కష్టం. చెట్టువ్రేళ్లు తింటున్నారంటే వీళ్ళదారిద్ర్యాన్ని ఊహించుకోవచ్చు. వీళ్ళపరిస్థితిచూస్తే నాకు బాధకలుగుతుంది' అని అన్నాడు ప్రిల్.

సంథాలీలతో వాళ్ళిద్దరికీ మంచిస్నేహం ఏర్పడింది. వాళ్లు తిరిగి వెళ్లిపోయే రోజున సంథాలీగ్రామ ప్రజలంతా వాళ్ళకు అడ్డంగా నిలబడ్డారు. ఒక నల్లటియువతి ఎదురుగావచ్చి వాళ్ళమెడలో బంతిపూలదండలు వేసింది. చేతులు జోడించి వాళ్ళ ఎదుట వంగి నమస్కరించింది. ఒకకాలు తెగిపోయిన ఆ సంథాలీ గ్రామపెద్ద కర్ర సాయంతో ముందుకువచ్చి వాళ్లను సాగనంపాడు. ఒక యువకుడు చెరువులో నుంచి ఒక ఎర్రని తామరపూవు తెచ్చి ప్రిల్‌కు అందించాడు.

ఆ రాత్రికి రాజషాహీనుండి వాళ్ళు సర్క్యూట్‌హౌసు చేరుకొన్నారు. దగ్గర లోనే గంగానది ప్రవహిస్తున్నది. అవలిఒడ్డున ముర్షిదాబాద్ వున్నది. ముర్షిదా బాద్। .. సిరాజుద్దౌలా। కర్నల్ క్లైవ్. ఓహో ఎన్నోస్మృతులు-ఎన్నోకథలు.... ఎన్నో గాథలు.'

ఢాకాకు తిరిగి బయలుదేరారు. రైలు నదిఒడ్డున ఆగిపోయింది. యాత్రికులు రైలుదిగి స్టీమరు ఎక్కారు. రైలులోను సామానంతా స్టీమరుమీద ఎక్కించారు. అక్కడ క్రేన్‌లు లేవు. కూలీలు పాటలుపాడుతూ గబగబా సామానంతా మోశారు. ఆ దృశ్యం చూస్తుంటే విద్యార్థిజీవితంలో వంతపాటపాడుతూ నాటకప్రదర్శనంలో తాను పాల్గొన్నదృశ్యం కమాలుకు జ్ఞాపకం వచ్చింది.

ఓడమీద ముస్లిం ముసలివాళ్లు, ఘోషాలోనున్న స్త్రీలు, ముసలి హిందువులు, ఆడపిల్లలు; పిల్లల్ని ఎత్తుకొని హిందూస్త్రీలు చాలామంది ఎక్కి కూర్చున్నారు.

'హిందూయువకులు కనబడరేం?' అని కమాల్ ప్రశ్నించాడు.

'హిందూయువకులు జీవనోపాధికోసం కలకత్తా వెళ్ళిపోయారు' అని అన్నాడు వినుగ్గా ప్రిల్.

మొదటితరగతిలోకి జనం రాసాగారు. కొంతమంది అమెరికన్‌లా మాట్లాడు కొంటున్నారు. ఇద్దరు బెంగాలీమౌలానాలు అవామీలీగ్‌నుగురించి చర్చించు కొంటున్నారు.

ఒక పెద్దవుద్యోగి కేబిన్‌నుండి బయటికివచ్చారు. ఆయనభార్య, ఆయన మర దలు నల్లద్దాల పెద్దపెద్ద కళ్లద్దాలుపెట్టుకొని ఎండపొడికి పడకకుర్చీల్లో కూర్చు న్నారు. మరదలు భారతదేశంనుండి వెలువడే 'ఫిల్మ్‌ఫేర్' పత్రికను శ్రద్ధగా చదువుతున్నది. ఫ్రిల్ ఎదురుగానున్న కటకటాలమీదవంగి నిలబడివున్నాడు. బంగారు వన్నెగల అతనిజుట్టు సూర్యకిరణాలవెలుగులో యింకా అందంగా కనబడు తున్నది. చాలా అందంగా వున్నాడు ఫ్రిల్,

మెట్లకు మరోవైపున రెండవతరిగతి డెక్ వున్నది. ఒక ఆంగ్లో ఇండియన్ అమ్మాయి అక్కడ కూర్చొని 'ట్రూ స్టోరీ మాగ్జిన్' చదువుతున్నది. ఆపత్రిక పేరుమీదగల నటుడిబొమ్మను చూస్తూచూస్తూ ఆ అమ్మాయికళ్ళు ఫ్రిల్‌మీద పడ్డాయి. మార్లిన్‌బ్రాండోలా ఫ్రిల్ ఆమెకళ్లకు కనబడ్డాడు. ఆ అమ్మాయి ఒక పెద్దనిట్టూర్పువిడిచి మళ్ళీ పత్రిక చదువసాగింది.

ఆ అమ్మాయి పూర్తిపేరు మిస్ మార్గ్రెట్ ఇజాబెల్ క్రిస్టీనా టీక్‌డెల్. ఇంత పెద్దపేరుకు కారణం వున్నది. ఆ అమ్మాయి నాయనమ్మ మార్గ్రెట్ ఇజాబెల్ సర్ ఫ్రిల్ బ్లేనల్ల ఒక స్వదేశ హిందూమహిళకు కలిగిన సంతానం. గత శతా బ్దంలో సర్ బ్లే.బెంగాలులో పేరెన్నికగన్న వ్యక్తి. కరువురోజుల్లో వాళ్ల అమ్మ ఢాకానుండి కలకత్తావెళ్ళి బ్లేగృహంలో అడుగుపెట్టింది. మార్గ్రెట్ ఇజా బెల్ పెద్దదై కాన్పూరు ఛావనీలోగల సార్జెంటు టీక్‌డెల్‌ను పెండ్లి చేసుకొన్నది. అతడు పిసరైన తెల్లవాడు. విపరీతంగా మద్యం త్రాగిత్రాగి కొద్దివయస్సులోనే చనిపోయాడు. అందువల్ల మార్గ్రెట్ ఇజాబెల్ పిల్లల్నితీసుకొని తిరిగి కలకత్తా వచ్చింది. ఆమెకుటుంబం కలకత్తాలో నివసించే నిమ్నవర్గానికిచెందిన ఆంగ్లో ఇండి యన్ సమాజంలో కలిసిపోయింది.

మెగీటీక్‌డెల్ తల్లితండ్రి యిద్దరూ చనిపోయారు. ఆమె గ్రేట్ ఈస్టరన్ హోటల్లో టెలిఫోన్ నడుపుతూ పనిచేస్తున్నది. సెలవుమీద జబ్బుగానున్న తన పినతల్లిని చూసేందుకు వచ్చింది. వాళ్ళ పినతల్లి పిక్చేలో వుంటున్నది. ఇప్పుడు పినతల్లి పిక్చేనుండి కలకత్తా వెళ్లుతున్నది.

స్టీమరు కూతవిని ఆమె ఉలిక్కిపడింది. తలఎత్తి చూపింది. రేవు దగ్గరకు వస్తున్నది. యాత్రికులు తమతమసామానులు సరిచేసుకొంటున్నారు. మొదటితరగతి డెక్‌మీదనిలబడి కనబడిన నాయకుడుకూడా ఆ జనంలో కలిసిపోయాడు. ఆమెమనస్సు చివుక్కుమన్నది. వంగి బూట్లు తొడుక్కొని అద్దంలోచూసి జుట్టు సరిచేసుకొని చేతిసంచీపట్టుకొని లేచి నిలబడింది.

ప్రిల్, కమాల్ యిద్దరూ ఓడదిగి ఒడ్డుమీదకు వచ్చారు. యాత్రికులు, కూలీలు అంతా రైలుదగ్గరకు పరుగులుతీస్తున్నారు. రైలు నదిఒడ్డుకు చాలాదూరాన నిలబడివున్నది. రేవుదగ్గర హిందూస్త్రీలు స్నానంచేసి పూజ చేసుకొంటున్నారు. ఎటు చూసినా హిందువులే హిందువులు. మధ్యతరగతికిచెందిన హిందూస్త్రీలు, పురుషులు ఎక్కువగా వున్నారు. నిమ్నవర్గాలకుచెందిన హిందూస్త్రీలు పురుషులుకూడా వున్నారు. కమాల్ ప్రిల్‌వెంట నడుస్తూ 'ఈ జిల్లాలో హిందువులు ఎక్కువగా వున్నట్లున్నారు' అని అడిగాడు. ఇక్కడ చాలా ప్రశాంతంగావున్నది. ఏమిటో హిందూ ముస్లింసమస్య నా మెదడును పాడుచేసివేసింది. హిందువులు, ముస్లిములు యిలా కలిసివుంటే ఎందుకో నాకు ఆశ్చర్యంవేస్తుంది. ''వీళ్ళు నరుక్కుచావరేం' అని అనిపిస్తుంది అని అన్నాడు కమాల్.

ఆంగ్లో ఇండియన్‌యువతి వాళ్ళముందే నడుస్తున్నది. రైలుదగ్గరకుచేరి ఆమె తనసంచీ క్రిందపెట్టి రుమాలుతో ముఖం తుడుచుకొన్నది. ప్రక్కగావెళుతూ ప్రిల్ ఆమెను పరిశీలించిచూస్తూ తన కంపార్టుమెంటువైపు వెళ్ళిపోయాడు.

ఢాకా చేరుకొని ప్రిల్ కమాల్ యిద్దరూ తమతమపనుల్లో లీనమైనారు. సాయంత్రం క్లబ్బులో కలుసుకొని తమతమయిండ్లకు వెళ్లిపోయేవారు. పని పూర్తి అయినతరువాత ప్రిల్ ఢాకావీధుల్లో తిరుగుతూవుండేవాడు.

ఒకరోజు కమాల్ ప్రిల్‌తోబాటు ప్రభుత్వపుపనిమీద లాంచీమీద ఎక్కి మరో జిల్లా వెళుతున్నాడు. ప్రిల్ కుర్చీమీదకూర్చొని వార్తాపత్రిక చదువుతున్నాడు. ఉన్నట్లుండి వెనక్కుతిరిగి కమాల్‌నుచూసి 'ఆ ఎదురూగానున్న చెట్లసమూహం చూస్తున్నావా?' అని అడిగాడు.

'ఆఁ.'

'అది విక్రమపూర్. అక్కడ సరోజినినాయుడు, బి. పి. రాయ్‌గారల తోటలు వున్నాయి. ఆ గ్రామాలు యిప్పుడు శూన్యంగా పడివున్నాయి. ఇక్కడి వాళ్ళంతా పశ్చిమ బెంగాలుకు వలస వెళ్ళిపోయారు. చూసేందుకు వస్తావా?'

'ఇప్పటికే స్మశానవాటికలు చూపిచూపి విసిగిపోయాను. నన్ను ప్రశాంతంగా నీయ దలచలేదా?'

'లేదు.'

'నీగొడవ యిక వినదలచుకోలేదు.'

'అదుగో చూడు రెండస్థుల తోటయిల్లు కనబడుతున్నదికదూ, అది రవీంద్ర నాథ్ టాగూరు బంగళా.'

ఇంతలో లాంచి నారాయణగంజ్ వైపుకు మళ్లింది. 'మనం ఆదమ్‌జీ జనపనార మిల్లుకి వెళుతున్నాం' అని అన్నాడు కమాల్.

'అక్కడికివెళ్లాక నీవు మేనేజరుతోకలిపి భోజనం చేయకుండా కార్మికులతో బాటుకలిపి తిరుగుతూ వాళ్ళ కూలినాలినిగురించి లెక్కలువేస్తూవుంటావు' అని నవ్వుతూ అన్నాడు ప్రిల్.

వాళ్లు మిలులకి చేరుకొన్నారు ఆ పెద్దమిల్లుల్లో బీహార్ ఆడవాళ్ళు బెంగాలు మొగవాళ్ళు కార్మికులుగ పనిచేస్తున్నారు. ఆశ్చర్యంతో కమాల్ అక్కడి పెద్దపెద్ద యంత్రాలు చూడసాగాడు. ఇద్దరూ తిరిగివచ్చి లాంచి ఎక్కారు. సూర్యాస్త మానం అయింది. పడవల్లో దీపాలు వెలిగాయి. సరంగులు తమతమపడవల్లో నమాజు చేయసాగారు.

'నేను రేపుఉదయం భారతదేశంమీదుగా కరాచీ వెళుతున్నాను' అని అన్నాడు కమాల్.

'తెలుసు.'

'నిన్ను తరుచు కలుసుకొంటూవుంటాను.'

'మంచిది' కమాల్ : అటుచూడు గంగానది కెరటాలు అనవసరంగా గొడవ చేస్తున్నాయి. మీ గొడవ వినబడకుండా చెవులు మూసివేసుకొన్నానని, నేను నా పడవను ఒడ్డుకు కట్టివేసుకొన్నానని చెప్పు' అని అన్నాడు ప్రిల్.

'మంచిది. అలాగే చెబుతాను' అని అన్నాడు మెల్లగా కమాల్.

రెండోరోజు ఉదయం కమాల్ ప్రిల్ ఏరోప్లేను ఢాకాలోవదలి విమానంఎక్కి కలకత్తా చేరుకొన్నాడు. రైలుఎక్కి లక్నోకు బయలుదేరాడు. హౌరాస్టేషనులో ఒక పోలీసువుద్యోగి తనవైపుకు వస్తూండటంచూసి కంగారుపడ్డాడు. జేబులో నున్న వీసా, పాస్‌పోర్టుకాగితాలను తడిమిచూసుకొని చట్టవిరుద్ధంగా తాను

ఇండియాలోకి అడుగుపెట్టలేదని గ్రహించి సంతోషపడ్డారు. రైలు నడుస్తున్నది. బర్ద్వాన్, అసన్‌సోల్, దుర్గాపుర్, అలహాబాద్. రైలు ముందుకు నడుస్తున్నది. సంవత్సరం క్రితం యిది తనదేశం. కాని యిప్పుడు విదేశీయుడుగా యీ దేశంలో యాత్రకు బయలుదేరాడు. అంతా తనను అనుమానంగా చూస్తున్నట్లనిపించింది. నీవు పాకిస్తాన్‌వాడివి. పోలీసుస్టేషనుకు పద అంటున్నట్లనిపించింది. నీవు గూఢ చారివి. పాకిస్తాన్ గూఢచారివి. ద్రోహివి అని ఇంజన్ అంటున్నట్లనిపించింది. కంగారుపడి కళ్ళుతెరిచిచూశాడు. రైలు చార్‌బాగ్ చేరుకొంటున్నది. చార్‌బాగ్, లక్నో - లక్నో సమీపిస్తున్నది. అతనిగుండె దడదడ కొట్టుకోసాగింది.

రెండురోజులు బంధువులయింట్లో వున్నాడు. తయారీగురించి కాగితాలు తెచ్చుకొనేందుకు డెహరాడూన్ వెళ్ళవలసివున్నది. మూడోరోజున లక్నోనుండి బయలుదేరాడు. రైలు మురాదాబాదు చేరబోతున్నది. చంప విదేశాలనుండివచ్చి మురాదాబాదులో పినతండ్రిగారింటిదగ్గర వుంటున్నదని ఎవరో చెప్పారు. అందు వల్ల వీసామీద మురాదాబాదు పేరుకూడా నమోదు చేయించుకొన్నాడు.

రైలు ప్లాట్‌ఫారంమీద ఆగింది. కమాల్ సామాను దింపుకొన్నాడు. స్టేషను బయటకువచ్చి టాంగాఎక్కి అడ్రసుకోసం పుస్తకంలో చూశాడు.

టాంగా ఒకపేటలోకి చేరింది. ఒక ఇంటిదగ్గర టాంగా ఆపి దిగాడు. పెద్ద గేటుగుండా లోపలికివెళ్ళి కాస్సేపు తిరిగిచూశాడు. కాని ఎవ్వరూ సరిగా సమా ధానం చెప్పలేదు. సాహసించి మెట్లెక్కి పైకివెళ్లాడు. ఎవ్వరూ కనబడలేదు. తిరిగి మెట్లుదిగి వీధిలోకి వచ్చాడు. ప్రక్కనేవున్న మరో మేడగేటుదగ్గరకు వచ్చాడు. అక్కడకూడా ఎవ్వరూ కనబడలేదు. లోపలికివెళ్లి తలుపు గట్టిగా తట్టడం ప్రారంభించాడు.

'ఎవరు' లోపలినుండి కేక వినబడింది.

నిరాశ నిస్పృహలవలన కమాల్‌కంఠం పెగలలేదు.

'ఎవరు?' అంటూ ఒక ముసలిది తొంగిచూసింది.

'నేను.'

'నేను అంటే ఎలా తెలుస్తుంది. పేరేమిటో చెప్పు.'

'నా పేరు కమాల్‌రజా. పాకిస్తాన్‌నుండి వచ్చాను.'

ముసలిది కొద్దిసేపట్లో బయటకువచ్చి 'రా బాబూ, లోపలికి రా' అంటూ ఆహ్వానించింది.

అతడు లోపలికివచ్చారు. హాలు కనబడింది. హాలుకొనవ పెద్దబల్ల వున్నది. దానిమీద చంపాబాజి కూర్చొనివున్నది.

'అరే హల్లో కమాల్ ! నీవా ? అరెరే !'

'చంపాబాజీ !'

'నీవా ! గుడ్‌గాడ్' అంటూలేచి త్వరత్వరగా నిలబడింది.

'అదుగో ప్రక్కయింటికి వెళ్ళాము తెలియక.'

'మావాళ్ళంతా పినతండ్రిగారింటికి వెళ్ళారు. అక్కడికే వెళదాం. నిశ్చింతగా మాట్లాడుకోవచ్చు' అని అంటూ చంపాబాజీ లేచినిలబడి మేలిముసుగు కప్పుకొని వీథిలోకి వచ్చింది. ఇది పూర్తి మేలిముసుగుకాదు. మాయింట్లో ఇద్దరు మేలి ముసుగుగా కప్పుకోవడం అలవాటు. కొంతదూరంవెళ్ళి ప్రక్కవీథిలోకి అడుగు పెట్టింది. ప్రక్కనే గోరీలదొడ్డి వున్నది.

'ఇది....'అంటూ కమాల్ సౌంజ్ఞచేశాడు.

'అంతా మనమే. ఇక్కడే జీవిస్తాం. యిక్కడే చనిపోతాం. ఇదుగో అదే మా పినతండ్రిగారి యిల్లు' అని అన్నది చంప.

లోపలికి ప్రవేశించారు. బల్లలు చాలా పరిచివున్నాయి. మనుష్యుల అలికిడి లేదు. కమాల్‌కు ఎందుకో భయంవేసింది. 'ఇక్కడ ఎవ్వరూ వుండటంలేదా ?' అని ప్రశ్నించాడు.

'ఎందుకు లేరు ? లోపలికి వెళ్ళిపో. ఘోషా లేదులే. స్వేచ్ఛగా వెళ్ళు' అని అన్నది చంప.

కమాల్ లోపలికివెళ్ళాడు. కుర్చీలు, మంచాలు పరిచివున్నాయి. ఇద్దరు ముగ్గురు మనుష్యులు అక్కడ వున్నారు. మేఘాలు క్రమ్మాయి. కాని బాగా ఉక్కబోస్తు వ్నది. పురుగులు దీపాలమీద ఎగురుతున్నాయి.

'చాఅబ్బా ! వీరు కమాల్' అంటూ చంప లోపలికి వచ్చింది.

'రా, రా, కూర్చో బాబూ. మీరు మా యింటికివచ్చి మమ్మల్ని గౌరవించారు' అంటూ చాఅబ్బా ఒక్కపర్యాయం లేచి మళ్ళీ కూర్చున్నాడు.

లాంతరు పుచ్చుకొని ఒక అమ్మాయి వంటయింట్లోకి వెళ్ళింది. మరోఅమ్మాయి కుర్చీలోకూర్చొని చదువుకొంటున్నది. మధ్యతరగతిప్రజలు, యింత యిబ్బంది పడుతున్నారా అని కమాల్ బాధపడ్డాడు.

'పిల్లిద్దరూ నా మేనకోడళ్ళు. ఈ అమ్మాయి జేబున్నిసా. ఢిల్లీ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పాసైంది. చిన్నఅమ్మాయి మరియమ్ జమానీ. అగ్రికల్చర్ ఎం. యస్‌సి. చదువుతున్నది. ఏమీ మాట్లాడవేం?' అని అడిగింది చంప.

'ఏమీ లేదు చంపాబాజీ!'

చాఅబ్బా హిందూదేశం పాకిస్తాన్‌విషయాలు ఎత్తి 'ఏమిటో బాబూ మాపని అయిపోయింది. మా వాళ్ళంతా నీవు వెళ్ళిపోయినచోటుకు వెళ్ళిపోయారు. రుహేల్‌ఖండ్ మొత్తం ఖాళీ అయిపోయింది. ముసలి ముతకవాళ్లంమాత్రం మిగిలిపోయాం. రెండు మూడు సంవత్సరాలు బ్రతికివుంటాం. మేము చచ్చిపోయిన తరువాత యిక్కడ గాడిదలు దొర్లుతాయి' అని అన్నాడు.

కమాల్ లేచి అటు యిటు పచార్లు చేయసాగాడు. ఇంతలో మరియమ్ జమానీ టీ తయారుచేసి తీసుకురాసాగింది.

'పాకిస్తాన్ పరిస్థితులేమిటి? ఇక్కడి సాలెవాళ్లు, దూదేకులవాళ్ళుసైతం అక్కడకివెళ్ళి లక్షాధికార్లు అయిపోయారటగదా! నిజమేనాబాబూ. అక్కడ పంజాబీవాళ్ళ తాకిడి ఎక్కువైపోయిందని యు. పి. వాళ్ళను పంజాబీలు చాలా బాధిస్తున్నారని మా మేనల్లుడు జాబు వ్రాశాడు. అక్కడ అంతా నోరున్నవాడిదే రాజ్యం అని కూడా వ్రాశాడు. బాబూ యీ దేశవిభజన కాదుగాని మేము నాశనమైపోయాం. అక్కడమాత్రం ఏం సుఖం వున్నది?' అని అన్నాడు చాఅబ్బా.

'మరియం! టీతో బాటు నాలుగైదు బిస్కట్లు తీసుకురాకపోయావూ? బాబూ నలుగురైదురుగు నౌకర్లు ఎప్పుడూ యిక్కడ వుండేవారు. అంతా వెళ్ళిపోయారు' అని వాపోయాడు.

కమాల్ ఏమీ మాట్లాడలేదు.

'ఇక్కడికి యింకా కరెంటు రాలేదు. పేటలోకి వచ్చేసింది. మా ఫూఅమ్మ మేడ వదిలి పాకిస్తాన్ వెళ్ళిపోయింది. ఆ మేడ సంరక్షకుడిచేతుల్లోకిపోయింది. సిక్కులు అందులో స్కూలు పెట్టారు. ఆ మేడలోకి కరెంటువచ్చింది. మా యింటికి కరెంటు రాలేదు.'

'కరెంటు రావాలంటే డబ్బుకావాలి బాబూ! ఆ డబ్బే లేదు' అంటూ చాఅబ్బ లేచి టీ ట్రే తెచ్చి బల్లమీద పెట్టబోయాడు. అతనిచేతులు వణకడంవలన పాల గిన్నె కాస్త క్రిందపడి పాలు ఒలికిపోయాయి. పాలన్నీ పోయాయి. ఇప్పుడు యిక పాలు ఎక్కడ దొరుకుతాయి?' అంటూ బాధపడింది చంప.

'మీరు ఏమీ బాధపడకండి. ఫరవాలేదు' అంటూ ఓదార్చబోయాడు కమాల్. చంప తలెత్తి అతనివంకచూపి చిరునవ్వు నవ్వింది.

కమాల్ యీరోజు చంపాబాజీని జీవితపు మరో మెట్టుమీద చూశాడు. ఇది ఆమె యథార్థస్థితి. ఒక్కక్షణంసేపు కమాల్ కళ్లుమూసుకున్నాడు. లక్నో, పారిస్, కేంబ్రిడ్జి, లండనుల్లో తానుచూసిన చంపకు, మురాదాబాద్ పట్టణంలో యీపేటలో నున్న చంపకు ఎంత వ్యత్యాసం? మధ్యతరగతికిచెందిన చంప, నిజంగా ధీరురాలు చంప.

కమాల్ మురాదాబాదులో రెండురోజులు వున్నాడు. ఆరాత్రి అద్దాలగదికి అతణ్ణి తీసుకొనివెళ్ళారు. అర్ధరాత్రివరకు అతనికి నిద్రపట్టలేదు.

మధ్యాహ్నం చివరిమెట్టుదగ్గర అతనికి మంచంవేశారు అక్కడ చల్లనిగాలి వస్తుంది.

'మీదేశంలో భారతదేశపు చీరెలకి మంచిగిరాకీ వుండటగదా!' అని అడిగింది చంప.

'ఏమో! అదంతా ఎవరుచూశారు?' అని అన్నాడు.

పరిస్థితులప్రభావంచూసి లోలోన అతడు క్రుంగిపోయాడు. తాను ఎంతో ముసలివాడినైపోయానని, చంపాబాజీకూడా బాగా ముసలిదైపోయిందని అనిపించింది. మేమిద్దరం మనస్సుకు సంబంధించిన పెద్దపెద్ద ప్రపంచాల్ని దాటాము.

అతడు యిప్పుడు ఒక అపరిచితమైన పట్టణంలో ఒక చీకటివరండాలో వున్నాడు. నదీనీటిమీదినుండి వస్తున్న చల్లనిగాలి అతని జుట్టును బాధిస్తున్నది. మాతృదేశపు గాలి. కాని యిప్పుడిది తన మాతృదేశం కాదు. తన వీసా వ్యవధి గడిచిపోతున్నది. రేపుఉదయం యిక్కడినుండి బయలుదేరి వెళ్ళిపోవాలి. మురాదాబాద్, చంపాబాజీ, యీ వరండా, జేబున్నీసా, మరియమ్, చా అబ్బ అంతా యిక్కడే వుండిపోతారు. దీనికి తను కన్నీరు కార్చాలా? కాని తాను వృద్ధుడనైనానని అతడు గ్రహించాడు. అతనిలో గొప్పఓర్పు వచ్చేసింది. 'ఓర్పు, శాంతి, సమానస్థాయి యివన్నీ ప్రాచీన యూనానీ ఆదర్శాలు' అని హరిశంకర్ అంటూ వుండేవాడు.

చంప అతనిహృదయంలోగల భావాన్నిగ్రహించి 'నీ స్నేహితుడు హరిశంకర్ ఎక్కడ వున్నాడు?' అని అడిగింది.

'చంపాబాజీ! హరిశంకర్ యిప్పుడు నాకు స్నేహితుడు కాడు. అత డిప్పుడు ఎక్కడున్నారో నాకేం తెలుసు?' అని అన్నాడు కోపంగా.

'అతనికి జాబులు వ్రాయడంలేదా?'

'నేను స్నేహితులకు జాబులువ్రాస్తూ కూర్చోనని నీకు తెలియదనుకొంటాను. హరిశంకర్ శ్రీ వాత్సవకు ఏం వ్రాయను? అసలు ఎందుకు వ్రాయాలి?'

'నీలో యిప్పటికీ మార్పురాలేదు. ఒట్టి ఆవేశపరుడివి' అని అన్నది.

'నేను ఇండో పాకిస్తాన్ పేరట జరుగుతున్న నాటకం చూసిచూసి విసుగు చెందాను. హరిశంకర్ యిప్పుడు బెంగుళూరులో వున్నారట. వెళ్ళి గుండెలకు హత్తుకోనా? ఆరోజులు గతించాయి.'

'నీవు ఇంకా దృఢచిత్తుడివికాలేదు. నీవు హరిశంకర్‌ని కలుసుకోకూడదని అనుకొంటున్నావు. కాని నిజంగా హరిశంకర్ యిప్పుడు ఎదురుపడితే భోరున ఏడ్చి అతణ్ణి గుండెకు హత్తుకొంటావు. ఇదికూడా విచిత్రమైన నాటకమే. సరే గాని, మరి నన్ను కలుసుకొనేందుకు ఎందుకు వచ్చావు?' అని అడిగింది సూటిగ చంప.

'పాతస్నేహితుల్ని కలుసుకొందామనే వచ్చాను. మురాదాబాదు వెళ్ళేత్రోవలో వున్నది' అందుకని వచ్చాను అని మెల్లగా సమాధానం యిచ్చాడు. కాని తన సమాధానం సరిగాలేదని అతనికి తెలుసు.

చంపకూడా ఏమీ మాట్లాడలేదు. కమాల్ లోలోనే ఒకప్రశ్న అడగాలని మథన పడుతున్నాడు. సాహసించి 'చంపాబాజీ! యిక నీ భవిష్యత్కార్యక్రమం ఏమిటి?' అని ప్రశ్నించాడు.

'నేనా? నేను వారణాసి వెళ్ళిపోతాను. మా పూర్వీకులపట్టణం. దానిపేరు శివ పురి. అంటే ఆనందనగరమన్నమాట. ఈ దేశాన్ని దుఃఖనగరంగాను చేయవచ్చు. సంతోషనగరంగాను చేయవచ్చు. అది నా చేతిలోనిపని. ఇతరులసంగతి నా కనవ సరం'అంటూ చేతులుచాచి అతనివంకచూపింది. 'ఇవిగో యివి నర్తకిచేతులు కావు. రచయితచేతులు కావు. కళాకారిణి చేతులుకావు. ఒక అతి సామాన్యమైన బీదకుటుంబానికిచెందిన కొంచెం చదువుకొన్న, తెలివిగల అమ్మాయి చేతులు. అవి యిప్పుడు పనికి పూనుకొంటున్నాయి. ఈ చేతులతో నా దేశాన్ని బాగుచేస్తాను' అని అన్నది దీక్షాభావంతో. ఆతరువాత నిండా ముసుగు కప్పుకొన్నది.

కొద్దిసేపటికి ముసుగు తొలగించుకొని, 'కమాల్, నీవు పాకిస్తాన్ ఎందుకు వెళ్ళిపోయావు? నేనుకూడా పాకిస్తానువస్తే ఒకటికాకపోతే ఒకటి పెద్దహోదా దొరకదూ? చూడు, కేంబ్రిడ్జినుండి ఎన్నిడిగ్రీలు తెచ్చానో?' అని అన్నది.

క్రింద చంప బంధువులు పిండివంటలు చేస్తున్నారు. 'అమ్మాయిలూ! కొద్దిగా పైకి పంపండి' అని కేకపెట్టింది.

జేబున్నీసా పళ్ళెంలో పిండివంటలుపెట్టుకొని వయ్యారంగావచ్చి అక్కడ వుంచి వెళ్ళిపోయింది.

'కమాల్! నా దగ్గరకు ఎవరు వస్తారా అ ఆలోచిస్తున్నావుకదూ! ఒక్క విషయంమాత్రం నిజం. వ్యక్తిగతసాఫల్యంవిషయంలోమాత్రం నీకంటె నేనే మెరుగు. అదృష్టవంతురాల్ని. నాకు మార్గం దొరికింది' అని అన్నది.

'నీవు చెప్పింది నిజం చంపాబాజీ!'

బయట పెద్దవర్షం కురిసింది. వీధుల్లో వాననీరు చిన్నచిన్నకాలువలుగా ప్రవహించసాగింది. ఇంటి ముందుభాగంలో నీరు నిల్వవుండి ఒక చిన్నచెరువుగా కనబడుతున్నది. పైన పెద్దపెద్ద గాజుపాత్రల్లో పచ్చపచ్చనిమొక్కలు నీటిలో తడిసి వున్నాయి. వాటిలో వాననీరు నిలచింది. ఆ నీటిని చూపుతూ, 'అదుగో, అది నా జలమహల్. అక్కడ నా కన్నీరు ప్రవహిస్తూవుంటుంది' అని అన్నది నిట్టూర్పు విడుస్తూ.

'నేను ఒక సామాన్యకుటుంబానికి చెందినదాన్ని. నేను భగవద్భక్తి కలిగి వుంటే యీపాటికి మీరాబాయి, ముక్తాబాయి, సెంట్‌సోఫియాలవంటివారి ముద్ర నామీద సంపూర్తిగా పడివుండేది. నాకు విషపాత్రలు పంపించబడేవి. ముళ్ల కిరీటం నెత్తిన పెట్టేవాళ్లు. కాని నేను మామూలుస్థాయికి చెందిన చంపా అహమద్‌ను. నాకు తగిలిన గాయాలు ఎవ్వరికీ కనబడవు. చూడలేరుకూడా. నన్ను చూడదలచుకొన్నవాళ్ళకుకూడా గాయాలు తగిలాయి. వాళ్ళు పిరికివాళ్ళు, బలహీనులు, వెన్నెముకలేని మనుష్యులు. చూడగలిగినా కళ్ళు లేనివాళ్లు. నన్నుచూపి జనం నవ్వితే నవ్వవచ్చు. కాని నేను లక్ష్యంచేయను. సెంట్‌సోఫియాను యిప్పుడు పూజిస్తున్నారు జనం.'

ఇంతలో గాలి పెద్దగా వీచింది. నేరేడుపండ్లు టపటప క్రిందరాలాయి. చంప తన జుట్టుమీదపడిన ఒక పండుటాకును వ్రేళ్ళతో తీసివేసింది.

'కమాల్ ! నేను చాలామందిదగ్గరకు వెళ్ళాను. 'అతి మేధావులయిన మనుష్యులతో సమయం గడిపాను. వారిలో ప్రతిఒక్కరు వ్యక్తిగతంగా దుఃఖపడేవారు. లేక సంతోషించేవారు. నీవు ఎందుకు సంతోషంగా వున్నావు? అని అడిగితే సరియైనసమాధానం దొరకలేదు. చివరికి నేను తెలుసుకొన్న రహస్యం ఒక్కటే. చాలామంది తమ దుఃఖాన్ని ప్రపంచపుదుఃఖంలో కలుపుకొన్నారు. ఎంత తేలిక అయినవిషయమో గమనించు. పర్వతంక్రిందకు చేరుకొనేసరికి మనం, మన దుఃఖాలు ఎంత తుచ్ఛమైనవో బోధపడింది. ఎనిమిదిసంవత్సరాలతరువాత నేను కూడా నా దేశానికి, నా మాతృదేశానికి తిరిగి వచ్చాను. ఇక్కడిపరిస్థితులు చూశాను. తలఎత్తుకొనగలిగిన, ఆనందంతో పొంగిపోవలసినవిషయాలు చూశాను. కొన్ని విషయాలుచూపి సిగ్గుతో తలవంగిపోయింది. నా మనస్సు క్రుంగిపోయింది. నా ఎదుట సమస్యలు గుట్టలు గుట్టలుగా పేర్కొని కనబడ్డాయి. అప్పుడు ఏం జరిగిందో తెలుసా? చీమ ఏమిచేసిందో తెలుసా? చెవులకు ఏనుగుల్ని తగిలించుకొని పర్వతంమీదకు ఎక్కడం ప్రారంభించింది. ఇకముందు నేనేమి చేయదలచుకొన్నానో యింకా తెలుసుకోవాలనుకుంటున్నావా?'

రెండోరోజుసాయంత్రం కమాల్ అక్కడినుండి బయలుదేరాడు. టాంగా రైలుస్టేషనుకు బయలుదేరింది. కమాల్ ద్వారంవంక చూశాడు. విరిగి పడిపోయిన ద్వారందగ్గర చంపాబాజి నిలబడివున్నది మౌనంగా, ఖిన్నవదనంతో. ఇదేవిధంగా అక్బఫర్డ్ వీధిదగ్గర చూజేవాలీసత్రంలో అద్దాలద్వారందగ్గర ఆమెను తాను ఒంటరిగా వదిలివచ్చాడు. ఇదేవిధంగా గుల్‌షిషాం గేటువగ్గర చీకట్లో సయ్యద్ యీమెను ఒంటరిగా వదిలిపెట్టి పాకిస్తాన్ వెళ్ళిపోయాడు.

కాని యిప్పుడు చంపాబాజి ఒంటరిగలేదు. ఇప్పుడు ఆమె ఒక సమూహంలో భాగంగా మారిపోయివున్నది. షరతులేమీ లేకుండా ఆమె సమూహంలో కలిసిపోయింది. చంపాబాజి యిప్పుడు ఒంటరిగలేదు. జనంలో కలిసిపోయింది. ముందుకు సాగుతున్నది. ఆమెవెంట పేటయందలి వీధులు, మసీదుగోడలు, కోట బురుజాలు, జేబున్నీసా, మరియమ్, రోడ్డుమీద గోలీలు ఆడుకొంటున్న బాలురు, బండ్లవాళ్లు, బీదవాళ్లు, ఘోషాస్త్రీలు, ప్రజానీకం అంతా వున్నారు. చంప వారందరికి స్నేహితురాలు. అంతా ముందుకు సాగిపోబోతున్నారు. ఇవాళ కాకపోయినా రేపు - ఏదో ఒకరోజున అతిత్వరగా త్వరత్వరగా పైకిలేస్తారు. పైకి లేచితీరుతారు.

రైల్లో కూర్చుంటూ 'ఏం చేయమంటావు పార్ట్నర్ ! చివరికి నా ముగింపు చింతాజనకంగా జరిగింది' అని లోలోన అనుకొన్నాడు.

రైలు బయలుదేరింది. శివాలిక్‌పర్వతాలుదాటి విశాలమైన హిమాలయాల ప్రాంతంలో ప్రవేశించింది. డెహరాడూన్ స్టేషనులోదిగి అతడు మేజస్ట్రేటు కోర్టుకు వెళ్ళాడు. అక్కడి యింటినిగురించి కాగితాలన్నీ బైటికితీశాడు. ఆ తరువాత అతడు అక్కడి అందమైనరోడ్లమీద తిరగడం ప్రారంభించాడు.

ఎదురూగా నది ప్రవహిస్తున్నది.

'మిత్రమా హరిశంకర్ ?' అని పిలిచాడు కమాల్.

'ఆఁ.'

'ప్రొఫెసర్ హామిల్టన్ చెప్పింది నిజం. మనం నిజంగా లేనిపోని జంజాటంలో పడి కొట్టుకొంటున్నాం మిత్రమా !'

'పద. ఈ మేడలపేర్లు చదువుదాం. ఇళ్ళపేరు చదివితే యీ యిండ్ల యజమానుల మనస్తత్వం తేలికగా బోధపడుతుంది' అని అంటూ హరిశంకర్ ఒక మేడదగ్గరకు వెళ్ళాడు.

'మనం మేడ కడతామో లేదో ! అయినా 'మేడలు మిద్దెలు మహరాజుల కెందుకులే' అన్నారు పెద్దలు.'

'నిజం, చూడు యీ పేరేమిటో ? చదువు.'

'ఖ్వాబిస్తాన్ (స్వప్నలోకం) అమ్మ బాబోయ్.'

'నీవుకూడా గుల్‌ఫిషాఁలోను ఖయాఁబాఁలోను వుంటున్నావు కదా !'

'అవును.'

'కమాల్ !'

'ఆఁ.'

'కొంచెం ఆలోచించు. జనం ఇళ్లుకట్టుకొన్నారు. ఈ చివరినుండి ఆ చివరిదాకా యిళ్ళేయిళ్ళు. ప్రపంచమందంతటా యిళ్ళువున్నాయి.'

'నిజం మిత్రమా ? విచిత్రమైనవిషయం.'

వాళ్లిద్దరూ ఒక ఇంటి గేటుదగ్గరకూర్చొని యీ సమస్యనుగురించి ఆలోచించసాగారు. ఒక ప్రొఫెసరు సన్యాసం పుచ్చుకొన్నందున వాళ్ళకు బాధగావున్నది.

చీకటిపడేందాకా యిళ్ల పేర్లు చదువుతూ తిరిగారు. చివరికి విసిగి వేసారి ఒక యింటిముందు నడిలో కొట్టుకుపోతున్న ఒక పాతచెప్పువంకచూస్తూ కూర్చున్నారు. ఇంతలో బుర్రున ఒక పొడుగుపాటి కారువచ్చి ఆ యింటిముందు నిలబడింది. కమాల్ వులిక్కిపడ్డాడు. కండ్లునులిమి నలువైపుల చూశాడు. హరిశంకర్ ఎక్కడా కనబడలేదు. ఇది 1942 కాదు. 1956. తాను డెహరాడూనులో వున్నాడు. ఇంకో పర్యాయం కళ్ళునులిమి చూశాడు. అతడు తనయింటి గేటుదగ్గర కూర్చొని వున్నాడు. కారులోనుంచి ఒక సర్దార్ దిగాడు. కమాల్ దగ్గరకు వచ్చాడు.

'మీరు ఎవరిని కలుసుకోవాలనుకొంటున్నారు ?'

'నేను.... నేను.... కంగారుపడ్డాడు. అతనిగుండె దడదడలాడింది. సర్దార్ తనను మోసగాడని అనుకొన్నాడు కాబోలు. దొంగనని అనుకొన్నాడుకాబోలు. మళ్ళీ మరొక్కపర్యాయం గేటుమీద వ్రేలాడుతున్న బోర్డు చదివాడు—'నవాబ్ తకీరజా బహాదూర్ ఆఫ్ కళ్యాణ్‌పుర్' అని వున్నది.

ఇది తనయిల్లు. లేచి నిలబడ్డాడు. తనదగ్గరవున్న కాగితాలుతీసి సర్దారు ముందు వుంచి సన్నగా ఒక్కనవ్వు నవ్వాడు.

'ఓహో ! మీరా ? ఆస్తివిషయమై వచ్చారన్నమాట ! రండి.'

అతడు సర్దార్ వెంట బయలుదేరాడు.

'మీ స్టోరురూము జాగ్రత్తగా మూసివున్నది. తాళపుచెవి తెచ్చారా ?'

'ఆఁ తెచ్చాను.'

ముందుగదిలోకి తీసుకొనివెళ్ళి సర్దార్ టీ తెప్పించాడు. భోజనం చేయమని బలవంతం చేశాడు.

'దాక్కురూము తెరిచేందుకు నేను రేపుఉదయం రావచ్చునా ?'

'తప్పకుండా రండి. ఇది మీ యిల్లే గదా !'

సర్దార్ రావల్‌పిండి నివాసి. ఇక్కడ పెద్ద గుత్తదారుడు. చాలాసేపు తన ఊరునుగురించి గోలపెడుతూవున్నాడు. విసిగిపోయి కమాల్ లేచి నిలబడ్డాడు. సర్దార్ సగౌరవంగా అతణ్ణి కారు ఎక్కించుకొని అతను వున్నచోటుకు చేర్చాడు.

మర్నాడుఉదయం అతడు మళ్ళీ ఖయాఁబాఁ వచ్చాడు. బయట ఎండగా వున్నది. తోటలో యిద్దరు యౌవ్వనంలోవున్న సిక్కుయువతులు బాడ్‌మింటన్ ఆడుతున్నారు. సర్దార్‌భార్య గేదెలకు కుడితిపట్టిస్తున్నది. లోపల రేడియో మ్రోగు

తున్నది. వాతావరణం ప్రశాంతంగావున్నది. కమాల్ ప్రక్కగానడచి స్టోరురూము దగ్గరకు వెళ్ళాడు. తాళం తెరిచేముందర అక్కడగల మెరమెట్లమీద కూర్చు న్నాడు.

ఇరవయ్యవశతాబ్దంలో హిందూదేశంలో సర్వస్వము పోగొట్టుకొన్నతరానికి చెందినవ్యక్తిగా అతడు అక్కడ కూర్చున్నాడు. గతంలో ఆ యింటికిగలవైభవం అతనికి కనబడసాగింది. ఆ ప్రపంచమే వేరు. అది గులాబీపూల మొక్కలమధ్య బంగారువన్నెగల ట్రేలలో బంగారువన్నెగల కప్పుల్లో టీలు త్రాగుతూ తిరిగిన యుగం. ఆ తోటలోగల దేవదారు చెట్లమధ్యగా కాలిబాటన తన కుటుంబస్త్రీలు గౌరుగులువేసుకొని నడుస్తుంటే యూరోపియన్‌నవలల్లో చిత్రించబడే నాయికలు జ్ఞాపకం వస్తారు.

చలికాలపురోజుల్లో తను లక్నోనుండి యిక్కడకు వస్తూవుండేవాడు. మధ్య గదిలో పరుపులు పరిచివుండేవి. వంటవాళ్ళూ నౌకర్లు విపరీతంగా వుండేవారు. కమాల్, తలత్ వందలాదిపుస్తకాలు ముందుపెట్టుకొని కూర్చునేవాళ్ళు. గిడ్డంగి తలుపులు తెరచినప్పుడు తానుకూడా అమ్మతోపాటు లోపలికివెళ్ళి చూసేవాడు. అక్కడ ఎన్నెన్నో వస్తువులు వుండేవి. అన్నింటినీ కమాల్ చూస్తుండేవాడు.

చలికాలపురోజుల్లో బాబా హుక్కా తాగుతుండేవాడు. నౌకర్లవాటాలో త్రిలోచన్ మాలి గదిగోడమీద పెద్దపటం వుండేది. ఈ ప్రపంచంలో చెడ్డపనులు చేసే వారికి నరకంలో ఏయే కష్టాలు కలుగుతాయో ఆ పటంలో బొమ్మలరూపంలో చిత్రింపబడివుండేది. రోజీపనిమనిషి వుండేది. వాళ్లఅమ్మాయి తెల్లదొరలయింట్లో ఆయాగా పని చేస్తుండేది. ఆ పనిమనిషి టీ పెట్టుకు త్రాగుతుండేది.

లక్నోనుండి పిల్చింది అంతా వచ్చేది. వంటయింటిముందు పనసచెట్టువుండేది. హుస్సేన్‌భార్య రోజూ ఆ చెట్టుకు కాచిన పనసపండ్లు లెక్కపెడుతూ వుండేది.

సోఫాలు, కుర్చీలమీద ఎరుపురంగు మెత్తనిబట్ట కుట్టబడివుండేది. మేలురకం తివాచీలు పరిచివుంచేవారు. ఎదురుగావుంచే వరండాలో రెండుమూడు వేట కుక్కలు జింకను వెంబడిస్తున్న పెద్దచిత్రరువు వ్రేలాడుతూవుండేది. కుటుంబ సభ్యులందరిఫొటోలు గోడలకు అమర్చబడివుండేవి. భోజనాలగదిలో సువాసనలు వెదజల్లే రకరకాల ఆకులు కుంపట్లలోవేసి కాలుస్తూవుండేవారు. ఆ సువాసన నతో వంటగది గుబాళిస్తూవుండేది. భోజనాలు చేసేటప్పుడు ఇంగ్లీషువాళ్లపద్ధతిలో

బల్లలు అలంకరించబడేవి. వడ్డనచేసేవాళ్ళు ఎప్పుడు తెల్లవిదుస్తులువేసుకొని వుండేవాళ్ళు; అతని తలపాగాకు వెండిబిళ్ల, నడుముకు బెల్టుపెట్టుకొనివుండేవాడు.

వేసవికాలపురోజుల్లో యింట్లోవాళ్లంతా పడుకొన్నప్పుడు కమాల్ మెల్లగా లేచి మామిడితోటలోకివెళ్ళి కూర్చునేవాడు. మంచి శాంతిమయమైనభావాలు కలుగుతూవుండేవి. దేవదారుచెట్లమీద కూర్చొని ఒకపక్షి 'నేను నిద్రిస్తున్నా ...నేను నిద్రిస్తున్నా....' అన్నట్లుగా కూతకూస్తూవుండేది. శివాలిక్‌పర్వతప్రాంతంలోనే ఆ పక్షి దొరికిందట. ఇంతవరకు ఆ పక్షిని ఎవ్వరూ చూడలేదు. ఈ పక్షినిగురించి ఒక కథ చెబుతూవుంటారు. పరమేశ్వరుడు ప్రపంచాన్ని నిర్మాణంచేసి ప్రాణాలకు అదృష్టం, గుణాలు పంచుతూవున్నాడట. నెమలికి పింఛం, కోయిలకు మధురమైన కంఠం లభించిందట. ఆ సమయంలో యీ పక్షి యెక్కడో ఎక్కడోపడి నిద్రపోతున్నదట. పరమేశ్వరుని అనుగ్రహం దీనికి లభించలేదు. అందువలన జన్మజన్మలకు ఏడుస్తూనేవుంటుందట. దానికూతను శ్రద్ధగావింటే 'నేను నిద్రిస్తున్నా... నేను నిద్రిస్తున్నా' అనుభావం ద్యోతకమవుతుంది.

సర్దార్‌భార్య బయటపని పూర్తిచేసుకొని లోపలికి బయటికి రాకపోకలు మొదలుపెట్టింది. దర్బీలుమని వాకిలితలుపులు మూసింది - ఆ చప్పుడుకు కమాల్ వులిక్కిపడ్డాడు. 1936 నాటి డెహరాడూన్‌నుంచి తిరిగివచ్చాడు.

మెట్లమీదినుండిలేచి తాళంచెవి తీసుకొని కింది అంతస్తుతలుపులు తెరిచాడు. లోపలికివెళ్ళి అలమారాలను తెరిచిమూయడం ప్రారంభించాడు. పెట్టెలన్నీ చూశాడు. ఈ సామానంతా ఏం చేయాలో అతనికి బోధపడలేదు. ఇదంతా తన ఆస్తిగాభావించి సంతోషపడుతూవుండే మానవులు అతనికి జ్ఞాపకం వచ్చారు. ఇంతసామాను కుప్పలుకుప్పలుగా గుల్‌ఫిషాంగదుల్లోను, కళ్యాణపుర్ భవనగదుల్లోను వున్నది. గొడౌనులో సామానుమధ్య చోటు ఖాళీచేసి అక్కడ నిలబడి యీ సామానుకోసమే జనం పడి చస్తుంటారు. ఏమిటిదంతా? అంతా మృగతృష్ణ మృగతృష్ణ అని ఆలోచించసాగాడు.

జనం సంసారం వదిలిపెట్టి అడవులకు ఎందుకు వెళుతూంటారో యిప్పుడు అతనికి అర్థమైంది.

ఆ తరువాత మోకాళ్లమీదకూర్చొని పెట్టెలు తెరిచాడు. నాలుగువైపుల పత్రికలు, పుస్తకాలు, పాతపటాలు కుప్పలుకుప్పలుగా పడివున్నవి. ఉత్తరాలగుట్ట

ఒకటితీసి చూశాడు. కవర్లమీద రకరకాల విచిత్రమైన ముహర్లు వున్నవి. పాట్నా 1933. బిలాస్‌పూర్ 1928. భోపాల్ 1937. ఆ జాబుల్లో ఏమివున్నదో ఏమో. ఎవరు ఆ జాబులు వ్రాశారో. వాళ్ళిప్పుడు ఎక్కడున్నారో. ఏమి చేస్తున్నారో తెలియదు. రాస్‌బిహారీలాల్ జాబు కనబడింది. 1934 లో పిలిభిత్‌నుండి వ్రాశాడు. గొలుసుకొట్టు ఉర్దూలిపిలో వ్రాసివున్నది. ఆయన ఎవరో. ఎక్కడున్నాడో తెలియదు. శివనందనపాండే. రాణీఖేత్. మొహమ్మద్ అహమద్ అబ్బాసీ మున్సిఫ్. గోండాజిల్లా. ఇలాంటి జాబులు చాలావున్నాయి. ఆ జాబులన్నింటినీ జాగ్రత్తగా అలమరలోకి త్రోసివేశాడు. తివాసీలగుట్టలక్రింద ఫైళ్లు పడివున్నవి. కేసులు. భూములు. ఇండ్లు మొదలుగాగల ఆస్తికి సంబంధించినకాగితాలు ఆ ఫైళ్ళలో వున్నాయి. ఆ కాగితాల్లో అయోధ్యచరిత్ర బొమ్మలతోసహా ఒకటి కనబడింది. అవి పీచుకాగితాలు. పట్టుకుంటే నుసినుసి అయిపోతున్నాయి. మొదటిపేజీలో హిజ్ హాయినస్ ది ఆనరబుల్ సర్ మహారాజా దిగ్విజయసింగ్ బహాదుర్ కె. సి. ఎం. బి. బలరామపూర్. తులసీపూర్. అయోధ్య ప్రాంతంవారి రేఖాచిత్రం ముద్రించబడివున్నది. ఆ చిత్రం కొంటెతనంగాను, హాస్యప్రధానంగాను గీయబడింది. ఆయన ఉర్దూలో వ్రాసిన పీఠికకూడా అందు ముద్రించబడివున్నది.

పుస్తకం రెండు మూడుపేజీలు తిరగవేసి చూశాడు. విసుగుపుట్టి విసిరి బుట్టలో పడవేశాడు. చేతికి అంటుకొన్నదుమ్మును తుడుచుకొనక శాస్త్రి అలాగే చూస్తూ కూర్చున్నారు.

'ఈ సామాను ఎక్కడికి పోదు. జప్తు అయిపోతే పోనీ' అని లోలోన అనుకొన్నారు. గొడౌనునుంచి బయటికివస్తూ ఇరవైసంవత్సరాలనాటి ఒక గ్రూపు ఫొటో బైటకు తీశాడు. అందులో అతని కీర్తిశేషులు పెద్దతండ్రి మధ్యలో పుష్పహారం మెడలోవేసుకొని కూర్చొనివున్నారు. ఇది ఏదోజిల్లాలో ప్లీడర్లు సందర్భంలో తీయబడిన ఛాయాచిత్రం. డిప్టీకలెక్టర్లు. వకీళ్లు చాలామంది ఆ ఫొటోలో వున్నారు. సక్సేనా. త్రివేదీ. ఠాకుర్ రామనారాయణ్. మసూదుల్ హసన్ మొదలగు వారున్నారు. అంతా పెద్దమనుష్యులు. అమాయకులు. మోసం అంటే ఏమిటో వారిలో చాలామందికి తెలియదు. తప్పుడు పనులు చేయడం. కళ్ళలో కారంకొట్టడం వగైరా పనులు చేసిఎరుగనివాళ్లు. నిజానికి యీనాటి పరిభాషప్రకారం మూర్ఖులన్న

మాట. వాళ్ళు ఆరోజుల్లో విచిత్రంగా ఎగతాళి చేసుకొనేవారు. చిన్నప్పుడు వీళ్ళను కమాల్ బాగా ఎరుగును. అంతా కలిసిమెలిసి సరదాగావుండేవారు. బావ, బావ మరుదులవరుసలు పెట్టుకొని పరిహాసాలు చేసుకొనేవారు. వారిది మంచిసమాజం. కమాల్ కాస్సేపుదాకా ఆ ఫొటోను చూస్తూ వున్నాడు. ఆ తరంవాళ్ళకంటె మా తరంవాళ్లం ఏమాత్రమైనా గుణంలో అభివృద్ధి సాధించామా లేదా అని ఆలోచించ సాగాడు. ఓ వృద్ధులారా! సిగ్గుతో తలవంచుకొంటున్నాను. మీకు ముఖం చూపించడం నాకు యిష్టంలేదు. అందువల్ల పారిపోతున్నాను. అంటూ గ్రూపుఫొటోను అక్కడే పడవేశాడు. గదికి తాళంవేసి బయటికివచ్చాడు.

దేవదారుచెట్లమీది పక్షి 'నేను విద్రిస్తున్నా....నేను విద్రిస్తున్నా' నంటూ ఒకే పనిగా అరుస్తున్నది.

అరే! విద్రపోతే వచ్చినవష్టం ఏమిటి? మేల్కొనివుంటే ప్రజాపతి సుఖాలు కల్పించి వుండేవాడా? పశ్చాత్తాపం కలిగినా అదే ఏడిచేదు. మహామహావాళ్లే ఏడుస్తుంటే ఏ లెక్కేమిటి? కమాల్ రజా, శ్రీల్ ఐప్లే, గౌతం పీతాంబర్ అంతా గిజగిజలాడిపోయిన బాపతే. అంతా నానాగొడవ పడిపోతున్నారు.

ఢిల్లీస్టేషన్లో బావగారు అతనికోసం ఎదురుచూస్తున్నారు. వారితో బయలుదేరి జేలాపోర్డుకు వచ్చాడు. లాన్ వరాండాలో నిలబడి అతనిరాకకై నిరీక్షిస్తున్నది. అతణ్ణిచూడగానే చేతుల్లోకి తీసికొని 'వెళ్ళకునాయనా! నిర్మల చనిపోయింది. హరిశంకర్ ఎప్పుడూ బయటనే వుంటున్నారు. నీవు పాకిస్తాన్ వెళ్ళిపోయావు' అంటూ వలవల ఏడ్చింది.

కమాల్ ఏమీ మాట్లాడలేదు. అతనికైలు అమృతసర్‌కు సాయంత్రం బయలు దేరుతుంది. త్వరగా లాజపతిని వదిలించుకోవాలని వున్నది. అందువల్ల భోజనం కాగానే బావగారితో క్రొత్తఢిల్లీని చూసేందుకు బయలుదేరాడు.

'అరే గౌతం పీతాంబర్ చండీగఢ్‌నుండి వచ్చివుంటాడు. ఫోనుచేయి' అని బావగారు జ్ఞాపకం చేశాడు. కమాలుకు యిష్టంలేదు. అయినా డైరెక్టరీ తిరగ వేయడం ప్రారంభించాడు. హరిశ్చంద్ర, నారాయణ్, ఎం. జె. పీతాంబర్. గౌతం. అతడు నెంబరు తిప్పాడు.

'హలో గౌతం! నీవు యిక్కడే వున్నావా? భలేవాడివి' అంటూ అమితో త్సాహంతో అని తరువాత తననుతాను సంబాళించుకొని మామూలుస్థాయిలో

మాట్లాడటం ప్రారంభించాడు. 'ఇవాళ ఉదయమే....డెహరాడూన్‌నుండి....హలో అవును. ఢాకానుండి లక్నోవచ్చాను. అక్కయ్య నిన్ను అడిగానని చెప్పమన్నది ....కులాసాగా వున్నది. నేనుమినహా అంతా బాగున్నారు....నేనా....ఏమీలేదు.... బాగా నేవున్నాను....ఎవరెవరినిగురించి అడుగుతావో అడుగు....కదీర్, కమరున్.... మిత్రమా! నీకు జ్ఞాపకశక్తి ఎక్కువ. కదీర్....మీర్జాపుర్ వెళ్ళిపోయాడు....కారు ఎప్పుడో అమ్మివేశాడు....ఎందుకు అమ్మాడంటే ఏం చెప్పను? అరే జీవితాలే అమ్ముడుపోతుంటే లేదుకాని కారు ఒకలెక్కా?....నీవు అమ్ముడుపోలేదా?.... నిన్నుగురించికాదు....నన్నుగురించే చెబుతున్నా....నేను ఎప్పుడో అమ్ముడు పోయాను....మంచిధర లభించింది. ఇంకా అడుగు ఎవరెవరినిగురించి అడుగు తావో అడుగు. సెలవుతీసుకుంది....పాపం చనిపోయింది. పాము కరిచిందట.... గంగాదీన్ ఎక్కడో మధ్యప్రదేశ్‌లో వున్నాడట....ట్రాక్టరు నడుపుతున్నాడని తెలిసింది....అతడు ఎఫ్. ఏ. పాసైనాడట....అక్కయ్య చెప్పింది....ఇంకా ఏం చెప్పను?....మిత్రమా! ఏమున్నది చెప్పేందుకు?....నిన్ను కలుసుకోనా?.... ఏమో చెప్పలేను....చాలా పనులున్నాయి....కలుసుకోలేను....మీ సమావేశం మూడుగంటలకు ముగుస్తుందా?....మంచిది....అల్ప్స్‌లో నాకోసం ఎదురు చూస్తావా?....వద్దు బ్రదర్....సంరక్షకుడిదగ్గరికి వెళుతున్నాను....ఏ. బ్లాక్....ఆ తరువాతనా....చూస్తా....ఏం చేయమంటావు చెప్పు?....ప్రయత్నిస్తా....రాలేక పోతే ఏమీ అనుకోవద్దు....సెలవు...'

కమాల్ ఫోను పెట్టివేశాడు. లాజవతి వాకిలిదగ్గర నిలబడివున్నది. 'వెళ్లొస్తా' నంటూ కమాల్ లేచి నిలబడ్డాడు.

'త్వరగా రా'

'అలాగే'

'ఫలహారంకోసం ఏం చేయమంటావు?'

'ఏదో ఒకటి నీ యిష్టంవచ్చింది చెయ్యి' అని బయలుదేరాడు. 'అక్కయ్య ప్రేమచూపి నన్ను వలలో వేయాలనుకొంటున్నది. అంతతేలికగా పడను. నా మనస్సు గట్టిపడిపోయింది. ఎవ్వరికీ లొంగను' అని లోలోన అనుకొన్నాడు.

యమున రోడ్డుమీదగా కెనాట్ ప్లేస్ చేరుకొన్నాడు. అంతా హడావుడిగా వున్నది. వచ్చేపోయే కార్లు. పెద్దపెద్ద భవనాలు. దుకాణాలు. జన సందోహం....

అతడికి భయం వేసింది. బయలుదేరేముందు సివిల్ లైన్సుకువెళ్ళి తాను యివాళ పాకిస్తానుకు బయలుదేరుతున్నానని తెలియజేయాలని జ్ఞాపకం వచ్చింది.

భాద్రపదమాసం - ఎండ తీవ్రంగా వున్నది. బాగా అలసిపోయావున్నారు. రెక్కలొస్తే కరాచీ ఎగిరిపోదామనిపించింది. ఇక ఎప్పుడూ హిందూదేశం రాకూడదని నిర్ణయించుకొన్నాడు. ముందుకుసాగాడు.

ఎదురూగా డాక్టర్ హెన్స్ క్రోమర్ వస్తూ కనబడ్డాడు. లోలోన సంతోషించాడు. మధ్యాహ్నం యితనితో హాయిగా గడుపుదామని నిర్ణయించుకొన్నాడు.

'హలో, హలో మైడియర్ బాయ్! ఏమిచిత్రం! ఏమిచిత్రం! యిక్కడ కలుసుకొన్నాం' అంటూ రెండుచేతులుచాచి ముందుకు వచ్చాడు డాక్టర్ హెన్స్.

ఆయనవెంట సమాచారశాఖకు సంబంధించిన ఒక అమ్మాయి వున్నది. ఆమె గంభీరంగా కమాల్ చేసిన సలాముకుబదులుగ సలాం చేసింది. 'నేను డాక్టరును. జాతీయ మ్యూజియం తీసుకువెళుతున్నాను. మీకేమి పనిలేకపోతే మీరు దయచేయండి' అని ఆహ్వానించింది ఆ అమ్మాయి. ఆమె పేరు కుమారి అరుణ వాజపేయి. కమాల్ కళ్ళు మూసుకున్నాడు. నిర్మల బ్రతికివుంటే ఆమెకూడా యిలాగే ఉద్యోగం చేసుకొంటూవుండేది.

'తప్పక వస్తాను' అని కమాల్‌కూడా వారితోబాటు బయలుదేరాడు.

రేడియోప్రసారం భవనందగ్గర మరోయిద్దరు యూరోపియన్‌ల్ని వెంటతీసుకొని అంతా రాష్ట్రపతిభవనానికి బయలుదేరారు. ఆ యూరోపియన్ పెద్దమనుష్యులు బుద్ధజయంతిని పురస్కరించుకొని ఇండియాకు వచ్చారు. శ్రీనగర్‌లో ఒక బోట్‌హౌసులోవుండి భారతీయశిల్పకళనుగురించి పుస్తకం వ్రాస్తున్నారు.

రాష్ట్రపతిభవనం మెట్లమీదకువచ్చి డాక్టర్ హెన్స్ తలపైకెత్తి చూశాడు. ఎదురూగా బంగారువన్నెగల సింహాలక్రింద వ్రాసివున్న 'సత్యమేవ జయతే' అను పదాలను బిగ్గరగా చదివాడు. 'సత్యం జయిస్తుంది' అని కమాల్‌కు అనువదించి చెప్పాడు. ఆతరువాత వాళ్ళంతా కుమారి అరుణ నాయకత్వాన మ్యూజియంలో అడుగుపెట్టారు. అక్కడి విశాలమైనగదుల్లో చాలా చల్లగా వున్నది. ప్రాచీన యుగం, మధ్యయుగం నాటివిగ్రహాలు పేరసంగావున్న కమాల్ కళ్ళను బాగా ఆకర్షించాయి. డాక్టర్ హెన్స్ ప్రతివిగ్రహంముందు నిలబడి జర్మనీభాషలో తన

అభిప్రాయం వెల్లడిస్తున్నాడు. ఎదురుగా బుద్ధుని భవ్యవిగ్రహం వున్నది. కమాల్ అక్కడే బల్లమీద కూర్చున్నాడు.

'ఇది తాత్కాలికంగా ఏర్పాటు చేయబడింది. త్వరలోనే యిందుకు తగినభవనంలో యీ మ్యూజియం ఏర్పాటు చేయబడుతుంది. భవనం నిర్మాణంలో వున్నది' అని అన్నది అరుణ.

'మంచిది' అని అన్నాడు కమాల్. ఒక ఏడాది క్రితం తానుకూడా యీ ఢిల్లీలోనే టామ్‌తో యిదేవిధంగా చెప్పినమాటలు జ్ఞాపకం వచ్చాయి.

'రండి యిటు వెళదాం. మీరు మా మొహెంజదారోకు చెందిన ప్రాచీన సభ్యతా కాలంనాటి వస్తువులని చూచారా?'

కుమారి అరుణ వాళ్ళను చరిత్రనాటి గాలరీలలో త్రిప్పింది. చన్‌హోదరో, మొహెంజదారో, స్వాత్‌లోయ, హరప్పా, తక్షిల, రోపడ్ వగైరాలన్నీచూశారు. 'ఇక మనం ఆధునికయుగంలో ప్రవేశించబోతున్నాం' అంటూ ముందుకు సాగింది అరుణ.

వాళ్లు ఒక అమ్మాయి విగ్రహం ఎదుటికి వచ్చారు. ఇది వాస్తు శిల్పకళ కి సంబంధించినది. త్రావస్తి త్రవ్వకాల్లో యీ విగ్రహం యీమధ్యనే దొరికింది. అమ్మాయి కడిమిచెట్టకొమ్మనువంచి చెట్టును అనుకొని నిలబడివున్నది. 'ఎర్ర మట్టితో తయారుచేయబడిన యీ విగ్రహం క్రీస్తుశకం నాల్గవశతాబ్దంనాటిదై యుంటుంది' అని తన సహచరునితో అన్నాడు హెన్రి.

వాళ్లు ఆ విగ్రహంనగ్గరగా చల్లనిరాతిమీద కూర్చున్నారు. ఆ రమణి విగ్రహంలో జీవనం వున్నది. ఎరుపురవం వేసి వున్నవి. సాక్షాత్తు జీవితం ఆమెలో తొణికిసలాడుతున్నది. గొప్పవిగ్రహం. మంచిపనితనం, ఆ విగ్రహాన్నిగురించి. భావసౌందర్యాన్నిగురించి చర్చ బయలుదేరింది.

'కమాల్, నీకు యీ విగ్రహం నచ్చిందా? లేక మధురస్టైల్‌కు ప్రాధాన్యమిస్తావా?' అని ప్రశ్నించాడు ప్రొన్సుమంచివచ్చిన మిత్రుడు.

'బుభుక్షితం న ప్రతిభాతి కించిత్ (ఆకలిగొన్నవానికి ఏదీ నచ్చదు) బ్రహ్మజ్ఞానం, ఆనందం మొదలుగాగల సూక్ష్మవిషయాలనుగురించి విమర్శించడం నావల్ల కానిపని' అని అన్నాడు కటువుగా.

'ఇతను కమ్యూనిస్టు' అని అనుకొన్నాడు డాక్టర్ స్టీవర్టు.

'ఇతను యింతగా మారిపోవడానికి కారణం ఏమిటా' అని అరుణ ఆలోచించ సాగింది. ఆమె అమెరికాలో మనోవిజ్ఞానాన్ని గురించి చదివి డాక్టరేట్ పుచ్చు కొన్నది. కమాల్‌ను శ్రద్ధగా చూసి 'చదువుకొన్నవాడు, అందంగా వున్నాడు. ఎందు కిలా మారిపోయాడు?' అని ఆలోచించసాగింది. 'మీరు సంస్కృతంకూడా చదువుకొన్నారా?' అని అడిగింది ప్రశంసిస్తూ.

'ఒకకాలంలో కొద్దిగా చదివానులెండి' అని అన్నాడు కమాల్. గడియారం చూశాడు. నందకిశోర్‌ను కలుసుకొనేసమయం దగ్గరలో వున్నందున లేచి నిల బడ్డాడు. ఒక్కసర్యాయం నాలుగువైపుల చూశాడు. ఇప్పుడంతా సరాయిసరాయిగా వున్నది. 'ఇప్పుడు నేను అంతా పరిత్యాగంచేస్తున్నాను. మస్కిష్కాన్ని, మన స్సును, బుద్ధిని పూర్తిగా శుభ్రంచేయడానికి పూనుకొన్నాను. గతచరిత్రనంతటినీ వదులుకొన్నానని యూరోపియన్లకు చెబుదామనుకొని ఆగిపోయాడు. ప్రక్కనే వున్నది శ్రావస్తీనగరపు సుదర్శనయక్షిణి. దిన్ని సృష్టించినవారు నాతో సంబంధం వదులుకొన్నారు. ఇక సంబంధం పెట్టుకోడుకూడా. రూపం, అరూపం అను చర్చల్లో పడటం యిక అనవసరం. ఈ జాతీయ మ్యూజియాన్ని భూతవర్త మానకాలాల చరిత్రతోబాటు కుమారి అరుణ వాజపేయికి అప్పగించివేస్తున్నాను. ఇక నాకు యిదంతా అనవసరం.'

అతను అక్కడినుండి ముందుకు సాగాడు. మెల్లమెల్లగా నడిచి గాలరీ దాటాడు. అతని చెవులకు యూరోపియన్ పెద్దమాటలు వినవస్తున్నాయి.

'ఈ విగ్రహం నిర్మాణంచేసిన శిల్పి పనిఏమిటో మనం తెలుసుకోగలిగితే ఎంతో బాగుండేది. కాని యిది విచిత్రమైనదేశం. ఇక్కడివాళ్లకు చరిత్రతో పనే లేదు. ఘట్టాలకు మహత్తు ఏమి వుండదు. మనిషి శాశ్వతుడుకాదు. కాలచక్రం తిరిగిపోతుంటుంది' అని అన్నాడు డాక్టర్ క్రీమర్.

ముసియోరావల్:-'అవును. మనిషి చనిపోతాడు. అతణ్ణి తగలేస్తారు. అతని చారిత్రకమహత్తు లేకపోవడమే అందుకు కారణం.'

డాక్టర్ స్టీవర్ట్:-ఏ ఆపద హిందూదేశపుబుద్ధిని ప్రభావితంచేయలేదు. కాలగర్భంలో ఆపదలుకూడా దాగిపోతాయి. కాని చరిత్రమాత్రం యిగిరిపోదు. భూత

భవిష్యత్తులకు అ ప్రితక్వం వుండదు. ఈ శరీరం తగులబెట్టు. ఇక వర్త మానంలో కూడా యిది లేనట్లే.

'అందుకనే తూర్పుదేశాల కళాకారులు తమ పేర్లు వ్రాసుకోవలసిన అవసరాన్ని గుర్తించలేదు. ఈ విగ్రహాలు చెక్కినవాళ్లనుగురించి కొంచెమైనా మనం తెలుసుకోగలిగితే ఎంతో బాగుండేది. ఇక్కడ ఎంతమంది మైకేల్ ఏంజెల్ మహాశయులు ప్రశాంతంగా నవ్వుతూ సంతోషంగా పేరు ప్రఖ్యాతిలేకుండానే కన్నుమూశారో చెప్పడం కష్టం' అని అన్నాడు డాక్టర్ క్రీమర్.

కమాల్ గాలరీనుండి బయటికి వచ్చాడు.

'మనకూ కాలం మనమేననే అనుభూతి కలుగుతుంది' అని అన్నాడు రావల్.

'విస్తారాన్ని తెలుసుకోవచ్చును. కాని సమయాన్నిగురించి కేవలం ఆలోచించవచ్చు' అని అన్నాడు డాక్టర్ క్రీమర్.

కమాల్ మెట్లుదిగి బయటకువచ్చి పి. బ్లాక్‌కు బయలుదేరాడు.

సంరక్షకుడితో కలిసి బుర్ర చెకగొట్టుకొన్నతరువాత గౌతం నీలాంబరుణ్ణి కలుసుకొనేందుకు ఆతడు అల్ప్రకు వెళ్లలేదు. తిన్నగా లాజ్‌పతియింటికి వచ్చి వేశాడు. 'ఎవరైనా నాకోసం ఫోనుచేస్తే యింకా తిరిగిరాలేదని చెప్పమని లాజ్‌పతికి చెప్పాడు. ఆతరువాత గదితలుపులుమూసుకొని సాయంత్రంవరకు పడుకొని నిద్రపోయాడు.

గౌతం రెస్టారెంటులో కమాల్‌కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. చాలా చోట్లకు ఫోనుచేశాడు. ఇక కమాల్‌ను కలవడం కష్టమనితేల్చుకొని ఆఫీసుకు వెళ్లిపోయాడు. బుద్ధజయంతిసందర్భంగా ప్రభుత్వం విపరీతంగా ప్రచారం చేస్తున్నది. దీపాలు వెలిగిందాకా ఆఫీసులో పనిచేయవలసివస్తున్నది. ఒక ముఖ్యమైన ఫైలుకోసం తన మెంబర్ టు కుమారి అరుణ వాజపేయికి ఫోనుచేశాడు. అరుణ వాజపేయీ సీటులోలేదని, డాక్టర్ హెన్స్‌క్రీమరును వెంటబెట్టుకొని నేషనల్ మ్యూజియం వెళ్ళిందని తెలిసింది.

అతనికి కోపంవచ్చింది. కమాల్ కలవలేదని అసలే విసుగ్గావున్నాడు. ఈ దేశంమీద, కమాల్‌మీద, తనమీద, ప్రతివస్తువుమీద అతనికి కోపంవస్తున్నది. సాధ్యపడటంలేదు గాని లేకపోతే హెన్స్ క్రీమరును, డాక్టరు స్టీవరును, కుమారి అరుణ వాజపేయిని గుటుక్కున మ్రింగివేసేవాడే.

ఫైలు చాలా అవసరం. త్వరగా జాయింట్ సెక్రటరీకి పంపాలి. కారెక్కి రాష్ట్రపతిభవనం వెళ్ళారు. మ్యూజియంలోపలికివెళ్ళి నాలుగువైపుల చూశారు. కాని వాళ్ళెవ్వరూ కనబడలేదు. అతనికి ఏమీ తోచలేదు. ఎదురుగా ఒక స్త్రీ విగ్రహం కనబడింది. ఆ విగ్రహందగ్గరకు వెళ్ళారు. అది శ్రావస్తిలో దొరికిన సుదర్శనయక్షిణి విగ్రహం. గౌతం ఆ విగ్రహంముఖం చేతితో తాకిచూశారు.

'మంచివిగ్రహం. పవితనావికి మచ్చుతునక. సాంస్కృతిక ప్రచారపత్రికల్లో యీ క్రొత్త అన్వేషణనుగురించి. అనగా క్రొత్తగా లభించిన యీ విగ్రహాన్ని గురించి ఒక వ్యాసం ప్రకటించాలి అని అనుకొంటూ బయటకువచ్చారు.

• • •

రైలువేళ అయిపోయింది. అందరిదగ్గర శెలవుతీసుకొని కమాల్ రైలు ఎక్కి కూర్చున్నారు. రైలు బయలుదేరింది. యమునానది వంతెన, ఎర్రకోటగోడలు, బజార్లు, ఇండ్లు, రోడ్లు కిటికీలోనుండి కనబడుతున్నాయి. రైలు ముందుకు సాగుతూవున్నది. రైలు పొలాల్లోకి వచ్చేసింది.

కమాల్ రాధాకృష్ణన్ రచించిన పుస్తకం తీసుకొన్నారు. 'భారతీయ వేదాంతంలో ఎవ్వరూ ఎవ్వరినీ ఆదేశించరు. ఎవరికర్మకు వారే కర్త' అని అందులో వున్నది. ఆ పుస్తకాన్ని కిటికీలోనుండి బయటకు విసిరివేశారు సీటుమీద పడుకొన్నారు. రైలు పంజాబుప్రాంతపు స్టేషన్లు అంబాలా, లుధియానా, జలంధర్ దాటిపోతున్నది. గోడలమీద ఉర్దూలో చలనచిత్ర వాల్‌పోస్టర్లు అంటించివున్నాయి. తెల్లవారింది. రైలు అమృతసర్ చేరుకొంటున్నది. సిక్కుస్త్రీలు కాలిబాటన నడుస్తున్నారు. సిక్కురైతులు పొలాలకు వెళ్లుతున్నారు. రైలు బయలుదేరింది. రెండు పక్షాలసైనికులు రైలు ఎక్కారు. ఉన్నట్లుండి మరోదేశంలోకి రైలు ప్రవేశించింది.

నేను యిప్పుడు పాకిస్తాన్‌లో వున్నాను. హిందూదేశాన్నుండి వచ్చాను. రైలు బోర్డరు దాటినతరువాత అతనికి వలవల ఏడ్పువచ్చింది. భోరుభోరున ఏడ్చారు. ప్రక్కనేకూర్చున్న యాత్రికుడు తనవంక చూస్తున్నాడని కమాల్ గ్రహించారు. అతడు పాకిస్తాన్ సరిహద్దు రక్షకదళ వుద్యోగి. అమృతసర్‌నుండి లాహోరు వెళుతున్నారు.

కమాల్ పిగ్గుపడ్డారు. 'నీవు యింకా యిరుదేశాలకు విశ్వాసపాత్రుడుగా వున్నా వన్నమాట. ఛీ ఛీ' అని ఆ ఆఫీసరు అంటున్న ట్లనిపించింది.

పాకిస్తాన్ ప్రజలంతా తనవైపు చూస్తున్నట్లు. నీవు హిందూదేశపు ఏజంటువి. హిందూదేశపు గూఢచారివి అంటున్న ట్లనిపించింది.

రైలు చక్రాలుకూడా 'గూఢచారి....ద్రోహి....గూఢచారి....ద్రోహి....' అని అంటున్న ట్లనిపించింది.

కంగారుపడి లేచాడు. కండ్లుతెరచి చూశాడు. రైలు లాహోరు చేరుకొన్నది. అతనిగుండె దడదడ కొట్టుకొన్నది. లాహోరులో దిగి విమానంలో కరాచీకి బయలు దేరాడు.

క్రొత్తజీవితం అతనిముందున్నది. డైరీ తెరిచాడు. చాలాపనులు చేయవలసి వుంది. సిమెంటు, యినుము, యింటికోసం బ్లాక్‌లో సంపాదించాలి. ఫలానా వారికి పార్టీ యివ్వాలి. ఏమిటిది? ఎక్కడికి పోతున్నాను? అవును పతనమై పోయిన సమాజంలో మానవుడు నిజాయతీగా బ్రతకడం సాధ్యమా? బాగా ఆలో చించవలసిన సమస్య. ఏర్ హోస్టెస్‌కు కాఫీ తెమ్మనిచెప్పి డాన్ పేపరుతీసి చద వడం ప్రారంభించాడు. పాకిస్తాన్ మంత్రివర్గంలో సంక్షోభం....ప్రధానమంత్రి రాజీనామా....క్రొత్త ప్రధానమంత్రి జహాంగీర్‌పార్కులో ఉపన్యాసం....'

కిటికీలోనుండి బయటికిచూశాడు. ఆకాశంలో మేఘాలు దట్టంగా వ్యాప్తమై వున్నాయి. వర్షం తప్పక కురుస్తుంది.

అతడు కిటికీకి కట్టినతెర దగ్గరకులాగి ఆలోచనల్లో మునిగిపోయాడు.

నేనే శవాన్ని. శవంకోసం గుంటలు త్రవ్వేవాణ్ణి నేనే. ఏడ్చేవాణ్ణి నేనే.... అని అనుకొంటూ దిండుమీద తల ఆనించి కళ్ళు మూసుకొన్నాడు.

మట్టిరోడ్డుమీద ఒక పిల్లవాడు ఎద్దులబండి తోలుకుపోతున్నాడు. ఒక స్టేషన్ వాగెన్ పొగవదులుతూ, దుమ్ము రేగగొడుతూ ముందుకు వెళ్ళిపోయింది. ఎదురుగా మరో ఎడ్లబండి వస్తున్నది. బండివాడు ఎద్దుతో కర్ర విరుస్తు కల్లెరచేసి కారువంకచూసి 'మోటరు వళ్ల దగ్గర పెట్టుకోని తోలండయా. ఎద్దు బెదిరిపోగల్దు' అని పెద్దగా అన్నాడు. వెంటనే కారుకో కూర్చున్న అమెరికన్ పత్రికావిలేఖరి కెమెరాతీసి ఆ బండివాణ్ణి, ఎద్దులబండిని ఫొటో తీశాడు. వెనక మరోకారు వస్తున్నది. అందులో కూర్చున్న శ్రీమతి రాజవాదే బయటికి తొంగిచూసి తిరిగి లేడీ కమలేష్‌వర్మతో మాట్లాడసాగింది. శ్రావస్తీ యింకా చాలాదూరంగా వున్నది. సూర్యుడు మేఘాల్లో దాగుతూవున్నాడు. వర్షం కురిసేలావున్నది. మూడోకారులో లంక, జపానునుంచివచ్చిన కొంతమంది భిక్షువులు కూర్చొనివున్నారు. వాళ్ళతో బాటే చలనచిత్రశాఖ ప్రతినిధి వున్నాడు. ఇద్దరు ముగ్గురు రైతుస్త్రీలు యీ కార్ల గుంపునుచూస్తూ నిలబడిపోయారు. గౌతం పీతాంబర్ కారు నడుపుతున్నాడు. వెనక్కుతిరిగి కుమారి అరుణ వాజపేయీనిచూసి 'నీవు కారునడుపు. నేను యిక్కడదిగి యింటికి వెళతాను' అని అన్నాడు.

'విసుగ్గా వున్నదా!' అని అడిగింది అరుణ వాజపేయీ. ఈ ప్రయాణం చేస్తుంటే ఆమెకు నిద్రవస్తున్నది.

'ఇక్కడే ఆగి పొలాలమీదుగా నడిచి యింటికివెళతాను. ఇంటికివెళ్ళి స్నానం చేసి విశ్రాంతితీసుకొంటాను. రేపు ఉదయాన్నుండి కార్యక్రమం మళ్ళీ మొదలవుతుంది. ముసియోరావల్! మీరు సెలవిస్తే వెళ్ళవస్తానని అన్నాడు ఫ్రాన్సునుంచి వచ్చిన రచయితతో పీతాంబర్.

కారు ఆపి దిగిపోయాడు. కార్లు ముందుకు సాగిపోయాయి. గౌతం కాసేపు అక్కడే నిలబడివున్నాడు. వానచినుకు అతని ముఖంమీద పడింది. నిలబడి గట్టిగా శ్వాస పీల్చాడు. కందిమొక్క ఒకటితుంచి కాలిబాటమీద ముందుకు సాగాడు.

వానచినుకులు ఎక్కువైనాయి. గౌతం వానలో తడవకుండా ప్రక్కనేవున్న ఒక పెద్ద మామిడిచెట్టు కొమ్మక్రింద నిలబడ్డాడు. అరగంటతరువాత మళ్ళీ బయలు దేరాడు. కనుచూపుమేరవరకు పచ్చపచ్చనిపొలాలు కనబడుతున్నాయి.

గౌతం సీలాంబర్ నడుస్తూ నడుస్తూ ఆగిపోయి వెనక్కుతిరిగి చూశాడు. వర్షంవల్ల దుమ్ముఎగరడం ఆగిపోయింది అతనిపాదాలకు కొంచెం బురదకూడా అంటుకొన్నది. వర్షంలో తడవడంవల్లనో ఏమో గడ్డి, చెట్లుకూడా పరిశుభ్రంగా కనబడుతున్నాయి. రేవుదగ్గర పడవలు నిలబడిఉన్నాయి. మర్రిచెట్టుక్రిందకూర్చొని సరంగు జానపదగేయాలు పాడుతున్నాడు మునికిచెట్టుమీద ఒక నెమలి. పింఛం విప్పుకొని దర్జాగా అందంగా నిలబడివున్నది. నలుగురైదుగురు మనుష్యులు పై పంచలు భుజంమీదవేసుకొని గబగబ వూరికి నడిచిపోతున్నారు.

బహరాయచ్ నగరం. పల్లెలు ప్రారంభమైనాయి. సివిల్ లైన్సులోవున్న తన తండ్రిగారి రెండంతస్థులమేడలో గౌతం అడుగుపెట్టాడు.

అతనితండ్రి సర్ దీప్‌నారాయణ్ యింటిముందు పచార్లు చేస్తున్నాడు

'ఏం నాయనా! విదేశీ అతిథులతోబాటు నీవుకూడా సహేత్ మహేత్ (యిప్పటి శ్రావస్తీపేరు) వెళ్ళివుంటావని అనుకొన్నాను' అన్నాడు దీప్‌నారాయణ్.

'వెళ్ళలేదు నాన్నా!' అనిచెప్పి లోపలికివెళ్ళి అమ్మను కలుసుకొన్నాడు. 'దమయంతి అత్త ఎక్కడున్నది' అని స్నానంచేస్తూ అమ్మను అడిగాడు.

'పట్నంలో వున్నది. ఆమెనుకూడా చూసినా' అని అన్నది అమ్మ.

'సరే.'

'బాగున్నావా నాయనా!'

'బాగానే వున్నాను. అమ్మా! బచ్చన్‌పెండ్లి ఎప్పుడు జరుగుతుంది?'

'రాబోయే ఫాల్గుణమాసంలో జరుగుతుంది.'

'ప్రకాష్‌బాబాయి యిల్లు తయారైందా?'

'లేదు. ఖాన్‌బహాదుర్ ముహమ్మద్ హుస్సేన్ వుండేవాడే రిటైర్డు జడ్జి? ఆయన పాకిస్తాన్ వెళ్ళిపోయాడు. అతనిభవంతి వేలం వేస్తూంటే ప్రకాష్ కొన్నాడు. చాలా చవుకగా వచ్చింది.'

భోజనంచేస్తూ గౌతం యిటువంటివే గృహసంబంధమైన మామూలుగు విష యాలు తల్లిని అడిగాడు. పాకిస్తాన్ పేరు వినేసరికి అతనిమనస్సు కలవరపడింది. పాకిస్తాన్‌విషయం పూర్తిగా మరిచిపోవాలని ప్రయత్నిస్తున్నాడు. శ్రావస్తికి వెళు తున్న విదేశీపర్యటకులకు కాశ్మీరుసమస్యనుగురించి తాను చెప్పవలసివున్నది. అతనిమనస్సుకు కంగారుపట్టుకొన్నది,

'నేను కాస్త షికారుగా నదిదాకా వెళ్లివస్తానమ్మా' అనిచెప్పి గౌతం బయలు దేరాడు.

'ఇప్పుడేగదా నాయనా యింతపెద్దప్రయాణం చేసివచ్చావు. విశ్రాంతి తీసు కోరా!' అని తల్లి చెబుతున్నా గౌతం వినక యింటినుంచి బయలుదేరాడు. వర్షం ఆగిపోయింది. గాలికూడా వీయడంలేదు. నదిఒడ్డుకుచేరి పడిపోయిన కాళికాదేవి దేవళం మెట్లమీద కూర్చున్నాడు. అక్కడ వాతావరణం ప్రశాంతంగా వున్నది. ఖాళీబుర్రతో హాయిగా వుండాలని అతనిప్రయత్నం. ఈ క్షణమందు నిర్వాణం పొందితే బాగుండునని మొదటిసారిగా అనిపించింది. భయం, ఏకాంతం, దుఃఖం, అసహ్యం, పలాయనం, నిర్వాణం ఏమేమిటోభావాలు బయలుదేరాయి. జీవితంలో చివరకు మిగిలేది ఏమిటి? శూన్యం ... శూన్యం .... శూన్యం.'

హిందూదేశపు ఆత్మకుగల దుఃఖం ఏమిటో యీ విదేశీయాత్రికులు తెలుసుకో గలరా? సిగరెట్టు ముట్టించి దేవాలయం మెట్టుమీద పడుకొన్నాడు

వర్షాకాలపురోజులు, ఇక్కడ పాముపుట్ట వుంటుంది. అయినా తనకు క్రొత్త ఏముంది? అడవుల్లో తిరిగినవాడేగదా తను.

ఇంతలో ఎవరిదో అలికిడి వినబడింది.

'ఎవరయ్యా నీవు? చీకట్లో యీవిధంగా ఒంటరిగా కూర్చున్నావు?' అని అడి గాడు ఎవరో వ్యక్తి.

'నేను' అని అన్నాడు గౌతం.

రెండో యువకుడు ఒక్కదూకుమీకి లోపలికివచ్చి 'ఇదేమిటోయ్ నీవు? నిన్ను వెతుకుతూ తెగతిరిగాను. ఇంటికివెళితే మీ నాన్న అమ్మ నదిఒడ్డుకు షికా రుకువెళ్ళాడని చెప్పారు' అని అన్నాడు.

'అవును మిత్రమా? ఏం చేయమంటావు. గాలిలేదు. ఉక్కపోస్తున్నది. రోజంతా ఎలా గడిపావు?'

'తోరె త్రిపోయిందనుకో' అంటూ హరిశంకర్ దగ్గరగావచ్చి మరో మెట్టుమీద కూర్చున్నారు. 'దూదాజయాంటి (బుద్ధజయంతి) యింకా కొన్నాళ్లు యిలాగే నడిచిందా యిక మనపని గోవిందా. ఈ గౌతమవల్ల లక్నో వెళ్లలేకపోయాను. కె. ఎస్. కెరిగ్రాం అందగానే బెంగుళూరునుంచి ఢిల్లీ చేరుకొన్నాను. అరుణ వాళ పేయీ ఏం చెబుతుందో తెలుసా? ఈ యాత్రికులు యిక్కడినుంచి తిన్నగా కపిలవస్తు, గయకూడా వెళతామంటున్నారట. శ్రీవపొదవునా డాక్టర్ హెన్ప్రికీమర్ మహాయానానికి 'జెన్'కి గల తేడానుగురించి ఎంతపెద్ద ఉపన్యాసం బలవంతాన నా గొంతులో పోశాడో తెలుసా? నా బుర్ర రెండు గిర్రున తిరిగిపోయింది. నీ కారులో మునిమోరావల్ ఒక్కడే వున్నాడు.'

ఇంతలో నదిలో ఆకాశంలోని చివరి ఎరుపుతనం ప్రతిబింబించింది.

'మిత్రమా గౌతం?'

'ఆఁ.'

'కమాల్ మోసంచేశాడు కదూ?' అని అన్నాడు హరిశంకర్.

'అవును.'

'దరిద్రుడు ఢిల్లీ మీదుగానే వెళ్ళాడు. నాకు తంతియిస్తే వెళ్ళి కలుసుకొనేవాణ్ణి. తంతి యివ్వలేదు. యీ విషయం నీకుతెలుసా?'

'నేను ఢిల్లీలోనే వున్నాను. అయినా అతడు నన్ను కలియలేదు' అని మెల్లగా సమాధానం చెప్పాడు గౌతం.

ఇద్దరూ కాస్సేపు ఏమీ మాట్లాడలేదు.

'ఇప్పుడు ఎక్కడ వున్నాడో ఏమో?' అని అన్నాడు హరిశంకర్.

'కరాచీలో వుండివుంటాడు. ఇంకెక్కడ వుంటాడు?'

వాళ్ళిద్దరూ లేచి మెట్లుదిగి నదిఒడ్డున నీటినిచూస్తూ నడక సాగించారు.

నది ప్రవహిస్తున్నది. వంగి నీటిలో తమనీడ చూసుకొన్నారు. గౌతం ఒక బెడ్డ నీటిలోకి విసిరాడు. కెరటాలు గుండ్రంగా బయటిదేరి ముందుకుసాగాయి. వాళ్ళ నీడలుకూడా వాటితోపాటు ముందుకుసాగాయి.

రేవుకు కొద్దిదూరానవున్న సాముదాయక వికాసకేంద్రంలో దీపాలు వెలుగుతున్నాయి. యువక ఉత్సవంలో ప్రదర్శించేనిమిత్తం సాంస్కృతిక కార్యక్రమా

నికి అక్కడ రిహార్సల్సు జరుపుకొంటున్నారు. కాంగ్రెస్‌కమిటీ కార్యాలయంలో ఎన్నికలనిమిత్తం ఏర్పాట్లు ప్రారంభమైనాయి.

గౌతం ఒక వరపమీద కాలుబెట్టి నిలబడ్డాడు. తానొక్కడే అక్కడ నిలబడి వున్నాడు. హరిశంకర్ ఒకరైతుతో మాట్లాడుతూ సామూహిక వికాసకేంద్రానికి వెళ్ళాడు.

అతడు అలసిపోయిన తన కాళ్ళను చూసుకొన్నాడు. చీకటిని పరిశీలించి చూశాడు. భయపడవలసినఅవసరం ఏమీ లేదు. భూదేవి తనతోబాటు వున్నది. తను భూదేవితోబాటు వున్నాడు. గౌతం ముందుకుసాగాడు.

'ఓ భూమీ! నీ పర్వతాలు, అడవులు చిరునవ్వు నవ్వుతున్నాయి. నేను నీ అండన నిలబడివున్నాను. ఓడిపోలేదు. నాకు దెబ్బ తగులలేదు. గాయాలు తగులలేదు. నేను పూర్ణపురుషుణ్ణి. నన్ను ఎవ్వరూ చంపివేయలేకపోయారు' అని తనలో తానే అనుకొంటూ గౌతం ముందుకుసాగాడు.

రకరకాలచెట్లు, మొక్కలు త్రోవలో ఎదురైనాయి. పక్షులు కలరవం చేస్తున్నాయి. నీటిచినుకులు తామరపూవులపై జలతరంగిణి వాయిస్తున్నాయి.

గౌతం నిలబడి పొలంవైపుచూశాడు. ముందుకు సాగిపో. ముందుకు సాగిపో. ఓ చిన్నకంకుల్లారా! తుఫానుల నెదుర్కొనండి. మా గాదెలనింపండి. సముద్రంలా గంభీరంగా వుండండి. మీకు సేవచేస్తున్నవాళ్ళంతా సుఖంగా వుందురుగాక. మీ పంటకళ్ళాలు చిరస్థాయిగా వుండుగాక.

గౌతం ముందుకుసాగి కాలిబాటమీదకు వచ్చాడు. వడివడ్డునే కాలిబాటన ముందుకు సాగాడు. ఆకాశంలో కారుమేఘాలు గర్జిస్తున్నాయి. అడవిగుండెలో అగ్నిధార ప్రవహిస్తున్నది. అడవి మస్తిష్కంలో జలప్రపాతం శ్రావ్యంగా పాటలు పాడుతున్నది. నెమళ్ళు కూస్తున్నాయి. ఇలకోళ్ళు అరుస్తున్నాయి. కడిమి పూలు కొమ్మలపైనుండి అడవి పాదాలచెంత రాలాయి.

దూరాన్నుండి గాయకులపాట వినబడుతున్నది.

బంజరుభూములు పచ్చబడినవి
మనచేలు గింజలతో నిండినవి

వచ్చివిపైరు హాయివిచ్చినది
ఈనాటే మనల్రతుకు పండినది.''

అంటూ ఎలుగెత్తి పాడుతున్నారు.

గౌతం శ్రద్ధగా విన్నాడు. అతని పెదిమలపై చిరునవ్వు తొంగిచూసింది.

పర్వతపు గుట్టలు, మంచుపొమవులు, తుపానులు, పెనుగాలులు, కంచుఅల్లులు అన్నింటిని దాటుకొని స్వరంహయంపై తేలుతూ అతడు గౌరీశంకర్ శిఖరంపైకి ఎక్కి మేఘాల్లో దాగిపోయాడు. శిఖరంమీద మోకరించి కూర్చున్నాడు. నాలుగు వైపుల పరిశీలించిచూశాడు. ఎటుచూసినా శూన్యమే శూన్యం. ఆ శూన్యంలో ఎప్పటివలె ఠా నొక్కడు ఒంటరిగావున్నాడు. ప్రపంచంలో మొదటిమానవుడు. తుదిమానవుడుకూడా అతడే. అతడు అలసిపొలసిన, ఓడిపోయిన మానవుడు, అయినా ఉత్సాహంతో ముందుకుసాగుతున్న అగావాడి. ఈశ్వరుడే అతడు. అతడే ఈశ్వరుడు. చిరునవ్వు నవ్వుతూ క్రిందికి దిగివచ్చాడు. కళ్ళు తెరిచాడు—

'మేల్కొన్నవారికి మేలగుగాక
న్యాయధర్మమ్ములు స్థిరపడుగాక
సంఘమ్ములో శాంతినెలకొనుగాక
సాధనాపథమున పయనింత్రుగాక
శాంతిసౌఖ్యమ్ములు విలసిల్లుగాక.'

అంటూ శాక్యముని సందేశం వినబడింది.

గౌతం నీలాంబర్ ఒక నిట్టూర్పు విడిచాడు. మెలమెల్లగా అడుగులువేస్తూ పట్నంవైపుకు నడక సాగించాడు.

సమాప్తం.